

# బైబిల్‌పై వివరణాత్మక విశ్లేషణా గ్రంథం

(నేటి వరకు ప్రపంచవ్యాప్తంగా ఇటువంటి రచనలు రాలేదు)

## ద్వితీయ భాగము


రచయిత - చిత్రకారుడు - సంఘసేవకుడు

**నెల్సన్ రష్దీ**

సెల్: *9396220406*, హైదరాబాద్



**మానవతా**  **ప్రచురణలు**



బైబిల్‌పై వివరణాత్మక విశ్లేషణా గ్రంథం

ద్వితీయ భాగము

తొలి ముద్రణ : డిసెంబర్ 15, 2013

ప్రచురణ : మానవతా ప్రచురణలు

ప్రతులు : 2500

వెల : 99/-

ప్రతులకు :
విశాలాంధ్ర బుక్‌హౌస్ రాష్ట్ర వ్యాప్త బ్రాంచీలన్నిటిలోను
మైత్రి బుక్‌హౌస్, విజయవాడ.
ఇతర అన్ని బుక్‌స్టాల్‌లలోనూ దొరకును.

టైప్‌సెట్టింగ్ & ముద్రణ:
రాప్ని గ్రాఫిక్స్
అంబర్‌పేట్, హైదరాబాద్ - 500 013.
ఫోన్ : 9246172133



# అంకితం

ఈ రచన అంకితం నా తల్లిదండ్రులకో లేక తదితర మహానుభావులకో కాకుండా నా మాతృదేశ ప్రజలకు అత్యంత ప్రేమ పూర్వకంగా అంకితమిస్తున్నాను. దయతో స్వీకరించగలరు.

సాధారణంగా అనేక రచనలను ఆయా రచయితలు వ్యాపార రీత్యా "కాపీరైట్" హక్కులను తామే భద్రంగా ఉంచుకొంటూ దీనిని ఎవరైనా అనుకరిస్తే వారిపై చట్టరీత్యా చర్యలు తీసికోబడతాయని హెచ్చరికలు జారీ చేస్తారు.

అయితే నేను ఈ రచనల విషయంలో ఎటువంటి నిర్బంధాలను పెట్టుదలచుకోలేదు. ఎందుకంటే ఈ రచన లాభాపేక్షతో కూడినది కాదు. అందుచే ఈ రచనలను ఎవరైనా అనుకరించినా లేక మరే విధంగా ఉపయోగించినా ఎటువంటి అభ్యంతరము లేదు. మరో ముఖ్య విషయమేమనగా ఔత్సాహికులు ఎవరైనా సరే ఈ రచనలను తమ ఇష్టము వచ్చిన రీతిలో భారతీయ భాషల్లోకి అనువరించి ప్రచురించుటకు ఎటువంటి అభ్యంతరము లేదు. అట్టివారికి నేను ముందు మాట కూడా వ్రాయుటకు సంసిద్ధమే! కాని ఈ విషయాన్ని మాత్రం నాకు ఫోన్ ద్వారా తెలియపరచమని కోరుచున్నాను.

- నెల్సన్ రష్దీ

# ఎందరో మహానుభావులు అందరికీ వందనాలు

ఈ నా రచనా కార్యక్రమాలకు అనేకులు సహాయసహకారాలు అందించారు. ఇందు సి.బి.ఆర్.ప్రసాద్ గారు అగ్రగణ్యులు. అలాగే డా॥ భానుప్రసాద్ గారు ఈ రచనకు ప్రూఫ్‌కాపీని చక్కగా దిద్ది, తప్పుఒప్పులను సవరించడమేగాక ఈ రచనను ఎడిట్ చేశారు. గొంది మాధవరావుగారు, సి.బి.ఆర్.ప్రసాద్‌గారు పరిచయ వాక్యాలు వ్రాసినందుకు అనేక వందనాలు. కులనిర్మూలన సంఘానికి చెందిన శ్రీమతి లక్ష్మీనాగేశ్వర్‌గారు చేయూతనిచ్చారు. అలాగే సి.ఎల్.ఎన్.గాంధీ దంపతులు తదితరులు తోడ్పడ్డారు. అనంతపురం, కమలానగర్‌కు చెందిన మిత్రుడు జయరామరెడ్డి (రిటైర్డ్ ప్రిన్సిపాల్) మానవావిర్భావం, ప్రకృతి పరిణామం గూర్చి వారి రచనల నుండి అమూల్యమైన సమాచారం ఈ రచనకు ఎంతగానో తోడ్పడింది. అందులకై వారికి నా కృతజ్ఞతలు. ప్రతి ఒక్కరికీ పేరుపేరునా అభినందనలు. అలాగే విశాలాంధ్ర పబ్లికేషన్‌వారు రాష్ట్ర వ్యాప్తంగా గల తమ బ్రాంచీలందు అమ్మకాలు సాగించారు. ఇంకా ఈ అమ్మకాలలో తోడ్పడిన తోటి ఉద్యమకారులకు, ముఖ్యంగా ఈ ద్వితీయభాగాన్ని చూడముచ్చటగా ముద్రించి సకాలంలో అందజేసిన రొప్పి గ్రాఫిక్స్ జ్యోతి గార్కి మొదలైన వారి వందనములు.

అయితే మన తెలుగు భాషా సాహిత్యంలో ఈ విధంగా వారివారి కృతజ్ఞతలు తెలియజేయుటకు ఒకే రకమయిన పదాన్ని ఉంచారు. అదేటంటే అందరికి ఒకే విధంగా "వందనాలు" అనే పదం తెలుగు భాషలో మనకు కనబడతాది.

కాని మరి ఎక్కువగా తోడ్పాటు అందించినవారికి వందనాలే కాక "వేలనాలు", "లక్షనాలు" అని కూడ ఉంటే బాగుండేదేమోగాని అలాగుండదు ఇది సరదాకు వ్రాయబడినదే!





# సత్యాన్వేషి సంగతులేమిటి!

సత్యాన్వేషి నెల్సన్‌రఫ్జీ గురించి నాకు హేతువాద ఉద్యమం మహోద్యమంగా ఉన్నప్పుడు పరిచయం. అదీ ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా నేను ఉద్యమ బాధ్యతల్లో ఉన్న రోజుల్లో హేతువాదం చందా పంపించేవారు. ఆ రోజుల్లో నెల్సన్ రఫ్జీ భారత నాస్తిక సమాజంలో ఉంటూ తర్వాత నెలనెలా 100 రూపాయలు పంపేవారు. వారు ప్రతి విషయాన్ని మనము గ్రుడ్డిగా నమ్మకూడదని ప్రతీదాన్ని ప్రశ్నించవలసిందిగా జనాన్ని పురికొల్పేవారు. వారు చేస్తున్న కార్యక్రమాలను, "మానవతావాద బృందం" ద్వారా జరిగే దీనజనసేవలను పత్రికల్లో ప్రకటించేవారము. భౌతికంగా నాకు పరిచయమైయ్యింది "మానవ వికాస వేదిక" బాటసింగారం రామోజీ ఫిలింసిటీ రోడ్, హైద్రాబాద్‌లో, "మా.వి.వే." భవనం ప్రారంభోత్సవ సమయంలోనే భౌతిక రూపంకన్నా వారు చేస్తున్న కృషికే నా గుర్తింపు. ఆ ప్రారంభోత్సవ సమయంలో తాను వ్రాసిన బైబిల్ పరిశోధనా వ్యాసాలు వాటికి జతచేసినవారి చిత్రాలను కొంతమందికి చూపుతున్నారు. కొద్దిమంది జనం ఆయన చుట్టూ మూగారు. ఏమిటాయని చూస్తే రఫ్జీగారు వివరిస్తున్నారని అక్కడున్న వారు చెప్పారు. డా॥ భానుప్రసాద్ గారు వచ్చారని ఎవరో చెప్పారు. ఆయన డాక్టరుగారూ! రండని ఆహ్వానించారు. అలా వారిని మొదటిసారి ప్రత్యక్షంగా చూచాను.

రామయణ గాధలు, భారత భాగవతాలు ఎన్ని చూచినా అంతా కథావస్తువుతో యుంటుంది. దాని చుట్టూ తిరిగే పిల్ల కథలు పిట్ట కథలు కలగా పులగంగా కలసి నడుస్తాయి. అయితే బైబిల్ కథనం అలాగుండదు. మహిమలు, మహత్యాలు, అసంభవాలు అధికంగా కనబడతాయి. అందులో నుండి అట్టి అద్భుతాలను తొలగిస్తే "అస్తి పంజరమే" మిగులుతాయి. అట్టి మహత్యాలను అందలి నిజనిజాలను వెలుగులోకి తేవాలనే నెల్సన్ తెగ మదన పడిపోయాడు. సహాయపడేవాళ్లుంటే "సరుకులు" సంతలోనికి తెస్తానన్న మాటకు నేను స్పందించి కొంత విరాళమిచ్చాను. అందరికంటే ముందు నన్ను మీరే ప్రోత్సహించారని ఆయన ఆనందంగా చెప్పారు. అనంతరం వారు అనుకున్న విధంగా 2013 ప్రారంభంలో తాను విడుదల చేయనున్న రచనల తీరు తెన్నులెలా గుంటాయో రుచి చూపించుటకు తాను మొదట పైలెట్‌ను పంపిన చందాన, ఇది నిజమా? పైలెట్ ఎడిషన్ చిరుపుస్తకాన్ని విడుదల చేశారు. 2012 డిసెంబరు, 25వ తేదీన ఇది నిజమా! ప్రథమ భాగాన్ని కూడ విడుదల చేశారు. సత్యమనే సరకును నింపుకొని అవి విడుదల అయ్యాయి. నేనైతే కొన్ని సవరణలు, వివరణలు కొన్ని కటింగులు ఇచ్చాను. కాని ఆయన స్పీడ్డే వేరు!

రూపాయిని ఒకవైపు నుంచే చూచి మురిసిపోతున్న "సిలువ జనాలకు" రెండోవైపు చూస్తే భరించలేరు. ఈ రోజుల్లో బైబిల్ భక్తి వ్యాపారం జోరుగా సాగుతుంది పనిలేని సోమరులకు అలుపు సొలుపు లేకుండా వారంలో మూడు నాలుగు రోజులు పనిచేస్తే చాలు రెండు చేతులా సంపాదించవచ్చు. పైగా వీరికి అంతులేని గౌరవం "బైబిల్ బిజినెస్" సామాన్యమైనది కాదు. ఈ వ్యాపారం ప్రారంభించడానికి పైసా పెట్టుబడి అవసరం లేదు. అయినప్పటికి ఈ మత ప్రచార "టర్నోవర్" ప్రపంచవ్యాప్తంగా లక్షల కోట్ల వరకు

వుండవచ్చును. మొదట మోటారు సైకిలెక్కుచున్నా, మరు సంవత్సరం చర్చికట్టించవచ్చు. తదుపరి సంవత్సరం కారు... అనంతర విలాస వంతమైన భవనం కట్టవచు. ఇందు టి.వి. ప్రసంగికులైతే మరిన్ని అవకాశాలు. ఇదంతా ఎక్కడివని వారినడిగితే "ప్రభువు ఇచ్చాడంటారు" ఒక్క స్వస్థతా ప్రార్థనల పేరుమీదే ఎంతో సొమ్ము దోచుకుంటున్నారు. ఈ రోగ గ్రస్తులు కడుపునొప్పి కాలునొప్పి మొదలైన సామాన్య కోరికలే కోరుకుంటారు. కాని చేయి తెగినవాడు... కాళ్లు లేనివాడు పుట్టు గ్రుడ్డివాడు తమకు ఆ అవయవాలు తిరిగి రావాలని పొరపాటున కోరుకోరు. అవి అసంభవమని ప్రపంచ వ్యాప్తంగా సర్వమతాల వారికి ఈ సంగతి బాగా తెలుసు. వీటిని ఏ దేవుడూ స్వస్తపరచలేడు.

"క్రిస్మస్-ఫ్రీ కిస్టమస్" వ్యాపారులకు "ఇది నిజమా" ప్రథమ భాగాన్ని నా యొద్దకు వచ్చే వారికి ఉచితంగా ఇచ్చాను. అనంతర వీరు తారసపడి నెల్సన్‌రష్దీ లాగానే మీ వంటి ఉత్తములెందరో చెడిపోతున్నారు. ఇట్టి వారిని సాతాను ఆవరించి ఇటువంటి పనులు చేయిస్తుంది. సమయము కొంచమేయుందని ఈ కడవరి దినాల్లో "అపవాది" రెచ్చిపోతున్నాడు. మీరొక్కసారి ఆలోచించండి. బైబిల్‌లోనున్న మంచిగాని నీతిగాని, అందలి సైన్సు గాని మీకంటికి కనబడదు. ఒకసారి ఆలోచించండి అసలే ప్రపంచంలో పాపం పెరిగిపోయింది. అసలు దేవుడే లేడంటే మరీ విచ్చలవిడిగా జీవించి ప్రపంచం దుర్మార్గాలతో నిండిపోతాది! అంటూ హితవుపలికారు. అందుకు నేను అట్టి విషయాలను గూర్చి మీరు నిస్పక్షపాతంగా ఆలోచించండి మీదే కరెక్టు అనుకుందాము. ఈ నేరాలు, ఘోరాలు, అవినీతి, దోపిడీలు జరిపించేది ఎవరు? అందరూ మతవాదులే దైవ భక్తులే కదా! ఇందు హేతువాదులు, నాస్తికులు లేరు కదా మనదేశంలో ముక్కోటి దేవతలున్నా వారి భయంతో మతవాదులంతా మీరు చెప్పినట్టు నిజయితీగా జీవిస్తున్నారా అనే సరికి, మీతో మాట్లాడలేమని జారుకున్నారు.

ఇంతటి క్లిష్ట పరిస్థితులో వయస్సు మీదపడి, కొడుకు మీద ఆధారపడి జీవిస్తూ నెల్సన్‌రష్దీ "ఇది నిజమా" భాగాలను ధారావాహికంగా ప్రచురించడం గొప్ప సాహస కృత్యం. బైబిల్ మీద కొన్ని విమర్శనా గ్రంథాలు వచ్చాయి కాని అవి పొడి పొడి ముక్కలుగా వుండగా, వీరు అదునుగా, పదునుగా, చిత్రకారుడు కూడా అయినందున అడుగడుగునా సచిత్రంగా తేటతెల్లంగా సామాన్యులకు కూడ అర్థమయ్యే విధంగా వివరించారు. ఇటువంటి వ్యక్తులు లక్షకొకడుంటాడు. ఈ నెల్సన్‌రష్దీ "నెల్సన్ మండేలా"! అంత సాహసవృద్ధుడే! ఉద్యమాలు వ్యాపారంగా కొనసాగించే ఈ రోజుల్లో లాభాపేక్ష లేని విధంగా ఉద్యమాన్ని ఊపిరిగా కొనసాగిస్తున్న వీరి నిరంతర పరిశోధనలకు అభ్యుదయ వాదులైన వారు, ఆయన ధ్యేయం కొనసాగింపుకు సహకరించాలని విజ్ఞప్తి చేయుచున్నాను.

*రష్దీ ఆలోచనా విధానం వర్ధిల్లాలి!*
*నెల్సన్ రష్దీ జిందాబాద్!!*

*సదామీ సహచరుడు...*
*డా॥ భానూప్రసాద్*
*ప్రజా వైద్యుడు, భద్రాచలం. ఫోన్.నెం: 9848421406*





## మా బాల్యమందే హిందూ మతం నుండి మా తల్లిగారు క్రైస్తవ మతం స్వీకరించారు



మా అమ్మగారు ఆత్యంత భక్తిశ్రద్ధలతో వీరబ్రహ్మేంద్ర స్వామిని పూజిస్తుండేది. ఒకగది నిండా దేవుని ఫోటోలే ఉండేవి. ఆ రోజుల్లో మా అమ్మకు పార్శ్వపు తలనొప్పి రావడం, వైద్యంచేయించుకోవడానికి ఆర్థిక స్థోమతగాని- ఉన్న పల్లెను వదిలి వెళ్ళే అవకాశం గానీ లేనందున అలానే భాధపడుతూయుండేవారు. ఒక రోజున మాఇంటికి గాజుల వ్యాపారి ఒకడు వచ్చాడు. మా అమ్మతలనొప్పితో భాధపడటం చూసి మరుసటి రోజు తన భార్యతోపాటు ఒక పాస్టర్‌ను వెంటబెట్టుకుని ప్రత్యక్షమయ్యాడు. ఏసూక్రీస్తు బొమ్మ ఇచ్చి క్రీస్తుని ప్రార్థన చేసుకోండి మీ తలనొప్పి తగ్గిపోతుందని చెప్పడం ఏసు ఫోటో మా పూజాగదిలోకి రావడం చకచకా జరిగిపోయాయి. అలా మా అమ్మగారితో పాటు నా అన్నదమ్ములు, అక్క చెలెళ్ళు ప్రార్థన చేయటం, బైబిల్ చదవడం, చర్చికి వెళ్ళడం జరుగుతుండేది. నెమ్మదిగా ఇతరదేవతల ఫోటోలన్నీ కనుమరుగవు చుండేవి.

నాకు చదువు చెప్పే గురువుగారు కూడా విద్యార్థులందరితో బ్రహ్మేంద్రస్వామి పూజ చేస్తుండేవారు. ఆ పూజా సమయంలో ఒరేయ్..బలరాం..నీవు బయటికెళ్ళిపో మీ అమ్మకుతెలిస్తే ఊరుకోదు అని నన్ను బయటికి పంపించేవారు. ఆ మాటలకు ఆ చిన్న వయస్సులోనే ఏదో కోల్పోచున్నాననే భాద నాకు కలిగేది. అలాగే మా గురువుగారి తల్లి రామాయణ భారత కథలు, జానపద కథలు ప్రతిరోజూ రాత్రి అరగంట చెబుతుండేది ఆ కథలలోని చారిత్రక వీరుల వీరోచిత గాథలు వింటూఉంటే నా రక్తం ఉప్పొంగుచుండేది. కానీ బైబిల్ చదువుచున్నపుడు, వింటున్నపుడు ఏ రకమైన థ్రిల్ ఉండేదికాదు. అయినా కూడా మా అమ్మగారి ప్రభావంతో రోజువారి ప్రార్థనలు నిత్యకృత్యమయ్యాయి. అనంతరం నేను మిలట్రీలో ఎయిర్‌ఫోర్స్‌లో చేరిపోయి ఈ మత ప్రభావానికి దురమయ్యాను. ఆ ఉద్యోగంలో చేరిన కొత్తలో అమ్మ ఒత్తిడితో నా జీతం నుండి దశమభాగం(10%) చర్చికి పంపుచుండేవాణ్ణి. కానీ అప్పుడు బయటి ప్రపంచాన్ని చూడటం, కొంతమంది వ్యక్తులు మతప్రభావం వల్ల వారి ప్రవర్తనను గమనించడం, సైన్సు - చరిత్ర పుస్తకాలు చదవడం, భారతదేశం మీద ఆంగ్లేయుల పరిపాలన, తురుష్కుల పరిపాలనతో వీరిప్రవర్తన పోల్చుకోవడం నాలో మతం పట్ల ఆలోచన పెరిగింది. ఒక రోజున 'నేషనల్ జియాగ్రఫీ' మ్యాగజైన్‌లో 60 లక్షల సంవత్సరాల నాటి డైనోసర్ (రాక్షసబల్లి) గ్రుడ్డు దొరికిందని చదవడం జరిగింది. దాని ద్వారా బైబిల్‌లో చెప్పిన 6000 సంవత్సరాల సృష్టికి సైన్సుచెప్పే లక్షల సంవత్సరాల సృష్టికి పొంతన లేనందున బైబిల్‌మీద పూర్తిగా నమ్మకంపోయింది. ఆ తరువాత కొద్దిరోజులకే సెలవులమీద ఇంటికి రావడం జరిగింది. ఇంట్లో ప్రార్థనా కూటమి జరుగుతోంది. అక్కడ చేరిన వారంతా అమాయక స్త్రీలు, భర్తలు దుర్వసనాలతో గానీ ఆర్థిక పరిస్థితులవల్ల గానీజీవితంలో అలసిపోయిన వారందరూ అక్కడున్నారు. నేను పాస్టర్‌ను ఒక ప్రశ్న అడిగాను --ఏ మయ్యా ఏసును నమ్ముకుంటే తలనొప్పి తగ్గుతుందని మా

అమ్మను మతం మార్చారు. 15-20 సంవత్సరాలైనా ఇంకా ఆవిడ తలనొప్పితో భాదపడుచూనే వుంది అని నేను అడగగానే.. "దేవుడు పరీక్షిస్తున్నాడు" అన్నాడు. సాధారణంగా ఈ దొంగ పాస్టర్లంతా చెప్పే "కప్పదాటు" సమాధానాలే! ఇది! ఇంకెన్నాళ్ళు పరీక్షిస్తడయ్యా వీళ్ళందరినీ ఈవిడే మతంలోకి మార్చింది. ఇంకా మీ దేవుడికి నమ్మకం కుదరలేదా? అన్న నా ప్రశ్నకు మీ మేనమామ మారలేదు కదండి అన్నాడు. ఆ మాట వినగానే ముందురోజు రాత్రి మా అమ్మకు మా మేనమామకు జరిగిన ఘర్షణాపూరితమైన వాదన నాకు గుర్తొచ్చింది. మా అమ్మగారు నా మేనమామను అన్నా నీవు సైతాన్‌లను పూజిస్తున్నావు అది మానేయమని పదేపదే హిందూ దేవతలపై ద్వేశపూరితమైన వ్యాక్యానాలు చేయుట వెనుక ఈ పాస్టర్ బోధనలే కారణమని అర్ధమైనది. వెంటనే నేను ఆ మరునాడు ఆ పాస్టర్‌ను ఇంటినుండి వెళ్లగొట్టి పూర్తిగా క్రైస్తవ మతాన్ని వదిలేయటం జరిగినది. తరువాత జీవన పోరాటంలో పడిపోయాను. కాని మా తల్లిగారు ఆ మతంలోనే కొనసాగుతూ వచ్చారు.

కుటుంబ బాధ్యతలు తీరిన తరువాత ప్రముఖ పారిశ్రామిక వేత్త జి.డి. నాయుడు గారిద్వారా విన్న భాతరతీయ జీవన విధానం లోని వానప్రస్థాశ్రమం గుర్తుకురావడంతో బాధ్యతలన్నీ పూర్తిచేసుకొని ఆర్మీ నుండి స్వచ్ఛందంగా రిటైర్‌మెంట్ తీసుకొని వచ్చి సామాజిక సేవాకార్యక్రమాలలో నిమఘ్నమై నా చిన్ననాటి కోర్కె అయిన క్రీడా రంగంలో ఒలంపిక్ పథకం సాధించాలనే తపనతో యువతీ యువకులను ఏ విధమైన లాభాపేక్ష లేకుండా క్రీడలను ప్రోత్సహిస్తున్నాను. ఈ క్రమంలో గత 15 సం॥ నుండి వైభవోపేతమైన భారత మాత చరిత్ర లెలుసుకొంటూ భావితరాలు అది సాధించాలనే దిశగా వారికి శిక్షణ ఇస్తున్నాను. అక్కడే నేను (కేతనకొండ ఇబ్రహీంపట్నం మండల్) కృష్ణాజిల్లాలో ఒక అతిపెద్ద హైస్కూల్‌ను నిర్మించి అందు పేద విద్యార్థులకు అందుబాటులో ఉండేటట్లు దానిని నడుపుతున్నాము. ముమ్ముందు దీనిని కాలేజీగా కూడా మార్చే అవకాశాలు మెండుగా ఉన్నాయి.

ఈ ప్రస్థానంలో నెల్సన్ రఫ్జీ గారు రచించిన 'ఇది నిజమా' పుస్తకం చదవడం నాకు చాలా ఆనందాన్ని ఇచ్చింది. ఎందుకంటే కొద్దిమంది ఆటవికులు రాసిన గ్రంథాన్ని పట్టుకొని దైవ వాక్యమని వందల సంవత్సరాలుగా ప్రచారం సాగిస్తూన్ననూ, కొంత మంది మేధావులనబడేవారూ మతం మారటం చూసి భాద ఉండేది. అలాగే ఎన్నో కుటుంబాలు వారి ఆప్తులు మతం మారడం వల్ల ఆవేదనతో తల్లడిల్లుచున్నాయి. ఇది రాబోవు కాలంలో అన్నదమ్ముల మధ్య ఘర్షణలకు దారితీసే అవకాశం నూటికి నూరు శాతం కనిపిస్తున్నది. కొన్ని విదేశీ శక్తులు లక్షలకోట్లు డబ్బు ఇక్కడ పంచుతూ ఈ ఘర్షణలను ప్రేరేపిస్తున్నాయి. ఇలాంటి సమయంలో నెల్సన్ రఫ్జీ గారు ఒక సామాన్యుడికి కూడా అర్థమయ్యేటట్లు బైబిల్ బండారం బయటపెట్టారు. కనీసం సాటి క్రైస్తవుడే బైబిల్ గురించి చెప్పినందువల్లనైనా రకరకాల ప్రలోభాలకు, మానసిక బలహీనతలకు లోనై మతంమారిన వారందరికీ రఫ్జీ గారి పుస్తకం కనువిప్పు కలిగిస్తుందని ఆనందపడుచున్నాను. ఈ ద్వితీయభాగం మరింత ఘాటుగా సాగే ఈ రచనలో బైబిల్ బండారాన్నంతా బట్టబయలు చేశారు. ముఖ్యంగా క్రైస్తవులు, క్రైస్తవేతరులు కూడ తప్పక చదవవలసిన పుస్తకం ఇది.

చలసాని బలరామయ్య
(సి.బి.ఆర్. ప్రసాద్)





# నేనెందుకు క్రైస్తవ విశ్వాసం నుండి మానవతావాదిగా మారాను?

నా పేరు గొంది మాధవరావు మాది దావాజీ గూడెం, గన్నవరం మండలం, కృష్ణా జిల్లా. నేను 1936లో మార్చి 6వ తేదీన హిందూ (కమ్మ) కుటుంబంలో జన్మించాను. మా తల్లిదండ్రులకు పండ్రెండుమంది సంతానం. వారంతా బాల్యదశలోనో, పుట్టీపుట్టడంతోనో వారంతా మరణించారు. తరువాత పదమూడవ వానిగా నేను జన్మించి, బ్రతికి బట్టకట్టాను. ఆ కారణంగా నన్ను గారాభంగా పెంచారు. హిందూ ధర్మం ప్రకారం నన్ను భక్తి శ్రద్ధలతో పెంచారు. మాది వ్యవసాయ కుటుంబం కావడంచే నేను ఓ ప్రక్క చదువుకుంటూ, తల్లిదండ్రులకు వ్యవసాయంలో తోడ్పడ్డాను. ఆ కాలంలో నేను ఇంటర్‌మీడియట్‌తో సమానమైన (F.A.) చదివాను. నాకు ఝాన్సీలక్ష్మితో వివాహమైంది. నాకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె. అయితే ఆమెకు ఆరు సంవత్సరాలుగా అంతులేని కడుపునొప్పితో బాధపడేది. ఎంతోమంది డాక్టర్ల చుట్టూ తిరిగాము. అనేక వైద్యాలు చేయించాము. అయినా ఫలితము కనబడలేదు.

నా భార్య అప్పుడప్పుడు క్రైస్తవ మతాన్ని గురించి వింటూ ఉండేది. అప్పుడప్పుడూ చర్చీలకు వెళ్ళడము స్వస్థతా ప్రార్థన కూటాలకు వెళ్లడము జరిగింది. బైబిల్ కొనుక్కుని క్రమంగా చదివేవాళ్లం. ఒకసారి నా భార్య బైబిల్ తెరవగా యెషయా గ్రంథం 54:7లో ఒక వచనం మీద దృష్టి పడింది. అది చదవగా యెహోవా నిన్ను పిలుచుచున్నాడు. నిత్యము ఆయన కృపతో, నీపై వాత్సల్యము చూపును అనే "బంగారు వాక్యం" వచ్చింది. ఈ వాక్యము ద్వారా యెహోవా దేవుడు మాతో మాట్లాడాడని గాఢంగా నమ్మాము. అమ్మాయిని గూర్చి దేవుని కన్నీళ్లతో ప్రార్థిస్తూ క్రమం తప్పకుండా చర్చీలకు వెళ్ళడం ప్రారంభించాము. కాలక్రమంలో అమ్మాయి కడుపునొప్పి తగ్గిపోయింది. దేవునికి వందనములు సమర్పించి, చర్చీలో కృతజ్ఞతార్పణం చెల్లించాము. 1974వ సంవత్సరంలో "రక్షణ పొంది" (దీనికి మరో అర్థం "మారు మనస్సు పొంది) ఇరువురము బాప్తీస్మము తీసుకొని చర్చీలో పూర్ణ సభ్యత్వం స్వీకరించాం. అనతి కాలంలోనే మా విశ్వాసం మరింత బలపడింది.

అనంతరం పరిశుద్ధ గ్రంథాన్ని క్షుణ్ణంగా చదువుచూ వచ్చాము. కాలక్రమంలో నేను కూడ క్రైస్తవ ప్రసంగికునిగా మారిపోయాను. ఇట్టి పరిచర్యలో భాగంగా అనేక క్రైస్తవ సంఘాలతో పరిచయాలు ఏర్పడ్డాయి. జీవనోపాధి కోసం హనుమాన్ జంక్షన్‌లో ఒక ప్రింటింగ్ ప్రెస్ ప్రారంభించాను. మొదట రెండు మూడు సంవత్సరాలు చాలా బాగా నడిచింది. నేను అనేకసార్లు దైవసేవకై వివిధ ప్రదేశాలు తిరుగుచున్నందున అది వారి ఇష్టారాజ్యంగా మారిపోయింది. ఆ కారణంగా దాన్ని మూసివేయటం జరిగింది. అనంతరం మాకు ఉన్న ఆరు ఎకరాల పొలం సాగుచేస్తూ దైవసేవలో తిరుగుచూ ఉండగా నాకు

"రాబర్ట్ ఓర్నీ" అనే దైవసేవకునితో స్నేహం ఏర్పడింది. ఆయన రష్యాలో పుట్టి ఆమెరికాలో సెటిలైన రాబర్ట్ ఓర్నీ అనే యూద క్రైస్తవ మిషినరీ తన ప్రసంగాలను తెలుగులోకి అనువదించ వలసిందిగా కోరారు. ఆయన ముఖ్యంగా స్వస్థతా ప్రార్థనా కూటాలు జరుపుతూ అనేకమంది రోగులకు "స్వస్థత" కలిగిస్తున్నానంటూ ప్రార్థించేవాడు. మరి ముఖ్యంగా దయ్యాలు పట్టిన అనేకుల గురించి ప్రార్థన చేయగా వారు స్టేజీ మీద పడిపోయేవారు. అనంతరం వారు లేచి వెళ్ళి కాస్త నేమ్మదించినట్లు కనబడేవారు. అందరు ఆశ్చర్యపోయే దయ్యాలు మనుష్యుల్ని ఎంతగా బాధపేడతారని భయపడేవారు. ఇట్టి దయ్యాలను గూర్చి రాగా పేజీల్లో సవివరంగా చూడగలరు.

ఈ నేపథ్యంలో క్రైస్తవం జెరుసలేములోనే పుట్టింది. ఇంకా అనేక సంగతులు తెలుసుకొనుటకు అట్టి యూద గ్రంథాలను చదవాలనే ఆసక్తి కలిగింది. అంతటా నాకు డా॥ ఎం.ఎస్.ఎస్. రాజు అనే క్రైస్తవ సేవకుడు ఉత్తమ క్రైస్తవులు. ఆయన అనేకసార్లు జెరుసలేము వెళ్ళి వస్తుండేవాడు. ఆయన యూద భాషయైన హిబ్రూ అనర్గళంగా మాట్లాడేవాడు. అప్పుడునేను వారిని కల్సి నాకు యూద భాష నేర్చుకోవాలని ఆసక్తిగా ఉందని చెప్పి ఆయన యొద్ద నాలుగు, ఐదు నెలలు కోచింగ్ తీసుకున్నాను. ఈ విధంగా నేను యూద భాష మాట్లాడటం, చదవటం వచ్చింది. యూద మత గ్రంథాలైన "తోహరా" అనగా ధర్మశాస్త్ర గ్రంథం, "చెతుబీగల్" అనగా ప్రవక్తల గ్రంథం, "ఉనబయిాం" అనగా పరిశుద్ధ గ్రంథంగా అర్థం చెపుతారు. అవన్నీ నేను చదవడం ప్రారంభించాను. అందు యెషయా గ్రంథం చదువుతుండగా బైబిల్‌లో వ్రాయబడిన విషయాలకు యూదమత గ్రంథంలోని సంగతులకు కొంత వ్యత్యాసం కనబడింది. ఎందుకిలా జరిగిందని మరింత జాగ్రత్త చదవగా (మత్తయి 1:22)లో

**ఇదిగో కన్యక గర్భవతియై కుమారుడి కనును. ఆయనకు ఇమ్మానీయులు అని పేరు పెట్టుదురు. అని ప్రభువు తన ప్రవక్త ద్వారా పలికిన మాటలు నెరవేరునట్టు ఇదంతా జరిగెను. ఇమ్మానీయులు అనే పేరునకు భాషాంతరమున దైవుడు మనకు తోడైయున్నాడని అర్థము. ఆమె పరిశుద్ధాత్మ వలన గర్భవతియైనట్లు వ్రాయబడింది. అంతేగాక యూదమత గ్రంథంలో కాని పాత నిబంధనలోగాని యేసు అనే పేరు ఎక్కడా కనబడదూ. అలాగే యేసును కూడా ఎవరు ఎప్పుడూ ఇమ్మానీయేలు అని పిలవలేదు. అయితే యూదమత గ్రంథంలో యువతి గర్భవతియై కుమారుని కనును. అతనికి ఇమ్మానీయేలు అని పేరు పెడతారని చెప్పబడింది. అయితే ఈ విషయాలు పాత నిబంధనలోగాని, యూదమత గ్రంథంలోగాని యేసు అని పేరు ఎక్కడా వ్రాయబడలేదు. ఇమ్మానీయేలు గూర్చి బైబిల్‌లో ఒక విషయం వ్రాయబడింది. ఇమ్మానీయేలు బాల్యమందు ఇంకా అమ్మ, నాన్న అనకముందే అతనికి తెలివి రాకముందే పెరుగు, తేనే తినే వాడని చెప్పబడింది. యూదమత గ్రంథంలో "ఆల్మా" అనగా యువతి అనే అర్థం. అయితే**





**దానిని క్రొత్త నిబంధనలో కన్యక అని వ్రాయబడింది. ఈ యూదమత గ్రంథాన్ని ప్రపంచ భాషల్లోకి తర్జుమా చేసినప్పుడు ఇటువంటి మార్పులు జరిగాయి.**

అంతేగాక ఇమ్మానీయేలు మన పాపములను భరించునని కూడా పాత నిబంధనలో వ్రాయబడలేదు. ఇమ్మానీయేలు రాజవంశీయుడు యూదారాజైన ఉజ్జియా మనుమడు, "యోతాము" కుమారుడైన అహాజు దినములలో సిరియా రాజైన "రెజీను" ఇశ్రాయేలు రాజైన రెమల్యా కుమారుడయిన "పెకెకు" మీద యుద్ధము చేయుటకు యెరూషలేము మీదకు వచ్చిరి గాని అది వారి వల్లకాలేదు. ఈ విషయంలో వారు యెషయా ప్రవక్తను వేడుకొనగా ఆయన వారికి పై సూచన చేశాడని అందుచే ఈ ఇమ్మానియేలు పేరు యేసుకు సంబంధించినది కాదు (యెషయా 8:7)లో కాగా ప్రభువు బలమైన "యూఫ్రటీసు" నది విస్తారంగా పొంగిన నదీజలాలు వారి మీదకు రప్పింతును. దాని కాలువలు విస్తారంగా పొంగి ఒడ్డులన్నింటి మీద పొర్లిపొరెను. అవి యూదాదేశంలోనికి వచ్చి పొర్లిపారెను. అవి "కృతికెల" లోతు అగును. ఇమ్మానీయేలు పక్షి తన రెక్కలు విప్పినప్పటివలె దాని రెక్కలు వ్యాపకము నీదేశ వైశాల్యమంతటి మీద వ్యాపించును. ఈ విధంగా యెషయా ప్రవక్త అప్పుడు జరగబోయే యుద్ధాన్ని సూచనప్రాయంగా చెప్పడం జరిగింది. అంతేగాని ఇది యేసుకు సంబంధించిన ప్రవచనం ఎంతమాత్రము కాదు. ఇమ్మానీయేలుగా చెప్పబడిన యేసు ఇటువంటి యుద్ధాలేమి చేయలేదు.

**"యెషయా గ్రంథములో వ్రాయబడిన విధంగా యేసు కన్యకు జన్మించలేదు. ఎవరైనా యేసు కన్యకకు పుట్టాడని రుజువు చేస్తే పదివేల డాలర్లు అనగా 5 లక్షల రూపాయలు బహుమతిగా ఇస్తామని ముప్పై సంవత్సరాల క్రితం "బిబ్లికల్ పాలిమిక్స్" అనే యెరూషలేము మాసపత్రికలో సవాలు చేసారు. కాని ఈ విషయంలో ఎవరూ ముందుకు రాలేక పోయారు. చివరకు ఆ వెబ్‌సైట్‌ను ఇటీవల ఉపసంహరించుకున్నారు. ఇవన్నీ చూసిన తర్వాత ఇట్టి సందేహాలు మరెన్నో నాలో చోటు చేసుకున్నాయి."**

అయినా మేము చర్చికి వెళ్తునేయున్నాము. మేము గన్నవరంలో సెయింట్ జాన్ హైస్కూల్ ముందున్న చర్చిని రెవరెండ్ "సిడ్నీ" గారు స్థాపించారు. వారు జీవించి యున్నప్పుడే మేమూ చర్చికి వెళ్ళేవాళ్ళం. వారి మరణానంతరం ఆయన సతీమణి, కుమారులు నడిపిస్తున్న చర్చికి మేము క్రమం తప్పకుండా వెళ్ళేవాళ్ళం. ఈ చర్చిని వారు నడపడమే కాక అనేక సేవా కార్యక్రమాలు చేస్తూ ఉంటారు. అంతే కాక తమ ఇంట్లో 20 మంది అనాద విద్యార్థులకు ఆశ్రయమిచ్చి చదివిస్తూ యుంటారు. ఆమెను మదర్ థెరిస్సా లాంటిదని అందరూ భావిస్తారు. ఫిబ్రవరి, 2013లో ఆమె కాలము చేయగా జ్ఞాపకార్థ కూటాముకు నెల్సన్ రష్దీ గారు కూడా వచ్చారు. ఈ సిడ్నీ దంపతులకు నెల్సన్ రష్దీ అతి సమీప బంధువు. సిడ్నీ గారికి తమ్ముడవుతాడు, సిడ్నీ గారి భార్య నెల్సన్‌రష్దీ మేనమామ కూతురే. వీరి కుటుంబాలన్నీ ఇట్టి సేవా తత్పరతలతోనే జీవిస్తున్నారు. అలాగే వీరి మేనమామ రెండవ కూమార్తె ఆమె భర్త

కుమారుడు కూడా లబ్బీపేటలో నెహ్రూనగర్‌లో చర్చిని నడిపించటమే కాక ప్రతి వారానికొకసారి సుమారు 30-40 మంది విధవరాళ్లకు భోజనం పెడుతూ ఉంటారు. సంవత్సరానికొకసారి బట్టలు ఇస్తారు. అలాగే వీరి కుమారులు పొట్టిపాడు అత్కూరులలోన (కృష్ణాజిల్లా) హైస్కూల్, వృద్ధాశ్రమం మొదలగునవి నడిపిస్తూ గొప్ప సేవ చేయుచున్నారు. ఆ సందర్భంలో నెల్సన్‌రష్దీ గారు నేను గతంలో అప్పుడప్పుడు కలుసుకొనేవాళ్లం. ఈయన వచ్చిన సందర్భంలో రెండు పుస్తకాలు ఇవ్వడం జరిగింది. అవి ఇది నిజమా ప్రథమ భాగం, రెండవది "ఇది నిజమా పైలెట్ ఎడిషన్" వాటిని నేను చదివాక నా సందేహాలు అనుమానాలు అన్ని కూడా మబ్బులు విడిపోయినట్లు విడిపోయాయి. అనంతరము రష్దీగారే నాకు నర్సాపూర్‌కు చెందిన సి.జాకొబ్ (రిటైర్డ్ జడ్జ్)గారు రచించిన "నేను ఎందుకు మతాన్ని విడిచి పెట్టాను", "దేవుడు, మతము, విశ్వాసము" వీటిని చదివిన తరువాత నా సందేహాలన్ని తీరిపోయి మతం పేరిట ఎన్ని రకాలుగా మనుషులు వంచించబడుతున్నారో తెలుసుకున్నాను. ఆశ్చర్యకరమైన రీతిగా ఈ విషయాలు తెలుసుకొన్న నేను క్రైస్తవ మతానికి దూరమై, మానవతావాదిగా మారిపోయాను. నా భార్య మాత్రం నరనరానా జీర్ణించుకుపోయిన ఈ మతం విడలేకపోతున్నది. నవంబర్ నెలలోనే నా భార్య జేరుసలేం వెళ్లి వచ్చింది.

ఏదిఏమైనా నేను సత్యాన్ని తెలుసుకొన్నందుకు ముఖ్యంగా నెల్సన్‌గారిని అభినందిస్తూ సెలవు తీసుకుంటున్నాను. నావలెనే అనేకులు ఇట్టి సత్యాలను గ్రహించగలరనుకుంటున్నాను.

*- గొంది మాధవరావు*
*సెల్.నెం: 9490401904*





## సత్యవేద గ్రంథమైన బైబిల్‌పై ఇంతటి తీవ్రమైన విమర్శలా?
## ఔను ఇదివాక్ స్వాతంత్ర్యంలోని భాగమే!

సత్యవేద గ్రంథమైన బైబిల్‌ను ఇంతటి తీవ్రంగా విమర్శించడమా! యని అనేకులు అభ్యంతరాలు వెలిబుచ్చినట్లు మా దృష్టికి వచ్చింది. ఔను ఇది వాక్ స్వాతంత్ర్యంలోని భాగమే. దీనిని మరియొక సారి మీ దృష్టికి తీసుకొని వస్తున్నాను.

ఆర్.వి. భూషణ్ ముంబాయిలో ఒక న్యాయవాది. ఆయన 2003లో "Islam a concept of Political World Invasion by Muslims" ఇస్లాం ప్రపంచంపై రాజకీయంగా దాడి జరిపే ముస్లింల భావన. అనే పుస్తకాన్ని రచించారు. అది 2004లో ప్రచురించబడి పాఠకుల్లోకి వెళ్లగా దానిపై కొందరు లేవనెత్తిన అభ్యంతరాలపై మహారాష్ట్ర ప్రభుత్వం దానిని 2007లో నిషేధించింది. అప్పటి నుండి దానిపై సుదీర్ఘ వాదోపవాదాలు విన్నమీదట ముంబయి హైకోర్టు 2010 జనవరి 6వ తేదీన తన తీర్పును వెలువరించింది.

ఆ తీర్పులో భాగంగా "హిందూ, క్రైస్తవ, ఇస్లాం వంటి ఏ మతాన్నయినా విమర్శించడం తప్పుకాదని అది మనకు మన రాజ్యాంగం ప్రసాదించిన ప్రాథమిక హక్కుల్లోని వాక్ స్వాతంత్ర్యపు హక్కుల్లోని భాగమేనని" వ్యాఖ్యానించింది. ఈ తీర్పును ప్రకటించిన త్రిసభ్య ధర్మాసనంలో – జస్టిస్ రంజనా దేశాయ్, జస్టిస్ డి.వై. చంద్రచూడ్, జస్టిస్ మోహిత్‌లున్నారు. ఇది ఒక మైలురాయిగా నిలిచిపోయే ఈ న్యాయమూర్తుల వ్యాఖ్యలు పౌరహక్కులు, ప్రజాసంఘాలు, అభ్యుదయ రచయితలు, హేతువాదులు మొదలైన సంఘ సంస్కర్తల్లో సంతోషాన్ని నింపాయి. మనం దేన్నయినా విమర్శించవచ్చు. అందుకు మతం మినహాయింపు కాదు. మతాన్ని విమర్శించడం కూడ భావ ప్రకటనా స్వేచ్ఛలోని భాగమేనని వ్యక్తిగతంగా ఏ ఒక్కరూ దానికి నొచ్చుకోవలసిన పనిలేదని న్యాయమూర్తులు స్పష్టం చేశారు. ప్రతి వ్యక్తి తన భావాలను ప్రకటించుకొనే స్వేచ్ఛను భారత రాజ్యాంగంలోని ప్రాథమిక హక్కులు మనకు కల్పిస్తున్నాయి. అందు మొట్టమొదటిది వాక్ స్వాతంత్ర్య భావ ప్రకటనా స్వేచ్ఛ!

ఈ సందర్భంలో భావ ప్రకటనా స్వేచ్ఛకున్న పరిమితుల్ని కూడ న్యాయమూర్తులు గుర్తుచేశారు. ఒక మతంపై చేసే విమర్శ ఆరోగ్యకరమైనది గాను, ఆలోచనను రేకెత్తించేది గాను, చర్చకు ప్రోత్సహించేది గాను, ఆ తరువాత వారు మారడానికి తోడ్పడేది గాను వుండాలని వారన్నారు. ఏ మతంపై విమర్శ చేస్తున్నా ఆ విమర్శ ఆయా మతస్తుల్లో జ్ఞానాన్ని ప్రేరేపించేది గాను, నమ్మదగినది గాను వుండాలని రెండు సముదాయాల మధ్య ద్వేషాన్ని కల్పించేదిగా వుండరాదని "త్రిసభ్యబెంచ్" వ్యాఖ్యానించింది. మత పెద్దలు చేస్తున్న దుర్మార్గపు ప్రచారాలను, చర్యలను ప్రశ్నించే విధంగా ఉండాలన్నారు. ఈ మాత్రపు ఊరట కలిగించే వ్యాఖ్యలు ఇంతవరకు ఏ తీర్పులోను రాలేదు. ఆ కారణంగా ఇది ఎంతో ప్రాముఖ్యాన్ని సంతరించుకొంది.

ఆగస్టు 1947 వరకు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల పాలనలో మగ్గిపోయిన భారతీయులు అంతకు ముందు తాము కోల్పోయిన హక్కుల కోసం ఆరాటపడ్డారు. ఆంక్షలు లేని సంపూర్ణ స్వేచ్ఛ కావాలని కోరుకున్నారు. అయితే అటువంటి స్వేచ్ఛ దేశ స్థిరత్వానికి తోడ్పడదని భావించి యుక్తమైన నిర్బంధనల (Reasonable Restrictions) తో కూడిన ప్రాథమిక హక్కులను అలనాటి రాజ్యాంగ నిర్మాతలు రూపొందించారు. ఏ పౌరుడైనా తన నోటి ద్వారాను, రాతల ద్వారాను, లేక బొమ్మల ద్వారా గాని, ముద్రణ ద్వారా లేదా ఇతర పద్ధతుల ద్వారా తన మనోభావాలను స్వేచ్ఛగా వెల్లడించుకోవచ్చని విషధీకరించారు. ఈ వాక్ స్వాతంత్ర్యపు హక్కుల్లో పత్రికా స్వేచ్ఛ కూడా ఒక భాగమే. అంటే ఒక పత్రికా యాజమాన్యం తన భావ ప్రకటనలతో పాటు, ఇతరుల మనోభావాలను కూడ సేకరించి ప్రచారం చేయవచ్చని, అలాగే రేడియో, టి.వి., "ఇంటర్ నెట్"ల వంటి ప్రసార సాధనాల ద్వారా కూడ ప్రచారం చేయవచ్చు.

అయితే ఈ హక్కులను వినియోగించుకొనే వారు కొన్ని నిబంధనలను కూడ పాటించడం తప్పనిసరి, దేశ భద్రత, విదేశీ స్నేహసంబంధాలు, ప్రజాశాంతి, నైతికత, పరువునష్టం, నేరాలకు పురికొల్పడం, న్యాయస్థానాలను ధిక్కరించడం మొదలైన అంశాలను పరిగణనలోనికి తీసుకొన వలసి యుంటుంది.

ఈ తీర్పులో న్యాయమూర్తులు చేసిన వాఖ్యలు మత, ఆధ్యాత్మిక రంగాలను సంస్కరించే వారికి ముఖ్యంగా నాస్తిక హేతువాద, మానవవాద సంఘ రచయితలకు, కళాకారులకు, వక్తలకు ముఖ్య సూచనలను అందిస్తున్నాయి. ఏ మతం పట్ల, లేదా మతస్తుల పట్ల, మత విద్వేష-పూరిత విమర్శలకు పాల్పడరాదని ఆయా మతాలను లేదా మతస్తుల వ్రాతలను, వ్యక్తీకరణలను సహేతుకంగా, చర్యకు ప్రోత్సహించే విధంగా మతానుయాయుల్లో ఆలోచనను రేకెత్తించేదిగా వుండి తమను తాము మార్చుకోవడానికి, ఉత్సాహపరిచే విధంగా వుండాలని గుర్తుచేస్తున్నాయి.

**- "ఇంటర్ నేషనల్ హ్యూమానిష్టు న్యూస్"**
**పత్రిక సౌజన్యంతో.....**





## "ఇది నిజమా"? ద్వితీయ భాగంలో దయ్యాలపై సవివరంగా ప్రస్తావించబడిన కారణంగా ఈ ద్వితీయ భాగం దయ్యాల స్పెషల్‌గా అభివర్ణించబడింది.

"ఇది నిజమా" ద్వితీయ భాగం అనేక అంశాలను గూర్చి వివరించింది. ముఖ్యంగా బైబిల్ దేవుళ్లైన యెహోవా, యేసుల సరసన దయ్యాలు, భూత ప్రేత పిశాచాలు తిరుగుచూ ఇవి సర్వోన్నతులని చెప్పబడిన దేవుళ్లనే ముప్పుతిప్పలు బెట్టి, దైవ సంకల్పాన్నే తారుమారు చేసినట్టు బైబిల్ చెబుతుంది. ఆ దయ్యాలు ఇంతటితోనయినా విడిచిపెట్టక దేవుని "మాస్టర్ ప్లాన్" అయిన "పరలోక స్వర్గానికి" క్రైస్తవ భక్త జనులెవ్వరూ చేరకుండ, అనేక ప్రలోభాలు పెట్టి ఆటంకపరచి, నరమానవులను భ్రష్టులుగా చేయుటకు అహర్నిశలు నిర్విరామంగా గర్జించు సింహం వలె తిరుగుతూ యుందని ప్రతి విశ్వాసి అప్రమత్తంగా వుండాలని ఏక్షణంలోనైనా మిమ్ములను పడగొట్టవచ్చని బైబిల్ నిండా హెచ్చరికల మీద హెచ్చరికలు చేయడం కనబడతాది.



ఒక్క క్రైస్తవమే కాదు తదితర మతాలు కూడ ఈ భూత, ప్రేత, రాక్షస గణాలతో నిండియుండడం మనము గమనించగలం. ఆకారణంగా ఈ దయ్యాలపై అనేక విశేషాలు తెలియజేస్తూ, ఇవన్నీ కల్పిత గాథలని రుజువు చేసే ప్రయత్నం జరిగింది.

ఒక్క క్రైస్తవులే కాదు అన్ని ఇతర మతాలకు చెందినవారు ఈ దయ్యాల పూర్వాపదాలను వాటిపైనున్న అపోహలనుండి బయటపడుటకు ఇది తప్పనిసరిగా చదవడం అత్యవసరం. ఈ శీర్షికను చదవనివారు జీవితంలో అమూల్యమైన జ్ఞాన సంపదను కోల్పోతారు.

# గమనిక

ఈ “ఇది నిజమా” రచనా పరంపరల యందలి అంశాలను గూర్చి, మీకు ఒక విషయం తెలియజేయవలసి యుంది. ఇందుకొన్ని బైబిల్ వాక్యాలు, కొన్ని సందర్భాలందు ఆయా చిత్రాలు తిరిగి ఇవ్వబడతాయి. ఆయా సందర్భాలందు ఇది వరకు వ్రాయబడిన బైబిల్ వాక్యాలే మీకు కనబడతాయి. అట్టి సందర్భాలలో “బోర్‌ఫీల్” కావద్దని మనవి. మరొకసారి వాటిని ఉటంకించడం తప్పనిసరి.

మరొక విషయమేమంటే సైన్స్ అంతా మా బైబిల్ నందే నిక్షిప్తమై వుందని చెబుతారు. ఆ విధంగానే ఇతర మతాల్లో కూడ మనకు కనబడతారు. అట్టి బైబిల్ మేధావులను కొన్నిచోట్ల నిశితంగా విమర్శించడం జరిగింది. అట్టివారు అశాస్త్రీయమైన విధంగా క్రైస్తవ సోదరులను తప్పు త్రోవను నడిపించ ప్రయత్నించారు. ఇట్టి విమర్శలను శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించి నిజనిజాలను గ్రహించమనవి.

ఈ రచనా పరంపరలన్నింటికి “ఇది నిజమా” అనే టైటిల్ పెట్టుటకు గల కారణమేమిటని కొందరు ప్రశ్నించారు. బైబిల్ సృష్టి కథను మలుపు త్రిప్పిన “అపవాది” సర్పాకారంలో స్త్రీని “ఇది నిజమా?” అనే ప్రశ్నతోనే బోల్తా కొట్టించిందని, ఆ కారణంగా “ఆది మానవులు” నిషిద్ధ ఫలాలను తిని పాపాత్ములై పోయారని ఈ కారణంగానే సర్వమానవులకు ఈ పాపం చుట్టుకుందని చెప్పబడినందున యీ రచనలకు అదే పేరును కొనసాగిస్తు, ఇందలి సమస్త విషయాలను ఇది నిజమాయని ప్రశ్నిస్తున్నాను.

తదుపరి ఒక విషయం మీకు చెప్పాలి. సాధారణంగా రచయితలు ఆయా పుస్తకాల నుండి, కొందరు మేధావులు అందజేసిన సమాచారాన్నుండి, ఇతరులకు సంబంధించిన సమాచారం సేకరించి రచనలు చేస్తూంయుంటారు. అయితే నా రచనలో అనేక ముఖ్య విషయాలను విషధీకరిస్తూ నా ఇంట్లో జరిగిన సంఘటనలు నేను స్వయంగా పాల్గొన్న దయ్యాల భయాన్ని పారద్రోలిన సంఘటనలు స్వయాన మా తల్లి గారికి కలిగిన భయాభ్రాంతులు, మానవతావాద బృంద సమావేశంలోని విషయాలు తదుపరి నేను చేసిన మానవసేవా కార్యక్రమాలు చాలా వరకు నా స్వీయ చరిత్రలవలెనే కనబడవచ్చును.

ఇందు రచయిత తన స్వంత డబ్బానే వాయించుకున్నట్లుందని భావించక అటువంటి యథార్థమైన విషయాలు, వాటికి తోడు అక్కడ ప్రదర్శించబడిన ఛాయాచిత్రాలు వంటివన్నీ చూచి ఇది కొందరికి స్వీయచరిత్ర లాగుందని తలంచవచ్చును. కాని ఇవన్నీ రుజువులతో చూపబడిన సేవాకార్యక్రమాలు, యథార్థగాథలు అయినందున చదవరులు కూడ తమ తమ దైనందిన జీవితాల్లో తమకు చేతనయిన విధంగా కొన్ని సత్కార్యాలు చేయాలన్న అభిలాష కలుగుతుంది. ఇట్టి విషయాలను సహృదయంతో అర్థం చేసికోగలరని మనవి చేయుచున్నాను.

*- రచయిత*







# తొలి పలుకు

నేను విశేషమైన పరిశీలన అనంతరము “ఇది నిజమా” అనే ప్రథమ భాగాన్ని రచించి వ్యయప్రయాసాల కోర్చి ప్రచురించడం జరిగింది. ప్రథమ భాగం కేవలము 2000 ప్రతులను మాత్రమే ప్రచురించడం జరిగింది. దీనిని తెలుగు క్రైస్తవ సోదరులు విస్తృతంగా చదువు తారని అనతి కాలంలోనే పునర్ముద్రణ అవసరమని భావించాను. అయితే ఇది రెండువేల ప్రతులు ముద్రించి, అందు ఏడెనిమిది వందలు వరకు కొందరు, క్రైస్తవ సోదరులకు, బంధు మిత్రులకు ఉచితంగా పంపడము జరిగింది. మరి కొన్ని పుస్తకాలు కన్వర్టెడ్ క్రైస్తవులకు, తదితర మేధావులకు పంపించాను. అయితే సగటు క్రైస్తవుల గొంతుల్లో పచ్చి వెలక్కాయ పడిన చందాన మౌనంగా వుండిపోయారు.

“కన్వర్టెడ్” క్రిస్టియన్ల నుండి, మేధావి వర్గాల నుండి మంచి స్పందన వచ్చింది. అయితే క్రైస్తవ సోదరులు చాలామంది దీన్ని చదివి యుంటారు. అయితే వీరు దీనిపై తగినవిధంగా స్పందించి, నేను ఏమయినా పొరబాటు రాతలు వ్రాసియుంటే నన్ను చెడమడా విమర్శించి వారి అభిప్రాయాన్ని నిర్మోమాటంగా తెలియ పరచియుంటే ఎంతో ఆనందించియుండేవాడిని. కొందరైతే నీలో సాతాను దూరి సర్వోన్నతుడైన యెహోవాకు, లోక రక్షకుడైన యేసు ప్రభువుకు వ్యతిరేకమయిన విధంగా నిన్ను అపవాది ఆవరించిదని విమర్శించారు. అట్టివారు ఈ పుస్తకాన్ని పూర్తిగా చదివి అందలి లోటుపాట్లను తెలియజేయక పోగా, బైబిల్ గ్రంథం యెహోవా దివ్య వాక్కులని, యేసు యొక్క దివ్య సందేశాలని వీటిని ఒక మానవ మాత్రుడు విమర్శించుటకు ఏ పాటి వాడని విమర్శించారు.

దీనికి కారణం ముక్కు పచ్చులారని వయస్సు నుండి, సండే స్కూళ్లు, చర్చీలు, తదితర కూటాలందు నూరిపోస్తూ అద్భుత కథలతోను, బైబిల్ వాక్యాలను కంఠస్థం చేయించడం, అపవాది మిమ్ములను లోబరుచుకోకుండా అప్రమత్తంగా యుండండని, **మరో ప్రక్క అపవాది భయాన్ని మస్తిష్కాలలోకి ఎక్కిస్తారు. అందుచే క్రైస్తవులకు దేవునిమీద భక్తికన్నా అపవాది మీది భయమే ఎక్కువ.** అపవాది అంటే చిన్నతనంలో జరిగిన సంఘటన ఒకటి గుర్తుకొచ్చింది. కారణాంతరములచే, ఒక ఆదివారం నేను మా అక్కగారు చర్చికి వెళ్లకుండ ఇంట్లోనే వున్నాము. అంత మా అక్క “నెల్సా” ఏమయినా తినాలని పిస్తుంది. నీవు ఎవరి కంది చేలోకైనా వెళ్లి కొన్ని కందికాయలు కోసుకొని రమ్మని పురమాయించింది. నేను చిన్న సంచిపట్టుకొని బయలు దేరుచుండగా ఎవరిచేలోకి వెళ్లి కోసుకొస్తావని అడిగింది. నేను అమాయకంగా “దేవుడు ఎక్కడికి నడిపిస్తే అక్కడికి” వెళ్తానన్నాను. ఆ మాట వినగానే నవ్వు ఆపుకోలేక పోయింది. వెంటనే తేరుకొని చూచావా బాబూ! మనము దైవ సన్నిధానానికి

వెళ్లకుండ ఇంటి యొద్దనే ఉండడము గమనించిన అపవాది నాలో దూరి నన్నీ విధంగా ప్రేరేపించిందని, దొంగతనానికి పురికొల్పిందని, ఆ ప్రయత్నము వెంటనే విరమింపజేసింది. ప్రభుని ప్రార్థించి క్షమాపణలు కోరింది.

సాధారణంగా క్రైస్తవ కుటుంబాలలో ఇట్టి భావనలు నరనరాన జీర్నించి ఉంటాయి. ఎంతసేపూ ఆయా ప్రసంగాలందు. ప్రేమ, దయ, క్రీస్తు రెండవ రాకడ, ఆయనను నమ్మినవారికి ఆకలి దప్పులు లేని పరలోక స్వర్గం, పాపాత్ములకు నిత్యనరకాగ్ని గుండం అందు అగ్ని ఆరదు, కొరుక్కుతినే పురుగులుంటాయి. అందు మరణమనేది లేకుండ దివా రాత్రులు నరకయాతనలను అనుభవిస్తూ యుండాలని భయ కంపితులను చేస్తూ యుంటారు. ఈ సంగతులు వంటబట్టించుకొన్న క్రైస్తవ సమాజాలు గడగడ వణకుచూ భయాందోళనలతో కాలం వెళ్లబుచ్చుతూ యుంటారు.

అలనాడెప్పుడో అయిదారు వేల సంవత్సరాల క్రితము మోషే ప్రవక్త యూద ప్రజలను అదుపాజ్ఞలలో పెట్టుటకు యెహోవా తనకు సీనాయి పర్వతం మీద దర్శనమిచ్చి "పది ఆజ్ఞలను" రాతిపలకల మీద చెక్కి యిచ్చాడని యూద ప్రజలకు ఇస్తాడు. యెహోవా తన ప్రజలకు ఇచ్చాడని చెప్పే ఆ "టెన్ కమేండ్‌మెంట్స్" ఏమిటో చూద్దాము.

1. నేను తప్ప వేరొక దేవుడు మీకుండకూడదు. 2. పైన ఆకాశమందే గాని, క్రింద భూమియందే గాని, భూమి క్రింద నీళ్లయందే గానియుండు దేని రూపమునయినను నీవు చేసికొన కూడదు, వాటికి సాగిల పడకూడదు. వాటిని పూజించ కూడదు. 3. నీ దేవుడైన యెహోవా నామమును వ్యర్థముగా ఉచ్చరింపకూడదు. 4. విశ్రాంతి దినమును పరిశుద్ధ దినంగా ఆచరించుటకు జ్ఞాపకముంచు కొనవలెను. దానిలో నీ వైనను, నీ కుమారుడైనను, నీ కుమార్తెయైనను, నీ దాసుడైనను, నీ ఇండ్లలోనుండు పరదేశి యైనను ఏ పనియు చేయకూడదు. 5. నీ దేవుడైన యెహోవా నీకనుగ్రహించు దేశములో నీవు దీర్ఘాయుష్మంతుడ వగునట్లుగా నీ తండ్రిని-తల్లిని సన్మానించుము. 6. నరహత్య చేయకూడదు. 7. వ్యభిచరించ కూడదు. 8. దొంగిల కూడదు. 9. నీ పొరుగువాని మీద అబద్ధ సాక్ష్యము పలుక కూడదు. 10. నీ పొరుగువాని భార్యనైనను, అతని గాడిదనైనను, అతని ఎద్దు నైనను మరి దేనినైనను ఆశించకూడదు.

సాధారణంగా ఒక రాజ్యాధినేతకానివ్వండి, లేక వారి నాయకుడు కానివ్వండి తాము ఏర్పరచిన నియమ నిబంధనలను ఎట్టి పరిస్థితిలోను వారే అతిక్రమించ ప్రయత్నించరు. ఒక వేళ్ల అట్టిబాధ్యులే తాము ఏర్పరచిన నియమ నిబంధనలను వుల్లంఘిస్తే ప్రజలేమంటారు? ఏమిటిది! "చెప్పేవి ధర్మశాస్త్రాలు-దూరేవి దొమ్మర గుడిశలు!..." "కోడలికి బుద్ధి చెప్పి అత్త తెడ్డు నాకిందేమిటి" అనే మొరటు సామెతలు చెప్ప ప్రయత్నిస్తారు. అయితే మనమిక్కడ ప్రస్తావిస్తున్న విషయం "పరిశుద్ధ దేవునికి సంబంధించినది" అటువంటి భాష మనము ఇక్కడ వాడకూడదు.





అయితే దేవుడైన యెహోవా దేవుని తాను జారీ చేశాడని చెప్పే పది ఆజ్ఞలను గూర్చి కాస్త ముచ్చటిందాము. నరహత్య చేయవద్దు, దొంగిల కూడదు, పరుల సొత్తు ఆశించకూడదు, వ్యభిచరించకూడదు అని ఆజ్ఞాపించిన యెహోవాయే.

అయితే యెహోవా యూదజనాంగాలు తన స్వజాతీయులని, ఈ ఇశ్రాయేలు ప్రజలు తన స్వజనులని ప్రేమానురాగాలతో వారికి ఇచ్చిన ఈ కఠిన నిబంధనల నుండి యెహోవా స్వయంగా వారికి వెసులు బాటు ఇవ్వడం గమనార్హం. తానే స్వయంగా అతిక్రమించడం గమనించాలి. అను నిత్యము యెహోవా యూద జనుల కొమ్ముకాస్తూ నా స్వజనులారా! మీరు ఐగుప్తు బానిసత్వం నుండి విడుదల అయ్యే సమయంలో ఐగుప్తు ప్రజల యొద్ద నుండి బంగారం, వెండి, విలువైన వస్త్రాలను ఎరువు అడిగి తీసికొండి! ఆ అన్య ప్రజలు దానికి అడ్డం చెప్పకుండ నేను వారి హృదయాలను జాలి గుండెలుగా మారుస్తాను. ఈ విధంగా మీరు ఐగుప్తీయులను నిలువు దోపిడీ చేయండి... అని వారికి వత్తాసు పలికాడు. వారు ఆప్రకారంగా చేశారు. అంతేకాక వారు కానానుకు తిరుగు ప్రయాణం నలువది సంవత్సరాలు సాగింది. వారికి దారిలో కనిపించిన అన్ని అన్య జాతుల రాజ్యాలను ఓడించి ప్రజలను రాజ్యాలను దుంపనాశనం చేయమని ఆజ్ఞాపించాడు.

వీరు అన్యజాతులైన అమాలేకీయులు, ఫిలిష్తీయులు, అమోరీయులు, హివ్వీయులు, హిత్తీయులు, ఎబూసీయులు, అమ్మోనీయులు, మోయాబీయులు, కానానీయులు, పెరిజ్జీయులను, మొదలగు అన్యజాతీయుల పురములపై దండెత్తి వారి సమస్త సంపదలను దోచుకొని, దోపుడు సొమ్ము పంచుకోండని, అంతేకాక ఒక పురుషుడినైనా బ్రతకనివ్వక కత్తివాత హతము చేయమని, వారి స్త్రీలను కూడ బ్రతికనీయ వద్దని, అయితే పురుష సమ్యోగము ఎరుగని కన్నె పిల్లలను మీ సుఖం కోసం ఉంచుకోమని, అలాగే పసివారిని పట్టుకొని మీరు బానిసలుగా వాడుకోమని... అనంతరం వారి పురములను అగ్నిచే కాల్చి వేయవలసిందని, అలాగే వారి గొర్రెమేకలను, గుర్రాలను, పశు సంపదను, ఒంటెలను మీ కొరకు ఉంచుకోమని అనేక సందర్భాలలో ఈ యెహోవా దేవుడు వారికి ఆజ్ఞాపిస్తూ వచ్చాడు. అనేకసార్లు వారి పక్షాన నిలువబడి యుద్ధాలు చేశాడట. ఈ వివరాలు నిర్గమాకాడంలో చూడగలరు.

మరియొక చోట యుద్ధంలో దొరికిన అన్య జాతులను పట్టుకొని దొరికిన వారిని దొరిగినట్లు నరికి పారేయమని, స్త్రీలను పిల్లను పట్టుకొని వారి నెత్తులు సుత్తులతో పగులగొట్టి ఇటుక ఆవములలో వేసి కాల్చివేయమని హృదయ విదారకమయిన కర్కషమైన రీతిలో శాంతియుతంగా జీవించే ఆయా జాతులను నామరూపాలు లేకుండ సంహరించడమే కాకుండ, వారిని పట్టుకొని రంపాలతో పరపరా కోయండని నిర్దాక్షిణ్యమయిన విధంగా వారిని చంపించిన యెహోవాయే పై విధమయిన పది ఆజ్ఞలను జారీ చేసి నీతి నిజాయితీలతో బ్రతకండని చెప్పాడంటే నమ్మశక్యంగా వుందా? ప్రథమ భాగంలో కూడ

మరెన్నో కిరాతకాలు యెహోవా చేయించినట్లు చూచాము.

వర్తమాన భూత భవిష్యత్ గ్రాహియైన యెహోవాకు భవిష్యత్‌లో జరిగే మార్పులు ఏమీ తెలియవా? మానవ మాత్రులమైన మనకు ఇవేమి తెలియనందున గతంలో చేయబడిన చట్టాలకు కాలదోశం పట్టగా కాలాను గుణంగా కొత్త చట్టాలు చేసికొంటాము. ఇక్కడ యెహోవా ఇచ్చిన పది ఆజ్ఞల్లో కొన్ని విలువలేకుండ కాలదోషం పట్టాయి.

నీ పొరుగువాని గాడిదనైనను.... ఎద్దునైనను, దాసులనైనను (బానిసలు) ఆశించవద్దని ఆదేశించడమేమిటి? నేటి క్రైస్తవవ విశ్వాసులు ఈ ఆజ్ఞను మాత్రం నూటికి నూరుపాళ్ళ "నిక్కచ్చి"గా ఆచరిస్తున్నారు. దీని విషయంలో ఎంతో నిజాయితీ కనబరుస్తున్నారు. నేటి క్రైస్తవ సోదరులు దీన్ని అక్షరాల అనుసరిస్తున్నారు. వీరు తమ పొరుగువారి గాడిదను... ఎద్దును... అతని బానిసనైనా అస్సలు ఆశించకుండా సాక్షాత్తూ దేవుని అగు జాడల్లో నడుచుకొంటున్నారు. నేడు ఎంత వెర్రి బాగుల వాడైనా కాలదోషం పట్టిన గాడిద కావాలని కోరుకోడుకదా! అబ్రహాం లింకన్ కాలంలోనే బానిసత్వం అంతరించిపోగా బానిసలు కావాలని ఎవడు కోరుకుంటాడు. ఈ బానిసలు ఆదేవుని దృష్టిలో మనుషులు కారా! సర్వమానవులను యెహోవా సృష్టించలేదా? ఒక్క యూద జనులనే సృష్టించాడా?

**నాటి అనాగరిక దశలో ఆయా జనాంగాలను అదుపాజ్ఞలలో పెట్టుటకు నాటి ముఠానాయకులు తాము చెబితే వినరని దేవునిపేర ఇట్టి తాకీదులు జారీ చేసి నాటి పామర ప్రజానీకాన్ని అదుపు చేయ ప్రయత్నించారేకాని ఇది ఏ దేవుని ఆజ్ఞలు కానేకావు. ఇవన్నీ కాకమ్మ కథనాలే! నేటి నాగరిక క్రైస్తవ సమాజము ఇట్టి కథనాలాను విశ్వసించినంత మాత్రాన పరలోక రాజ్యాలను చేరలేరు. నేటి క్రైస్తవ సమాజాలపై నా బైబిల్ పరిశోధనలో తేలిన విషయాలేమంటే సత్యము పలికే ఏ క్రైస్తవుడు పరలోక రాజ్యంలో (స్వర్గం) చేరడు గాక చేరడు. అబద్ధమును నమ్మేవారిదే పరలోక రాజ్యం. క్రొత్తగా వీరం ఏ అబదాలను నమ్మనవసరం లేదు. ఈ పనిని ఆదిమ క్రైస్తవ సంఘాలే మధ్యయుగాలందే చేసిపారేశాయి. వాటిని అనుసరిస్తూ పోతే అవే మోక్షమార్గాలా? అదేమిటో చూడండి!...**







# విషయసూచిక

## అబద్ధాలే... మోక్షమార్గాలు - నిజాలే నరక ద్వారాలు!

భూమి బల్లపరుపుగా ఉందని, అది నీళ్లమీద పరచియుందని... దానికి సముద్రము మీద పునాది వేయబడి యుందని అది స్తంభాలపై నిలచి యుందనే అబద్ధాలను నమ్మేవారిదే పరలోక రాజ్యం.

... ... ...

కాదు! కాదు! భూమండలం గోళాకృతిలో యుందని... దానికి సముద్రము మీద పునాదులు వేయబడలేదని... సముద్రమే భూమిపై ఉన్నదని... భూమి తన చుట్టూ తాను తిరుగచూ సూర్యునిచుట్టూ ప్రదక్షణాలు చేయుచున్నదని నిజాన్ని నమ్మేవారంతా నిత్య నరకాగ్ని గుండంలో పడిపోతారు!!

* * *

నిశ్చలనంగా నున్న భూమి చుట్టూ సూర్యుడే ప్రదక్షణాలు చేస్తున్నాడని, ఈ దిక్కు నుండి ఆ దిక్కు వరకు తిరిగి వస్తున్నాడని భూకేంద్ర సిద్ధాంతాన్ని నమ్మేవారిదే మోక్షరాజ్యం!

... ... ...

అసలే కాదు! అమ్మతోడు! భూమండలమే తన చుట్టూ తాను తిగుచూ సూర్యుని చుట్టూ నిర్విరామంగా ప్రదక్షణాలు చేస్తుందని ఈ ప్రక్రియ వల్లనే ఉదయాస్తమయాలు కలుగుచున్నాయని భూకేంద్ర సిద్ధాంతం తప్పని, సైన్సును నమ్మే విజ్ఞానులంతా అగ్ని గంధకములతో మండుచున్న నరకంలో పడక తప్పదు.

* * *

చంద్రుడు స్వయం ప్రకాశం గల చిన్న జ్యోతియనే, అభూతకల్పనను నమ్మేవారిదే ఆకలి దప్పులులేని పరలోక రాజ్యం!

... ... ...

చంద్రుడు నిర్జీవ గ్రహమని దానికి స్వయం ప్రకాశం లేదని సూర్యకాంతి దానిపై పడగా అది ప్రతిఫలిస్తుందనే శాస్త్రీయ వివరణలను నమ్మే వారంతా నరకప్రాప్తులే!

* * *

సూర్యుడు పెద్ద జ్యోతియని, చంద్రుడు చిన్న జ్యోతియని... నక్షత్రాలు మరింత చిన్నవని అర్థ మిచ్చేటట్లు చెప్పబడిన బైబిల్ వివరణ, క్రొత్త నిబంధన గ్రంథంలో చెప్పబడిన సాద్రుశ్యాల రీత్యా... దీపస్తంభాల మధ్య (యేసు) తన కుడిచేత ఏడు నక్షత్రములను చేత పట్టుకొని యున్నాడని... ఆయన నోటనుండి రెండంచులు గల ఖడ్గము వెలువడుచున్నదని అంత్యదినాల యందు ఆకాశ నక్షత్రాల్లో మూడవ భాగము, అకాలపు అంజూరపు కాయలు రాలునట్లు భూమి మీద రాలిపడునని వివరించబడింది. దీనిని బట్టి నక్షత్రాలు అత్యంత చిన్నవని నమ్మే అజ్ఞాన అమాయక క్రైస్తవ సమూహాలన్నీ హెూల్‌సేల్‌గా స్వర్గలోకం చేరుకుంటారు. (ప్రకటన మొదటి అధ్యాయం). చూడండి!!



అబ్బో అబ్బో! ఇది ఎంతటి ధారుణమైన పెద్ద అబద్ధమో!! విశాల విశ్వంలో యింతటి బ్రహ్మాండమైన అబద్ధం మరొకటుండదు. పాలపుంత నక్షత్రమండలంలో సుమారు పదివేల కోట్ల నక్షత్రాలున్నాయని అంచనా! ఇవి మనకు అనేక సుదూర కాంతి సంవత్సరాల దూరంలో ఉన్నాయి. అనేక నక్షత్రాలు భూమండలం కన్నా లక్షలాది రెట్లు పెద్దవని అవి సూర్యునివలె అనునిత్యం భగభగ మండుచున్న భయంకర అగ్నిగోళాలని ఇట్టి నక్షత్రాలలో మూడవ భాగం కాదు ఒకే ఒక్క నక్షత్రంలో మూడవ వంతు నక్షత్రశకలం వచ్చి భూమిని "ఢీ" కొంటే చాలు భూమితోపాటు మహా పర్వతాలు. సప్తసముద్రాలు, సర్వజీవరాసి సకల మానవాళి పేలిపోయి, కాలిపోయి, బూడిద కూడ మిగలకుండ అసలు అడ్రసే లేకుండ అంతర్థానమై పోతారు. అట్టి భయంకర ప్రళయాన్ని గుర్చి ప్రకటించడానికి ఏ వార్తా పత్రికలు... మరే టి.వి. కేంద్రం మచ్చుకైనా మిగలవుగాక మిగలవు.

... ... ...

ఇట్టి మహెూన్నత విజ్ఞానం బయలు పరచిన అమూల్య జ్ఞాన సంపదను నమ్మే బుద్ధి జీవులంతా అగ్ని గంధకములతో మండుచూ, అందు అగ్గిపురుగులు కొరక్కు తింటూ





యుండగా చావనేదే రాకుండ యుగ యుగాల పర్యతరం నరకయాతనలను భవిస్తూ ఆకలి, దాహంతో విలపిస్తూ చావు వచ్చినా బాగుండునని ఎదురుచూస్తారట. ఆ నరకం వేడి మంటలకు కళ్లైన కాలిపేలి చూపైనా నశించదట, ఈ చిత్రమైన నరకంలో పడిపోతారు. దయామయుడైన యెహెూవా ఇంతటి భయంకర క్రూరుడా?

* * *

భూమండలం సూర్య చంద్ర నక్షత్రాదులు సమస్త విశాల విశ్వం, చెట్టు చేమలు, మహెూన్నత పర్వతాలు, సమస్త నదీనదాలు, సప్తసముద్రాలు కేవలం ఆరంటే ఆరు దినాలలో ఆరేడువేల సంవత్సరాల క్రితమే యెహెూవా దేవుడు సృష్టించాడని ప్రగాఢంగా నమ్ముచూ, వాటిని ఏ కరువు పెట్టే "టి.వి". ప్రసంగికులు. ఆయా క్రైస్తవ సంఘాల కాపర్లు, "ప్రిజ్‌బిటర్. ఇంచార్జ్‌లు", "ఎంవాంజిలిస్టులు" "బిషప్పులు", "ఆర్చ్ బిషప్పులు" "కార్డినల్సు" చివరకు వాటికన్ సిటీ పాలకులు, అధినేత పోప్‌తో సహా అంతా కూడ "నిత్యము-సత్యము" అయిన పరలోక మోక్షంలోకి ఎగిరిపడతారట. నేడు భూమి మీద జీవించి యున్నవారే కాదు లోకం పుట్టినది మొదలు కొని బ్రతికి చచ్చి మట్టిలోను, సముద్రములోను కలసిపోయిన నీతిమంతులంతా వీరితో పాటు బ్రతికివచ్చి పరలోకంలో పాలు పంచుకొంటారట పాపాత్ములంతా నరకంలో పడిపోతారట.



# భూగోళం అవతరణ, జీవజాలం, మానవావిర్భావం గూర్చి క్లుప్తంగా శాస్త్రీయ వివరణ

భూమండలం అవతరణ: మతగ్రంథాలు భూమి ఆవిర్భావం గూర్చి చెప్పిన కథనాలన్నీ కాకమ్మ కథలే! అవన్నీ అనాగరిక మానవుల ఊహలనుండి ఉద్భవించినవే. ఒక మత గ్రంథం చెప్పిన దానితో మరో మత గ్రంథం ఏకీభవించదు. ఏ ఒక్క విషయంలోను ఒకరితో ఒకరు ఏకీభవించరు. వారి యొక్క విభిన్నమైన కథనాల ద్వారా ఇవన్నీ కల్పితాలని రుజువు చేయు చున్నవి. ఏది ఏమైనప్పటికి ఇవన్నీ ఆకాయ పోకాయ కబుర్లే!

సైన్సు ప్రకారం భూమి అవతరణ: విశ్వంలో సూర్యుడు చలన రహితమైన పెద్ద నక్షత్ర గోళమే! 420 కోట్ల సంవత్సరాల క్రితం సూర్యునిలో జరిగిన మహా విస్ఫోటనం సందర్భంగా విడుదల అయిన ఒక బ్రహ్మాండమయిన అగ్నిని విరజిమ్మే శకల మొకటి విడివడి అది కాలక్రమంలో భూమిగా రూపాంతరం చెందిందని శాస్త్రవేత్తలు దృఢనిశ్చయానికి వచ్చారు. ఈ పదార్థం సూర్యుని చుట్టూ పరిభ్రమిస్తూ గోళాకృతికి చేరింది. ఈ విధంగా ఆముండుచున్న శకలం చల్లబడడానికి 220 కోట్ల సంవత్సరాలు పట్టిందని తదుపరి మరో వంద కోట్ల సంవత్సరాల అనంతరం భూవాతావరణంలో వచ్చిన మార్పులకు చెమ్మ, బూజు, నాచు, పాకుడు లాంటి పదార్థాలు పుట్టుకతో ఈ నిర్జీవ పదార్థాల నుండి జీవపదార్థం ఆవిర్భవించడానికి దోహద పడిందని, కమక్రమంగా జలచర, భూచర తదితర ప్రాణకోటి అంతా ఉనికిలోకి వచ్చింది. ఇవి ఏకకణ జీవులుగా ప్రారంభమై కాలక్రమంలో బహుకణ జీవులుగా ఆవిర్భావం చెందాయి.

మానవుని శిలాజాలు (Fossils) రాతి పనిముట్లు లభ్యమైన ప్రదేశాలను బట్టి మొదట ఆఫ్రికా, ఆసియా, యూరప్ ఖండాలలో మానవావిర్భావం జరిగినట్లు శాస్త్రవేత్తలు నిర్ణయించారు. "డి.యస్.ఏ. కంటెంట్స్"ను బట్టి క్రోమోజోముల సంఖ్య ఆధారంగా మానవుని పూర్వీకులు వాలరహిత వానరులని అనగా తోకలేని కోతులు (APES) జాతికి చెందినవని శాస్త్రవేత్తలు నిర్ధాణకు వచ్చారు. కావున ప్రకృతి పరిణామంలో నుంచి మానవుడు యాధృచ్ఛికంగా పుట్టిన వాడేకాని మిధ్యాభూతమైన "దేవుని" చేతిపని ఎంతమాత్రము కాదు. భూమికి యెహోవా ఆజ్ఞ ఇవ్వగా సకల జంతు జాలాన్ని క్షణాల మీద "భూమి రూపొందించిందని" బైబిల్‌లో చెప్పబడగా!...





ఇక్కడ మనము చూస్తున్న ఈ చింపంజీ పిల్ల చిత్రాన్ని కాస్త విప్పారిన నేత్రాలతో పరికించి చూడండి. ఈ చింపంజీ పిల్ల పాదాలు తప్ప "A to Z" అచ్చు మానవాకృతిలోనే... అనగా యెహోవాతో పాటు ఆదాము రూపంలోనే వుండడము మనకు విస్మయం కలిగిస్తుంది. అప్పుడే పుట్టిన పసివాడు గుప్పెళ్లు బిగబట్టి కళ్లు గట్టిగా మూసుకొని పొట్టను ఉబ్బించి గుక్క పట్టి ఏడ్వడము చాలామందికి తెలుసు. ఇట్టి మానవ లక్షణాలన్నీ మనకు తేట తెల్లంగా కనబడుచున్నాయి. మరొక్కసారి నిశితంగా పరీక్షించిచూడండి! యెహోవా నరుని మట్టితో చేశాడంటే తన పోలికెను చూచుకొని మరి చేసియుండవచ్చు! అయితే భూమికి బుద్ధి లేదు... చూడ్డానికి కళ్లులేవు. వినడానికి చెవులు లేవు. అయితే యెహోవా రూపం దానికెలా తెలిసి పోయింది? ఈ చింపంజీ పిల్లకు ఒక్క పాదాల ఆకృతి తప్ప మిగతావన్నీ నరుని పోలికే! అనేక మంది క్రైస్తవ విశ్వాసులకు నిజంగా నరులు యెహోవా సృజించాడని చెప్పేదానిలో ఇసుమంతైనా నిజముందా అనిపించకమానదు. ఇవన్నీ గమనిస్తూయుండగా డార్విన్ మహాశయుని పరిణామ వాద సిద్ధాంతాన్ని ఈ నరవానర బాంధవ్యాలు ధృవ పరుస్తున్నాయి.

ఈ విషయాలన్నీ ప్రక్కన పెట్టినా ఇక్కడ మనము అతి ముఖ్యంగా గమనించవలసిన ముఖ్యమైనదేమంటే యెహోవా నరుని తన పోలికెచొప్పున మక్కీకి మక్కీ అచ్చుగుదినట్టుగా రూపొందించినట్టు చెప్ప బడుచుండగా మధ్యలో ఈ కుర్ర కోతి వెధవ వచ్చి యెహోవా ఆకృతిలో దర్శనమివ్వడం చూడగా బైబిల్‌లో చెప్పబడిన దేవుని పోలికతో చేయబడ్డ నరులు అనే మాట కల్పనా కథయని, ఆ విధంగానే సర్వమత గ్రంథాలు తలోరకమైన వివరణలివ్వడం సత్యదూరమని విదితమౌచున్నది. మరిన్ని వివరాలు రాగల పేజీల్లో చూడగలము.



## భూమండలం ఎలా అవతరించిందో!
## ఆ విధంగానే అంతర్ధానం కావచ్చు!!!

విశాల విశ్వంలోని భూమండలం అది అవతరించిన విధంగానే గ్రహశకలాలు ఢీ కొనో... అగ్ని పర్వతాలు విస్ఫోటనం వల్లనో అంతర్ధానం కావచ్చును. అయితే అట్టి సంఘటన పదివేల సంవత్సరాలకో... లక్ష సంవత్సరాలకో... కోట్ల సంవత్సరాలకో సమస్త మానవులు... సర్వజీవకోటితో పాటు నామరూపాలు లేకుండా నశించవచ్చు. అది ఎలా సంభవిస్తుందంటే ప్రపంచంలోనే అత్యంత పెద్దదైన మూడు లక్షల పదివేల, ఏడు వందల తొంభై ఎనిమిది చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం గల రాకాశి అగ్ని పర్వతం సముద్రపు అడుగున 6500 అడుగుల లోతున అగ్నిని వెడల గ్రక్కుచూయుంది. ఇది అనూహ్యంగా ఎప్పుడైనా విస్ఫోటనం చెందవచ్చునేమో!

### జలనిధిలో భారీ అగ్నిపర్వతం



హూస్టన్: ప్రపంచంలోనే అతి పెద్ద అగ్నిపర్వతాన్ని శాస్త్రవేత్తలు పసిఫిక్ మహాసముద్ర గర్భంలో కనుగొన్నారు. సౌర కుటుంబంలో ఉన్న రెండో అతి పెద్ద అగ్నిపర్వతం ఇదేనని అంటున్నారు. తూర్పు జపాన్‌కు 1,609 కిలోమీటర్ల దూరంలో సముద్రంలోపల 6,500 అడుగుల లోతులో ఇది ఉంది. ఈ అగ్నిపర్వతం వైశాల్యం 3,10,798 చదరపు కిలోమీటర్లు. ఇది న్యూ మెక్సికో దేశ వైశాల్యంతో దాదాపు సమానం. 'టము మస్సిఫ్'గా వ్యవహరిస్తున్న ఈ అగ్నిపర్వతం సముద్ర గర్భంలోని షాట్‌స్కైరైస్ పర్వత శ్రేణుల్లో ఏర్పడింది.

(7-8-2013 ఈనాడు సౌజన్యంతో)

దీనికన్నా ప్రమాద కరమైన విధంగా మన భూమండలం చుట్టూ దాదాపు 2,452 గ్రహశకలాలు (ASTERIODS) మరియు అనేక తోక చుక్కలు అడ్డదిడ్డంగా





పరిభ్రమిస్తున్నాయి. ఇవి అనేకసార్లు భూమికి చేరువలో దూసుకుపోయి తృటిలో ప్రమాదం తప్పిపోయింది.

### భూమికి త్రుటిలో తప్పిన ముప్పు
#### చేరువగా దూసుకుపోయిన గ్రహశకలం

లండన్: భూమికి త్రుటిలో ముప్పు తప్పింది. దాదాపు 28 అడుగుల వెడల్పు గల గ్రహశకలం భూమికి అతి చేరువగా దూసుకుపోయింది. చంద్రుడి కంటే 30 రెట్లు భూమికి చేరువగా వచ్చిన ఈ గ్రహశకలం, శుక్రవారం భూమికి కేవలం 14 వేల కిలోమీటర్ల దూరం నుంచి దూసుకుపోయిందని 'నాసా' వెల్లడించింది. ఏడాదికి కనీసం రెండుసార్లు ఇలాంటి గ్రహశకలాలు భూమికి కొన్ని చేరువగా దూసుకుపోవడం జరుగుతూ ఉంటుంది. ఇవి భూమిపై పెద్దగా ప్రభావం చూపవు. ఇప్పటి వరకు భూమికి అతి చేరువగా గ్రహశకలాలు దూసుకుపోవడం ఇది మూడోసారి అని 'నాసా' ఖగోళ శాస్త్రవేత్తలు చెబుతున్నారు. తాజాగా దూసుకుపోయిన గ్రహశకలం భూ వాతావరణం పరిధిలోకి వచ్చేటప్పటికే పూర్తిగా దగ్ధమైపోయి ఉంటుందని భావిస్తున్నారు. కాటలీనా స్కై సర్వే సంస్థ నవంబరు 6న ఈ గ్రహశకలాన్ని గుర్తించింది. మసాచుసెట్స్‌లోని మైనర్ ప్లానెట్ సెంటర్ నుంచి శాస్త్రవేత్తలు ఇది భూమికి చేరువగా రావడాన్ని తిలకించారు. ఈ ఏడాది మార్చిలో దాదాపు వంద అడుగుల భారీ గ్రహశకలం కూడా భూమికి చేరువలో కనిపించింది. అయితే ఇది భూమికి 45 వేల మైళ్ల దూరం నుంచి దూసుకుపోయింది.



ఊహా చిత్రం 12-11-09 — సాక్షి

ఆటంబాంబు, హైడ్రోజన్ బాంబులు సృష్టించే ప్రమాదమే నాడు జపాన్ నందలి "నాగసాకి హిరోషిమా"లపై అంతటి విధ్వంసాన్ని సృష్టించగా... భూమండలంకన్నా అతిపెద్ద గ్రహశకల మేదయినా వచ్చి భూమిని "ఢీ" కొంటే దానికి భూపరిభ్రమణ వేగం తోడై భూమి ప్రేలిపోయి కాలిపోయి క్షణాల మీద అంతర్ధానమైపోతాది. అట్టి ప్రళయం సంభవిస్తే మనల్ని కాపాడేవాడుండడు. ఉహామాత్రమైన దైవభావం వల్ల ప్రయోజనం సూన్యం.



# మలి పలుకు!

## ప్రభువా-దేవా!! ఈ నెల్సన్ రఫ్జీ గాడిని మట్టు పెట్టండి!!

ఇదేంటి ప్రభువా! ఈ మాయదారి బోధనలు! సాతాను ఈ రచయితను పూనింది. పూర్తిగా ఆవరించింది. ఈ నెల్సన్‌రఫ్జీ గాడి మీద, నీ మెరుపు బాణాలను, పిడుగు పిరంగులను కుమ్మరించి మట్టు పెట్టమని మన ప్రభువు వారిని అడిగి చూడండి. దేవుడు మీ మొర ఆలకిస్తాడేమో!

కాని ఈ విషయంలో మీకు ఎటువంటి సమాధానము రాదు. ఎందుకంటే ఈ దేవుళ్ల యొద్ద ఒక మంచి లక్షణముంది. అదేమంటే మౌనమే వీరిభాష. మీరు ఉపవాస ప్రార్థనలతో జుట్లు పీక్కుంటూ, ఏకాంత ప్రార్థనలు చేసినా, "ప్రెయర్ టవర్స్"లో సిగ్నల్స్ బాగా వుంటాయని భ్రమపడుచూ సామూహిక ప్రార్థనలు చేసినా దేవుళ్ల జాడగాని నీడగాని, వాళ్ల ఊసుగాని, పలుకు గాని కనపడదు, వినపడదు. ఎందుకంటారేమో! ఈ ప్రార్థనా విన్నపాలన్నీ "మౌత్‌పీస్"లు గాని, "రిసీవర్లు"గాని లేని డమ్మీ టెలిఫోన్లే!! కాని ఈ సమాధానానికి క్రైస్తవ విశ్వాసులెవ్వరూ, అంత తేలికగా అంగీకరించరు. అందుచేత దీనికి ధీటైన సమాధానము ఇవ్వాలి. అది విన్న తర్వాత ప్రతీ ఒక్కరు నాతో ఏకీభావించి తీరవలసిందే! అదేమిటో చూడండి.

ఈ దైవ వ్యతిరేకియైన నెల్సన్ రఫ్జీని మట్టు పెట్టమని యావత్ క్రైస్తవ సమాజాలు ఏకగ్రీవంగా కోరినా ఆపనిని మన "దయామయుడైన" తండ్రి చేయగలడా? అనే విషయాన్ని కూలంకుషంగా పరిశీలిస్తే ఆయన ఏమీ చేయలేడని ఆయన వల్లకాదని, ఇదేమిటి? ఈ రచయిత మొండి వాదన! అని భావించకండి! ఈ విషయంలో కొన్ని "బైబిల్ కొటేషన్లను" ఎత్తి చూప ప్రయత్నిస్తాను. అదేమిటో చూడండి.

దేవుడు పాపాత్ములను సహించడని ఆయన భయంకరుడైన దేవుడని... బైబిల్‌లో అనేక చోట్ల కనబడతాది... నీవు దుష్టత్వమును చూచి ఆనందించు దేవుడవు కాదు... పాపము చేయు వారందరిని నశింప జేయుదువు... యెహోవా - ఇచ్చకములాడు పెదవులన్నింటిని చీల్చివేయును... దేవుడు లేడని బుద్ధిహీనుడు తన హృదయమందు అనుకొనును... సైన్యములకు అధిపతి యగుదేవా! నీవు భయంకరుడవైన దేవుడవు. నీ ముందు అగ్ని



నడచును... దేవా నామొర ఆలకించుము... క్రొవ్వు చేత వారి కన్నులు మెరకలై యున్నవి... వారి హృదయాలోచనలు బయటకు కాన వచ్చుచున్నవి... ఎగతాళి చేయుచు, కీడును గూర్చి గర్వముగా మాట్లాడుదురు, ఆకాశము తట్టు వారి ముఖములను ఎత్తుదురు... వారి నాలుక భూసంచారము చేయును... మహోన్నతునికి తెలివియున్నదా అని వారనుకొందురు... ఇట్టి వాక్యాలన్నీ ముందస్తుగానే బైబిల్ నందలి కీర్తన గ్రంథములో వ్రాయబడియున్నవి. ఆయా ప్రసంగికులు వీటిని ఏ కరువు పెడుతూయుంటారు. అయితే ఆయనకు వ్యతిరేకంగా పనిచేసిన వారిపట్ల, మరిముఖ్యంగా బైబిల్ విలన్ అయిన అపవాది పట్ల ఎలా ప్రవర్తించాడో వివరాలు చూడండి. అప్పుడు మీకు అర్థమౌతాది. "యెహోవా ఎంతటి బలాఢ్యుడో?" తెలుసుకుంటారు. అబద్ధికుల పెదవులు చీల్చి చెండాడ గలిగాడాయని? పరిశీలించవచ్చు.

బైబిల్‌లో అపవాది పాత్ర ఏమిటో మీకందరికి తెలుసు. సమయము కొంచమే యున్నదని అపవాది గర్జించు సింహమువలె ఎవరిని మ్రింగుదునా యని వెదకుచూ తిరుగుచున్నాడు జాగ్రత్తగా యుండండని, క్రైస్తవ విశ్వాసులను అనునిత్యం, ఆదివార సమావేశాలందు, 24 గంటలూ టి.వి. లందు ఆయా ప్రసంగికులు ఊదరగొడుతూ యుంటారు. అయితే ఈ క్రైస్తవులకు మూలవిరాట్టు అయిన "యెహోవా" తన కార్యకలాపాలకు అడుగడుగునా అంతరాయం కలిగిస్తున్న ఈ లూసీఫరు అనే అపవాది పట్ల ఎంతటి మెతక వైఖరి అవలంభిచావడో, ఈ దుష్టుడైన అపవాదితో ఎంత సన్నిహితంగా వుంటున్నాడో, పిచ్చాపాటి ఎలా మాటాడుతూ, స్నేహితులవలే "బెట్టింగ్"లు (పందాలు) కాస్తూ యుండేవాడో! వాడి నైజమెటువంటిదో అంతా తెలిసియుండి కూడ వాడిని ఏమీ చేయకపోవడం చుడగా ఆశ్చర్యం గొల్పుతాది. అనునిత్యము క్రైస్తవ విశ్వాసులంతా ఆ మాయావియైన అపవాదితో పోరాటాలు సాగిస్తున్నామని భ్రమపడుతూ ఉత్తుత్తి యుద్ధాలు చేస్తూయుంటారు.

"బైబిల్"లో ఈ అపవాది పాత్ర ఏలా వచ్చింది? దీని పూర్వాపరాలేమిటి? అనే విషయం చాలా మందికి తెలియదు. తెలుసుకుందామనే ధ్యాస కూడా వుండదు. ఇక్కడ ఈ విషయాన్ని టూకీగా తెలుసుకుందాము.

> బైబిల్‌లో ఈ అపవాది పాత్రను గూర్చి తేటగా వ్రాయబడలేదు. ఈ అపవాది, సాతాను, భూతం, దయ్యంగా చెప్పబడే అపవాది ఎవరోకాదు సాక్షాత్తూ యెహోవా యొక్క *కుమారుడే!* బైబిల్ నందు దేవదూతలు అనగా దేవుని కుమారులు అని "రిఫరెన్సు"లో అర్థం వ్రాయబడింది. అపవాది ఆవిర్భావం "ఇది నిజమా" ప్రథమ భాగంలో పూర్తి వివరాలు సచిత్రంగా *108*వ పేజీలో వివరాలు చూడవచ్చు.

"బైబిల్"లో ఆదికాండంలో చెప్పబడిన సృష్టికి ముందు యెహోవా భూమ్యాకాశాలను సృజించి దానిపై తన కోటానుకోట్లమంది (కుమారులను) దేవదూతలను ఉంచాడట. వీరిపై ప్రధానిగా "లూసీఫరు" అనే ఒక "నమ్మకమైన" దూతను నియమించాడట. అతడు అందగాడే

కాక ఇంచుమించు యెహోవాకున్న శక్తి యుక్తులన్నీ వున్నాయట. అతడు కణకణమని మండే గంధ్ర నిప్పుల మధ్య విహరిస్తూ... సితార, పిల్లనగ్రోవి, "స్వరమండలము" మొదలగు వాయిద్య పరికరాలతో యెహోవాను స్తుతిస్తూ, కీర్తిస్తూ యుండేవాడట. ఇలా చాలా కాలం సజావుగా సాగిపోయి నమ్మకమైన సేవకుడుగా పేరు తెచ్చుకున్నాడట. మొత్తానికి దేవదూతలంతా పురుషపుంగవులేనని బైబిల్ వివరించింది. ఎందుకో ఆయన కడుపున ఒక్కటంటే ఒక్క ఆడపిల్లైనా పుట్టలేదు. ఇంతటి ఆహ్లాద కరమైన జీవితం దొర్లిపోతూ యుండగా కొన్నాళ్లకు ఈ లూసీఫరుకు ఓ దుర్బుద్ధి పుట్టి.. ఆ! తూర్పు దిక్కునున్న సభాపర్వతంపై యెహోవా సింహాసనంపై తాను కూర్చుంటే యెహోవాతో సమానుడనైపోతాను కదాయని తన మనస్సులో గర్వించాడట. అంతే ఈ సంగతి యెహోవాకు తెలిసిపోయింది. ఆఘమేఘాల మీద అచటికరుదెంచి, లూసీఫరును అతని అనురచరులను మెడపట్టి ఆకాశవిశాలంలోకి గెంటివేశాడట. నాటి నుండి నేటి వరకు వారు "బద్ధ శత్రువులైపోయారు" ఈ కథనం నర్మగర్భితంగా అక్కడో ముక్క ఇక్కడో ముక్క వ్రాయబడింది.

యెహోవా అంతటితోనైనా ఆగక భూమిని నిర్వికారంగా మార్చివేసింది చాలక అగాధ జలాలతో ముంచివేశాడు. అయినా ఆయన కోపం తగ్గక తాను కూడ ఆత్మరూపు దాల్చి ఆ చిమ్మచికట్లో ఆ జలాలపై అల్లాడుతూ ఎన్ని లక్షలో కోట్ల సంవత్సరాలో వుండి పోయాడట. అయితే తనకు విదేయులైన మిగతా కోట్లాది మంది దేవదూతలను ఏమి చేసాడో ఎక్కడుంచాడో ఎవరికీ తెలియదు. ఎక్కడా వ్రాయబడలేదు.

అనంతరము ఎప్పుడో మేల్కొని, భూమిని తిరిగి "రీ-మోడల్" చేసి తిరిగి ఆరు దినాల్లో (ఆదికాండములో చెప్పబడిన) సృష్టిని చేశాడట. ఇది క్లుప్తంగా అపవాది ఆవిర్భావం కథ.

*(ఇక్కడ మనము గమనించగా యెహోవా దేవుడు) ఇటువంటి కార్యం భూలోకంలో జరిగితే రాజద్రోహ నేరం క్రింద ఆ లూసీఫరుకు, అతని అనుచరులకు శిరచ్ఛేధనం శిక్షవేసి అజ్ఞాన కాలం నాటి చండ శాసనులైన రాజులు. అట్టివారి పీడవదిలించుకుంటారు. అయితే ఆయనకు వీలుపడకననో... చేతకాకనో యెహోవా లూసీఫరును ఏమీ చేయకుండా వదిలి వేశాడు.*

*మనము అలా తలంచకూడదు. వాడిని చంపితే ఇంతే సంగతులు, బైబిల్ కథనం అంతటితో ఆగిపోతాది. ఒకవేళ అందుకే బ్రతక నిచ్చాడేమో!*

అటు తరువాత భూమి మీద ఆదిమానవులను సృష్టించి ఏదెను లో (EDEN) ఒక తోటవేసి అందు "మేళ్లూ-కీళ్లు" తెలియజేసే వృక్షాన్ని, జీవవృక్ష ఫలాల చెట్టును నాటాడు. వారితో మీరు ఈ తోట యందలి అన్ని ఫలాలను తినవచ్చుగాని తోట మధ్యనున్న "మేళ్లూ కీళ్లు" తెలియజేసే వృక్ష ఫలాలను మాత్రం తినకూడదు. అవి తిన్న దినాన మీరు చస్తారని



చిన్న అబద్ధం చెప్పి వారిని భయపెట్టాడు యెహోవా!

ఆకాశ విశాలంలో అటూ ఇటూ తిరుగుచున్న లూసీఫరు ఈ సంగతంతా ఒక కంట కనిపెట్టుచున్నాడు. యెహోవా లేని సమయం చూచి గుట్టుచప్పుడు గాకుండ భూమ్మీదకు దిగి సర్పంలో ప్రవేశించి స్త్రీ యొద్దకు వచ్చి "ఇది నిజమా" యని యుక్తిగా ప్రశ్నించి యెహోవా తినవద్దన్న నిషిద్ధ ఫలాలను వారితో తినిపించి వారిని ఆజ్ఞాతిక్రమణ చేయించి, మెల్లగా జారుకున్నాడు. పాపమా అమాయక సర్పం యింకా అక్కడే తచ్చుళ్లాడుతుంది. అంతలో యెహోవా వచ్చి విషయం తెలుసుకొని అక్కడ కనిపించిన సర్పాన్ని శపించాడు. వెనువెంటనే తన ఆజ్ఞను ధిక్కరించారని నరమానవులను కూడ శపించి చర్మపు దుస్తులిచ్చి వారిని ఏదెను తోట నుండి తరిమివేసి, వారు తిరిగి రాకుండా దాని గేట్ల యొద్ద "ఖడ్గ జ్వాల"లను కావలియుంచాడట.

*అపవాది సర్పాకారంలో యెహోవా సంకల్పాన్ని తారుమారు చేశాడు. కనీసం అప్పుడయినా న్యాయవిచారణ జరిపి దోశులెవరో నిర్ధారించకుండ అదరాబదరా నిర్ణయాలు తీసికొన్నాడు యెహోవా. ఈ సంగతి ఆయనకు ముందే తెలుసునని కొందరు వాదించవచ్చు. కాని ఆయనకు ఎంత మాత్రము తెలియదు. తెలిస్తే అపవాదినే శిక్షించే వాడేమో!*

మరో ముఖ్య సంఘటన: భూమి మీద జనులు విస్తరించాక యోబు అనే భక్తుడు యెహోవాను అత్యంత భక్తి శ్రద్ధలతో సేవిస్తూయుండగా అతనిని బహుగా ఆశీర్వదించి పిల్లాజల్లలను, ఆస్తిపాస్తులను పుష్కలంగా ఇచ్చాడట. యెహోవా.

ఇదిలా గుండగా దేవదూతలు యెహోవా ముందు నిలచు దినమొకటి వచ్చిందట (సాధారణంగా సైన్యంలో పదాతి దళాలు తమ పై అధికారి ఎదుట నిర్ణీత సమయాలలో హాజరౌతూయుంటారు. వారు క్రమశిక్షణను పాటిస్తున్నారా లేదా? వారి క్లాపులు, షేవింగులు సరిగా వున్నాయాలేవా? వారి "యూనిఫారం", బూట్లు వగైరా పరిశీలిస్తూ యుంటారు). బహుశా ఆ విధమైన పరిశీలన లాంటిది చేస్తారేమో! ఆ సందర్భంలో దేవ దూతలతో కలసి అపవాది కూడ యెహోవా ముందు నిలుచున్నాడట. యెహోవా వారిని తేరిపార జూచి, తనకు విధేయులైన దూతలందరిని విస్మరించి, తన విరోధియైన అపవాయొద్దకు వచ్చి "హలో లూసీ! ఎక్కడి నుండి ఊడిపడ్డావయ్యా! అంతా కుశలమేనా?" అన్న విధంగా వాడిని కుశల ప్రశ్నలు వేశాడు. అందుకు అపవాది "కేర్‌లెస్"గా సమాధానమిస్తూ ఏదోలే! భూమ్మిద అటూ ఇటూ తిరుగుతూ వచ్చాన్‌లే! అన్నాడు. తిరిగి యెహోవాయే మాట్లాడుతూ ఏమోయ్! నాకు భూమ్మీద ఏక్ నెంబర్ భక్తుడు, నీతి పరుడు, నిజాయితీపరుడు, అయిన యోబు అనే ఏకైక భక్తుడొకడు ఉన్నాడు నీకు తెలుసా అని అడిగాడు. అందుకు అపవాది నాకు తెలియనిదేముంది! అతనికి, అతని ఆస్తిపాస్తులకు, నీవు కంచెవేసి కాపాడుచున్నావు. మరి నిన్ను సేవించక ఏమి చేస్తాడు? అవన్నీ నీవు తీసివేస్తే నీ ముఖం ముందరే నిన్ను

విడిచి పోతాడు అనగా యెహోవాకు ఎక్కడలేని పౌరుష మొచ్చింది. సరే నీకూ నాకు పందెం! అన్న చందాన, సరే అలాగే కానిద్దాము, అంటూ దొంగకు తాళం చేతులు ఇచ్చి పంపిన చందాన యెహోవా అపవాదిని యోబునొద్దకు పంపాడు.

**యెహోవా యొద్ద నుండి అగ్ని దిగివచ్చి** యోబు యొక్క గొర్రెల మందలను, పశు సంపదను దహించి నాశనం చేసిందట. అనంతరం కల్దీయులు వచ్చి యోబు పని వారినందరిని చంపి ఒంటెల నన్నింటి నీ దొంగిలించారు. అనంతరం యోబు కుమారులు, కుమార్తెలు ఒక విందులో మునిగి తేలుతూ "ద్రాక్షసారాయి" మత్తులో యుండగా అరణ్యములో నుండి అతివేగంగా సుడిగాలి వచ్చి ఆ ఇంటిని తాకగా ఆ ఇల్లు కూలి వారాంతా చనిపోయారు. ఆ వార్త తెలిసిన యోబు చింతా క్రాంతుడై తల వెంట్రుకలు గొరిగించుకొని, గోనెబట్ట కట్టుకొని, బూడిదలో కూర్చొని రోధిస్తూ, నేను దిగంబరంగానే భూమి మీదకు వచ్చాను. దిగంబరంగానే పోతాను. యెహోవా ఇచ్చెను. యెహోవా తీసుకొని పోయెనని దేవుని స్తుతించాడట.

మళ్లీ దేవదూతలు యెహోవా సన్నిధిని నిలుచు దినమొకటి రానేవచ్చింది. అపవాది యధాప్రకారంగా దూతలతో పాటు దేవుని సన్నిధికి వచ్చాడు. యెహోవా మళ్లీ అపవాది యొద్దకు వచ్చి తిరిగి అదే పలకరింపు. అపవాది అదే పాత సమాధానం. ఏమయ్యా! అపవాదీ... నిష్కారణంగా నా భక్తుని పాడుచేయుటకు నీవు నన్ను రెచ్చగొట్టావు అయినా అతను చెక్కుచెరదలేదు. అలాగే యున్నాడు చూచావా! అని విజయగర్వంతో అన్నాడు యెహోవా. అందుకు అపవాది అతని ఆస్తిపాస్తులు అన్నీ పోయినా అతని చర్మమును ప్రాణమును బాగానే ఉన్నాయి కదా! అతని స్నేహితులు అతన్ని ఆదుకుంటారు. అతనికేమి తక్కువ. ఈ ఒక్కసారి నీవు నీ చేయిచాచి యోబు శరీరాన్ని మొత్తిన ఎడల నీ ముఖం ముందే నిన్ను దూషిస్తాడని మరో మారు యెహోవాను రెచ్చగొట్టాడు. వెనువెంటనే యోబుకు నడినెత్తి మొదలుకొని అరికాలి వరకు కుష్టు కురుపుల వంటివి పంపగా యోబు ఆ దురద భరించలేక పళ్లు గిట్టకరచుకొని చిల్లపెంకులతో గోక్కొంటూ బరుక్కొంటూ రక్తాలు, కారు చున్నప్పటికి చలించకుండ యెహోవాను స్తుతిస్తూయున్నాడట. అపవాది ఇక లాభం లేదని అజా పజా లేకుండ పారిపోయాడట.

అనంతరం ఎప్పుడో తీరికగా యెహోవా ప్రత్యక్షమై యోబుకు సమస్త ఆస్తిపాస్తులు... ఆరుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలను ఇచ్చాడట. ఇలా జరగనున్నదని యెహోవాకు ఏ మాత్రం తెలియదు లాగుంది పాపం! ఈ విధంగా కథ సుఖాంతం చేశారు.

ఏమిటీ కథనం? తనను ఆదియందే ధిక్కరించిన లూసీఫరు... ఆది దంపతులను మోసగించి, తన యొద్దకు ధైర్యంగా వచ్చినపుడు వాడిని అరెస్టుచేసి, అంతమొదించవలసిన యెహోవా! ఇంతటి చేత కాని తనంగా వాడితో పందాలు కట్టడమేమిటి? అసలు అపవిత్రమైనదేది ఆయన సన్నిధిలో ప్రవేశించ జాలదని చెప్పబడుచుండగా అపవాదికి ఎవరు? "ఎగ్జంప్షన్" ఇచ్చారు? అసలే భూలోకంలో భక్తులు లేని కరువు రోజుల్లో ఒకే ఒక్క



భక్తుడుండగా వాడిని నిలబెట్టుకొనకుండ, అపవాది మాటలకు యెహోవా రెచ్చిపోయి ఆ మాయావి ముందు తన గొప్పతనము. చాటుకోవాలా? ఇదంతా ఒక అసమర్థ దేవుని కథలాగ ముగిసిపోయింది. వాడు తిరిగి భూలోకంలో భక్తులను వేధించడానికి మళ్లీ వెళ్ళిపోయాడా? ఏమిటీ చోద్యం! ఇది "అట్టర్ ఫ్లాఫ్" అయిన సినిమా కథలాగ యుంది. ఈ యోబు కథను చెబుతూ అనేకమంది ప్రసంగికులు, భక్త జనులకు ఇంకా బోరు కొట్టిస్తూనే యున్నారు. ఎవరూ నోరు విప్పి ఇట్టి ప్రశ్నలను వేయ సాహసించరు. ఒకసారి ప్రశ్నించి చూడగలరా అత్యంత పిరికివారైన క్రైస్తవులెవరు ఈ పని చేయసాహసించరు. అయ్య బాబోయ్ సర్వశక్తివంతుడైన యెహోవాను ప్రశ్నించడానికి మానవుడెంతడి వాడు!

**అపవాది మరోసారి యెహోవా సన్నిధానంలో మకాము:** ఇదే అపవాది ఈసారి డైరెక్టుగా యెహోవా సన్నిధానంకు, తన అనుచర బృంధాలతో సహా వెళ్లి ఆయనతోనే సహజీవనం సాగించిన మరో ఆశ్చర్యకరమైన కథ! (ఎంతైనా యెహోవా కుమారుడే కదా అప్పుడప్పుడు ఇలా దర్శనాలు చేస్తుంటాడేమో!) "అపవాది యెహోవా నివాసం చేరుకొని ఆయన పరిశుద్ధ సన్నిధిలో రాత్రింబవళ్లూ మన దేవుని ఎదుట, మన సహోదరుల మీద నేరములు మోపుచూ" కొంతకాలం మకాం వేశాడట. చాలా రోజుల తర్వాత వాడిని వాని అనుచర బృందాన్ని భూమిపై పడద్రోశారట. అందుచే ఇక మనమే గెలిచాము. గనుక ఇప్పుడు రక్షణయు, శక్తియు, రాజ్యమును మన దేవుని (యెహోవా) దాయెను. ఇప్పుడు అధికారము క్రీస్తుదాయెను అని పరలోకమందు పండుగ చేసికొన్నారట. అంటే అంతకు ముందు అధికారము అపవాది - హస్తగతము చేసుకొన్నాడని భావించాలా? (ప్రకటన గ్రంథంలో చూడండి).

ఏమిటీ ఈ తలాతోక లేని రాతలు, ఇంతటి విధ్వంస కారుడైన, దుష్టుడు, దుర్మార్గుడు యెహోవాకు వ్యతిరేకంగా తిరుగుబాటులు, చేసినా వాడికి ఏ విధమయిన శిక్ష విధించలేక పోయాడు యెహోవా! ఇటు భూలోకంలో చూస్తే అమ్మో! అపవాది, సాతాను!, ఘటసర్పం!, మాయావి!, అంధకారశక్తి అని క్రైస్తవ సమూజాలకు కంటి మీద కునుకులేకుండా చేస్తూ యుండగా మరో ప్రక్క దేవుళ్లను కూడ వదలకుండ యున్న ఈ అపవాదిని గూర్చి యెహోవాకు అంతభయమెందుకు? వాడికి అంతమర్యాద ఇవ్వవలసిన పని ఏమిటి? పరలోకంలో కూడ, యెహోవాతో సహజీవనం చేసే కాడికివచ్చాడా! అయినా యెహోవా వీడిబాధ పడలేక తిరిగి భూలోకంలోకి పడద్రోశారా? ఈ దురాత్మను యెహోవా ఎందుకు అంతమొందించ లేకపోతున్నాడో? ఎప్పుడో యుగాంత మందు నరకంలో పడవేస్తాడా! గంధ్రనిప్పుల్లో సంచారము చేయగల శక్తియుక్తులున్న అపవాదిని యెహోవా ఏమి చేయగడు! ఇంతటి ముఖ్య విషయాన్ని గూర్చి క్రైస్తవ సమాజాలు ఏ మాత్రము సందేహాలు వెలిబుచ్చవు. అసలు ఈ కథనాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించరు. ఇప్పుడేమీ చేయలేడా అనే ప్రశ్నలకు సమాధానం లేదు యిదంతా ఆయోమయం.

*ఆఖరుగా మరీ విచిత్రమైన విషయం మీకు చెబుతాను. సాక్షాత్తు యెహోవా ఏకైక కుమారునిగా కూడ చెప్పబడిన యేసు క్రీస్తు ప్రభువుకు ట్యూషన్ మాస్టారుగా అపవాది నియమించబడ్డాడా? దేవుడికి దయ్యాల ట్రెయినింగ్ అవసరమా? దేవుడికి "ట్యూషన్" అవసరమా! ఏమిటి ఈ తలాతోక లేని రాతలు? పిచ్చిరాతలు.*

మన పసిపిల్లలకు అనుభవజ్ఞుడైన ట్యూషన్ మాస్టర్ కావాలని వెతుకుతాము. కె.జి. క్లాసు నుండే వాడు "మెరిట్ స్టూడెంట్" కావాలని కోరుకుంటాము. దానికి ఎంతైనా ఖర్చుచేయుటకు వెనుకాడము. అయితే దేవాది దేవుడైన యెహోవా కుమారుడని చెప్పబడే యేసుకు ఒకసారి ఒక ట్యూషన్ మాస్టారు అవసరమయ్యాడు. యెహోవా పరిపరి విధాల ఆలోచించి చివరికొక నిర్ణయానికొచ్చాడు. ఆ సంగతి పరిశుద్ధాత్మ దేవుని చెవిలో చెప్పాడు లాగుంది. యేసు స్నానికుడైన యెహోను యొద్ద "యోర్దాను" నదిలో బాప్తీస్మము తీసికున్నాడు. ఆయన ఆ నదిలో నుండి గట్టెక్కాడో లేదో... అంతలోనే "పరిశుద్ధాత్మ దేవుడు" ఆయన నెత్తిమీద పావురం వలె దిగాడు. ఆకాశము నుండి గొప్పస్వరము వచ్చిందట. **"ఈయన నా ప్రియకుమారుడు ఈయన యందు నేను ఆనందించుచున్నాను"** అవి యెహోవా పలికిన మాటలుగా చెబుతారు... సరే ఆయన ఆపదలను ఎలా ఎదుర్కోవాలో అందలి మెళకువలు నేర్చుకోవలసి యున్నదట. (ఔను మరి సిలువ మరణానికి ఆయుత్త మవ్వాలి కదా!) యేసుతో పరిశుద్ధాత్ముడు మీరు 40 దివారాత్రులు పాటు పాఠాలు నేర్చుకోవాలట! పదమంటే ఆయన రానన్నాడు కావచ్చు. సాధారణంగా కొంతమంది పిల్లలు స్కూలుకు పోనని పాతకాలంలో మారాము చేసేవారు. అట్టి పిల్లలను తన్నుకుంటూ గెంటుకుంటూ, లేక భుజాల మీద ఎక్కించుకొని తీసికొని వెళ్లేవారు.

యేసు వస్తానంటే చేయిపట్టుకొని తీసికొని వెళ్లేవాడు పరిశుద్ధాత్మ దేవుడు. బహుశా ఆయన ట్యూషన్ మాస్టరు పేరు చెప్పగానే భయపడి రానన్నాడేమో! అందుకే పరిశుద్ధాత్ముడు యేసును అరణ్యానికి "త్రోసుకొని" పోయాడనుకుందాము. బహుశా యేసు భయము నిజమే కావచ్చు ఆ ట్యూషన్ మాస్టర్ ఎవరనుకుంటున్నారు? వాడు అపవాది. ఆ ట్యూషన్ ఎంతటి కఠినమైనదో చూస్తే 40 రోజుల పాటు తిండీ తిప్పలు లేకుండ "థియరీతో" పాటు "ప్రాక్టికల్స్" కూడ చేయించాడట! సైతాను ట్రైనింగ్ ముగిశాక ఏమయినా సర్టిఫికెట్ జారీ చేశాడో లేదో తెలియదు. (మత్తయి 4:2-11 చూడండి).

అయ్యబాబో! దేవుడి కొడుకైన యేసు క్రీస్తు ప్రభువుకు అదే యేసు దేవునికి దయ్యం దగ్గర "కోచింగ్!" ఇప్పించాలా! ఇన్నిసార్లు యెహోవా కొంపముంచి రాగల భక్త జనులను కూడ మాయోపాయములచే పడగొట్టుచున్న ఆ అపవాది యొద్ద నా! ఈ తర్ఫీతు! ఇవి ఎంతటి జుగుప్సా కరమైన రాతలు! యేసు దేవునికి ఇట్టి సాతాను తర్ఫీతు అవసరమంటారా! క్రైస్తవ విశ్వాసుల్లారా? ఈ ట్రెయినింగ్‌ను గూర్చి బైబిల్‌లో వ్రాయడం పరిశుద్ధ గ్రంథమని



చెప్పుకోవడానికే సిగ్గనిపిస్తుంది. తీరా చూస్తే అవి "ఉత్తుత్తి" ట్రయినింగులే! అపవాది యేసుకు బైబిల్ రిఫరెన్సులు చూపుతూ ఫలానా విధంగా చేయమనగా క్రీస్తు మరో బైబిల్ కోటేషన్ చూపినంతనే OK అని సరిపెట్టుకున్నాడా! అపవాది శోధనలు. ఇంత తేలికగా ముగిసిపోయాయా!

యెహోవా యంతటి వాడినే ముప్పుతిప్పలు పెట్టి, బైబిల్ దేవుడి కొంపముంచినా! ఏమీ చేయలేకపోగా చేతులు ముడుచుకొని కూర్చున్న యెహోవా పైగా వాడితో స్నేహంగానే యుంటూ, సాక్షాత్తూ తన ఏకైక కుమారునికి సైతాను వంటి మాయావిని "కోచ్"గా నియమించడం చూడగా... శాంతి యుతంగా... శాస్త్ర యుక్తంగా కార్యకారణ సంబంధాలను ప్రశ్నిస్తూ... ఎందుకు? ఏమిటి? ఎక్కడ? ఎలా! అంటూ "ఇది నిజమా?" అని అడుగుచున్న ఈ సత్యాన్వేషిని ఏమీ చేయలేడు, సాహసోపేతంగా ముందుకు అడుగులు వేస్తూ "సెంచరీ" కొట్టకపోయినా... అందరివలెనే సహజసిద్ధంగా ఏరుగ్మత వల్లనైనా మరణిస్తే స్వాగతం పలుకుతాను. దీనిని ఏ మానవుడు తప్పించుకోలేడు. అదిగో "దేవుడు చంపేశాడు చూడు!" అనవలసిన పని ఎంతమాత్రము లేదు.

ఇక్కడొక జోక్ లాంటి సత్యాన్ని బాలరాజు అనే గాస్పెలు సింగర్ ఒక సమావేశంలో చెప్పాడు. మానవ జీవితం గూర్చి నాలుగు ముక్కల్లో తేల్చి పారేశారు.

"చిన్నప్పుడు చిగురు
బాల్యంలో బగరు
యవ్వనంలో పొగరు
వృద్ధాప్యంలో షుగరు"

అంటే మరణం ఎంత సహజమైనదో మనకు అర్థమౌతుంది.

... రచయిత.



## జలచరాలు - పక్షులు - జంతుజాలం
## (ఆవిర్భావం పై సమగ్రచర్చ)

ఈ సకల సృష్టిని ఎవరుచేశారని మీరు క్రైస్తవులనెవరినడిగినా ఏ మాత్రము తడుముకోకుండా ఏమత గ్రంథంలోను వ్రాయబడని రీతిలో మా బైబిల్‌నందే తేటతెల్లంగా వివరించబడిందని... దేవుడైన యెహోవా కేవలం ఆరంటే ఆరు దినాల్లో మానవులతో సహా సకల సృష్టించాడని చెబుతారు. అనుభవజ్ఞులైన భక్తాగ్రేసరులు కూడా బైబిల్‌లో వివరించబడిన విధంగా కాక దేవుడి మీదనున్న అధిక విశ్వాసంతో వారు కూడా అలాగే చెబుతారు. ఎవరినైనా అడిగిచూడండి!

బైబిల్ సృష్టికార్యంలో నీరు-నేల-నింగి-లందు విహరించే జలచరాలు, జంతుజాలం, పురుగులు, పాములు, పక్షులు మొదలైన జీవులన్నియు వింతగొల్పే రీతిలో సృష్టించబడినట్టు బైబిల్ వివరిస్తుంది. ఇందలి సంభవాసంభవాలను పరిశీలించి చూద్దాము.

సృష్టికార్య వివరణలలో నాల్గవ దినాన చేపలు, మహామత్స్యములు, తిమింగలాలు, మొసళ్ళు, తాబేళ్లు, నత్తలు, పీతలు, రొయ్యలు, కప్పలు, “అగుడు” అనబడే (“ఆక్టోపస్”)లు జలగలు, చివరకు భూమ్మీద, ఆకాశమందు విహరించే పక్షిజాతులను ఎవరు సృష్టించారో తెలుసా? వీటి సృష్టికర్త సముద్రమట! వాటిని సృష్టించవలసిన బాధ్యతను యెహోవా సముద్రానికి అప్పగించాడట. వెనువెంటనే సముద్రము పై జీవులనన్నింటిని పుట్టించి వేసింది. దేవుడు చెప్పిందే తడవుగా ఒక దానితో మరొక దానికి సంబంధంలేని విధంగా సముద్రం ఎలా! డిజైన్ చేసిందో ఎవరికీ తెలియదు. వెనువెంటనే సముద్రం యొద్దకు వచ్చిన దేవుడు పక్షిజాతులను, జలచరాలను చూచి నీళ్లలోను భూమి మీద, ఆకాశమందు విహరించమని చెప్పినంతనే అలా జరిగి పోయిందట.

అనంతరం అడవి జంతువులను, పశువులను, పురుగులను భూమి పుట్టించును గాక! అనగానే భూగర్భం నుండి - సింహాలు, పెద్దపులులు, ఏనుగులు, ఖడ్గమృగాలు, ఒంటెలు, గాడుదలు, గుర్రాలు, లేళ్లు, దుప్పులు, జీబ్రాలు, జిరాఫీలు, ఎలుగుబంట్లు, తోడేళ్లు, కుందేళ్లు, పందులు, పందికొక్కులు, ఎలుకలు, సుంచులు, మేకలు, గొర్రెలు, ఆవులు, ఎద్దు, దున్నపోతులు, బర్రెలు, జెర్రెలు, తేళ్లు, బల్లులు, సాలెపురుగులు, ఉడుములు, ముంగిసలు, తొండలు, ఉడతలు, మిడతలు, బొద్దింకలు, జిల్లపురుగులు, చెదపురుగులు,





సకల రకాల చీమలు, సకల విధాలైన క్రిమి కీటకాదులు, కంటికి కనిపించని కోట్లాది సూక్ష్మక్రిములు, నల్లులు, పేలు అమ్మో! అసలైన సర్పజాతులు, కొండ చిలువలు, మొదలైన వాటన్నింటిని, అందలి అనేక రకరకాల వెరైటీలను సముద్రము, భూమి సృష్టించగా చూచిన యెహోవా! అబ్బబ్బ ఇవన్నీ ఎంత మంచిగావున్నాయని చూచి తెగ సంబరపడి పోయాడట!

అయితే ఇక్కడ మనము చూడగా సకల జీవరాసులను చూచిన యెహోవా దేవుడు మరి ముఖ్యంగా భవిష్యత్ గ్రాహియైన మహోన్నతుడు అనగా జరగబోయే సంగతులన్నీ ముందే తెలిసిన ఈ మహానుభావునకు అతి త్వరలోనే ఈ చిత్రంలో కనబడుచున్న ఈ సర్పం వచ్చి తన కొంప ముంచనున్నదనే విషయం పాపం ఆయనకు తెలియదులాగుంది. “ఇది నిజమా?” అని ఆది దంపతులైన ఆదాము హవ్వలను ప్రశ్నించి, యెహోవా సంకల్పాన్ని పేకమేడల్లా కూల్చివేస్తాదని ఆ దేవునికి తెలియదాయని మనము ఎలాగడగ గలము. ఈ అవివేకము యెహోవాది ఎంతమాత్రము కాదు! ఈ బైబిల్ కథా రచయితలు ఎలావ్రాస్తే అలాగే కథానాయకుడు నడుచుకోవడము రివాజు కదా! ఇది కేవలము నాటి రచయితల అజ్ఞానం మాత్రమే!



సోదర మహాశయుల్లారా! విద్యాధికులైన భక్తజనుల్లారా! శాస్త్రప్రముఖులు, న్యాయశాస్త్ర కోవిదులు, రాజకీయ ప్రముఖులు కంప్యూటర్ సైన్స్ మేధావులు మొదలైన వైజ్ఞానిక ప్రపంచం, పైన చెప్పబడిన సృష్టికార్య వివరణను గూర్చి ఏమంటారు? సముద్రము - భూమి ఇంతటి క్లిష్టకార్యాన్ని చేయడము సాధ్యమేనా? సముద్రానికి గాని, భూమండలానికిగాని దేవుని ఆజ్ఞలు విని ఆచరించగల శక్తి యుక్తులు వున్నాయా? అనే విషయాలను ప్రక్కన పెడదాము. ఈ ఆదికాండ సృష్టికార్యాన్ని నేను ఇప్పటి వరకు రెండు మూడు వందల సార్లు

చదివి యుండవచ్చు. అయితే ఈ వ్యాసాన్ని ఫెయిర్‌గా వ్రాయుచుండగా పాపం ఈ అమాయక బైబిల్ రచయితలు నా చేతికి అడ్డంగా దొరికి పోయారు. ఇంతకాలము నాటి బైబిల్ రచయితలను అమాయకులు, అనాగరికులు అంటూ వచ్చాను. కాని ఇప్పుడు మరింత ధైర్యంగా, ప్రప్రథమంగా "దొంగ రచయితలు" అని ఒత్తి ఒత్తి పలుకుచున్నాను.

ఈ ఆదికాండ గ్రంథంలో పై కథనం గూర్చి ఎప్పుడో యెహోవా "సముద్రాన్ని భూమిని" ఉద్దేశించి మాట్లాడాడని చెప్పిన పలుకులను వారు వ్రాశారు.

దేవుడు సముద్రముతో మాట్లాడుతూ... నీవు మహామత్స్యములను జీవము కలిగిన వాటి నన్నింటిని వాటి వాటి జాతి ప్రకారము "రెక్కలు గల ప్రతి పక్షిని" చేయాలని ఆదేశించాడు.

ఇకపోతే భూమితో: వాటి వాటి జాతి ప్రకారము జీవముగల వాటిని... పశువులను, పురుగులను, అడవి జంతువులను, భూమి పుట్టించును గాకయని పలికెను. ఆ ప్రకారమాయెను. యెహోవా సముద్రాన్ని, భూమిని మీరు పలానా జీవులను చేయమని చెప్పాడేగాని, అవి ఎలా గుండాలో ఎన్ని విధాలుగా వుండాలో వాటికి వివరించలేదు. అయినప్పటికి అవి క్షణాల మీద సృష్టించి వేశాయి. పై ఆదేశం సంగతి అలాగుంచగా ఇందు యెహోవా వాక్కులు అసలు సముద్రానికి, భూమికి వినబడ్డాయా? వాటితో దేవుడు ఏ భాషలో మాట్లాడాడు? సముద్రము ద్రవ పదార్థముకాగా, భూమి రాయి రప్పలలో కూడిన జడపాదార్థమైనప్పుడు అవి స్పందించడమనేదే అసంభవమైన విషయము.

ఈ సంగతి కన్నా ముఖ్యమైన అభ్యంతరము మరొకటుంది. సముద్రానికి భూమికి అవి చేయబోయే జీవులు ఎలా గుండాలో ఆయా జాతుల పేర్లు ఉదహరిస్తూ... "జీవము గలిగి" "చలించు" "రెక్కలుగల" "పక్షులను" మహామత్స్యము"లను "పశువులను" "అడవి జంతువులను" వాటివాటి "జాతి" ప్రకారము చేయమని సముద్రానికి, భూమికి ఆదేశించినట్టు వ్రాయబడింది. అప్పటికి పక్షులుగాని, జంతువులుగాని అసలు జీవమంటే ఏమిటో తెలియదు. ఆ సమయానికి ఇంకా నరమానవుడు భూమిమీద లేడు. అప్పటికి భూమి మీద ఏమీలేనప్పుడు పక్షులు, జంతువులు, మహామత్స్యములు, అడవి జంతువులు వాటి వాటి జాతి చొప్పున చేయమని చెప్పడంలో ఏమయినా అర్థముందా? అప్పటికి ఆదామును చేయలేదు. ఆయా ప్రాణులకు పేర్లు యెహోవా ఎలా ఉదహరించాడు? ఇక్కడ బైబిల్ గ్రంథ రచయితలు అడ్డంగా దొరికిపోయారు. నాటి రచయితలకు ఇవన్నీ ముందే తెలుసును గనుక, వారు బైబిల్‌ను వ్రాసే సమయానికి ఉన్న మానవులకు తెలిసే విధంగా వ్రాయబడిందే గాని ఇది యెహోవా వాక్కులు ఎంతమాత్రము కావు. బైబిల్‌ను 60,65 సంవత్సరాల నుండి చదువుచున్నా ఈ సంగతిని నేను గ్రహించలేదు. ఇంత కాలానికి ఈ "క్లూ" దొరికింది. మరొక్కసారి చదవండి. అప్పటికి సూర్యచంద్ర నక్షత్రాదులు, చెట్లు, సృజించబడినప్పటికి మనుషులు లేనందున చెట్లున్న ప్రాంతాన్ని అడవి అంటారని ఎవరికీ తెలిసే అవకాశం లేదుకదా!






పూల మొక్కలకు సంబంధించి భూమి ఒక "జ్యోక్ సృష్టి" చేసినట్టు కనబడుతుంది. విత్తనాలనేవే లేకుండ మొలిపించిన పూల మొక్కతో ఒక కోతి పని వలె దానికి పూచిన పూలు విచిత్రమైన రీతిలో కోతి ముఖాలు కలిగి పళ్లికిలించి నట్లున్నాయి.

భూమి మీద ఇంకా వర్షము కురియుట ప్రారంభం కాకముందే... భూమిని సేద్య వరచుటకు నరుడులేనప్పుడే భూమి నుండి నీటి ఆవిరి లేచి భూమిని తడపగా చెట్టు చేమలు పుట్టుకొచ్చాయట. భూమి మీద వర్షము కురియక ముందే సముద్రాలు ఎలా పుట్టుకొచ్చాయో బైబిల్ రచయితలకే తెలియదు. విత్తుముందా చెట్టు ముందా అని ప్రపంచములో ఎన్నో తర్జన భర్జనలు జరిగాయి. ఆ చర్చ ఎటూ తేలలేదు. భూమి నుండి నీటి ఆవిరి లేచినంతనే భూమి తడిసిపోయి నానా జాతుల చెట్లు చేమలు మొలకెత్తాయట. ఆయా విత్తనములు ఎలా పుట్టుకొచ్చాయో మిస్టరీగా మిగిలిపోయింది. "కొలంబియా", "ఈక్వెడార్", "పెరూ" దేశాల్లో పెరిగే ఈ "ఆర్కెడ్" పూల చెట్లు అచ్చం కోతి ఆకృతిలోనే వుంటాయి. ఈ ముక్కు, కళ్లు, పల్లు, నెత్తి అచ్చం కోతిలాగానే వుంది. ఇది భూమి చాకచక్యమో లేక యెహోవా మేజిక్కో! మనకు తెలియదు.



ఈ కారణంగా ''తలాతోక'' లేని విధంగా బైబిల్ సృష్టి కార్యం మోసపూరిత రాతలతో వివరించబడింది. పై వాక్యాలు నేడు మనము చదువుచుండగా మనకు చాలా బాగా అర్థమౌతాయి! కారణమేమిటి పై మాటల అర్థం మనకు ప్రత్యక్షంగా తెలుసు. అడవి, పక్షులు, రెక్కలు, జంతువులు, అనగా మనము వాటినన్నింటిని చూస్తూ వాటితో సహజీవనం చేస్తున్నందున మనకు సులువుగా అర్థమౌతాది! క్రైస్తవ భక్తజనులు ఎంతటి మేధావులైనా, శాస్త్రవేత్తలైనా, మహా వైజ్ఞానికులైన పాశ్చాత్యదేశాల ప్రముఖులు గాని

విమర్శకులు గాని పై విధమైన విమర్శను అభ్యంతరాలను ప్రపంచవ్యాప్తంగా లేవనెత్తిన రుజువులు ఎక్కడా కనబడదు. అధిక సంఖ్యాకులు మతాభిమానులే కదా! అయితే ఇట్టి విపులమైన శాస్త్రీయ వివరణలు "ఇది నిజమా" రచనా పరంపరల్లో మాత్రమే చోటు చేసికోవడం ఆనందదాయకం. మీరు కూడ ఈ విషయాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచించి చూడండి?

గనుక ఈ బైబిల్ సృష్టికార్యాన్ని మహామాయ మాటలు చెప్పడంలో ఆరితేరిన నాటి అనాగరిక తెలివితేటలతో వైజ్ఞానిక ప్రపంచాన్నే బోల్తాకొట్టించే మాయాజాలంలో డొంకతిరుగుడు వివరణలతో బైబిల్ రచయితలు మానవాళిని మరి ముఖ్యంగా క్రైస్తవ విశ్వాసులను "ఫూల్స్" చేశారు. ఇంతటి ధారుణమైన అబద్ధాలు నేడు బయటపడినా క్రైస్తవ విశ్వాసులు మాత్రం అంగీకరించకుండా సైతాను చాలా తెలివైన వాడుకదా! ఈ రచయితతో ఇట్టి రాతలు రాయించి చెత్త విమర్శలు చేయిస్తున్నాడని బైబిల్‌ను గట్టిగా గుండెలకు హత్తుకుంటారు.

ఇక సముద్రము - భూమి సృష్టించిన జీవ జాతులలో కొన్నింటిని చూచి తరిందాము!



ఏమిటీ! అందచందాలొలక బోసే సర్వాంగ సుందర రమణీయ, పక్షి జాతులు!! తలనుండి తోకల వరకు అందమే అందం!... అబ్బబ్బ! వీటి "డ్రెస్సింగ్" ఎంత బాగుంది! ఆ దిక్కుమాలిన సముద్రానికి ఇన్ని రకాల ఫ్యాషన్లు, ఈ "క్రియేటివిటీ!" ఎలావచ్చు! అద్భుత సృష్టిలో దేవుణ్నే మించిపోయినట్టుందీ సముద్రం!

ఆహాహా! "సముద్రమ్మా!" నీది ఎంతటి కళాత్మక హృదయమో! మాటలతో వర్ణించలేకపోతున్నాను. ఇంద్రధనుస్సు లోని రంగులన్నీ చిలకమ్మలకే పులిమావా! నీ దివ్య సృష్టి పరికించి చూస్తుంటే కనులు చెదిరిపోతున్నాయి! నా రెండు





కళ్లూచాలడములేదు. ఈ కొంగలకు ఇదేమి అర్థంకాక ముఖాలు ప్రశ్నార్థకంగా పెట్టినట్టున్నాయి.

ఈ చిత్రంలో కనిపిస్తున్నది "తొండ" జాతికి చెందినది. ఈ తొండకు ఆపద ఎదురైనప్పుడు తన తలభాగనుండి అకస్మాత్తుగా ఒక "ఆటోమేటిక్" గొడుగు వంటి దానిని విప్పి తన శత్రువులకు భయాభ్రాంతులు కలుగజేసి తన ప్రాణాలు కాపాడుకొంటుందట. ("హాయ్‌బుజ్జీ" ఈనాడు సౌజన్యంతో)



అయ్యబాబోయ్! ఇదేమిట్రా బాబూ! ఈ సముద్రం, భూమండలం ఇంతటి తెలివయినవా? ఇంతటి అపారమైన జ్ఞానం, తెలివి తేటలు... అసలు సృష్టికర్తగా చెప్పబడిన యెహోవాలో కూడ కనబడవు. అసలు మత్స్యమంటే ఏమిటో! పక్షి అంటే ఎలాగుంటాదో? జంతుజాలం...

క్రిమికీటకాదులు అనే విషయాలేమి నామమాత్రంగానైనా తెలియని భూమి తమకు చెప్పిన మరుక్షణమే చేసేయడమేమిటి? భూమి మరీ దీర్ఘంగా ఆలోచించి ఈ తొండ ముండకు శత్రువు ఎదురైతే దాన్ని ఎలా బురిడీ కొట్టించాలో ముందే ఆలోచించి ఒక వెరైటీ "అంబ్రెల్లా - మ్యాజిక్" ఏర్పాటు చేయ గలిగిందా ఈ మట్టిముద్దయైన భూమండలం.

ఇక్కడ మనము చూడబోయే ఈ సృష్టి చిత్రాలను పరికించగా నా కళ్లను నేనే నమ్మలేక పోతున్నాను. ఈ భూమియొక్క దివ్య జ్ఞానానికి అవధులు లేవేమో అనిపిస్తుంది. నాకు ఊహ తెలిసినప్పటి నుండి నాతోటి పిల్లలంతా భూమ్మీద ఆటలాడుతూ దాన్ని త్రొకడము, త్రవ్వడము, దానిమీద గంతులేస్తూ పొర్లడము, రాళ్లతో కొట్టడము, మంటలు వేసి కాల్చడమే కాక దానిని మరెన్నో విధాలుగా అపవిత్రం చేసినా, నాటి నుండి నేటి వరకూ మౌనంగా భరిస్తూనే వస్తుందే తప్ప, ఊసుగాని పలుకుగాని లేని భూమి, సముద్రము, ఇంతటి ఘనకార్యాలు చేశాయంటే నమ్మబుద్ధి కావడము లేదు.

ఆ సంగతి అలాగుంచి ఈ కొంటె కోణంగియైన తుంటరి కోతిని భూమి సృష్టించడము అసమాన్యమైన అద్భుతం!

ఇంతటి అత్యద్భుత గ్రాహ్యశక్తి, భూమిమీద జీవి మనుగడ సాగించుటకు, నానా విధములైన ఆహారాన్ని సమస్తజీవులు ఆరగించి జీర్ణించుకొనుటకు అనువైన అంతర్భాగాలను ఎలా అవి చేయగలిగాయి?



భూమిమీద మానవుడు ఆరవ దినాన దేవుని పోలికలో సృష్టించబడగా, అసలు భూమిమీద గాని సముద్రాలందుగా జీవి అనేదే లేనప్పుడే సముద్రము, భూమి సృష్టించిన జలచరాలకు కోతి, ఎలుగుబంటి, జిరాఫీ, జీబ్రా, ఏనుగుల వంటి సమస్త జంతువులకు ఒకే విధమైన అవయవ నిర్మాణము ఎలా వచ్చింది.

అసలు సృష్టి జరిగిందని చెప్పే సమయాన ప్రపంచంలో జీవి అనేదే లేకపోగా నాల్గవదినాన జలచరాలు, పక్షిజాతులు చేయబడగా అయిదవ దినాన జంతుజాలం, పురుగులు వగయరా చేయబడ్డట్టును, ఆరవదినాన మాత్రమే నరుడు సృష్టించబడ్డట్టును చెప్పబడింది. కాని ఆ విషయం తెలిసిన నరమానవుడే భూమి మీద లేడు. అటువంటప్పుడు "నాలుగవ-అయిదవ దినాలందు" రెండు రోజుల్లో సముద్రము, భూమి చేసిందని చెప్పే ఈ సకల జీవులకు యెహెూవా కడుపులో భద్రంగా దాచుకొన్న, యెహెూవా దేవుడి కొక్కడికే తెలిసిన "సీక్రెట్" వీటికి ఎలా తెలిసిపోయింది? ఈ సర్వజీవులకు అచ్చంగా యెహెూవాకున్న








సమస్త అంతర్భాగాలైన గుండె, ఊపిరి తిత్తులు, మెదడు, కళ్లు, ముక్కు చెవులు, నాలుక, దంతములు, కొండనాలుక, కాలేయము, కార్జాలు, "ఫాంక్రియాస్", మూత్ర పిండాలు, సమస్తరక్తనాళాలు మరి ముఖ్యంగా విసర్జనావయవాలు అన్నీ కూడ నరుని పోలికలో దీనికి మూలమైన యెహెూవా యొక్క సర్వావయవాలు ఆ నోరు వాయిలేని సముద్రాలు, భూమి ఎలా అమర్చాయి? అని పదేపదే ప్రశ్నిస్తున్న ప్రశ్నకు బైబిల్ గాని, మరే క్రైస్తవ మేధావిగాని ఎటువంటి సమాధానము. ఇవ్వలేరు.

నరులకు, సకల జీవులకు ఒకే విధమైన అంతర్భాగాలున్నప్పటికి బాహ్యరూపాలు వేరువేరుగా వున్నాయి. అయితే నరుడొక్కడే పరిశుద్ధ దేవుని నకలుగా ఆయన రూపంలో ఉన్నాడని బైబిల్ చెప్పుచుండగా ఒక్క తోక తప్ప "మంకీ" గారు మాత్రం అచ్చంగా యెహెూవా అకృతిలో ఎందుకున్నాడయ్యా! అంటే ఏ విధమైన సమాధానం రాదు. చిత్రంలో చూపబడిన ఆ కోతి కళ్లు ఎలా వెలిగిపోతున్నాయో మరోసారి చూడండి!



జంతు, పక్షి జాతుల చిత్రాలు అద్భుతమైన పంచ రంగులలో వెలిగిపోతున్నాయి. సముద్రము భూమి యొక్క ప్రావీణ్యత, కళాత్మకత, పనితనం... ఆయా జంతువులకు అమర్చబడిన రక్షణ కవచాలు, శత్రువుల బారి నుండి రక్షించబడుటకు ట్రిక్కులు, వాటి

వాటి అవసరాన్ని బట్టి శరీర వర్ణాలను మార్చుకొనుటకు అవసరమైన విధంగా ఆశ్చరకరమైన ఏర్పాట్లను ఏ ఇంజనీరింగ్ సంస్థకు గాని అత్యాధునిక కంప్యూటర్ టెక్నాలజీకి కాని జీవశాస్త్ర కోవిదులకు గాని, జన్యుశాస్త్ర నిపుణులకు గాని టెస్ట్‌ట్యూబ్ బేబీ నిపుణులకు గాని తెలియదు. సాధ్యంకాదు. ఆయా ప్రక్షుల, సీతాకోకచిలుకల యొక్క రెక్కల అమరిక కనులు మిరిమిట్లు గొల్పే రంగులతో ఆయా పక్షుల తలలపై నయనానందకరంగా కిరీటముల వంటి వాటి అమరికలు అద్భుతంగా వున్నాయి. అలాగే ఆయా పక్షుల, జంతువుల వెంట్రుకలు, గోళ్లు ఒక చక్కని రూపం వచ్చాక వాటంతటవే ఆగిపోవడం చూడగా ఆశ్చర్యం గొల్పుతుంది.

మరి ముఖ్యంగా వీటికి ఏ విధమైన అచ్ఛాదనం లేక పోయినా వీటిలో దిగంబరత్వం అనేది మచ్చుకైనా కానరాదు. బుద్ధి జ్ఞానం లేని సముద్రము, భూమి తమకు చెప్పినవెంటనే క్షణాలమీద మీద సమస్త జీవులను కోట్లాది వెరైటీలను చేసి పారేసాయి. ఇది నమ్మశఖ్యమైన విషయమేనా! రాత్రి మంచ మెక్కాక ఈ విషయాన్ని గూర్చి తీవ్రంగా ఆలోచించండి. కాని పరిశుద్ధ దేవుడు, ఆలోచనాకర్త, నిత్యుడగు దేవుడు మరి ముఖ్యంగా భవిష్యత్ గ్రాహి యైన యెహోవా దేవుడు సాక్షాత్తూ నరుని తన రూప మందు సృష్టించాడని చెప్పు చూయుండగా ఈ నర మానవునికి అడ్డూ అదుపూ లేకుండ పెరిగిపోయే తల వెంట్రుకలు, గడ్డము, గోళ్ల అడ్డదిడంగా పెరిగిపోయి భీకరాకారారంగా పెరిగిపోయి భీకరాకృతిగా కనబడడము చూస్తుంటే వళ్లంతా కంపరమెత్తి పోతుంది.

అందునా ఈ మానవుడు జ్ఞానవంతుడు అనుకుంటే అదీకాదు. అవివేక మానవుడుగా రూపొందాడు. నరుడ్ని నోటి మాటతో సృష్టించలేదు. దేవుడు తన స్వహస్తాలతో తన రూపమందు సృష్టించాడు. అయితే నరుడు యెహోవా రూపొందించి నట్లుండక కాలక్రమంలో మంగలికత్తులు, కత్తెర్లు, "నెయిల్ కట్టర్స్" రూపొందించు కొని ఈ దేవుని పోలికల్లో నేను బ్రతుకలేననుకొని అవన్నీ కత్తిరించుకొని దేవుడిలా కాకుండ మనిషిలా బ్రతకడం ప్రారంభించాడు. నేటి క్రైస్తవ భక్త జనులెవ్వరు పై విధంగా దేవుని పోలి నడుచు కొనుటలేదు.





బైబిల్ ప్రవక్తలైతే ఆయనను పోలి గడ్డాలు, మీసాలు పెంచుకొన్నారు. దేవుని యొద్ద అటువంటి "రేజర్లు, నెయిల్ కట్టర్లు" ఏమి లేవు కావచ్చు. పాపము ఇప్పుడాయన స్థితి ఎలాగుందో మనకు తెలియదు ఆ సంగుతులలా గుంచి అసలు కథలోకి వద్దాము.

ఇట్టి మానవుడు మొదట దిగంబరం గాను తదుపరి ఆకులమలు కప్పుకోవడము తదుపరి చర్మపు చొక్కాయిలు ధరించడము. వీటన్నిటికి తోడు నోటి దుర్వాసన, స్వేదము, తదితర విసర్జనాలతో కంపుకొట్టే అపవిత్ర మానవుడ్ని పరిశుద్ధ దేవుడు తన రూపంలో చేయడమేమిటి? దేవుడికి కూడ ఇన్ని కష్టాలా! అనిపించి ఒళ్లు జలధరిస్తుంది.



# యెహోవా తన స్వరూపమందు మంటి నుండి మానవుడ్ని సృజించాడు

దేవుడు నేల మంటి నుండి మానవుని చేసినట్టుగా చెప్పబడుతుంది. మట్టిని పిసికి మంచి పాకానికి వచ్చాక ఆ బంకమన్నుతో సర్వాంగ సుందరంగా తీర్చిదిద్ది అచ్చంగా తన పోలికలోనే మానవుని చేసినట్టు బైబిల్ వివరించింది.



అయితే ఇక్కడొక పెద్ద అనుమానము వచ్చింది. దేవుడు తాను ఎలా గుంటాడో చూచుకొనుటకు అప్పటికి - బెల్జియం "మిర్రర్"లు లేవు. దేవుని యొద్ద కోటాను కోట్ల దేవదూతలుంటారని చెప్పబడినా సృష్టికార్య సమయాన దేవదూతల ప్రసక్తి ఏమీలేదు. ఒకే ఒక్క మార్గముంది. అదేమంటే దేవుడు నీటిలో తన నీడను చూచుకొని కష్టపడి తన బాహ్యరూపాన్ని తయారు చేయవచ్చును. అయితే తన అంతర్గత అవయవాలు మనము ఈ పుస్తకములో చూస్తున్నవన్నీ తుచ తప్పకుండ చేయాలి! అసలు ప్రారంభమందే అంతర్భాగాలను చేసి అనంతరం బాహ్యరూపాన్ని చేయాలి.

సాధారణంగా నావంటి చిత్రకారులు బొమ్మలు గీసేటప్పుడు గాని... విగ్రహాలు చేసేవారు లేక శిల్పాలను చెక్కేవారు ఎవరైనా సరే కేవలము బాహ్యరూపాన్నే రూపొందిస్తూ వుంటారు గాని అంతర్ భాగాలు, లోపలి అవయాల జోలికి వెళ్లరు. అయితే మనము ఈ చిత్రంలో చూచిన విధంగా యెహోవా మొదట అస్తిపంజరాన్ని... కపాలాన్ని అనగా మొదట ఎముకల గూడును చేసి బాగా ఎండ బెట్టాలి. ఆ అస్తిపంజరము బాగా గట్టిబడ్డాక దానిలోపల మెదడు... కనులు... చెవులందని అంతర్భాగాలు గుండె ఊపిరితిత్తులు, జీర్ణాశయము, లివర్, పురుశునికి పాలిండ్లు అవసరము లేకపోయినా వాటిని అమర్చాలి. అలాగే నాలుక, కొండ నాలుక, గొంతు, ముక్కు చెవుల్లో కర్ణభేరి, కండ్లల్లో "రెటీనా" అనబడే ఉల్లిపొర కన్నా సున్నితమైన పొరను, కనురెప్పలను అతి సున్నితంగా తీర్చిదిద్దాలి.

చిత్రంలో మనము "క్లోజ్ అప్"లో చూచిన కపాలపు భాగాలను "డొవెటెయిల్







జాయెంట్ల"తో పకడ్ బంధీగా అతకాలి. నోటిలో రుచులు చూడగల నాలుకను... కొండ నాలుకను అమర్చాలి!

అవన్నీ ఒక ఎత్తుకాగా బుర్రంతా ఉపయోగించి అత్యంత క్లిష్టమైన మానవమేధస్సు (మెదడును) రూపొందించాలి. పై మానవ మేధస్సు చిత్రాన్ని నిశితంగా పరిశీలించి చూడగా బుర్ర గిర్రున తిరిగిపోతాది.



మానవుని మెదడులో పదివేల కోట్ల నాడీ కణాలుంటాయట. వాటిని అనుసంధానం చేసే "కోటికోట్ల" తంత్రువులుంటాయట. వీటిని అనుసంధానం చేసే తలవెంట్రుకల కన్నా సన్నపైన సూక్ష్మనరాలను లోపలినుండి రక్తము ప్రసరించే విధంగా గొట్టాలుగా బంకమన్నులో చేయడమనేది సాధ్య మయ్యేపని ఏనా? ఇది అసాధ్యమే కాదు. దుస్సాధ్యమైన ఆలోచనే. ఈ విధంగా మెదడులో నూరు బిలియన్ల న్యూట్రాన్లుంటాయట. వాటిని లెక్కించాలంటే మూడు వేల సంవత్సరాలు పడుతుందని, ఈ న్యూట్రాన్ల మధ్య రసాయన, విద్యుత్ సంకేతాల వల్లే మనము కలలుకంటున్నాం. నవ్వతాము, ఆలోచిస్తాము. అంతేకాదు గంటకు నూటయాభై మైళ్ల వేగంతో ఇవి మెదడుకు సమాచారాన్ని అందిస్తున్నాయి. ఆంధ్రజ్యోతి ఆదివారం నుండి సేకరణ. ఇట్టి నాడీమండల వ్యవస్థ గల రక్తనాళాల పొడవు మానవ దేహంలో అనేక మీటర్ల పొడవుంటాయట. దేవుడు తన అతీత శక్తులతో కాక బంక మట్టితో తన స్వహస్తాలతో చేశాడని చెప్పుచుండగా దేవుడైనా సరే తలవెంట్రుకలకన్నా సన్నని గొట్టాలుగా మట్టితో చేయలేక చేతులెత్తేయ వలసిందే!

నరునికి నవరంధ్రాలే కాక మూడు మిలియన్ల స్వేదగ్రంధులు పరుచుకొని ఉంటాయట. అందుచే చర్మానికి లెక్కలేనన్ని స్వేదరంధ్రాలు చేసి అందు వెంట్రుకలు అమర్చాలి. అదే

విధంగా తల వెంట్రుకలను కూడ గొట్టాలుగా రూపొందించి వాటి లోపల రక్తప్రసరణ జరిగే విధంగా చేసి కపాలంపై బిగించాలి. ఇంతటితో అయిపోలేదండి బాబోయ్... ఈపనే ఇంత కష్టసాధ్యమని తలస్తుండగా బైబిల్‌నందు నీ తలవెంట్రుకలన్నీ లెక్కించబడివున్నాయని చెప్పబడి నందున వాటిని లెక్కిస్తూ కూర్చుంటే అది కుదిరేపని ఏనా? అప్పుడు కేలిక్లేటర్లే లేవు కదా!... పాపం ఎలా లెక్కించాడోసుమా!


INTERNAL STRUCTURE OF THE HAND

ఇక్కడ ఈ చిత్రంలో మానవుని చేతి వ్రేళ్లను పరిశీలించగా ఆ రక్త నాళాల అమరిక ఎంతటి క్లిష్టతరంగా యుందో చూడండి. నేలమంటితో ఇది చేయసాధ్యమేనా?




నరమానవుని కండర వ్యవస్త ఏవిధంగా ఉంటుందో మనమీ పటంలో తేటగా వీక్షించ గలుగుచున్నాము. ఇవివట్టి మాంసపు కండరాలు మాత్రమేకాదు. దీన్ని బంకమన్నుతో చేయసాధ్యమా!!! దీనిని మట్టితో నిర్మించడము అసాధ్యమనే చెప్పాలి. అసలప్పుడు మైక్రోస్కోప్ లేదు కదా! మనము మైక్రోస్కోప్ దగ్గరుంచుకొని ఒక్క అంగుళము తల వెంట్రుకనైనా చేయడం అసంభవము.

ఈ విధంగానే మానవ శరీర నిర్మాణంలో అత్యంత ప్రాముఖ్యమైన గుండె... ఊపిరి తిత్తులు... థయోరైడ్ గ్లేండ్... లివర్... కాలేయము... మూత్ర పిండాలు... మూత్రాశయము... ప్రేవులు... పిత్తాశయము మొదలైన సమస్త అంతర్యా వయవాలు బంకమన్నుతోనే నిర్మించాలి. అదేమిటోగాని ఇట్టి "అపవిత్రమైన" అంతర్యా వయవాలు కూడ అంతటి పరిశుద్ధ దేవుడైన యెహోవాకు కూడ వుంటాయని బైబిలు చెబుతూయుంటే అస్సలు నమ్మబుద్ధి కావడములేదు.

ఈ శీర్షిక చదువుతుంటే భక్తజనులైన క్రైస్తవ సోదరులకు బహుశా అరికాలి మంట నెత్తి కెక్కవచ్చు. ఎవడీ వెర్రిబాగుల రచయిత? అని తిట్టుకొంటూ... భూనభో మండలాలను కేవలం తన నోటిమాటతో సృష్టించిన యెహోవా దేవుడంతటి మహిమన్వితునికి మట్టితో



మానవుని నిర్మించడం ఒక్క లెక్కా! అని తలపోయవచ్చు. అయితే ఆదికాండ గ్రంథములో దేవుడైన యెహోవా నేలమట్టితో నరుని నిర్మించెను అని యుందిగాని ఆయన మహిమతో "హాం! ఫట్!!" మని సృజించినట్లు చెప్పబడలేదు గనుక ఇన్ని ధర్మ సందేహాలు వెలువరించవలసి వచ్చింది.



"సరే ఏదో విధంగా మానవాకృతిని చేసి అయ్యిందిరా బాబూయని దేవుడు వెళ్లి బంకమన్ను చేతులు, కాళ్లు కడుగుకొని ముకుచీదుకొని వచ్చాడను కొందాము. అయ్యయ్యో తిరిగి వచ్చేసరికి ఎంతపని జరిగిపోయింది! బంకమన్ను బాగా పచ్చిగా యుండి, త్వరగా ఆరనందున ఒక్కసారిగా చేయబడిన ఏడడుగుల మట్టి బొమ్మ బరువెక్కి మానవాకృతి మరుగుజ్జులా కృంగిపోయి ముక్కు, చెవులు, చేతులు సాగిపోయి వికృతాకార మానవుడుగా రూపొందాడు. అయ్యవారిని చెయ్యబోతే కోతి అయినట్టు ఇది సహజమే కదా!"

మానవ జన్మ ఎంతటి ఉత్కృష్టమైనదని కొద్దిపాటి తేడాలతో మనము దైవ సమానులమై పోయామని క్రైస్తవ సోదరులు ఉప్పొంగిపోతారు. అయితే దేవుని పోలికలో నున్నామని చెప్పబడే మన పోలిక ఎంతటి దయనీయమైనదో తలచుకుంటేనే ఒడలు గగుర్పొడుస్తుంది.

మన శరీరం నుండి అనునిత్యం బయలు వెడలే దుర్గంధభరితమైన చమట వాసనలు... దంత ధావన సంబంధమైన కలుషిత వాతావరణం... కండ్లనుండి... ముక్కునుండి కారే కన్నీరు... "పన్నీరు" సంగతులు అలాగుంచగా కాలకృత్యాల వంటివన్నీ మనకు దేవుని పోలిక నుండే సంక్రమించాయనుకోవాలా? ఇట్టి ముఖ్యవిషయాలు ఏ క్రైస్తవునికి తట్టవు. దైవం పేరు తలంచగానే అమ్మో! ఆయన పరిశుద్ధుడు, మహోన్నతుడైన దేవుడే కాక దేవుళ్లకు కూడా దేవుడట! అని పొగుడుతూ... తామంతా పాపపంకిలమైన దౌర్భాగ్య జీవులమని కృంగిపోతూ "దేవా! పాపినైన నన్ను కరుణించ మని మొకరిల్లతారు.

అయితే ఈ బైబిల్ దేవుని పోలిక మహా పరిశుద్ధమైనది కాకపోగా ఇందు అనేక జుగుప్సాకర విషయాలు పెనవేసికొని ఉన్నాయి. అయినప్పటికి ఇట్టి ఇబ్బందికర విషయాలను మనము అవలీలగా అధిగమించి దేవుళ్లకన్నా అనేక రెట్లు అదృష్టవంతులమేమో అనిపిస్తుంది!

నెల్సన్ రష్దీ

ఎందుకంటే మనము మెరిసే పళ్లతో స్వచ్ఛమైన చిరునవ్వులు చిందించుటకు మనకు అనేక రకాల టూత్ పేస్టులున్నాయి. సుతి మెత్తని నైలాన్ సింథటిక్ బ్రష్‌లున్నాయి. మనము పరిమళభరితమైన అభ్యంగస్నానం చేయుటకు తాజా పుష్పాల ఘుమఘుమలతో కూడిన అనేక సబ్బులు, షాంపూలు, రకరకాల అత్తర్లు, సెంట్లు, పౌడర్‌లు స్నోలు "మోఇశ్చరైజర్‌లు" మనకు అందుబాటులో ఉన్నాయి.

అయితే ఇక్కడ మనమొక ముఖ్య విషయాన్ని గూర్చి ప్రస్తావించాలి. పాపం! ఇటువంటి మానసికోల్లాసం కలిగించే ఫెర్‌ఫ్యూమ్‌లు ఆ దేవుడి దగ్గర ఏమైనా ఉన్నాయో లేదో... అంత పెద్దదైన బైబిల్ గ్రంథంలో ఒక్క ముక్కయినా వ్రాయబడలేదు వుంటే తప్పకుండ వ్రాసియుండేవారు. మానవుడు అచ్చంగా దేవుని పోలికలోనే చేయబడ్డాడనే ఈ చర్చాంశం ఈ వివరణ ద్వారా అదొక కట్టుకథయని, అశాస్త్రీయమైన అతిశయోక్తియని నేను కాదు చదువరులే సమర్థించగలరు.

**దేవుడైన యెహోవా ఆహారం నాడు జంతు బలుల ద్వారా మేకలు, గొర్రెలు, పశువులను వధించి అందలి అంతర్భాగాలైన... ఆ బలి పశువు యొక్క క్రొవ్వును, ముడ్డిపూస మొదలు కొని క్రొవ్విన తోక అంతటిని, ఆంత్రములులోని క్రొవ్వును, ఆంత్రము మీది క్రొవ్వు అంతటిని, రెండు మూత్ర గ్రంథులను, వాటి మీది కలేజముల యొక్క "వపను" తీసి యెహోవాకు హోమ రూపమైన దహన బలిని అర్పించవలెను. లేవియా కాండము (3:9-10లో చూడగలరు).**

క్రొవ్వంతయు యెహోవాదే! అది సువాసన గల హోమ రూపమైన ఆహారము. (లేవియా. 3:16) మరికొన్ని చోట్ల వీటితో పాటు గోధుమ పిండి, ద్రాక్ష సారాయి కూడా కలిపి "యాజకుడు" (పూజారి) బలిపీటం మీద దహించి అర్పించాలని వుంది. ఇవన్నీ చదువుచుండగా "నాన్ వెజిటేరియన్" గాళ్లకే "ఓ"కారాలు, వికారాలు, విరేచనాలు పట్టుకునేలాగున్నాయి. నేటి మానవ అవయవ నిర్మాణము పంచభక్ష్యపరమన్నాలు ఆనందంగా స్వీకరించి జీర్ణించుకొనే విధంగా వున్నాయిగాని పై విధమైన రాక్షసాహారం స్వీకరించి అరాయించుకొనుటకు మాత్రం ఎందుకూ పనికిరావు కదా! దైవం యొక్క ఆహార స్వీకరణకు బద్ధవ్యతిరేకంగా వుండగా... దేవుడైన యెహోవా తన పోలికలోనే తనకున్న అవయవాల మాదిరిగానే నరుని చేశాడని చెప్పుటలో ఇసుమంతైనా నిజముందా?

**"దేవుని పోలికలో నరులు" అనే శీర్షిక అనేక మలుపులు తిరిగి ఎన్నెన్నో విషయాలను ఆమూలాగ్రంగా చర్చించడం జరిగింది. అయితే ఈ రచయితనైన నేను మరీ "కోడి గుడ్డుకు ఈకలు పీకిన" చందాన దేవుడైన యెహోవాను ఇంతగా విమర్శించడం అంత బాగుండక పోవచ్చును. అందుచే ఈనా విమర్శలను భేషరతుగా ఉపసంహరించుకొంటూ... దేవుని పోలికలో నరులు సృష్టించబడ్డారనకుండా... నరుల పోలికలోనే నాటి**





**అనాగరిక మానవులు పైన చెప్పిన విధంగా దేవుడ్ని సృష్టించుకున్నారంటే సబబుగా వుంటాదనుకుంటున్నాను. దేవుడంతటి వాడికే కులాలు గోత్రాలు అంటే అంత ఇష్టమైనప్పుడు నరమానవులు కూడా తమ జాతి వాడే తమకు దేవుడై వుండాలనుకొనుట సహజమే కదా! అసలు ఆకలిదప్పులేలేని పరలోకరాజ్యంలో యెహోవాకు మానవునికి వున్న విధంగా జీర్ణావయవాలు తదితర అవయవాలు ఎందుకో నరమానవులెవ్వరికి అంతుచిక్కదు. "ఇది నిజమా" తృతీయ భాగంలో దేవుని తిండి, దేవదూతల ఆహారం అనే శీర్షికలో మరిన్ని వివరాలు చూడగలరు.**

"ఆలోచన అనేక అంధవిశ్వాసాలను నివృత్తి చేస్తుంది. - అనాలోచన మరింత మౌఢ్యంలోకి నెట్టివేస్తుంది.

దేవుడు తన పోలికలో నరుని బొమ్మను చేసి తన జీవపు ఊపిరి ఊదగా నరుడు జీవాత్మ అయ్యాడని చెప్పబడింది. బహుశా ఈ సందర్భంలో - యెహోవా "జీన్స్" నరుని నరనరాల్లోను ప్రవేశించి జీర్ణించుకుపోయాయి కావచ్చు. అందుకే మనిషికి కూడ దైవలక్షణాలన్నీ సంక్రమించాయేమో ననిపిస్తుంది.

పాతనిబంధన గ్రంథము మనము చూస్తే యెహోవా ఎంతసేపూ... నా కులము, నా గోత్రము, నేను ఏర్పరచుకొన్న నా ప్రజలు యూద, ఇశ్రయేలు ప్రజలేనని అనునిత్యము ఆయన వారిని రెచ్చగొడుతూ... నేను భయంకరుడనైన దేవుడును! నా ముందు అగ్ని నడుస్తుంది. నా కోపము త్వరగా రగులుకొనును. తండ్రులు చేసిన దోషములు వారి పిల్లల పిల్లల మీదికి ఏడు తరముల వరకు మోపెదనని... అన్య జాతులెవ్వరినీ బ్రతక నీయకూడదని, కత్తివాత వారిని హతము చేయమని, వారి ఆస్తులు దోచుకోండి... వారి పురుషులను హతమార్చండి... అందమైన కన్నెపిల్లలను మీ సుఖ సంతోషాల కోసం ఉంచుకోండి! వారివారి ఆవాసాలను అగ్నికి ఆహుతి చేయండి!... దోపుడు సొమ్మును సమంగా వాటాలు వేసికోండని, పసివారిని బానిసలుగా పట్టుకోండని వారిని ఆదేశిస్తూ వచ్చాడు.

ఈ కారణంగానే కావచ్చు నేటి సగటు మానవుల్లో దోపిడీ, దౌర్జన్యం పరుల ఆస్తి పాస్తులను భూములను కబ్జాలు చేయడం, కపటత్వం, మోసం, దగా, పరమత ద్వేషం, కులతత్వం వంటివి పెరిగి పోయాయేమో అనుకొనవలసివస్తుంది. పై ఆదేశాలు దైవ వాక్కులుగా కాక, రాక్షసత్వం వుట్టిపడే విధంగా కనబడుచున్నాయి. పై దుర్మార్గ ఆదేశాల నుండి సగటు మానవుడు నేర్చుకోవలసిన నీతి ఇసుమంతైనా ఉన్నదా? ఇవి దుష్టబుద్ధులు, దుర్మార్గపు ఆలోచనలని ప్రతీఒక్కరికి తెలుసు. ఇవన్నీ పరిశుద్ధుడైన యెహోవా దేవుని ఆదేశాలని బైబిల్ ప్రసంగికులు నిర్లజ్జగా బల్లలు గుద్ది ప్రసంగించడానికి వారికి నోరెలా వస్తుందో తెలియదు.

విద్యాధికులు, మేధావులైన క్రైస్తవ సోదరుల్లారా! అత్యాధునిక విద్యలనభ్యసిస్తున్న, భావి మేధావులుగా రూపుదిద్దుకోనున్న విద్యార్థుల్లారా! ఇప్పటి వరకు మనము చూచిన

అశాస్త్రీయమైన, అసందర్భ గర్భిత కథనాల్లో ఆవగింజంతైనా నిజముందా? సముద్రము క్షణాల్లో కోటానుకోట్ల జలచరాలను, పక్షి జాతులను తన నుండి సృష్టించగలదా? భూమండలము మిలియన్ల, బిలియన్ల కొద్దీ జంతువులను, పురుగులను, సూక్ష్మక్రిములను తనకు ఆజ్ఞాపించిందే తడవుగా తననుండి వాటిని రప్పించగలదా? యెహోవా తన రూపంతో సృష్టించానని చెప్పి "ఆదిమానవుడి" మట్టి బొమ్మ ముక్కులో ఊపిరి ఊదగా అది జీవించగలదా? ఇవి ఎంతటి అసందర్భ ప్రేలాపనలు! అసలు ఈ మతాలకు మూలమైన దేవుడనేవాడు ఎలా పుట్టుకొచ్చాడు? అతగాడు ఎప్పుడూ వున్నాడా? ఆయన ఆద్యంత రహితుడు అంటే కేవలము ఏడు వేల సంవత్సరాలేనా? అయితే భూమ్యాకాశాలు, సముద్రాలు కోట్లాది సంవత్సరాల నుండి ఉన్నాయని, సౌరమండలం మరింత పురాతన మైనదని చెప్పుచున్న అధ్యాపకలు గాను, కాలేజీ లెక్చరర్లు గాను, స్కూల్ టీచర్లు గాను లక్షలాది మంది క్రైస్తవ సోదరులు ఎలా బోధించగలుగుచున్నారు? అంతరిక్ష పరిశోధకులుగా గ్రహాంతర యానాలు ఎలా చేయ గలుగుతున్నారు? బ్రతకడాని అట్టి ఉద్యోగాలు... చావడానికి ఇటువంటి దేవుళ్లూ కావాలా మీకు? సమస్త విషయాలు తెలిసిన మీరు ఇట్టి అసంభవమైన కాల్పనిక జగత్తులో నుండి బయటపడి శాస్త్రయుక్తంగా జీవించమనవి! మనకు ఇట్టి అనుమానాలు రాకుండ బైబిల్‌లో మొట్టమొదటగా ఈ దేవుడనేవాడు ఎలా సృష్టించబడ్డాడో తెటయైన భాషలో చక్కగా వివరిస్తే మనకు ఇలాంటి సందేహాలు వచ్చేవికావు. కాని ఈ బైబిల్ వ్రాసిన నాటి "జేజమ్మ"లకే ఏమి తెలియనందున అస్పష్టంగా ఈ గ్రంథరాజాన్ని మనకు అందించి ఎవడమ్మా ఈ మాయదారి దేవుడని జుట్లు పీక్కొని ఆలోచించే విధంగా ఈ మతగ్రంథాలను వ్రాశారు.





## ఆదాము సకల జీవరాశికి పేర్లు పెట్టుట

మంటి నుండి ఆదామును చేసి ఇంకా ఒక గంటైనా గడవ లేదు. అతనికి సమస్తము క్రొత్తే. అతను వేసే ప్రతీ అడుగూ అపరిచితమే ఈ రంగుల ప్రపంచంలో కొద్ది సేపటి క్రితమే కనులు తెరచాడు వింతవింతగా బిత్తర చూపులు చూస్తూయుండవచ్చు. కనీసం ఇది భూమి, అది ఆకాశము, అవి సూర్య చంద్రాదులు, అది సముద్రమని చెప్పి పరిచయం చేసే నాధుడే లేడు ఒక్క ముక్కలో చెప్పాలంటే అతను అభంశుభం ఎరుగని అమాయకుడు. ఈ విధంగా అప్పుడే భూమ్మీద అవతరించిన ఆదాముపై, ఒక బృహత్ కార్యభారాన్ని యెహోవా మోపి యావత్ ప్రపంచ జీవ జాలానికి పేర్లు పెట్టమని అప్పగించాడు. ఇది సాధ్యమేనా?

ఆయా జంతువులు... మృగాలు... నేలను ప్రాకు పురుగులు ఆకాశ పక్షులను గూర్చిన అవగాహన అతనికి ఎంతమాత్రము లేదు. వాటి ఆహారపు అలవాట్లు తెలియవు. అవి క్రూర జంతువులా... విషసర్పాలా... సాధుస్వభావులాయనే సంగతులేవీ నామ మాత్రంగానైనా తెలియదు... బారులు తీరిన జంతు సముదాయాలు ఒకదాని వెంబడి ఒకటి "క్యూ"లో వచ్చేస్తున్నాయి. పేర్లుపెట్టే తతంగం ప్రారంభించేశాడు... నీ పేరు సింహము... పెద్ద పులి... చిరుత పులి... ఏనుగు... ఎలుగుబంటి... ఒంటె... ఖడ్గ మృగము... దుమ్ముల గొండె... జిరాఫీ... జీబ్రా... పండు కోతి... నక్క... కుక్క... మేక... గొర్రె... ఆవు... ఎద్దు... దున్నపోతు... ఈ "క్యూ" కిలోమీటర్ల కొద్దీయుంది... మరోప్రక్క పాములు... పురుగులు... పుట్రలు... పైకి చూస్తే పక్షి జాతులు... గబ్బిలాలు... గిరికీలు కొడుతున్నాయి... నీళ్లల్లో... జలచరాలు... తిమింగలాలు... మొసళ్లు... మహామత్స్యాలు... చేపలు... రొయ్యలు... ఎగిరెగిరి పడుతున్నాయి... వీటన్నింటికి రెండు మూడు గంటల్లో పేర్లు పెట్టడం సాధ్యమేనా! నీవు కింగ్ ఫిషర్... వడ్రంగి పిట్ట... రాబందు (రామబంధు) రామచిలుక... ఆదాముకు కింగ్ అంటే తెలియదు... "వడ్రంగి" ఎవరో... రాముడెవరో... ఏమాత్రము అవగాహన లేదు కదా! అటువంటి పేర్లు పెట్టగలడా! ఈ విధంగా సోదివ్రాస్తూ పొడిగించుట వ్యర్థము, యావత్ జీవజాలము క్యూలో నిలబడుటకు ఏదేనుతోట సరిపోయిందా? ఒక్కసారి కాస్త ఆలోచిందాము. పేర్లు పెట్టే సమయంలో మానవ మాతృలెవరూ లేరు. స్త్రీ ఇంకా సృజించబడలేదు. ఆదాము ఏమేమి పేర్లు పెడతాడో చూద్దామని యెహోవా ఏచెట్ల

గుబురుల్లోనో దాక్కుని యుండవచ్చును. అన్నింటికన్నా ముఖ్య విషయం అదాముకు అప్పుడు ఏ భాష మాట్లాడే అవకాశము గాని, పరిజ్ఞానము గాని లేదు. అసలు మాట్లాడదామన్నా నరమానవుడు లేడు. ఇటువంటి వెర్రిబాగుల స్థితిలో ఆదాము జంతుజాలానికి ఏ భాషలో పేర్లు పెడతాడు. ఒక వేళ అప్పుడు పంచతంత్రం కథల్లో లాగ జంతువులు, పక్షులు, కుక్కలు, నక్కలు మాట్లాడేవా? కావచ్చులాగుంది సర్పం స్త్రీతో మాట్లాడిందట... ఇంకా బైబిల్ కథల్లో బిలాము ప్రవక్తను గాడిద చీవాట్లు పెట్టిందట... ఏలియా ప్రవక్తకు కాకులు రొట్టెలు తెచ్చి అందించాయట. "ఫరో" కాలంలో ప్రవక్తలు పిలవగానే బెకమంటూ కప్పలు వచ్చేశాయట, మిడతల్లారా.. కందిరీగల్లారా!.. మీరు అర్జంటుగా వచ్చేయండని "ఈల" కొట్టిన వెంటనే అని వచ్చి ఈజిప్టు మీద దాడి చేయమనగానే కుప్పలు తెప్పలుగా వచ్చిపడ్డాయట. ఈ రచనను తెలుగులో వ్రాస్తున్నందున తెలుగులో వాటివాటి పేర్లను గూర్చి వివరణ తెలుగులోనే ఇవ్వబడిందని గమనించగలరు.

ఈ ప్రకారంగా ఆదాము కాకితో నీపేరు కాకి అంటే "కావ్‌కావ్" నా పేరు కాకియని కోయిలలో నీ పేరు "కోయిల" అనగానే కో...కో... అంటూ గుర్తుంచుకొని రాబోయేతరాలకు తెలిపాయా? మిత్రులారా నేటి వేగవంతమైన కంప్యూటర్ ప్రపంచంలో సైతం మన పిల్లలకో... మనవరాలికో... పేర్లు పెట్టాలంటే "వెబ్‌సైట్లు" గాలించి, పేర్ల పుస్తకాలు తిరగేసి... ఎంతోమందిని అడిగి విసిగివేసారి చివరకు తాత పేరే మనవడికి పెట్టే బుద్ధిజీవులమైన మనమే నానా తంటాలు పడుతూయుండగా మట్టితో చేయబడిన ఆదాము... ఇది మంచి అని గాని అది చెడు అని గాని తెలియని అజ్ఞాన మానవుడు పేర్లు పెట్టాడని అవే వాటికి కలిగాయని చెప్పే కాకమ్మ కథల్లో ఏమాత్రము పసలేదు. అప్పుడు ఆదాము పెట్టిన పేర్లను రికార్డు చేయుటకు టేప్‌రికార్డర్లుగాని, వీడియో, ఆడియో సౌకర్యాలనేవే లేవు. స్త్రీ కూడా ఇంకా చేయబడలేదు. అన్నిటికన్నా ముఖ్యంగా భాష అనేదే లేదు.

మన దైనందిన జీవితంలో సూపర్ కంప్యూటర్ల సాయంతో ఒక రైల్వే టిక్కెట్టు మాస్టారు ఒక రోజుంతా కష్టపడినా అయిదారు వేల టిక్కెట్లైనా ఇవ్వలేడు కదా! ఒక డాక్టరు ఒక రోజులో 200 మంది రోగులను చూచి తగిన సలహా లీయగలడా? కోట్లాదిగా యున్న జంతువులు, పక్షులు, పాములు, పురుగులు, సూక్ష్మజీవులు, జలచరాలకు ఆదాము పేర్లు ఏ విధంగా పెట్టగలడు, ఒక వేళ ఆదాము యెహోవా దేవుని తాజా సృష్టి యైనందున నిముషానికి అయిదు పేర్లు పెట్టినా గంటకు 300 కన్నా ఎక్కువ పెట్టలేడు కదా! నాలుగు గంటలు నిలుచుండి పెట్టినా 1200 కూడా కావు. ఆ దినమే ఆదాము ప్రక్కటెముకతో స్త్రీని రూపొందించవలసిన పని ఇంకా మిగిలియుంది. పాఠకులు ఇందలి సాధ్యాసాధ్యాలను గ్రహించియుండవచ్చు.

ఈ సందర్భంగా సృష్టికర్తకు: హృదయ విదారక శోకతప్త "హృదయం"తో ఒక విన్నపం లాంటి ఆవేదనా భరితమైన విషయమేమంటే... దేవాదిదేవా! ప్రేమగల తండ్రీ!



ఆలోచనా కర్తా! దూరదృష్టిగల ప్రభువా! నిత్యుడగు దేవాయంటూ అనునిత్యం సకల ప్రపంచ భాషల్లోను సమస్త మానవజాతులనుండి స్తోత్రవందనాలను స్వీకరిస్తున్న యెహోవా! మహోన్నతుడా! "దయామయుడా!"... ఈ సూక్ష్మాతి సూక్ష్మమైన మానవ నేత్రాలకు కానరాని అనేక రోగాలకు, రొష్టులకు, ప్రాణాంతకాలైన రోగ కారక "వైరస్" జీవులను సృష్టించి మిలియన్ల, కోటానుకోట్ల మంది అమాయక మానవ జాతులను కాలగర్భంలో కలిపి వేసి నేటికి కూడా అవి మాతో సహజీవనం చేస్తూ మమ్మును పీడిస్తున్న ఈ "వైరస్"లను ఎందుకు సృష్టించావో కాస్త విడమరచి చెప్పగలరా మహానుభావా! దీనికి సమాధానము ఏ నరమానవుడు చెప్పజాలడు. దేవుడు అంతకన్నా చెప్పలేడు.

మిస్టర్ ఆడమ్స్ గారి కంటికివి కనబడ లేదుగాని కనబడితే వీటికి కూడ అందమయిన పేర్లు పెట్టెవాడేమో! ఎలక్ట్రానిక్ మైక్రోస్కోప్ లాంటివి అందు బాటులో లేనందున బహుశా ఇవి యెహోవా "ఏడు నేత్రాలకు" కూడా గోచరించి యుండక పోవచ్చు ననుకుందాము. "పిట్ట కొంచము కూత ఘనమన్న" చందాన శ్రావ్యమైన సంగీత నాదం వినిపిస్తూ ఓరే! నేను డైరెక్ట్‌గా చెప్పిమరీ నిన్ను కుట్టి చంపుతున్నాననే దోమలను, గుట్టు చప్పుడుగాకుండా నెత్తురు త్రాగే నల్లులను ఈగలను ఎందుకు సృష్టిచారో కాస్త విడమరచి చెప్పగలరా! దేవా!



ఇట్టి వైరస్‌ల వల్ల, దోమలు-ఈగల వల్ల మానవులకు మశూచి, మలేరియా, పైలేరియా, కుష్టు, కేన్సర్, ఎయిడ్స్, ప్లేగు, న్యూమోనియా, ఉబ్బసము, స్వైన్‌ఫ్లూ, బర్డ్‌ఫ్లూ, క్షయ, మెదడువాపు వ్యాధి, చికన్ గున్యా మొదలైన ప్రాణాంతక వ్యాధులతో చేయని నేరానికి అభంశుభం ఎరుగని అమాయక ప్రాణాలను అనంత వాయువుల్లో కలిపివేయండం దయామయుని పనేనా?

నీ మృదు మధుర స్వరంతో సృష్టించిన "అక్షయమైన" క్షయ వ్యాధి ప్రతి ఏటా క్రొత్తగా 15 లక్షల మందికి సోకుతుందని, ఒక్క 1995వ సంవత్సరంలోనే అనగా కేవలం 365 రోజుల్లోనే అయిదు లక్షలమంది దీనివల్ల అకాలమరణం పొందాలని ప్రపంచ ఆరోగ్య సంస్థ (W.H.O.) తన నివేదికలో పొందుపరచింది. గత (1993-94) రెండు సంవత్సరాల్లోనే ఆరు కోట్ల మంది క్షయవాధికి గురయ్యెయ్యారని పై సంస్థ పేర్కొంది. (ఈనాడు 15-06-1995) ఇంతకన్నా ఘోరంగా మలేరియా, న్యూమోనియా, ఎయిడ్స్, కేన్సర్, ఉబ్బసము, సైన్‌ఫ్లూ వంటి అనేక వ్యాధులవల్ల ఏటా కోట్లమంది చనిపోతున్నారు. అనవసరంగా సృష్టికార్యం యెహోవాయే చేశాడని అలనాటి రచయితలు ఈ పాపాన్నంతా ఆయన నెత్తిన రుద్దారేమో అనిపిస్తుంది. పాపం యెహోవాకు ఇదేమి తెలియదు. ఆయన

నిమిత్త మాత్రుడేమో అనిపిస్తుంది! ఇంతటి ముఖ్యమైన సందేహం క్రైస్తవ భక్తాగ్రేసరులకు గాని, విశ్వాసులకు గాని రానేరాదు. ఈ రోగకారక క్రిములను గూర్చి ఒక ఆశ్చర్యకర విషయాన్ని చూద్దాము. మానవ శరీరంలో కోటానుకోట్ల బ్యాక్టీరియా - వైరస్ జీవులు స్థావరాలేర్పరచుకొని అనునిత్యం మన ప్రాణాలు తోడేస్తున్నాయి.

> ***అయితే "నోరూ-వాయి" లేని సముద్రము, భూమి సృషించాయని చెప్పబడే కొన్ని జంతువులు, పక్షులకు ఈ సమస్యవున్నట్టు కనిపించదు. కాకులు, నెమళ్లు, చిలుకలు మొదలగు పక్షులలోను, ఎలుకలు, పందులు తదితర జంతువులు ఎంతో ఆరోగ్యంగా కనబడతాయి. ఉదాహరణగా మనకు రైల్వేప్లాట్ ఫారాలు క్రింద పందికొక్కుల్లా బలిసిన ఎలుకలు ఎంతో ఉత్సాహంగా కనబడతాయి. మరిముఖ్యంగా బ్రతుకంతా దుర్గంధ భరిత మురికి కూపాల్లో పొర్లాడుతూ జీవించినప్పటికి పందులు ఎంతో ఆరోగ్యంగా కనబడతాయి. అలాగే కోటానుకోట్ల కాకులు కూడ సమస్త కాలుష్యాన్ని తింటూ నిగనిగలాడుతూ అత్యంత చురుకుగా కనబడతాయి. ఎంత వయస్సు వచ్చిన వీటికి ముసలితనం వచ్చి వెంట్రుకలు తెల్లబడవెందుకు? యెహోవా రూపంలోనున్న మానవులకే వృద్ధాప్యం సంక్రమించడమేమిటి? ఏ కరెంటు తీగో తగిలి చనిపోయిన కాకులు తప్ప గుంపులు గుంపులుగా పడిచచ్చిన దృశ్యాలు మనకు కనబడవు. ఇంతటి భయంకర వాతావరణంలో జీవించే వీటికి ఈ వైరస్‌ల బెడద ఎంతమాత్రము లేదా! కాని యెహోవా తనరూపంలో చేశాడని చెప్పే నరమానవులకు మాత్రమే ఈ రోగకారక క్రిముల వల్ల మరణం సంభవించడం అంతు చిక్కని విషయం.***

అందమైన లేసు అల్లకంలా కనిపించే ఈ ఆకృతి "ఇన్‌ఫ్లూఎంజా" అనే ప్రాణాంతక జ్వరాన్ని కలిగించే "వైరస్". దీని నిజమైన సైజు గుండుసూది గుండులో పదివేలవ వంతంత సూక్ష్మంగా వుంటాడంటే మనము దాని ఆకృతి ఎంత చిన్నదో ఆలోచించవచ్చు. ఇది మామూలు మైక్రో స్కోపులతో చూస్తే కనిపించవు. ఒక్క "ఎలక్ట్రానిక్ మైక్రోస్కోప్" మాత్రమే ఈ వైరస్‌ను గుర్తించగలదు. నిజానికిది యెహోవా కంటికి కనబడియుంటే ఇంతటి తీవ్రమయిన రోగక్రిములను చేసియుండక పోవచ్చునేమో గాని తలకాయ గాని, మెదడుగాని, కళ్లు, ముక్కు, నోరు కూడలేని భూమితో చెప్పి నీ ఇష్టం వచ్చిన జీవరాసులను చేయమని యెహోవా చెప్పినందున ఈ తప్పంతా భూమిదే ననుకుందామా! అయ్యయ్యో దేవుడా! ఏమిటిది!

మత గ్రంథాలు ఎన్ని కథలు చెప్పినా ఆదాము పెట్టిన పేర్లే సమస్త జీవజాతులకు



కలిగాయని చెప్పే కథనాలు కేవలం కల్పితాలుగా పాఠకులే నిర్ధారించగలరు.

కంటికి కనిపించని సూక్ష్మజీవులు "వైరస్"ల ప్రస్తావన వచ్చింది గనుక ఇక్కడొక విషయం చెప్పాలి. ప్రపంచంలో ప్రప్రథమంగా సూక్ష్మజీవుల వునికిని 16వ శతాబ్దంలో "లీవెన్ హాక్" అనే శాస్త్రవేత్త కనుగొన్నాడు. అంతకుముందు ప్రారంభమైన బలవంతపు ఆపరేషన్ల సందర్భంలో సూక్ష్మజీవులు, రోగకారక "వైరస్"ల సంగతి తెలియని డాక్టర్లు ఆపరేషన్ మధ్యలో కత్తికి పదును పెట్టుటకు గాను దానిని తమ కాలికున్న లెదర్ బూటుకు రుద్దుకొనేవారు. ఆపరేషన్ సజావుగా జరిగిందని వారు భావించే తరుణంలో రోగి ఇన్‌ఫెక్షన్ వల్ల మరణించేవాడు. సంగతి అంతుచిక్కని అలనాటి నాటు వైద్యులు తలలుపట్టుకొనే వారు. దేవాది దేవుళ్లకు కూడ తెలియని ఈ పరమ రహస్యాన్ని లీవెన్‌హాక్ గాజు ముక్కలను అరగదీసి భూతద్దంగా మలచి వాటి ద్వారా ఈ ఘనతను సాధించాడు.

ప్రపంచంలో మొట్టమొదటగా జీవులన్నిటికి ఒక క్రమ పద్ధతిలో వర్గీకరించి వాటికి జాతిపరంగా పేర్లు పెట్టిన వ్యక్తి "కార్ల్‌లిన్నేయస్" (1707-1778) అంతకు ముందు జంతువులను, మొక్కలను ప్రాంతాల వారీగా అనేక పేర్లతో వ్యవహరించేవారు. అయితే కార్ల్‌లిన్నేయస్ ప్రతి జాతిని జాతి పరంగా విడగొట్టి 4004 జంతువులకు, 7007 వృక్షజాతులకు పేర్లు పెట్టగా ఆయన పెట్టిన పేర్లే నేటికీ కొనసాగుతున్నాయి.

బైబిల్ ఎన్ని కథలు చెప్పినా, ఆదాము తప్ప వేరే నరమానవుడేలేని సమయంలో ఆదాము పెట్టిన పేర్లే కలిగాయనే మాటలన్నీ కల్పిత గాథలేనని పాఠకులు కూడ నిర్ధారించగలరనే దానిలో ఎటువంటి సందేహము లేదు.

ఈ విషయాలన్నింటికన్నా దేవుడైన యెహోవా ప్రేమామయుడు... కరుణా సముద్రుడు... కటాక్షం గల తండ్రి అంటూ లెక్కలేనన్ని బిరుదులతో కీర్తించే క్రైస్తవ భక్త జనాలతో ప్రశంసలందుకొంటున్న యెహోవా ఇంతటి ప్రాణాంతకమైన వైరస్ జీవులను, రోగకారక క్రిములను ఎందుకుచేశాడీ "యెహోవా-గాడ్" అని నాబోటి వారెవరన్నా విమర్శిస్తే సహించలేరు. ఇట్టి సందేహాలను కూడ నివృత్తి చేయగల అనుభవజ్ఞులైన బోధకులు చాలామంది వున్నారు. వారు దీనికి తడుముకోకుండా సమాధానమిస్తారు. ఈ నెల్సన్ రఫీ బైబిలంతా పరిశీలించానంటాడు ఈ మాత్రం తెలియదాయని తలంచవచ్చు.

వారు చెప్పే విషయమేమంటే... ఆది దంపతులను యెహోవా "మీరు ఈ తోటలోనున్న సమస్త ఫలాలను తినవచ్చు". "అయితే తోట మధ్యనున్న "మేళ్లూ కీళ్లూ" తెలిపే వృక్ష ఫలాలు మాత్రం తినవద్దని" ఆజ్ఞాపించగా... వారు సర్పముచే మోసగించబడి ఆ ఫలాలను తిన్నందున యెహోవా వారిని పాపాత్ములుగా చిత్రించి దానికి శిక్షగా భూమిని శపించాడు. ఆకారణంగా భూమి మీద ముండ్ల తుప్పలు గెచ్చపొదలు మొలిచి భూమి నిస్సారమయ్యిందని బహుశా అప్పుడే దేవుడు భూమ్మీద ఈ రోగకారక వైరస్ క్రిములను

పుట్టించి యుండవచ్చునని కోడిగుడ్డుకు ఈకలు పీకే ప్రయత్నం చేస్తారు. ఈ వ్యాఖ్య ఎంతవరకు సమజంసం?

ఆది దంపతులను మంచి చెడ్డలు తెలియని పామరులుగా సృజించబడ్డారని బైబిల్ చెబుతుంది. అట్టివారిని సర్పము మోసగించగా సహజంగానే వారు మోసపోయారు. అదివారి తప్పుకాదు కదా! అంత మాత్రానికి భూమిని శపించి ఇల్లుపీకి పరిదిరేయాలా? ఒక వేళ వారిని శిక్షించుటకే ఈ రోగకారక క్రిములను సృష్టించి యావత్ మానవాళిని... రాగల కోటాను కోట్ల తరాలవరకు తరగని శిక్ష విధించడం న్యాయ సమ్మతమేనా? ఎంతటి బుద్ధిహీన న్యాయాధిపతియైనా ఒకడు చేసిన నేరానికి వాడిని వాడి కుటుంబాలనే కాక రాగల తరతరాల వారసులనందరికి శిక్ష విధిస్తాడా? ఈ సమాధానం అలాగేయుంది. ఒక వేళ ఇది దైవనీతే అయివుంటే ఇది రాక్షసత్వం కన్నా ఘోరాతి ఘోరంగా యుంది. ఒక వేళ వీరు చెప్పిన సంజాయిషీ నిజమే అయితే! యెహోవా దుర్నీతి విషయంలో తండ్రులు చేసిన దోషాలను నాలుగైదు తరాల వరకు వారి పిల్లల పిల్లల మీదికి రప్పిస్తాడని బైబిల్‌లో చాలా చోట్ల చెప్పబడింది. నిజమే యెహోవా అలాంటి మనస్తత్వం కలవాడేననుటకు మరో ప్రబల నిదర్శనముంది. అలనాడెప్పుడో భూమి మీద పాపం విస్తరించిందని యావత్ మానవాళిని జలప్రళయంలో ముంచి చంపేసిన కౄరచరిత్ర గలవాడు. నాడు భూమి మీదనున్న ముక్కు పచ్చులారని బాలబాలికలు, పాలుత్రాగే పసివారు, గర్భస్త శిషువులు ఎంతోమందికి ఈ పాపాలతోను బలాత్కారం తోను ఎటువంటి సంబంధం వుండదు. వారినందరిని ఎందుకు చంపినట్లు? దీనికి ఎవరూ జవాబు చెప్పలేరు.

పోనీ చంపేశాడనుకుందాము. జలప్రళయానంతరం నీతివంతమైన సమాజం అవతరించిందా? అంటే అదీ లేదు. అనంతర సమాజం సంగతి అలాగుంచి ఓడలో నుండి బయటకొచ్చిన నీతిమంతుడని చెప్పబడ్డ నోవహు తప్ప త్రాగి గుడ్డలు లేకుండా పొర్లాడాడట ఈ ఆలోచనా కర్తయైన యెహోవాకు అనంతర పర్యవసానం ఎలాగుంటాదో తెలియదా? ఇవన్నీ ఆకాయ పోకాయ కథనాలు తప్ప దైవలీలలు ఎంత మాత్రము కావు. తృతీయ భాగంలో జలప్రళయం కథనం సచిత్రంగా చూడగలరు.





## స్త్రీ ఆవిర్భావం!

యెహోవా! ఆరవ దినాన ఆఖరి ఘడియలో స్త్రీని సృష్టించుటకు ఉపక్రమించాడు. నిజానికి ఇది అత్యంత క్లిష్టతరమైన చర్య. ఆదినమందే సమస్త జీవరాశికి సరికొత్త పేర్లు పెట్టి ఒక్క దినమైన వయస్సులేని గంటల బాలా కుమారుడైన ఆదామును యెహోవా అర్జంటుగా పిలిచాడు. ఆదాము యొక్క ప్రక్క టెముకను తీసి దానితో స్త్రీని చేసి ఆదాముకు సాటియైన సహాయంగా ఇవ్వదలచుకున్నాడు.



ఇక్కడ మనము అలవాటు పడ్డ బైబిల్ కథను బట్టి ఇట్టి విషయాలను మనము అతి సామాన్యంగా అలవాటుపడ్డ బైబిల్ కథలాగే వింటాము గాని ఇందలి సాధ్యాసాధ్యాలను గూర్చి ఎంత మాత్రము ఆలోచించము. దేవుడైన యెహోవా ఎంతకైనా తగిన వాడు ఆయనకు అసాధ్యమేమిటని తలంచవచ్చు. ఇక్కడ చేతిలో వున్నది పురుషుని ప్రక్కటెముక ఇది పచ్చి ఎముక అయితే మరికాస్త లావుగా వుండి, లోపల నున్న సన్నని గొట్టంలో మూలుగ, రక్తనాళాలు వుంటాయి. అయితే ఇది చంద్రవంక ఆకృతిలో ఒంపుతిరిగి వుంది. సుమారు అయిదారు అంగుళాల ఒంపు తిరిగిన పలుచని ఎముక సుమారు ఆరు ఏడు అంగుళాలు. దీనితో ఆరడుగుల స్త్రీ మూర్తిని కొండపల్లి బొమ్మను చెక్కినట్టు చెక్కవలసి వుంటాది. తన మహిమాన్విత శక్తులతో కాక చేతితో సామాన్యమైన రీతిలో చేయబడినట్టు మాత్రమే చెప్పబడింది.

యెహోవా ఆదాముకు గాఢ నిద్ర కలుగజేసి ఏ చెట్టు క్రిందనో పడుకోబెట్టి "ఆపరేషన్"కు ఉపక్రమించవచ్చును. అప్పుడు కత్తులు కఠారులు లేవు. "స్టెరలైజేషన్" సంగతులు అసలే తెలియవు. భయంకర బ్యాక్టీరియాను తానే చేయించినట్టు చెప్పే విషయము అంతకన్నా తెలియదు. గాఢ నిద్రలో నున్న ఆదాము డొక్కను గోళ్లతో చించి, ఏ బండ రాయితోనో ఒక ప్రక్కటెముకను విరగగొట్టి దానిని పెకలించి మాంసంతో పూడ్చి చిన్నపాటి ప్లేస్టిక్ సర్జరీలాంటిది చేసి యుండవచ్చును. ఈ ఎముక వంపు తిరిగి వున్నందున నిఠారుగా

నిలువగలిగిన స్త్రీ ఆకృతిని చేయడము అసాధ్యము. ఇంతా జరిగించాక మనిషి కోలుకొనుటకు కనీసం కొన్ని నెలల సమయం పట్టవచ్చును.

గతంలో హైద్రాబాద్ కోటీ సెంటర్‌లో ఆంధ్రాబ్యాంక్ సమీపమందు కొమ్ముతో కొండపల్లి బొమ్మల్లాంటి కొంగ బొమ్మలను చేస్తూవుండేవారు. అయితే వారెవరూ బొమ్మల యొక్క బాహ్య రూపాన్ని తప్ప అంతర్ భాగాలు చేయలేరు. శిల్పకారులు, చిత్రకారులైనా వారు తాము రూపొందించిన ఆకృతులకు అంతర్ భాగాలు ఎంతమాత్రము చేయలేరని ఇది వరకే చెప్పుకున్నాము.. కాని ఆ బొమ్మకు ప్రాణం పోయాలంటే దానికి సమస్త అంతర్ భాగాలు విధిగా చేసి తీరాలి. అంతేకాదు. పురుషునికన్నా కొన్ని అదనపు అవయవాలు స్త్రీలకు వుండాలి. ముఖ్యంగా గర్భాశయము ప్రత్యేకంగా ఏర్పాటు చేయాలి! పాలండ్లు అమర్చాలి. మనము మతగ్రంథాల విషయంలో ఇటువంటి "చొప్పదంటు ప్రశ్నలు" ఏమీ వేయకూడదు. కాని వివరాలలోకి పోక తప్పడములేదు. మొత్తానికి అన్నీ సజావుగా జరిగిపోయాయి. కుందనపు బొమ్మలాంటి స్త్రీ మూర్తి ఒయ్యారంగా అడుగులు వేస్తూ నడవసాగింది. వెనువెంటనే ఆదామును లేపి ఇదిగోనయ్యా నీకు సాటియైన సహాయం. ఈ అమ్మాయి ఎక్కడి నుండి వచ్చిందనుకున్నావు. ఇదీ నీ ప్రక్కటెముకే! అంటూ ఆదాముకు అందించాడు.

వెనువెంటనే ఆదాము నా ఎముకల్లోని ఎముకా! నా మాంసంలోని మాంసమా! నీవు నరునిలో నుండి తీయబడినందున "నారి" అనబడుదువని చెప్పాడట, ఇది నమ్మశక్యమేనా? అసలు మాంసమనే సంగతి ఆదాముకు తెలుసా? ఎముకలు ఎలా గుంటాయో అసలే తెలియదు గదా! ఇవి కేవలం ఆ రచయితల వ్యాఖ్యలే!

ఇంతటి దారుణమైన మేజర్ ఆపరేషన్ ఎటువంటి పరేషాన్ లేకుండ జరిగిపోయింది. ఆదాము కనీసం 24 గంటలైనా మంచంపట్టలేదు. ఆపరేషన్ అనంతరం కుట్లువేయలేదు. ఇన్‌ఫెక్షన్ కాలేదు. రక్తం ఎక్కించబడలేదు. క్షణాల మీద కోలుకొని చెట్టాపట్టాలేసుకొని కులాసాగా తోటలోకి లాక్కుపోయాడు. ఈ ఘటనను రచయితలు వ్రాసే సమయానికి మత్తుమందు లాంటిది ఇచ్చి ఆపరేషన్‌లు చేసే ప్రాథమిక దశ ప్రారంభమై వుండవచ్చును. ఇవండీ! మతగ్రంథాలు చెప్పే బూటకాలు. అందుకే ఇటువంటి సందేహాలు వెలిబుచ్చకుండ చూచినమ్మిన వానికన్నా చూడక వాడు ధన్యుడని ప్రభువువారు చెప్పాడు.





## దేవునికి విశ్రాంతి నిద్ర అవసరమా!

ఆకాశమును భూమియు వాటిలోనున్న సమస్త సమూహములను సంపూర్తి చేయబడెను. దేవుడు తాను చేసిన తన పనిని ఏడవ దినములోగా సంపూర్తి చేసి తాను చేసిన పనియంతటి నుండి ఏడవ దినమున... విశ్రమించెను. (ఆది. 2:1-2)

ఇక్కడ మనము చూస్తే రెక్కలు ముక్కలు చేసికొని గత ఆరు రోజులుగా పడ్డ శ్రమ యంతటి నుండి యెహోవా విశ్రమించడం చూస్తుంటే నరుని పోలికెలో నున్నందుకే ఆయన శక్తిని కోల్పోయి అలసిపోయి యుండవచ్చుననిపిస్తుంది. ఆకారణంగా తనతో పాటు యావత్ ప్రపంచానికి "హాలీడే" ఇవ్వడం జరిగింది. అయితే దీనికి సోదర క్రైస్తవ సమాజాలు... దేవుడేమిటి అలసిపోవడమేమిటి? అని తలస్తూ ఉదాహరణలుగా... భూమ్యాకాశములను సృజించినవాడు. ఆయన నీ పాదములను తొట్రిల్లనీయడు, నిన్ను కాపాడువాడు కునుకడు. ఇశ్రాయేలును కాపాడువాడు కునుకడు నిద్రపోడు. (కీర్తనలు. 121:2-4). ఇక్కడ ఈ వాక్యంలో యెహోవా ఎంత సేపూ తన ప్రజలైన ఇశ్రాయేలు జనాంగాలకు గూర్చిన తపనే కనిపిస్తుంది. తదితర సర్వమానవాళి సంగతులు ఆయనకేమి పట్టవా?

నీకు తెలియదా! భూ దిగంతములను సృష్టించిన యెహోవా నిత్యుడగు దేవుడు. ఆయన అలయడు. సొమ్మసిల్లడు. (యెషయా. 40:28).

అయితే అలయని సొమ్మసిల్లని దేవుడు ఆరు దినములు పనిచేసి ఏడవ దినాన ఎందుకు విశ్రమించవలసి వచ్చింది?

ఈ విధంగా రోబాట్లు ఎప్పుడైనా సెలవు అడుగుతాయా!




నెల్సన్ రఫీ

ఆ దినాన్ని విశ్రాంతి దినంగా ఎందుకు ప్రకటించవలసి వచ్చింది? ఆ రోజును యూదులు నేటికి విశ్రాంతి దినంగా పాటిస్తున్నారు.

ఈ కారణంగా యెహెూవాకు మానవుల వలెనే నిద్ర విశ్రాంతి అవసరమేమో అనిపిస్తుంది. మరికొన్ని ఆధారాలు చూస్తే... "నేను పెందల కడనేలేచి ప్రవక్తలైన నా సేవకులనందరిని మీ యొద్దకు పంపుతూవచ్చితిని? (యిర్మియా. 7:25).

"నేను పెందల కడనే లేచి మీకు ఆ మాటలు ప్రకటించుచూ వచ్చినను మీరు వినకపోతిరి". (యిర్మియా. 25:3)

"ఆయన పెందల కడనే లేచి ప్రవక్తలను పంపుచూ (వచ్చెను. 2వ. దిన. 36:16).

ఆదాము హవ్వలు ఏదేను తోటలో వున్నప్పుడు యెహెూవా సాధారణంగా ఎండ తీవ్రత తగ్గాక చల్లపూట ఆది దంపతులను పరామర్శించుటకు ఏదేను తోటకు వస్తూపోతు యున్నట్టు కనబడతాది. అందుచే యెహెూవా మధ్యాహ్నపూట ఒక కునుకు తీసే అలవాటున్నట్టు విదిత మౌతుంది. దేవదూతలు కూడ "లోతు" ఇంట ఒక రాత్రి నిదురించినట్టు ఆదికాండం చెబుతుంది.

<u>**ఇది నిజమా! అది నిజమా! ఏది నిజం?**</u>

***(యెహెూవా! తాను చేసిన పనియంతటి నుండి ఏడవ దినమున విశ్రమించెను). ఆయన పెందలకడనే లేచి ప్రవక్తలను పంపుచూ వచ్చెను. (2.దిన. 36:16).***

***నీకు తెలియదా? భూదిగంతములను సృష్టించిన దేవుడు అలయడు. సొమ్మసిల్లడు. (యెషయా. 40:28).***



## "దేశమంటే... మట్టి కాదోయ్! దేశమంటే... మనుషులోయ్!"

దేవుడు "ఏదెనులో" ఒక తోటను వేసి తాను నిర్మించిన నరులను అందులో ఉంచెను. ఆ తోటను తడుపుటకు ఏదెనులో ఒక నది పుట్టి పారుచూ చీలిపోయి, అది నాలుగు శాఖలాయెను. మొదటి దాని పేరు "పీషోను" అది "హవీలా" దేశమంతటి చుట్టునూ పారుచున్నది. అక్కడ బంగారమున్నది. ఆ దేశపు బంగారము శ్రేష్టమైనది. అక్కడ "బోళమును గోమేధికమును" దొరకును. రెండవ నది పేరు "గీహోను" అది "కూషు" దేశమంతటి చుట్టును పారుచున్నది. మూడవ నది పేరు "హిద్దెకెలు" అది అష్షూరు తూర్పువైపున పారుచున్నది. నాలుగవ నది పేరు యూఫ్రటీసు అని చెప్పబడింది.

పై వివరాలు బహులోతుగా ఆలోచించవలసిన విషయాలు. అసలు అప్పటికి ఒక్క నరుడు మాత్రమే (ఆదాము)ను సృజించాడు. భూమి యందలి సమస్త జీవరాశికి పేర్లు పెట్టమని పురుమాయించాడు. అప్పటికింకా స్త్రీ (హవ్వ) సృజించబడనైనా లేదు. ఆవివరణ సృష్టికార్యం పూర్తయ్యాక ఏడవ దినం తరువాత చెప్పబడినదిగా భావించినా అప్పటికి భూమిమీద ఇద్దరంటే ఇద్దరేవున్నారు. ఆది మానవులకు మంచి చెడ్డలు తెలియక ముందే వారింకా దిగంబరులు గావుండగానే పై మూడు నదులు మూడు దేశాల చుట్టూ పారడమేమిటి? ఈ దేశాలెక్కడ నుండి పుట్టుకొచ్చాయి?

మనము ఆదికాండములో మరికాస్త ముందుకు పోయి చూడగా ఆది దంపతులకు ఇద్దరంటే ఇద్దరు కుమారులుండగా కయీను తనతమ్ముడైన హెబెలును చంపగా యెహెూవా అతనిని ఏదెను పరిసర ప్రాంతాలనుండి వెళ్లగొట్టగా అతడు వెళ్లి "నోదు" దేశమున కాపురమున్నాడట. ఇప్పటికే "ఏదెను, హవీలా, కూషు, అష్షూరు" దేశాలు ఎక్కడినుంచి వచ్చాయిరా బాబూ! యంటూ సతమతమౌతూ యుండగా ఈ "నోదు దేశము"లో కాపురమున్నాడట. ఈ 'నోదు' దేశ మెక్కడిది. అక్కడతడు పెండ్లి చేసికొని కుమారులను కుమార్తెలను కనెను. అనంతరం అక్కడ కయీను ఒక టౌన్‌షిప్‌ను కట్టించి దానికి "హనోకు" అని తన కుమారుని పేరు పెట్టడం జరిగింది. నీవు దేశదిమ్మరి యౌదువుగాకయని యెహెూవా శపించగా అక్కడ కయీను స్థిరనివాస మేర్పరుచుకోవడం జరిగింది. దేవుని

శాపం గాలికి కొట్టుకుపోయింది. అనగా బైబిల్ చెప్పుచున్న ప్రకారం ఆదాము హవ్వలను ఏదేను తోటనుండి దేవుడు వెళ్లగొట్టిన సమయానికే భూమి మీద ఆయా దేశాలున్నట్టుగా రుజువగుచున్నది. దీనిని బట్టి బైబిల్‌లోని ఆదిమానవ సృష్టికార్యం సర్వాబద్ధమని తేలిపోయింది.

నిజమే! కేవలము ఆరేడు వేల సంవత్సరాల క్రితమే సృష్టి జరిగిందని బైబిల్ వివరించే నాటికే ఇండోనేసియా, రోమన్, సుమేరియన్, అస్సీరియన్ నాగరికతలు వర్ధిల్లాయని చరిత్రకారులు ఆధారాలతో సహా రుజువులు చూపారు. ఆ సమయానికి ఇండియా దేశమందు అనగా అవిభక్త భారతావనిలో "హరాప్పా", "మహింజోదారో" లందు అనేక నాగరిక జాతులు నివసించినట్టు పురాతత్వ శాస్త్రవేత్తలు జరిపిన త్రవ్వకాలలో మన పూర్వీకుల నాగరికతా విశేషాలు, గృహనిర్మాణాలు తదితర ఆధారాలు బయల్పడినట్టు మనకు అనేక రుజువులు చూపబడ్డాయి. ఆరేడు వేల సంవత్సరాలకు పూర్వమే ప్రాచీన ఈజిప్షియన్లు "పెరిమిడ్స్" తదితర కట్టడాలను నిర్మించినట్టు, దాని ద్వారా వారి ఇంజనీరింగ్ ప్రతిభను చూపడం జరిగింది. వారు అప్పటికే క్యాలండర్‌ను, పంచాంగాన్ని ఆవిష్కరించిన ఆధారాలు దొరికాయి. ఈ రుజువులను బట్టి బైబిల్ సృష్టి కథ అబద్ధమని తేటతెల్లమగుచున్నాయి.

**కయీను దేశదిమ్మరా?**

**స్థిర నివాసియా!**

**యెహోవా నీవు భూమి మీద దిగులు పడుచూ దేశదిమ్మరివైయుందువని శపించెను. *(ఆది 4:9-12)***

**కయీను యెహోవా సన్నిధి నుండి బయలు దేరి వెళ్లి ఏదెను కు తూర్పు దిక్కున నున్న నోదు దేశములో కాపురముండెను. *(ఆది 4:16,17)***

**ఇది నిజమా? అది నిజమా? ఏది నిజం!**





## రాతియుగపు జాడలు మచ్చుకైనా కనబడవు!



మానవుడు ప్రాథమిక దశనుండి నాగరికుడేనా? ఆదియందే వివాహ వ్యవస్థ యున్నదా? మానవుడు భూమ్మీద కాలుమోపిన నాటి నుండే వ్యవసాయం చేస్తూ జంతువులను మచ్చిక చేశాడా! గనులు త్రవ్వి ఇత్తడి, ఇనుము, రాగి, బంగారము, వెండి తదితర లోహాలను కనుగొని, ఆయుధాలు, ఆభరణాలు చేసి ధరించాడా? అసలు అగ్నిని రాజేయగలి గాడా! చర్మపు దుస్తుల సంస్కృతిలోనే రక రకాల వాయిధ్య పరికరాలను తయారు చేయడము వాటిని వాయించగల సత్తా అలవడిందా? లాంటి సమస్త ప్రశ్నలకు బైబిల్ ఔననే సమాధానం చెబుతుంది!



రాతి యుగపు జాడలు అంటే నాకు గుర్తుకొచ్చారు. మనము ముందుమాటలో చూచిన మేడం నిర్మల మేరి గారు కళ్లల్లో మెరిశారు. ఆమె అభూత కల్పనా రచయిత్రిగా పరిచయం చేయబడ్డారు. ఇక్కడ మనకు "రెడ్‌హేండెడ్"గా దొరాకిపోయారు: వారు రచించిన **"బైబిల్ వాక్కులు – సైన్సు సాక్ష్యాలు"** అనే పుస్తకం పేజి నెం॥ 31లో ఈ క్రింది పాతరాతి యుగం నాటి రాతి పనిముట్ల నమూనాలను పొందుపరచి క్రైస్తవ సోదరుల్లారా! ఇదిగో చూడండి! ఈ పటంలో అదాము ఉపయోగించిన రాతి పనిముట్లని సొరబాటు వివరణలతో ప్రకటించారు. బైబిల్ దీనికి ఏ విధమైన ఆధారమైనా మీరు చూపగలరా?

పాపం! అమాయక భక్తురాంద్రేమనుకుంటారు... అయ్య బాబోయ్! మా ఆదాము హవ్వలు ఈ సన్నికాలు మీద ఆ బండరాయితో కొత్తిమెరి పచ్చడి నూరు కొన్నారా! అంటూ లొట్టలేసుకొంటూ మరిచూస్తారు.

ఆదాముకు చేతి గోళ్లు తప్ప మరే విధమయిన ఆయుధాలు లేవు. ఇట్టి రాతి పనిముట్లను తయారు చేయుటకు అనువైన పనిముట్లు లేవు. ఇంతటి మహోన్నత మేధావులు సైంటిస్టులు అయివుండి మీరు ఈ విధంగా వ్రాయుట సబబేనా? ఎంతటి మహామేధావులైన విద్యావంతులైనప్పటికి వృక్షశాస్త్రజ్ఞులైనా, భూగర్భ పరిశోధకులైనా, చివరకు అంతరిక్ష శాస్త్రవేత్తలైనా సరే మూడంటే మూడు అక్షరాలు "దేవుడు" అనే పదము ఎదురైయ్యే సరికి ఈ క్రైస్తవ మేధావులకు తమ జ్ఞాన సంపద, విద్యాధిఖ్యత మొదలైనవన్నీ దేవుని దృష్టిలో ప్రవక్త చెప్పిన విధంగా అవన్నీ "మురికి గుడ్డ పేలికల" వంటివని "సరెండర్" అయిపోయి దైవాల దుశ్చర్యలు కూడ వీరికి మహోన్నతమైన వైజ్ఞానిక విషయాలు గానే కనబడతాయి. ఈ బైబిల్ మేధావిని గూర్చి ముందు పేజీల్లో సవివరంగా ఇవ్వబడింది.

బైబిలు ఏమని చెబుతుందంటే ఆది మానవులుగా చెప్పబడిన దిగంబర మానవులు అత్యంత అనాగరికమైన (అప్పుడే చంపబడిన గొర్రె చర్మాలతో చేయబడిన చర్మపు ఆచ్ఛాదనాలు కావచ్చు) ధరించారని ఆ ఆది మానవులులను అట్టి ప్రారంభ దశలోనే భార్యాభర్తలుగా సంభోదించబడింది. అనంతరము కయీను కూడ పెండ్లి చేసికున్నట్టు అర్థంవచ్చే విధంగా "కయీను భార్య" అని వివరించబడింది.

క్రైస్తవ సోదరులు ఒక్కసారి కాస్తయినా ఆలోచించే ప్రయత్నం చేయండి. నరులు ఇంకా తోలు ఆచ్ఛాదనాలు ధరించే స్థితిలో యుండగానే భూమి మీద వివాహ వ్యవస్థ ప్రారంభమయ్యిందా? మానవులు కాలక్రమంలో వేలాది సంవత్సరాల అనంతరము సంఘుకట్టుబాట్లు, క్రమశిక్షణా యుతమైన జీవనం ప్రారంభమై వివాహ వ్యవస్థకు అంకురార్పణ జరగడానికి వేలకొలది కాదు. లక్షలాది సంవత్సరాల కాలవ్యవధి పట్టిందని చెప్పవచ్చు. ఆదిమ జాతులు తమతమ జాతులకు చెందిన స్త్రీలతో తమ చిత్తము వచ్చిన వారితో జతకట్టేవారు. పూర్తి వివరాలు చూడాలనిపిస్తే.. తాపీధర్మారావు గారు రచించిన "పెండ్లి-దాని పుట్టుపూర్వోత్తరాలు" అనే పుస్తకాన్ని చదవండి. అంతేకాక ప్రపంచ ప్రఖ్యాత చరిత్రకారులు, రచయితలు అయిన రాహుల్ సంస్కృత్ యాయన్, "ఓల్గాసే గంగా" అనే వీరి రచనల్లో మాతృసామ్య యుగం ప్రారంభంలో స్త్రీలకు లైంగిక పరమైన విచక్షణా జ్ఞానం వుండేది కాదు. స్త్రీలు తండ్రి... సోదరులు అనే తారతమ్యం లేకుండా విచ్చలవిడి శృంగారం జరిపేవారు.

అయితే మనకు ఈ మత గ్రంథమైన బైబిల్ ఏమంటుందంటే భూమిమీద పట్టుమని పదిమంది జనాభా అయినా లేనపుడే మానవుని ప్రాథమిక దశలోనే అదాము సంతానము.. కయీను కుటుంబము మాత్రమే భూమిమీద నుండగా వ్యవసాయము గొర్రెల పెంపకము,



జంతువులను మచ్చిక చేయుట ఏ కాక, కయీను సంతానమైన "యూబాలు" సితారలు, పిల్లన గ్రోవులు మొదలైన వాయిద్య పరికరాలను చేయడము ప్రారంభించాడట.

కయీను సంతతియైన "తుబాల్ కయీను" అనేవాడు ఏకంగా పదునుగల రాగిపనిముట్లు, ఇనుప పనిముట్లను చేయడంలో ప్రవీణుడట. మిత్రులారా ఇక్కడ మనకు కనిపించే రాళ్లవంటివి గనులలో త్రవ్వబడిన ముడి ఇనుప ఖనిజము. ఇట్టి ఇనుప ఖనిజానికి సంబంధించిన రాళ్లు ఎక్కడయినా బయట పడి నాటి అనాగరిక మాన వులకు కనబడినా అవి ఇనుము, ఇత్తడి, రాగి వంటి లోహాలకు సంబందించిన వని గుర్తించగలరా? నేటి బుద్ధి జీవులమైన మనమైనా ఎవరూ చెప్పకుంటే తెలిసికోలేము. బంగారు గనులైన కోలారు "గోల్డ్ ఫీల్డ్స్" గూర్చి మీరు ఎప్పుడైనా విన్నారా? అక్కడ బంగారము రెండు మూడు కిలోమీటర్ల లోతులో భూగర్భమందు లభిస్తాదట. ఒక వేళ్ల వారు ఆయా లోహాలకు సంబంధించిన ముడి పదార్థాలను గుర్తించారనుకుందాము. అసలు ఆదాము హవ్వలకు నిప్పంటే ఏమిటో తెలియదే! ఆయా చెట్ల ఫలాలను తింటూ వచ్చారని చెప్పబడింది తప్ప నిప్పును ఉపయోగించి చేపల పులుసు లాంటిదేదీ చేసుకు తిన్నట్టుగా ఎక్కడా కనబడదు. యెహోవా అగ్నిని గూర్చి వారికి ఏమాత్రము చెప్పినట్టుగాని... వారికి ఇచ్చినట్టుగాని ఎక్కడా చెప్పబడలేదు.

ఆదాము హవ్వలు ఆజ్ఞాతిక్రమణ ద్వారా పాపాత్ములయ్యరని ఒక వేళవారు ఏదెను తోటలోనికి అడుగుపెట్టి జీవవృక్ష ఫలాలను కూడ తిని తన కొంప ఎక్కడ ముంచు తారోయనే భయంతో యెహోవా ఆ తోటలో ప్రవేశించే మార్గంలో "ఖడ్గ జ్వాల" అనగా అగ్ని అని మనము భావించలేము. గనుక అసలు అగ్ని అంటే ఏమిటో తెలియని ఆదాము సంతతి ఆయా లోహాలను ఎలా కరిగించి వుంటారు? ఆ రోజుల్లో ఏవయినా మ్యాజిక్ వృక్ష్యాలు వుండేవేమో! ఏదయినా చెట్టుపసరు ఉపయోగిస్తే ఇనుము కలిగిపోవడము జరిగేదేమో! ఎందుకంటే ఆ కాలములో ఒక చెట్టు ఫలాలు తింటే సిగ్గు ముంచుకు రావడము... మరో చెట్టు పండు తింటే చిరంజీవు లైపోవడం లాంటి చిత్రకథ లెన్నో బైబిల్ లోకనబడతాయి. ఈ అగ్ని ఆచూకి తెలుసుకొనుటకు మనము బైబిల్ కాస్త

ముందుకుపోయి చూస్తే... జలప్రళయానంతరము జలప్రళయం నుండి బయట పడ్డాక నోవహు యెహోవాకు దహనబలిని అర్పించాడట! అయితే ఆ "అగ్గినిప్పును" పాపం నోవహు ఎక్కడి నుండి తెచ్చాడో ఎవరికీ తెలియదు. ఆకాశం నుండి అగ్ని దిగివచ్చి దహించేదని బైబిల్‌లో కనబడతాది. మత గ్రంథాలందు మనకు ఇటువంటి "ఆకాయపోకాయ" కబుర్లు ఎన్నో కనబడతాయి. ఇట్టి వాటిని గూర్చి ఏ ఒక్క విశ్వాసికి ఆవగింజంత అనుమానమైనా రాదు.

నిజానికి ఆది మానవ జాతులు మాత్రం ఆకులలములు... కందమూలాదులు... పచ్చిమాంసం తింటూ మృగ ప్రాయంగా దిగంబరంగా కొండ గుహల్లోను, చెట్టుతొర్రల్లోను నివసిస్తూ దుర్భరజీవితం గడుపుచూ... క్రమక్రమంగా "దావానలల్లో" చిక్కుకొని మరణించిన కాలిపోయిన జంతు కళేబరాలను రుచిమరిగి చాలా కాలానికి చకుముకి రాళ్లతో అగ్నిని రాజేయడం నేర్చి, ఉడికించిన లేక కాల్చిన ఆహారంలో కాస్త ఉప్పుకారాలను చేర్చి అంచెలంచెలుగా రాతియుగం లోహ యుగం దాటుకొంటూ లక్షలాది సంవత్సరాల అనంతరం మానవుడు నాగరికత వైపు అడుగులు వేయడం ప్రారంభమయ్యిందేగాని... బైబిల్ వివరణ ప్రకారం నరుడు తొలి నాళ్లలోనే వ్యవసాయం చేయడం, లోహాలను వెలికితీయడం, బంగారు ఆభరణాలు ధరించడము వాయిధ్య పరికరాలు చేయడం వంటివన్నీ నిస్సందేహంగా కల్పిత గాథలుకాక మరొకటికాదు. అసలు క్రైస్తవ భక్తులు ఎంతటి మేధావులైనా, ఇంతకు ముందు మనము చెప్పుకున్న పి.హెచ్.డి.లు వైజ్ఞానిక శాస్త్రవేత్తలందరు ఇట్టి యధార్థ విషయాల జోలికి చచ్చినా వెళ్లరు.

బుద్ధి జీవులుగా ఎదిగిన క్రైస్తవ మేధావుల్లారా! కాస్త ఆలోచించండి. నేటి క్రైస్తవ ప్రపంచంలో ఎక్కడో మారుమూల దేశాల్లోనో, ప్రాంతాలందో కొంతమంది నిరక్ష రాస్యులుంటే ఉండవచ్చు. కాని నేటి కాలమాన పరిస్థితులో క్రైస్తవ లోకం విద్యాబుద్ధుల్లో ముందంజలోనే యుంది. అధిక సంఖ్యాకులు ఉన్నత విద్యలనభ్యసించిన వారే. అయితే వీరంతా బైబిల్ ఈ విధంగా చెబుతుంది. దీనికి మనం బద్ధులమై యుండాలి అని తలంచడమేనా? అసలు శాస్త్రమేమంటుంది? అది నిజమా? ఇది నిజమా! యని ఎప్పుడయినా ఆలోచించ ప్రయత్ని స్తున్నారా? ఆలోచిస్తే బైబిల్ అబద్ధమైపోతాదేమోననే భయమా? యావత్ విశ్వం బైబిల్ వివరించిన ప్రకారం ఆరేడు వేల ఏళ్లక్రితమే సృజించబడిందా? నిజం తెలిసికోవడానికి ఎందుకు సంకోచిస్తున్నారు?



## మంచి చెడ్డల తెలివినిచ్చు వృక్షఫలాలు

మంచి చెడ్డల తెలివినిచ్చు బైబిల్ "ఏపిల్" పండ్లు తిన్నవెంటనే ఆది దంపతులు పాపాత్ములయి, భ్రష్టులైపోయారని బైబిల్ దేవుడైన యెహోవా తెగ బాధపడి పోయాడు. కాని అవి ఎంత మాత్రము చెడ్డవికావు.

దాని పండ్లను గూర్చి ఎంత పవిత్రంగా చెప్పబడింది? ఇది ఎంతో పొరబాటు వ్యాఖ్య! ఆ ఫలాలు ఇది మంచి అది చెడు అని తెలియజేసి మానవులను మేల్కొలుపుతాయి. దీన్ని బట్టి వారు వివేకవంతులౌతారు. అయితే ఈ చర్యను బైబిల్ ఎందుకంత పాపంగా చిత్రించింది? ఒక్కసారి యెహోవా స్వయంగా పలికాడని చెప్పిన పలుకులు వినండి!...

**అప్పుడు దేవుడైన యెహోవా! ఇదిగో! మంచి చెడ్డలను ఎరుగునట్లు ఆదాము మనలో ఒకని వంటి వాడాయెను అని వాపోయాడు.** వారు సైతాను వంటివారు కాలేదు కదా! దేవుళ్ల వంటి వారైపోయారు కదా! అంతకు ముందు ఆ దేవుళ్లు కూడ ఆ ఫలాను తిన్నారేమో! నరులు బాగుపడడం దేవునికి ఇష్టం లేదనుకోవాలా? అందుకే దీన్ని పాపంగా చిత్రించడం జరిగింది కావచ్చు. అదే పాటను నేటి వరకు యావత్ క్రైస్తవ సమాజాలు పాడుతూనే వున్నాయి. ఏది ఏమైనా ఈ బైబిల్ "ఏపిల్" నిజం కథయై కూర్చొని యావత్ ప్రపంచంలో నేటికీ కొనసాగుతూనే యుంది.

మానవుని హృదయం బాల్యం నుండి (మాహో) చెడ్డదని తెలిసియుండి కూడ యెహోవా ఆ తోట మధ్యలో ఆవివాదాస్పదమైన "లిటిగేషన్" చెట్టును ఎందుకు నాట వలసివచ్చింది? పోనీ వారు ఆ చెట్టు ఛాయలకు కూడా వెళ్లకుండా గట్టి బందోబస్తు అయినా చేసి యుండవలసింది కదాయని ఎవరయినా అభ్యంతరము లేవదీస్తే దానికి కొందరు బైబిల్ మేధావులు వివరణ నిస్తూ యెహోవా యంతటి సర్వోన్నతుని ప్రశ్నించుటకు ఈ మట్టి బుర్ర మానవుడెంతటి వాడు? మారు మాట్లాడకుండ నమ్మ వలసిందే! అయినప్పటికి దేవుడు విశాల హృదయుడు. ఆయనకు నియంతృత్వమంటే "బొత్తిగా గిట్టదు". మానవుని ఇంచుమించుగా తనతో సమానంగా సృజించాడు. అట్టి మానవునికి సంపూర్ణ స్వేచ్ఛనివ్వగా

దానిని వారు నిలుపుకో లేదంటూ, ఈ కారణంగా వారు పాపాత్ములయ్యారని చెబుతూయుంటారు. ఇక్కడ యెహోవా ఇచ్చాడని చెప్పే స్వేచ్ఛ ఎంతవరకు సమంజసము? అజ్ఞానులైన ఆది మానవులకు అమాయకత్వం తప్ప జ్ఞానం లేదుకదా. వర్తమాన, భూత, భవిష్యత్ విషయాలన్నీ ముందే తెలిసిన యెహోవాకు తెలుసు గనుక యెహోవా అపవాదిని, లేక సర్పాన్ని ముందే అదుపు చేసియుండవలసింది. ఒక వేళ్ల అలా చేసి యుంటే బైబిల్ కథ ఒక్క అంగుళమైనా ముందుకు సాగియుండేది కాదు.

నేటి ఆధునిక మానవుడు శాస్త్ర పరిజ్ఞానంలో ముందంజవేస్తూ ఎంతటి వివేకవంతుడైనప్పటికి మతాను సారుల దృష్టిలో వీరంతా అజ్ఞానులే. యెహోవా ముందు మానవుని తెలివితేటలు మురికిగుడ్డ పేలికలవంటివని బైబిల్ చెబుతున్న విషయాలనే ఎన్నోసార్లు ప్రస్తావిస్తారు.

అలాగే అనుకుందాము. అయితే ఈ తెలివి "తక్కువ మానవుడు"గా చెప్పబడుచున్న ఒక తండ్రి తన పసి బాలునికి స్వేచ్ఛనిస్తాడా? ఇవ్వడు, ఆటలాడుతూ ప్రమాదము అంచుకు వెళ్లిన తన ముద్దుల తనయుడ్ని రెక్కపట్టి వెనుకకులాగి రెండుదెబ్బలు పిర్రమీద తగిలించి మరొక్కసారి అలా జరగ కూడదని హెచ్చరిస్తాడు. ఏ మాత్రము భవిష్యత్ తెలియని సామాన్య మానవుడే ఇలా జాగ్రత్తలు చెప్పుచుండగా జరుగనున్న పరిణామాలన్నీ ముందే తెలిసిన యెహోవా నరులను పాపాత్ములుగా "డిక్లేర్" చేయుటకు ఇంతటి హైడ్రామా ఎందుకు ఆడవలసి వచ్చింది?



ఇట్టి నేరారోపణలు మానవుల మీద రుద్దటంలో యెహోవా సిద్ధహస్తుడే! రాబోయే శీర్షికల్లో ఇశ్రాయేలీయుల రాజు మీద యెహోవాకు కోపం వచ్చి ఆ ప్రజలమీద "ఉత్తుత్తి" నేరం మోపి డెబ్బది వేలమందిని నిష్కారణంగా చంపిన ఉదంతం మనము చూడగలము. నిజానికి వారా జ్ఞాన ఫలాలు తిన్న తరువాత కూడ వారికి విశేషమైన తెలివి తేటలు అబ్బినట్టు కనబడదు, తాము దిగంబరుమని మాత్రమే తెలుసుకున్నారట. అసలు అక్కడ



బట్టకట్టిన వారెవరున్నారని - తాము దిగంబరులమని గుర్తించారు? సకల జంతువులు దిగంబరంగానే వున్నాయి కదా! పనిలో పనిగా వీరు ఆ జీవ వృక్ష ఫలాలు కూడా తిని చిరంజీవులమైపోదామనే జ్ఞానం కూడ వీరికి రాలేదెందుకు? ఆ అపవాదిగాడైనా వీరికి చెప్పలేదు.

"ఆదాము - హవ్వలు" ఏదెను తోటలోనికి ప్రవేశించే నాటికి జంతుజాలం, పశు పక్ష్యాదులు కూడా సృష్టించబడినట్టు చూచాము. ఏదెను తోటలో అనేక రకాల ఫలవృక్షాలున్నట్టు, అందలి ఫలాలను వారు తిని జీవించినట్టు చెప్పబడింది. ప్రపంచ "ప్రథమ" ఉద్యానవనంలో వీరితోపాటు అనేక రకాల పక్షులు కిలకిలారావాలతో నెమళ్లనృత్యాలతో కన్నుల పండుగగా కొనసాగవచ్చును. ఇవిగాక లేళ్లు, దుప్పులు మొదలైనవి ఆ తోటకు మరింత అందాన్ని తెచ్చియుండవచ్చును. ఏదెను తోట అంటే అది చాలాచిన్నదని అందరూ అనుకుంటారు. అందలో నాలుగు నదులు ప్రవహిస్తున్నాయంటే అది అనేక చదరపు కిలోమీటర్లు విస్తీర్ణంలో ఉండియుంటుంది.

వీటి సంగతి ఎలాగున్నా నోరూరించి ఫలవృక్ష్యాలు గల తోటలో చెట్లపై అటూ ఇటూ కుప్పిగంతులు వేస్తూ వానరసైన్యాలు తప్పకుండా వెతుక్కొంటూ మరి వస్తాయి. అక్కడ ప్రత్యేకాకర్షణగా చూపునకు రమ్యమైనమైన "మేళ్లూ కీళ్లు తెలుపు" వృక్ష ఫలాలపై వాటి కళ్లుపడి ఆ చెట్టుపై దాడి చేసి కసాపిసా నమిలేసి యుండవచ్చు. వెనువెంటనే తాము దిగంబరులుగా వున్నామని తెగసిగ్గు పడిపోయి ఎక్కడలేని సిగ్గుముంచుకొచ్చి ఆకులు తెంపుకొని తమ మొలలకు కట్టుకున్నట్టు బైబిల్‌లో ఎక్కడాలేదు.

ఆ ప్రకారం గానే పక్షులు మరీ ముఖ్యంగా చిలకమ్మలు అందలి జీవవృక్షఫలాలను కొరుక్కు తిని అవి చిరంజీవులై పోయాయేమో! నేడు మనము చూడగా ఆ విధంగా చిరంజీవులై పోయిన చిలకమ్మల జాడకూడ ఎంతవెదకినా మనకు కనబడవు దీనిని బట్టి బైబిల్ నందలి ఇట్టి కథనాలన్నీ సర్వాబద్ధమని రుజువగుచున్నది.

ఈ కథ ఎలాగుందంటే ఒక రాజు సంతానం కొరకు తాపత్రియ పడుతూ ఒక మునీశ్వరుని ఆశ్రయించగా అతగాడు ఏవో చెట్టు ఫలాలు ఇవ్వగా తిన్న అతని భార్యకు గర్భం వచ్చిందని చెప్పే పౌరాణిక కథలవలె కనబడుచున్నది. ప్రపంచంలో ఏ చెట్టు ఫలాలకు ఇటువంటి అతీత శక్తులు లేవని, పండుతిన్నంతనే జ్ఞానం కలిగించే ఫలాలు అంతకాన్నా లేవని మనందరికి తెలుసు.

అనంతరం ఆ దిగం బరులైన ఆది మానవు లకు యెహోవా చర్మపు చొక్కాయిలు చేయించి యిచ్చి భూమి మీదకు గెంటి వేసినట్టు వివరించ బడింది. అయితే మానవుడు ఆది నుండి నాగరికుడేనని చెప్పే బైబిల్ కథనం ఈ చర్య ద్వారా అనాగరిక దశలో ఆజ్ఞాతి క్రమణ వల్ల పాపాత్ము నున్నట్లయ్యింది. ఇక్కడ మనము మరొక విషయము గమనిస్తే

లైన వీరిని అప్పటి కప్పుడే చంపిన గొర్రెల చర్మంతో అనగా బొచ్చు గల పచ్చి తోలుతో వారి సిగ్గును కప్పగా అది వారి ఒంటి మీదనే కుళ్లి, పురుగులు పట్టి ఎండిపోయి కుంచించుకుపోయి, బిగుసుకుపోలేదా? ఆ తోళ్లను ఉప్పులో ఊరబెట్టి నెలలతరబడి ఆర బెట్టి "పదును" చేసినట్లు ఎక్కడా లేదు. ఇదంతా వెనువెంటనే జరిగిన చర్యయైనందున ఆ దుర్వాసనకు వారు దిక్కుమాలిన చావు చావలేదా?యని చొప్పదంటు ప్రశ్నలు వేయకూడదు. నమ్మి విశ్వసించడమొకటే మార్గం.. అసలు దేవుడు మొట్టమొదటగా సిగ్గులేని మానవులను చేశాడు. అయితే ఆజ్ఞాతిక్రమణను చేసిన మానవులు ఆ నిషిద్ధ ఫలాలు తిని సిగ్గు తెచ్చుకొన్నా రనుకుందాము. అయితే దేవుడైన యెహోవాకూడ బట్టలు కట్టుకున్నాడో లేదో మనకు తెలియదు. ఆదామును అడుగు దామనుకున్నా మనకు ఆదాము అందుబాటులో లేడు. అయినా బైబిల్ గ్రంథ రచయితలు ఎంతో స్టోరీ దాచిపెట్టి పొడిపొడి వాక్యాలు వ్రాశారు. యీ విషయంలో ఏమి చేయాలని ఆలోచిస్తూ యుండగా K.G. క్లాస్ కొరకు వ్రాయబడిన బైబిల్ కథల పుస్తక మొకటి కనబడింది. "BRIJBASI ART PRINTERS Ltd"., NODIA వారు ప్రచురించగా దానిని పేరుగాంచిన క్రిష్టియన్ లిటరేచర్ సొసైటీ బుక్‌స్టాల్స్ వారు పంపిణీ చేస్తున్నారంటే విశ్వాసనీయమైన రచనేయని తలంచాను. ఆ చిత్రకారుడు యెహోవాను ఎలా ఊహించి వేశాడో లేక బైబిల్ మేధావులు సలహా ఇచ్చారో తెలియదు గాని చక్కని ధవళ వస్త్రాలు ధరించివున్నాడు. నిజంగా ఆ దేవుడు ఆదియందే చక్కగా వస్త్రాలు ధరించాడు కావచ్చు! కొంపదీసి ఒకవేళ్ల యెహోవా దేవుడు కూడ ఆ "మేళ్లూ కీళు తెలిపే" వృక్ష వలాలు తినగా సిగ్గముంచుకొచ్చిందేమో! వెంటనే బట్టకట్టుకున్నాడు కావచ్చు. అయితే తాను మాత్రం ఇంతటి నాగరిక దుస్తులు ధరించి మానవులకు మాత్రం అంతటి అనాగరిక చర్మపు దుస్తులు ఇచ్చాడంటే నమ్మబుద్ధి కావడంలేదు.



## ఆదాము - హవ్వల పాపానికి అసలు కారకులెవ్వరు?

దైవాజ్ఞను ధిక్కరించిన ఆదాము - హవ్వలు నిషిద్ధఫలాలను తినడమే కారణమని యెహోవా వారిని పాపాత్ములుగా తీర్పుతీర్చి, ఈ ఆది మానవుల కారణంగా యావత్ ప్రపంచాన్నే కాదు ముమ్మందు భూమిమీద కన్నులు తెరవబోయే యావత్ ప్రపంచ ప్రజలను సైతం భూమితోపాటు శాపాలకు గురిచేసినట్టు సృష్టి కథలో మనం వివరంగా తెలిసికొన్నాము.

నిష్పాక్షిక దృష్టితో మనమాలోచిస్తే అసలు పాప కారకులు స్త్రీ యా, పురుషుడా, వీరిని మాయమాటలతో పడవేసిన సర్పమా! లేక వెనుకనుండి కథ నడిపించిన అపవాదాయని చర్చిస్తే... వీరు నిజంగా పాపంలో పడిపోయారా? అని ప్రశ్నిస్తే ప్రతి ఒక్కరు ముక్తకంఠంతో దైవాజ్ఞను ధిక్కరించినది స్త్రీ మూర్తి యేనన చెబుతారు. ఆరేడు వేల సంవత్సరాల క్రితం మానవ సృష్టి జరిగిందని చెప్పే బైబిల్ నాటి నుండి నేటి వరకు స్త్రీయే పాపకారకురాలని క్రైస్తవ బోధకులు నిర్విరామంగా నిందిస్తూయున్నారు. మరి యొక మతం స్త్రీ నరక ద్వారమని చెబుతుంది.

కాని ఈ విషయంలో పై బోధకులు యెహోవా స్వయంగా పలికాడనే పలుకులను ఏ మాత్రం ఖాతరు చేయక పోవడము చిత్రమైన విషయము. మరొక్కసారి చూస్తే... అప్పుడు **దేవుడైన యెహోవా - ఇదిగో మంచి చెడ్డలను ఎరుగునట్లు "ఆదాము మనలో ఒకని వంటి వాడాయెను" అని చెప్పడం జరిగింది. కాబట్టి అతడు ఒకవేళ తన చేయిచాచి (ఈ సంగతి యెహోవాకు తెలియదు) జీవవృక్ష ఫలాలను కూడ తీసికొని తిని నిరంతరము జీవించునేమో!యని తోటలో నుండి వెళ్లగొట్టి జీవవృక్షమునకు పోవు మార్గమును కాచుటకు అటూ ఇటూ తిరుగుచున్న ఖడ్గ జ్వాలలను నిలువబెట్టెను** అని యుంది. యెహోవా ఇక్కడ తేటతెల్లమైన భాషలో మాట్లాడుతూ ఈ ఆది మానవులు ఆ "ఫలాలు" తిని మనలో ఒకని వంటి వారైపోయారని మాత్రమే బాధపడినట్టు కనబడుచున్నది. దీని బావమేమిటి? యెహోవా పరిశుద్ధుడు... ప్రేమా స్వరూపుడు రోషముగల దేవుడుగా చెప్పబడుచున్నాడు, వీరు సజ్జనులైపోయారు. యెహోవా వంటి వారైపోయారు. అంతేగాని పాపాత్ములు కాలేదు గదా! దైవ మనస్కులుగా మారిపోయారనే అక్కసుతోనే యెహోవా వారిపై "ఆజ్ఞాతిక్రమణ" నేరము మోపి పాపాత్ములుగా ముద్ర వేశాడు. ఇంతటి దైవ స్వరూపులైన ఆది దంపతులు పాపాత్ములై పోయారని చెత్త అర్థాలు తీస్తూ యెహోవాకు వత్తాసు పలుకుతుంది ఈ క్రైస్తవ

సామ్రాజ్యం. వీరు పాపులైతే - వీరు కూడ యెహోవా వంటి పాపులేనని అనుకోవాలా? తాము ఆ ఫలాలు తిని చిరంజీవులైన విధంగా జీవ వృక్ష ఫలాలు కూడ తిని వీరు కూడ బాగు పడిపోతారేమోననే భయంతోనే వారిని తన్నితరిమి వేయడం యెహోవా యంతటి వాడికి హుందాగాలేదు, ఇదెలా గుందంటే "మొగుడు కొట్టినందుకు కాదు - తోడికోడలు నవ్వినందుకన్నట్లుంది".

ఈ మానవ సృష్టి ఎంతో లోపభూయిష్టంగా చేయబడినట్టు కనబడుతుంది. మానవుని అజ్ఞానాంధకారం అలముకున్న పామరునిగా, ఇది మంచి అది చెడ్డ అనే విచక్షణా జ్ఞానం కూడలేని విధంగా చేయబడ్డాడని చెప్పుచున్నందున ఇట్టి అమాయక మానవుడు ఎవరేమి చెప్పినా నమ్మేస్థితిలో యుంటాడు. మోసము, పాపము అనే మాటలకే అర్థాలు తెలియవు. అట్టి పామరులను ఇంచుమించు యెహోవా యంతటి శక్తియుక్తులు గల అపవాది సర్పాకారంలో వచ్చి మోసగించుట అతి తేలిక. అసలు చావంటే ఏమిటో కూడ వారికి తెలియనే తెలియదు. ఇంతటి తెలివి తక్కువ మానవులను సృజించి వారికి ఏ విధమైన హెచ్చరిక చేయకుండ విడిచి పెట్టి వారు భ్రష్టులైపోయారని బాధపడుటలో అర్థములేదు.

ఇంజనీర్లు పదిటన్నుల కెపాసిటీ కలిగిన ఒక "క్రెయిన్"ను నిర్మించి దాని సహాయంతో 25 టన్నుల బరువును ఎత్త ప్రయత్నిస్తే ఆయంత్రం యొక్క నడుము విరిగి నాడు హుస్సేన్ సాగర్‌లో పడ్డ బుద్ధ విగ్రహం లాగ బోల్తా కొట్టవచ్చు. అది మానవ తప్పిదము. అదిగాకున్నా మానవులకు భవిష్యత్ సంఘటనలు ఏ మాత్రము తెలియవు. ఆ కారణంగా వారు చేసే పనుల్లో అనేక ఎదురు దెబ్బలు తింటూ యుంటారు. ఇంత బలహీన మనస్సుని ఎందుకు రూపొందించాడు? జలప్రళయానంతరము యెహోవా మాట్లాడుతు నరుల హృదయము బాల్యము నుండి కేవలము చెడ్డదని సెలవిచ్చారు. ఇక్కడ మనము చూడగా ఆదాము హవ్వలకు "బాల్యమ"నే దేలాగుంటాదో తెలియదు. వారు యుక్త వయస్కులుగా సృజించబడ్డారు. గనుక ఆ మాటలు వీరికి వర్తించవు. అపవాది ఆది దంపతులచే ఆ నిషిద్ధ ఫలాలు తినిపించాడు. గనుక నరుడు వివేకవంతుడెయ్యాడు లేకుంటే పశువుల వలె దిగంబరంగా చెట్టుపుట్టలమ్మట తిరిగేవాడేమో.

యెహోవా తలంచాలే గాని వివేకము గల మానవులుగా సృష్టించి యుండవచ్చును. ఆయన జాలి గుండెలను ఇవ్వగలడు కఠిన హృదయాలుగా మార్చగలడు కాని ఆది దంపతులను ఇంతటి బలహీన మనస్కులుగా చేసి వారిమీద నిందలు మోపడం తగదు. అందుచే ఆది దంపతులు చేశారని చెప్పే "పాపానికి" అసలు కారకుడు యెహోవాయే! ఈ సంగతి అలాగుంచి మరే ఇతర మతాలందు లేని విధంగా యూద మతమందు, మరీ ముఖ్యంగా ఈ క్రైస్తవ మతమందు పాపమనే మాట మన చుట్టూ తిరుగుతూయుంటాది.



మనం ప్రపంచంలోని ఏ దేశంలోనైనా క్రైస్తవ చర్చీలకు ప్రార్థనా సమావేశాలకు, ఇద్దరు ముగ్గురు కూడుకున్న కలయికల్లో కూడ పాపం! పాపం! అయ్యో పాపం! దేవా పాపం! పాపినైన నన్ను కరుణించండి! తండ్రీ యంటూనే పాపపంకిలంగానే, కనబడుతూ యుంటాయి! మనమింకా ప్రార్థనా మందిరంలో ప్రవేశించకముందే ఆలయం యొక్క గోడలన్నీ పాపంతో నిండిన "బంగారు వాక్యాలే" కనబడతాయి. ఈ విధంగా కాక ఇతర మతాల్లో "పుణ్యం" అనే పదం ఎక్కువగా కనబడతాది. ఆ కారణంగా వారికి వీరిలాగ, పాపపుటాలోచనలు రావేమో!

దీనికి మూలకారణం కూడా యెహోవా, యేసులే! అదేమంటే మానవ జన్మయే భయంకరపాపంతో ప్రారంభమయ్యిందని... తల్లిదండ్రుల కలయిక యే ఘోరాతి ఘోరమైన పాపమని వారి పాప పర్యవసానమే మనల్ని జన్మత పాపాత్ములుగా చేసిందని క్రైస్తవం ఘంటాపథంగా చెబుతుంది. ఇంతకంటే బుద్ధిలేని ప్రేలాపన ప్రపంచంలో మరొకటి లేదు. ఇది క్రైస్తవ మతం కల్పించిన అభూతకల్పన. ఒక్కసారి ఈ విషయం దీర్ఘంగా ఆలోచించి చూస్తే ప్రకృతిలో చీమలు, దోమలు, పురుగులు, పుట్రలు, కుక్కలు, నక్కలు, ఎలుకలు, యేనుగులు, గుర్రాలు, గాడుదలు, పశువులు, పక్షులనే తేడాలేకుండా ప్రకృతి సహజమైన ఈ "ఆడ-మగ"ల కలయిక సకల జీవులు, మానవులు అనే తేడా లేకుండ దైనందిన జీవనంలో మహదానందమైన లోకాల్లో విహారింపజేస్తూ అత్యంత ఆహ్లాదకరమైన మధురాను భూతికాగా! దీనిని పాపాల్లో కెల్ల ప్రథమ పాపంగా వర్ణించి క్రైస్తవలోకాన్ని అపరాధ భావనలో నెట్టివేయడం కన్నా దుర్మార్గమైన పాపం మరొకటిలేదు. ఇట్టి భావనల వల్లే అది పాపకార్యమనే భావనకు లోనుకావడం క్రైస్తవ కన్యల్లో కనబడతాది. ఒక రోమన్ కేథలిక్ సిస్టర్ బట్టలు విప్పకుండా స్నానం చేసేదట. ఎందుకని ఆమెను ప్రశ్నించగా అమ్మో! నాకు అసలే సిగ్గు ఎక్కువ. మనము కూర్చుండుట లేచుట అన్నీ దేవుడు చూస్తూయుంటాడని సమాధానమిచ్చిందట. ఇట్టి భావనల నుండి బయటపడినపుడే క్రైస్తవులు మోస్తున్నారని చెప్పే పాపభారం సగానికి సగం తగ్గిపోతాది. సోదర సోదరీ మణుల్లారా అంతా తేలికగా ఊపిరి పీల్చుకోండి! మనం ఈ విషయంలో ఎంత మాత్రం పాపాత్ములం కాదు. కానే కాదు!

సమయము సందర్భము వచ్చింది గనుక క్రైస్తవ మతంలో అతిభయంకరమైన పాపంగా వ్యభిచారమును గూర్చి చెబుతూయుంటారు. అసలు తల్లి గర్భమందు మనము జన్మించడమే మహాపాపంగా, తల్లిదండ్రులు పాపం చేయగా మనము జన్మించామని బైబిల్‌లో అనేక చోట్ల చెప్పబడింది. యేసు అయితే మరో అడుగు ముందుకు వేసి ఒక పురుషుడు స్త్రీని మోహపు చూపుతో చూస్తే చాలు - "ఆ స్త్రీతో వ్యభిచరించినట్లే"నని యేసు చెప్పుచుండగా

సాక్షాత్తూ యెహోవా యంతటి వాడే ఇట్టి వ్యభిచారాన్ని ప్రోత్సహించడమేమిటని బుర్రలు తిరిగి పోతాయి. ఈ విషయాలను గూర్చి అనేకసార్లు చెప్పుకున్నాము. అయినా మరి యొకసారి ఇక్కడ వినకతప్పదు.

పాపము విషయములో భయంకరుడైన యెహోవా తానే నియమించిన కట్టడలను (పది ఆజ్ఞలను) తానే ధిక్కరింపజేసినట్లు మనము చూచాము. అలనాడు అన్య జాతులతో యుద్ధాలు చేయించి ఆయా దేశాల అందమైన కన్యకలయిన స్త్రీలను మీ సుఖసంతోషాల కొరకు వాటాలు వేసికొమని ప్రోత్సహించడం గూర్చి ఎంతో వివరంగా చూచాము. రాజైన దావీదు ఒక్కసారి పరస్త్రీని ఆశించినందుకు యెహోవా బహుగా కోపపడి పైగా ఏమన్నాడో చూడండి... నీవు "ఊరియా" భార్యను ఎందుకు తెచ్చుకున్నావు? **నేను నీ యజమానియైన సౌలు రాజు స్త్రీలనందరిని నీ కౌగిట చేర్చలేదా? అవి చాలవని నీవనుకొనిన ఎడల నేను నీకు మరి యెక్కువగా ఇచ్చియుండే వాడిని కదా!** అన్నాడు... ఇవి ఒక "బ్రోకరు" మాటల్లాగున్నాయి. అలాగే అతని కుమారుడైన సొలోమోను రాజుకు 969 మంది భార్యలు... 300 మంది ఉపపత్నులు.. మరెంతోమంది అన్యులైన రాజకుమార్తెలను ఉంచుకున్నా యెహోవా అతనిని పల్లెత్తుమాట అనలేదు. చివరకు సొలోమోను యెహోవాను ధిక్కరించినా సొలోమానును బ్రతిమాలాడాడే తప్ప ఏ శిక్ష విధించలేదు. అయినప్పటికి క్రైస్తవ విశ్వాసులు "దైవజ్ఞానియైన" సొలోమోనును నేటికీ నెత్తికెక్కించుకుంటారు. ఈ విధంగా బైబిల్‌లో చెప్పబడిన అధ్యాయాలకు అధ్యాయాలను గూర్చి నేటి ప్రసంగికులెవ్వరూ నోరు విప్పరు. సగటు క్రైస్తవులు ఇట్టి రాతలు చదివినా మాట్లాడరు. వీరి మౌనం అర్ధాంగీకారం అనుకోవాలా?

ఇట్టి దుర్మార్గమయిన ఆ దేశాలపై నోరు విప్పని క్రైస్తవ మేధావుల్లారా! ప్రియక్రైస్తవ స్త్రీ విశ్వాసుల్లారా మీరెప్పుడైనా ఆలోచించారా? ఇట్టి వాక్యాలు బైబిల్‌లో వున్నాయి గదా! యని అట్టి కార్యాలు మీ ఇంట్లో జరగడానికి సమ్మతిస్తారా! నాటి అనాగరిక పురుషాధిక్య ప్రపంచం ఇట్టి చండశాసనాలను వ్యభిచారంతో పాటు సకల దుర్నీతికి కారుణమైన మద్యపాన వ్యసనాకి (బైబిల్ ముద్దుపేరు "ద్రాక్షారసము") దీన్ని సర్వమత గ్రంథాలు ప్రోత్సహించాయి. యేసు తాను దేవుడనని రుజువు చేయుటకు ప్రప్రథమంగా చేసిన అద్భుతం "నీళ్లను ద్రాక్షసారాయిగా చేయుట" ఆదర్శప్రాయంగా వుండవలసిన యేసు క్రీస్తు కూడ దీనిని సేవించాడు. నాటి అనాగరిక దుర్వ్యసనాలను దైవాదేశాలుగా వ్రాసుకొన్నారు. ఇట్టి ఆదేశాలు నేటి నాగరిక సమాజానికి, అవసరమా? వ్యభిచారాన్ని ప్రోత్సహించే వాక్యాలను కాలదోషం పట్టిన పనికిమాలిన రాతలను ప్రశాంత చిత్తులుగా జీవిస్తున్న క్రైస్తవ సోదరులకు ఈ పునశ్చరణలు చేయడమెందుకు?



**బైబిల్‌ను పరిశీలించగా మన తరువాత ప్రపంచంలో అడుగిడనున్న సుపీరియర్ బుద్ధి జీవులకు కూడ ఇట్టి బైబిల్ రాతలు అవసరమా అనిపించక మానదు. ఇంచుమించు ప్రముఖ మతాలన్నింటిలోను ఇట్టి వ్యభిచార ప్రోత్సాహకాలు కనబడుతూవుంటాయి. ఇట్టి మత గ్రంథాల దుష్ట ప్రచారం అవసరమా? ఇట్టి సాహిత్యంపై ప్రభుత్వాలు నిషేధం విధిస్తే ఎలాగుంటాది. మన రాజధాని ఢిల్లీలో జరిగిన "నిర్భయ" వుందంతాల వంటివి కొంత తగ్గుముఖము పట్టవచ్చునేమో! నిర్భయ హంతకులకు మరణ శిక్ష విధించినంత మాత్రాన ఇట్టి వాటికి పరిష్కారం చూపగలుగుతాయా? అంటే అనుమానమే! మహిళలపై జరిగే అత్యాచారాలకు విరుగుడుగా మరణశిక్షలు పరిష్కారం కాబోదని మరణ దండనల కంటే సంస్కరణలే అవసరమని "అమ్నెస్టీ ఇంటర్ నేషనల్ సంస్థ" (అంతర్జాతీయ మానవ హక్కుల పరిరక్షణ సమితి) కూడా అభిప్రాయపడినది. ఇట్టి అంశాలపై ప్రభుత్వాలు నిషేధం విధిస్తాదనేది కలలోని మాట! కనీసం ఈ విషయాన్ని ఉన్నత న్యాయస్థానమైనా తీవ్రంగా ఆలోచించి దీనిని "సుమోటో"గా స్వీకరిస్తే అంతకన్నా కావలసింది ఏమీ లేదు. ఈ చర్యపై వ్యతిరేకత ఎంతమాత్రమూ రాదు. గతంలో మనము మత సంబంధమైన నరబలులను, జంతుబలులను సతీసహగమన దురాచాన్ని నిషేధించలేదా? ఇట్టి సాహసోపేతమయిన ఈ ప్రతిపాదనలను ఎవరూ మత ద్వేషంగా భావించకూడదు. ప్రతీ ఒక్కరు దీన్ని గూర్చి నిశితంగా ఆలోచించి దానిపై సుదీర్ఘ చర్చలు జరపవలసిందిగా మనవి చేయుచున్నాను.**

కొసమెరుపు

కాని ఈనా ఆలోచనలు, భావజాలం అన్నీ కూడ అడియాశలే. నేడు పాశ్చాత్య దేశాలు, యూరోపియన్ కంట్రీస్ అన్నీ అనేక విధాల అభివృద్ధి పథంలో నడుస్తున్నాయను కొను చుండంగా క్రైస్తవ దేశంగా భావించే "స్విట్జర్‌ల్యాండ్" దేశం ఏకంగా వ్యభిచారాన్ని చట్టబద్ధం చేసిందట. ఇట్టి వ్యభిచార కేంద్రాను ఆయా పార్కుల్లో ఏర్పాటుచేసి చట్ట సమ్మతంగావించిందట.



శృంగార గదులు' (సెక్స్ బాక్సు)గా వ్యవహరించే చెక్కతో తయారు చేసిన ఈ గదులను స్విట్జర్లాండ్‌లోని జ్యూరిచ్‌లోని సిటీ పార్కుల్లో ఏర్పాటు చేశారు. సుమారు రూ.12 కోట్ల (20 మిలియన్ అమెరికా డాలర్ల) వ్యయంతో వీటిని వ్యభిచారుల కోసం నిర్మించారు. సోమవారం అధికారికంగా ప్రారంభించారు. నిజానికి స్విట్జర్లాండ్‌లో వ్యభిచారం చట్టబద్ధమే. అయితే జ్యూరిచ్‌లోని కొన్ని ప్రాంతాల్లో వ్యభిచారం నిషిద్ధం. ఈ నేపథ్యంలో ఆయా ప్రాంతాల్లోని వ్యభిచార వ్యవహారాలు ఈ కొత్త ప్రాంతానికి తరలించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ క్రమంలో అన్ని సౌకర్యాలతో మెరుగుపరిచిన భద్రత, పరిశుభ్రతలతో కూడిన ఈ శృంగార గదులను ప్రయోగాత్మకంగా ఏర్పాటు చేసింది.

ఈనాడు సౌజన్యంతో 27 ఆగస్టు, 2013

నెల్సన్ రక్షే

## సైన్సు అంతా మా బైబిల్‌లోనే ఉంది


Prof. T. Nirmala Mary

సైన్సు అంతా మా బైబిల్ నందే వ్రాయబడి యుంది అన్నట్లే తదితర మతాల వాళ్లు కూడ మా వేదాల్లోనే అంతా వుందని చెప్పేమాటలు మనము తరచుగా వింటూయుంటా ము. ఇట్టి వారు తాము ఏమి చెప్పినా ఎటువంటి అర్థాలు తీసినా క్రైస్తవులు అదేమిటని ఎలాగని ప్రశ్నించరనే ధిమాతో అనేకులు ఈ విధంగా ప్రచారం చేస్తూయుంటారు. **ఇట్టి "విశ్వాసులకు" చెప్పింది నమ్మటం, విన్నది-విశ్వసించటం బాగా అలవాటు.**

యావత్ బైబిలు పరిశుద్ధ గ్రంథమని, ఇది యెహోవా దివ్య వాక్కులని బల్లగుద్ది చెబుతారు. ఇట్టి బోధనలన్నీ బాల్యం నుండి వంట బట్టించుకున్న క్రైస్తవ సమాజాలకు మతాంథకారమనే మబ్బుతెరలు కమ్మి ఇవన్నీ యథార్థాలేయని నమ్ముతూ యుంటారు. ఈ విధంగా పామర జనాగం నమ్మడంలో కొంత అర్థముంది.




ఈ కోవకే చెందిన వారిలో అగ్రగణ్యురాలు - శ్రీమతి నిర్మలమేరి, ఆచార్య నాగార్జున యూనివర్సిటీ మాజీ ప్రిన్సిపాల్ అయిన సత్ క్రైస్తవ భక్తురాలు. మనము సాధారణంగా



విద్యాధికులు అంటే B.A., M.A., B.Sc., B.Com., వంటి డిగ్రీలు చదివిన వారేననుకుంటాము. కాని ఇప్పుడు మనము చెప్పుకొనే వీరు అత్యున్నత విద్యావంతులు. వీరు చదివిన డిగ్రీలు, పదవులు మచ్చుకు కొన్ని... M.Sc., Ph.D., P.G.C.C.S., F.B.S., F.A.P.A., F.S.C.G, D.N.A., ప్రొఫెసర్ ఆఫ్ బోటనీ, డీన్ ఆఫ్ నేచురల్ సైన్స్, ఎగ్జిక్యూటివ్ మెంబర్ ఆఫ్ "ANU", కో-ఆర్డినేటర్ ఆఫ్ డిస్టెంటెన్స్ ఎడ్యుకేషన్ ఇన్ భోటనీ, ఎగ్జిక్యూటివ్ మెంబర్ ఆఫ్ ఆంధ్రప్రదేశ్ ఎకాడమీ ఆఫ్ సైన్సెస్, హైద్రాబాద్... 80 కి పైగా తన పరిశోధనలను జాతీయ అంతర్జాతీయ స్థాయిల్లో ప్రచురించిన బహుముఖ మేధావి అనేక పాఠ్య గ్రంథాల రచయిత, దేశీయంగాను అంతర్జాతీయం గాను అమెరికా, ఇంగ్లండ్ వంటి దేశాల్లో అనేక శాస్త్రీయ సదస్సుల్లో పాల్గొని మన్ననలందుకొన్న మహోన్నత విద్యాధికురాలు, సైంటిస్ట్ అయిన శ్రీమతి నిర్మలమేరి గారు నాటి గౌరవ ముఖ్యమంత్రి వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి తదితర శాస్త్రవేత్తలతో సన్మానించబడ్డారు. సైన్స్ అంతా బైబిల్‌నందే నిక్షిప్తమై యుందని నిరూపించుటకు గాను ఈ ప్రక్కన చుపబడిన "టైటిల్"తో వ్రాశారు. వీరీ పుస్తకంలో డొంక తిరుగుడు అర్థాలతో వాటికి మతం ముసుగు కప్పి సైన్సును అపహాస్యం చేసే రీతిలో వీరు వినిపించిన వాదన యందలి మరికొన్ని అంశాలను మనమిక్కడ చూద్దాము.

> ***భూమి గుండ్రంగా వుందని క్రీస్తుపూర్వం అయిదారువేల సంవత్సరాల క్రితమే బైబిల్ ప్రవక్తయైన (యెషయా 4:22)లో ఉదహరించారు. (యెహోవా) "ఆయన భూమండలము మీద ఆశీనుడైయున్నాడు". అని వున్నది గనుక... "భూమండలము" అనగా గోళాకారముగా వుందని అర్థమని. ఇది బైబిల్‌లో చెప్పబడిన "సైన్సు"గా సమర్థించ ప్రయత్నించారు.***

నిజానికి బైబిల్‌లో ఎక్కడా భూమి గుండ్రంగా వుందని లేదు. మనము బైబిల్‌ను తరచిచూడగా భూమి బల్లపరుపుగాను... నీళ్ల మీద పరచియున్నట్లును, సముద్ర గర్భంలో దానికి పునాదులు వేయబడి స్తంభాలపై నిలచియున్నదని చెప్పబడింది. భూమి మీదనే సముద్రము వున్నదనే విషయము బైబిల్ రచయితలకు తెలియదు. అంటే సృష్టికర్తగా చెప్పుకుంటున్న యెహోవాకే తెలియదన్నమాట. ఆ రచయిత చెప్పేదే నిజమయితే! అలనాడు మధ్య యుగాల్లో భూమి గుండ్రంగా ఉన్నదని, తన చుట్టూ తాను తిరుగుచూ సూర్యుని చుట్టూ ప్రదక్షణాలు చేస్తుందని ప్రకటించి శాస్త్రవేత్తలను మధ్యయుగాల్లో మతాధిపతులు దారుణంగా సజీవ దహనాలు చేసి యుండేవారు కాదు. ఈ వివరాలు "ఇది నిజమా" ప్రథమ భాగంలో కూడ చర్చించాము.

యెషయా గ్రంథంలోను యోబు గ్రంథంలోను మనకు "భూమండలము, భూగోళము" అనే పదాలు కనబడతాయి. ఇక్కడ నిర్మలమేరీ వంటి శాస్త్రవేత్తలు గమనించవలసిన దేమిటంటే ఆదిమగ్రీకు, హిబ్రూ, అరమేయిక్ భాషల్లో వ్రాయబడిన బైబిల్ మూల ప్రతుల్లో ఎక్కడ వెదకినా భూగోళము, భూమండలము అనే పదాలు మనకు కనబడవు.

బైబిల్ 600 సంవత్సరాల క్రితము ఇంగ్లీషులోనికి తర్జుమా అయ్యింది. అనంతరం సుమారు 430 సంవత్సరాలకు అది తెలుగులోనికి తుర్జుమాచేయబడింది. 1820-1825 ప్రాంతాల్లో తెలుగు బైబిల్ వచ్చింది. ఆ సమయానికే భూగోళశాస్త్రము, స్కూళ్లలో "గ్లోబు"లు అందుబాటులోకి రావడమే గాక తెలుగు నిఘంటువులందు కూడా భూమికి బదులుగా భూగోళము అని మార్పు చేయబడింది. ఆ కారణంగా తెలుగు నిఘంటువులోని అర్థాన్ని తెలుగు బైబిల్‌లోకి తీసికొనడం జరిగింది. ఇంగ్లీషు బైబిల్‌నందు THE EARTH అని, మళయాళ బైబిల్‌నందు "భూముగం" అని, తమిళ బైబిల్‌నందు "ఉలకత్తిన్", రోమన్ కేథలిక్ బైబిల్‌నందు "నేల"అని వ్రాయబడింది. ఒక్క తెలుగు బైబిల్‌నందే భూగోళము, భూమండలము అని వుంది. ఇంతటి మేధావియైన నిర్మల మేరిగార్కి ఈ చరిత్ర తెలియక ఇదంతా బైబిల్‌లోనే యున్నట్టు భ్రమపడ్డారు. అయితే ఈ సైన్సు ప్రొఫెసర్ అమ్మగారు గుంటూరు మండలంలో వుంటున్నారని చెప్పబడినంత మాత్రాన గుంటూరు మండలం గుండ్రంగా వుండదు కదా! పాపం ఈ రచయిత్రి పొరబడ్డారు. కాని ఈ పొరబాటు అనేక క్రైస్తవ సమాజాలను బలంగా నమ్మించే అవకాశం ఉంది.

**రెండవదిగా వీరి పుస్తకం పేజీ నెంబర్ 23 లో నేటి ఆధునిక వైద్యులు ఏదయినా శస్త్రచికిత్స చేసే సందర్భంలో "ఎనస్తిటీషియా" ద్వారాను, "క్లోరోఫారం" ద్వారాను మనిషిని గాఢ నిద్రలాంటి స్థితిలోనికి తీసికొని వెళ్తారు. ఆదాము ప్రక్క టెముకతో స్త్రీనిగా రూపొందించుటకు యెహెూవా గాఢనిద్ర కలుగ జేసిన విధానాన్ని చూచి "సింసన్" క్లోరోఫారంను కనుగొనియుండవచ్చునని తేటయైన భాషలో కాకుండ నిగూఢమైన రీతిలో వివరించారు. గనుక ఈ "సైన్సు" బైబిల్‌లో నుండి వచ్చినదే అన్నారు.**

బైబిల్‌లో మరో "సైన్సు పాఠం" వుందని ఒక పచ్చి అబద్ధాన్ని వీరు చిన్నగా చెప్పుకొచ్చారు. (యోహాను 2:6) ప్రకారము ఈ క్రింది వాక్యాన్ని (పేజీ.నెం. 67లో) ఉదహరిస్తూ: "యూదుల శుద్ధీకరణాచారము" ప్రకారము రెండేసి తూముల (నీరు) పట్టు ఆరు రాతిబానలు అక్కడ వుండెను. యేసు ఆబానలను నీళ్లతో నింపుడని వారితో చెప్పగా వాటిని వారు అంచుల వరకు నింపిరి. అని మాత్రమే వుంది. అయితే పై వాక్యానికి ఈ బైబిల్ సైంటిస్ట్ మేడం గారు దారుణమైన అబద్ధమును కల్పించి పై వాక్యములో "శుద్ధీకరణ" అని వున్నందున దాని అర్థం- మనము భోజనము చేసేముందు మనకాళ్లను చేతులను పరిశుభ్రంగా కడుగుకొని భోజనము చేయాలని, ఎన్నో కంటికి కనబడని బ్యాక్టీరియా క్రిములుల బారిన మనము పడకుండ ఈ వ్యాధుల నుండి మనము రక్షించబడుటకు ఈ "శుద్ధీకరణ" మనల్ని కాపాడుతుందని నాటి అనాగరిక బైబిల్ వ్యాఖ్యలకు ఆధునిక పరిశోధనా ఫలమైన బ్యాక్టీరియాకు లింకు పెట్టి ఆహా! చూడండి! "సైన్సు"ను మా బైబిల్ ఎంత చక్కగా వివరించిందొహొ! అని సమయము సందర్భము లేని విధంగా క్రైస్తవ అమాయక సోదరులను మరింత మౌఢ్యంలోనికి దించ ప్రయత్నించడం విచారకరం.





**అసలు పై ఆరు రాతిబానలకు సంబంధించిన "అద్భుత కథ" ఏమిటో కూడ చదవరులు తెలుసుకుంటే మంచిది. అన్ని దుర్మార్గాలకు, దుష్టత్వాలకు, మూలకారణమైన "ద్రాక్షసారాయిని", యేసు ఆ ఆరు రాతిబానల్లో నింపిన నీటిని తన మహిమతో "సారా"గా మార్చి అందరితోను పూటుగా త్రాగించాడట. ఇది నిజంగా పాపుల రక్షకుడనని చెప్పుకున్న యేసు చేయవలసిన పనిఏనా ఇది ఈ త్రాగుడు వలన ఎన్ని సంసారాలు కూలిపోతాయి? ఎందరి వూపిరి తిత్తులు చిల్లులు పడిపోతాయి! ఈ సంగతులు యేసుకు తెలియవా? ఆయనే పెద్ద త్రాగుబోతు అయినప్పుడు ఆయన ఇవన్నీ ఆలోచించడు కదా!**

ఇక్కడ మేడం గారు చెప్పిన "బ్యాక్టీరియా" వంటి రోగకారక క్రిములను గూర్చి యేసయ్యకు నామమాత్రంగానైనా తెలియదు యేసు ఒక సందర్భంలో ఆయన శిష్యులు చేతులు శుభ్రపరచుకోకుండా భోజనము చేయడమేమిటని! "శాస్త్రులు, పరిశయ్యులు" విమర్శించిన సందర్భంలో యేసు బదులిస్తూ.. ఈ మాత్రం మీకు తెలియదా? బయటి నుండి కడుపులోకి పోయేదంతా పవిత్రమైన దేనని లోపలి నుండి బయటకు వచ్చేదే అపవిత్రమైనదని చెత్త నీతి సూత్రాలు బోధించాడు. ఇక్కడ "యూదుల శుద్ధీకరణా చారము" అనే పదంలో వీరికి సైన్సు గోచరించరించింది. శుద్ధీకరణ అనగానే వీరికి బ్యాక్టీరియా గుర్తుకొచ్చింది. ఏ ఆధారంగా వీరు పై విధంగా మాట్లాడారు? ఇది వీరి శిష్య పరమాణువుల దురదృష్టం అనుకోవలసి వస్తుంది. క్రైస్తవులు మాత్రం ఎటువంటి అభ్యంతరము చెప్పరు.

అనంతరం వీరి పుస్తకంలో భూమి మీద పాపం పండిపోయిందని యెహెూవా దేవుడికి వళ్ళు మండిపోయింది! యెహెూవా దేవుడు యావత్ ప్రపంచమందలి వృద్ధులను, యవనస్థులను, ముక్కుపచ్చలారని పసిపిల్లలను, ఇంకా కనులు తెరవని గర్భంలోని పసిగృడ్లనేకాక యావత్ ప్రపంచ మందలి సమస్త జంతు జాలాన్ని సమస్త ప్రాణకోటిని జలప్రళయంలో ముంచి చంపదలచాడు. ఈ సందర్భంలో దేవుడు ఒక సైన్సు సంగతి ఆలోచించాడట! దేవుడుగారు సకల మానవులు, సమస్త జీవజాలం అంతరించిపోతే ఇక భూమిమీద మిగిలేదేముంది? గనుక యెహెూవా ఒక నౌకను చేయించి అందు మానవ కుటుంబాన్ని, ఆయా జాతుల వంశపుచిహ్నాలు సజీవంగా వుండాలనే సదుద్దేశంతో అన్ని జీవజాతులను యెహెూవా ఆ ఓడలో రక్షించాడని ఇది లోకానికి సైన్సు విజ్ఞానపు రుజువు కాదా? అదే! "GENE POOL CONSERVATION OF PLANT ANIMAL AND HUMAN BEING" ఇదియొక గొప్ప సైన్స్ సత్యం కాదా! భూమి మీద అంతరించిపోయే జీవజాతులను రక్షించడానికి నేటిమానవుడు ఏ విజ్ఞాన శాస్త్రీయ పద్ధతులను (METHODS OF CONSERVATION TISSUE CULTURE) అవలంభిస్తున్నాడో అలాగే దేవుడు కూడ సమస్త జీవాన్ని పదిలపరచుటకు తనదైన దైవజ్ఞానపు గవినిని మనకు పై చర్య ద్వారా సాక్షాత్కరింప జేశాడని బైబిల్‌లో నిక్షిప్తమై యున్న ఈ మహెూన్నత దైవజ్ఞానాన్ని తెగపొగిడేశారు. కరుణా కటాక్షాలు గల తండ్రి యావత్ విశ్వ సృష్టికర్తగా చెప్పుకునే యెహెూవా దేవుడు తాను సృజించానని చెప్పే సర్వప్రపంచాన్ని

నిర్దాక్షిణ్యంగా చంపిపారేస్తూ ఒక ఉన్మాదిలా ప్రవర్తిస్తూ చేసిన అత్యంత కిరాతరకమైన అనాలోచితమైన క్రూర నిర్ణయంలో మీకు గొప్ప సైన్సు విజ్ఞానం గోచరించిందా? తల్లీ! ఇదొక దైవజ్ఞాన గవిని అని ప్రశంసించారు. మీ జ్ఞాన సంపదను చూచి గొళ్లుమని ఏడవాలనిపిస్తుంది.

ఈ జలప్రళయ కథాంశం గూర్చి మరొక్కసారి కాస్త మానవత్వంలో ఆలోచించి చూడండి! ఈ విధంగా మానవాళిని సకల జీవప్రపంచాన్ని అర్ధమత్రంగా చంపిపారేస్తే అనంతరం నీతివంతమైన ఉత్తమ ప్రపంచాన్ని సృష్టించవచ్చుననుకున్నాడా? తర్వాత ఈ చర్యకు సత్ఫలితమేమన్నా కనబడిందా! నీతివంతమైన మరో ప్రపంచం వెలసిందా? లేదే? తాను నీతిమంతుడని మెచ్చుకున్న నోవహు ఓడ నుండి బయటపడ్డాక ద్రాక్ష సారాయి తప్ప త్రాగి గుడ్డల్లేకుండా కనిపించాడట? తిరిగి మరింత దుష్టప్రపంచం తయారైనట్టు బైబిలే చెబుతుంది కదా! రేపు ఏమి జరగనుందో యెహోవా దేవునికి తెలియదా? అసలు భూమి మీద ఈ మనష్యులను ఎందుకు చేశానురా! యంటూ గుండె నొప్పి తెచ్చుకున్నాడా? ఈయన సర్వజ్ఞుడైన మహోన్నత దేవుడుగా మీకు గోచరించాడా? ఇట్టి దేవునిలో దాగియున్న సైన్సు పరిజ్ఞానానికి తన్మయత్వం చెందారా? ఇది ఎంతటి దయనీయం?

"ఈ జలప్రళయం" ఓడ యొక్క "సైంటిఫిక్" టెక్నాలజీ ఎంత అద్భుతంగా వుంది తండ్రీ! ఇది ప్రపంచ "మెరైన్ టెక్నాలజీకి" ఈ జలప్రళయ ఓడ ద్వారా అంకురార్పణ జరిగిందని సంబరపడిపోతూ ఆ ఓడను చితిసారపు చెక్కలతో చేయించాలని అది 300 మూరల పొడవు, 50 మూరల వెడల్పు, 30 మూరల ఎత్తు కలిగి వుండాలని దేవుడు దాని నమూనా "ప్లాన్"ను నోవహకు చెప్పాడని... ఈ నిర్మాణ కొలతలను గూర్చి షిఫ్‌యార్డ్ అధికారులు "ఇది ఎంతో యోగ్యమైన ప్లాన్ అంటూ తెగమెచ్చుకున్నారట".



అయితే ఆ జలప్రళయ నాటు పడవ నమూనాను గూర్చి ప్రశంసించిన ఆ షిఫ్‌యార్డ్ వారు హిందుస్తాన్ షిఫ్‌యార్డ్ (ఇండియా) వారా? లేక భారీ ఆయిల్ ట్యాంకర్స్ నిర్మాతలైన జపాన్‌కు చెందిన "మిట్సుబిషీ కంపెనీ వారో? మరి ఎవరో? వీరు పేర్కొనలేదు. దయయుంచి ఆ విషయము నాకు ఫోన్ చేయండి. ప్లీజ్!

దీనినిబట్టి ప్రపంచమందలి నేటి మెరైన్ టెక్నాలజీకి ఇది ప్రేరణ కాదా! ఇది మనదేవుని యొక్క తలంపే కదా! బైబిల్‌లో ఇట్టి సైన్సును గుర్తించడానికి ఇంతకన్నా మారే రుజువులు కావాలి? అంటూ పేజీ.నెం. 32లో నోరు పారేసుకున్నారు. ఇలా ఎక్కడెక్కడో దాగియున్న సైన్సును త్రవ్వి వెలికి తీశారు.

మనమంతా సైంటిస్టులము కాకపోవచ్చు. ఓడలను విమానాలను నిర్మించలేకపోవచ్చు.



అయితే మనకు కామన్‌సెన్స్ అనబడే కనీస ఆలోచనతో మనము ఆలోచిస్తే.. ముప్పది మూరలు ఎత్తున్న ఓడను మూడంతస్తులుగా విభజిస్తే మధ్యలో దూలాలు చెక్కకూర్పుపోను ఏడెనిమిది అడుగుల ఎత్తు మాత్రమే ఒక్కో అంతస్తు ఉండవచ్చు. అందు ఒంటెలు, జిరాఫీలు, ఏనుగుల వంటివి నిలబడగలవా? అసలు ఓ అంతస్తు నుండి మరొక అంతస్తుకు వెళ్లుటకు మెట్లయినాలేవే! ఆయా జంతువులకు గడ్డిగాదర వేయడమెలాగ? ఆ వాడలో ఆ జంతు జాలానికి అందలి మానవ కుటుంబానికి సుమారు 9 నెలకు సరిపడా నీళ్ల ట్యాంకర్ ఆమర్చిన జాడ లేదు. జలప్రళయం ఇంకా ప్రారంభం కాకముందే నోవహ కుటుంబంతో పాటు సకల జీవరాసులను, వాటికి ఆహార పదార్థాలను నింపిన తరువాత యెహోవా దానికున్న ఒకే ఒక్క తలుపును, ఒక్క కిటికిని మూసివేసి సీలు వేశాడట. ఇందు టన్నుల కొద్దీ బరువు పట్టివుంటారా? దాని "కెపాసిటీ" ఎన్ని టన్నులు? ఆ విధంగా ఆ ఓడల్లో ఈ నరులు జంతుజాలం, పక్షిజాతులు సుమారు తొమ్మిది నెలలు జీవించాయట. ఇందు సత్యముందా? ఈ విధంగా మూయబడిన సారాపీపా లాంటి ఓడలో ప్రాణవాయువు లేకుండ అంతకాలం జీవించగలరా? ప్రాణ వాయువులేనందున వంటావార్పులు చేయడం సాధ్యమేనా? పొయ్యి మండుతాదా? పైగా సమస్త జీవుల యొక్క మలమూత్రాదులు నెలల తరబడి ఆ ఓడలో మురిగిపోతూ యుండగా గాలి చొరబడని ఆ ఓడలో మానవులతో పాటు అవి జీవింప సాధ్యమేనా? అందునా ఆ ఓడకు చుక్కాని కూడలేదు. చెక్కతో చేయబడిన ఆ చెక్క ఓడ యొక్క "టెక్నాలజీ" ప్రపంచ మెరైన్ టెక్నాలజీకి మార్గదర్శకమయ్యిందని ఆమేధావి అమ్మ "కితాబు" నీయడం ఆమె అజ్ఞానం. కృపా సముద్రుడుగా కీర్తించబడే యెహోవా సాగించిన ఈ క్రూర భయంకర చర్యలో నుండి సైన్సు ఆవిష్కరణలను వెలికి తీయ ప్రయత్నించడం సబబు కాదు. ప్రపంచ మానవులు పాపాత్ములయ్యారని బోనులోని ఎలుకలను నీట ముంచి చంపినట్లు ఇంతటి క్రూరుడైన దేవుడు గార్ని ప్రశంసలతో ముంచెత్తడం ఏమీ బాగులేదు. ప్రజలు పాపాత్ములైయ్యారని సమస్త ప్రాణకోటిని చంపడంలో ఆయన ఉద్దేశమేమిటో మానవత్వమున్న మానవులెవరు సమాధానం చెప్పలేరు. దేవుడినైనా అడుగదామంటే ఆయన కనపడి చావడు చ.చ. అదేంమాటలు? నోరు కాస్త కుదురుగా ఉంచుకోవయ్యా!

ఇవన్నీ సమంజసమైన విమర్శలు కావని మీకు తెలిసినప్పటికి మతప్రచారము మీదనున్న ఆసక్తితో ఇలా అబద్ధ ప్రచారాలు చేయడం జరిగించినప్పటికి క్రైస్తవ విశ్వాసుల నుండి ఎటువంటి అభ్యంతరాలు రావు. అబద్ధికులంతా నరకాగ్ని గుండంలో పడిపోతారని బైబిల్ ఘోషిస్తున్నప్పటికి మీకు భయములేకపోవడానికి ఒక కారణముందనుకుంటున్నాను. అదేమంటే మీరు బైబిల్ మిషన్‌కు చెందినవారు కదా. ముంగమూరి దేవదాసయ్యగారి బైబిల్ మిషిన్ సిద్ధాంత ప్రకారం నరకంలో కూడ సువార్త వుంటాదని చెబుతారు కదా! అప్పుడు మరల మారుమనస్సు పొందే వెసులు బాటు వుంటాదేమో! అని అనుకున్నారా. అమ్మాతల్లీ మీ కోతలపై నా రాతలను సద్విమర్శలగా స్వీకరించండి. నేను యెహోవాను ఎడాపెడా విమర్శించినా ఆయన ఏమీ అనలేదు. "Take it Easy". ●

నెల్సన్ రశ్మీ

## దైవ విశ్వాసం అత్యంత బలీయమైనది. అది కఠిన శిలకన్నా దృఢమైనది!

ఏమత గ్రంథాలకు చెందినవారైనా సరే తమ తమ మతగ్రంథాలు చెప్పిందే అక్షరాల నిజమని ప్రగాఢంగా నమ్ముతూ యుంటారు. అది ఎంతటి అసంభవమైనదైనా, కల్పిత గాథయైనా వారి దృష్టిలో అక్షర సత్యం. ఆయా అద్భుతాలను తాముకళ్లారా చూచినంత ధీమాతో చెప్పడం పరిపాటి.

ఈ విషయంలో న్యాయశాస్త్ర కోవిదులైనా, తర్కవాదంలో ఆరితేరిన లాయర్లైనా, డాక్టర్లు, ఇంజనీర్లు, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు, సకల సైన్సు తదితర రంగాలందలి శాస్త్రవేత్తలు, సమస్త విద్యారంగ ప్రముఖులు, పండితులు, రాజకీయ నాయకులు, మరి ముఖ్యంగా అంతరిక్ష పరిశోధనా సంస్థల అధిపతులు, విమర్శకులు, సంఘసేవకులు సామాన్యమానవులు చివరకు బిచ్చగాళ్లనే తేడాలేకుండా తమతమ దైవ విశ్వాసాలే యధార్థమైనవని, తమ దేవుడే యధార్థమైన వాడని నిస్సందేహంగా నమ్ముతూ, ఇతరులను నమ్మించ ప్రయత్నిస్తూ యుంటారు.

ఉదాహరణకు క్రైస్తవ విశ్వాసులు నమ్మే అనేక అంధ విశ్వాసాలు, అసంభవ అద్భుతాలు, వాగ్దానాలు అదంతా ఎందుకు ఒక్క మాటలో చెప్పాలంటే బైబిల్‌నందు వ్రాయబడిన ప్రతీవచనం బంగారు వాక్యాలుగా విశ్వసిస్తారు. దానికి తిరుగులేదు. నాలుగు రోజుల క్రితము చనిపోయి భూస్థాపితం చేయబడిన లాజరును యేసు తన మాటతో బ్రతికించాడని... పుట్టుగ్రుడ్డి వాడిని నేలమట్టి మీద ఉమ్మివేసి కలగా పులగం చేసి ఆ బురదను వ్రాయగా వానికి చూపువచ్చిందని.. అయిదు రొట్టెలను రెండు చిన్న చేపలను అయిదు వేలమందికి పంచగా వారంతా తిని తృప్తి పొందిన తర్వాత ఇంకా పండ్రెండు గంపలు మిగిలిపోయాయని.. నీళ్లను ద్రాక్షారసంగా మార్చాడని, కుంటివారు, కుష్టురోగులు అంగవికలులు మాట సెలవిచ్చినంతనే బాగుపడ్డారని... నీళ్లమీద నడిచారని... ప్రార్థనల ద్వారా చెరసాలలో కాళ్లకు "బొండాలు" బిగించి చేతులకు వేసిన సంకెళ్లు భూకంపం వచ్చి ఉడిపోయాయని (వాటికి బిగించిన తాళం కప్పలు ఎలా తెరచుకున్నాయో తెలియదు) ఒక ప్రవక్త ఒక పేద విధవరాలి ఇంటనున్న కొద్దిపాటి పిండి, బుడ్డిలోనున్న నూనె నెలల తరబడి అయిపోకుండా ఊరించాడని మరో ప్రవక్త తన కర్రతో బండను బాధగా నీళ్లు ఉబికి వచ్చాయని, తన కర్రను సముద్రము



మీద చాపగా అది రెండు పాయలుగా విడిపోయి మధ్యలో రహదారి ఏర్పడిందని, ఇశ్రాయేలీయులు అరణ్యప్రయాణంలో సుమారు నాలుగు దశాబ్దాల పాటు వారికి ఆకాశాన్నుండి "మన్నా" అనే ఆహారాన్ని దేవుడు ఏకధాటిగా కురిపించాడని... వారికి ఆ ప్రయాణంలోను ఎండ దెబ్బ తగలకుండా మేఘ స్తంభాలను వారికి నీడగా పంపించాడని... చెప్పనలవికాని ఈ అద్భుతాలు యధార్థాలని తాముకళ్లా చూచినట్టుగా కళ్లింత చేసి వీరు చెబుతూ యుంటారు. సాధ్యాసాధ్యాలతోను సత్యముతోను వీరికి పనిలేదు.

అలాగే హిందూ మతానికి ఒకేఒక ఉదాహరణలు చాలు. పార్వతీదేవి ఒంటికి నలుగు పెటుకొంటూ మిగిలిన నలుగు పిండితో ఒక బాలుని బొమ్మను చేసి, ప్రాణం పోసి, తాను స్నానం చేస్తూ బాత్రూం యొద్ద కావలి యుంచిందని, అంతలో వచ్చిన శంకరుని వాడు అడ్డగించగా తలతెగనరికి, చివరకు ఒక చచ్చిన ఏనుగు తల తెచ్చి అతనికి అతికించి బ్రతికించాడని కథనాలను నమ్ముచూ కోట్ల ప్రజలు కోటానుకోట్లు ధనాన్ని వెచ్చించి ప్రతీ ఏడాది వైభవోపేతంగా గణేష్ ఉత్సవాలు చేయడము చూస్తున్నాము.

ఇక్కడ మనము గమనించగా అంగరంగ వైభవముతో బంగారము, వజ్రవైడూర్య నవరత్న ఖచిత విలాసవంతమైన సుందర భవంతులతో కలకలలాడే దైవలోకాల్లో బాత్‌రూమ్‌లకు, బెడ్‌రూమ్‌లకు తలుపులుండవా! అనిపిస్తుంది. ఎంత పేదరాలైనా భూలోకంలో తన తడకల మరుగు దొడ్డికి గోనెసంచైనా అడ్డం కట్టుకుంటుది కదా! దైవాల పేరున ఏమి చెప్పినా చెల్లిపోతుంది. ఇట్టి వాటిని ఎవరూ ప్రశ్నించిన పాపన పోరు!

ఏది ఏమైనా ఎంతటి కల్పనా గాథలైనా వాటికి మతం ముసుగేసి "దేవుడు" అనే మూడక్షరాలు రాస్తే చాలు అవలీలగా వాటిని నమ్మడమే కాదు! అక్షరాల ఆచరిస్తారు. ఇది మానవ బలహీనత. మరణానంతర జీవితం అంతటితో సమాప్తమని భావించక వెనకాల ఇంకేముందో అనే అగమ్య గోచరమైన భావనలే దీనికంతకూ కారణం. దీనికి మనము ఎవరిని తప్పుబట్టి నిందించవలసిన అవసరము లేదు. ప్రపంచమంతా ఇలాగే యుంది. సమయం సందర్భం వచ్చింది గనుక చెప్పవలసి వచ్చింది.



ఈ నా యొక్క పై అభిప్రాయంతో ఒకే ఒక్క మహా మేధావి ప్రముఖ శాస్త్రవేత్త ఇటీవల సచిన్ టెండుల్కర్‌తోపాటు అత్యున్నత పురస్కారం పొందిన భారతరత్న సి.యన్.ఆర్.రావు (ప్రొఫెసర్ చింతామణి నాగేశ రామచంద్రరావు, 89) భారత ప్రధాని శాస్త్ర సాంకేతిక సలహాదారుగా "ప్రధాని సలహా మండలికి" నేతృత్వం వహిస్తున్న భారతరత్న రావుగారు బెంగుళూరు ప్రెస్‌క్లబ్‌లో మాట్లాడుతూ బాలాజీ అశీస్సులు తీసుకొనే అంతరిక్ష పరిశోధనా సంస్థ "ఇస్రో" చైర్‌మెన్ సాంప్రదాయంగా ఒక

మూఢనమ్మకంతో ప్రతీసారి ఉపగ్రహనమూనాను వేంకటేశ్వరుని పాదాల చెంత ఉంచడం అవివేకం అన్నారు. భారతీయులకు భక్తి ఎక్కువ భగవంతుని అశీస్సులు కోరితే ప్రతీ పని సక్రమంగా జరుగుతుందని వారి నమ్మకం. నేనిటువంటి అంధవిశ్వాసాల జోలికి వెళ్లనని జ్యోతిషాన్ని కూడ నమ్మనని చెప్పినట్లు ఈనాడు 24-11-2013న ప్రచురించింది.

మేమిద్దరం ఒకే భావజాలం గలవాళ్లం. వారు ఈ విషయంలో నిర్భీతిగా పై విషయాన్ని ప్రకటించినందుకు భారతరత్న సి.ఎన్.ఆర్. రావుగారిని మరొక్కసారి మన:స్ఫూరిగా అభినందిస్తున్నాను. ఆయన ఆయురారోగ్యాలతో నూరెళ్లకుపైగా జీవించాలన ఆకాంక్షిస్తున్నారు.

... నెల్సన్ రష్టీ









## బైబిల్‌లో... భూతప్రేత పిశాచాలు!

ముఖ్యమైన మత గ్రంథాలన్నిటిలోను మనము చూడగా అనేకమంది దేవుళ్లు, దేవీదేవతలతో పాటు భూతప్రేత పిశాచాలు, రాక్షసులు మొదలైనవి మనకు కనబడతాయి. అదే విధంగా బైబిల్‌నందు కూడ మనము చూస్తాము. అసలు వీటి ఉత్పత్తి క్రమం ఏమిటో అంతవివరంగా వివిధ మతాల్లోను, ముఖ్యంగా బైబిల్‌నందు కూడా తేటగా కనబడదు. అయితే ఈ దేవుళ్లకు, దయ్యాలకు బైబిల్‌లో అవినాభావ సంబంధం మనకు కనబడతాది. ఎందుచేతనో అవి వారికి ఎంత అపకారం చేసినా వాటిని దేవుళ్లేమి చేయరు. అనడంకన్నా చేయలేరంటే సమంజసంగా యుంటాది. హిందుమతంలో అయితే అట్టి దయ్యాలను, రాక్షసులను దేవుళ్లు "ఎన్‌కౌంటర్" చేసిపారేశారు. అసలీ దయ్యాల వ్యవహారమేమిటో కాస్తపరిశీలించి చూద్దాము. ఈ బైబిల్ "విలన్" గూర్చి "ఇది నిజమా" ప్రథమ భాగంలో బైబిల్ దయ్యాలుగా చెప్పబడిన సాతాను, అపవాది, దురాత్మలు మున్నగు నామధేయాలతో సవివరంగా చర్చించాము. అధిక సంఖ్యాకులు మానవుల మరణానంతరము ఇలా దయ్యాలుగా మారతారని నమ్ముతూ వుంటారు.

అన్ని మత గ్రంథాలవలెనే బైబిల్‌నందలి పాత, క్రొత్త నిబంధనలలో కూడ ఈ దయ్యాలకు ఏ మాత్రము కొదువ లేదు. అసలు దయ్యాలు భూతాల ప్రమేయం లేకపోతే అసలు బైబిల్

గ్రంథమే వుండేది కాదేమో! అనిపిస్తాది. బైబిల్ సృష్టికార్యం ప్రారంభం నుండి యెహోవా చరిత్ర అంతటిలోను యూదమతస్తుల జీవిత గమనంలోను, నేటి ప్రపంచ క్రైస్తవుల్లోను దయ్యాలు అనేవి నిజంగా వున్నాయని అవిమాకు తారస పడ్డాయని కథలు కథలుగా వివరిస్తూ యుంటారు.



చాలామంది ఈ దయ్యాలు తెల్లని దుస్తులు ధరించి గాలిలో తేలియాడుతూ వుంటాయని, మర్రిచెట్లను, రావిచెట్లను ఆశ్రయించి వుంటాయని తలస్తారు. కొందరైతే ఇవి కారు నలుపుగావుంటాయని చెబుతారు. యెహోవా "లూసీఫరు" అనే అపవాదిని అతని అనుచరులను తన సన్నిధిలో నుండి గెంటివేయుగా వారంతా దయ్యాలుగా మారిపోయాయని కూడా భావిస్తారు. క్రైస్తవ భక్తజనులను అనునిత్యం పీడిస్తూ వుంటాయని తమను తమ దైవ విశ్వాసాల నుండి పడగొట్టి భ్రష్టులుగా చేయుటకు అపవాది గర్జించు సింహంవలె వెదకుచు తిరుగుచున్నాడని భ్రమలుపడుతూ భయాందోళనలతో జీవిస్తూవుంటారు.

ఈ దయ్యాలు యేసు కాలంలో 2000 సంవత్సరాల క్రితం రెచ్చిపోయి, మరీ బరితెగించి తిరిగాయట. అసలు మానవులకు వచ్చే సామాన్య రోగాలైన చెవుడు, మూగ, మూర్ఛ, చివరకు నడుము నొప్పి, గూని మొదలగు రుగ్మతలన్నీ ఈ దయ్యాలు పట్టడం వల్లనే వస్తూవుంటాయని యేసు స్వయంగా చెప్పడం జరిగింది. ఈ విషయాలను మనము మత్తయి, మార్కు లూకా, సువార్తల్లో చూడగలము. **యేసు ఒకనిని చూచి మూగవైన చెవిటి దయ్యమా! నీవు ఈ మనుష్యుని వదలి పో! అని అరిచాడట. వెనువెంటనే ఆ దయ్యం ఆ మనుష్యుని విలవిలలాడించి అతన్ని వదలి పారిపోయిందట. అసలు యేసు మాటలు ఆ చెవిటి దయ్యానికి ఎలా వినిపించాయో! ఆ మూగ దయ్యం ఎలా కేకలు వేసిందో ఏ క్రైస్తవ విశ్వాసి ప్రశ్నించిన పాపానపోడు.** అయితే యేసు మంచి అనుభవజ్ఞుడైన భూతవైద్యుని వలె కనబడతాడు. ఆయన ఈ దయ్యాలపై "Ph.D." లాంటి దేమైనా చేశాడేమోగాని మంచి దయ్యాల స్పెషలిష్టు లా మాట్లాడుతూ ఈ దయ్యాలకు అసలు రక్తమాంసాలు గాని... చివరకు ఎముకలు గాని వుండవని సెలవిచ్చారు. యేసు వాటిని పిసికి మరి చూచాడేమో! ఈ భూతప్రేత పిశాచాలు ఎలాగుంటాయి? ఇవి గాలికొట్టిన రబ్బరు తిత్తుల వలె వుంటాయా?

ఈ దయ్యాలను గూర్చి మనుషులు అనేక రకాలుగా చెప్పుచుండగా ఈ యేసు దేవుడు మరీ చిత్రంగా చెబుతున్నాడు. "నిజమనేది ఒకే రకంగా వుంటాది" అబద్ధాలు అనేక విధాలుగా వుంటాయి. దీన్నిబట్టి ఈ దయ్యాల కథలన్నీ సర్వాబద్ధాలే! అయినా



మరికొన్ని వెరైటీ దయ్యాల్ని చూడండి!

**గూని దయ్యం:** పద్ధెనిమిది సంవత్సరాల నుండి బలహీన పరచుదయ్యం పట్టిన ఒక స్త్రీని యేసు యొద్దకు తీసికొని వచ్చారు. ఆమె నడుము ఒంగిపోయి ఎంతమాత్రమును చక్కగా నిలువబడలేకుండెను. యేసు ఆమెను చూచి, రమ్మని పిలచి అమ్మా నీ బలహీన తల నుండి విడుదల పొంది యున్నావని ఆమెతో చెప్పి ఆమె మీద చేతులుంచగా ఆ దయ్యం వదిలిపోయి ఆమె చక్కగా నిలువబడి దేవుని మహిమపరచెను. (లూకా. 13:11-13).

నేటి నాగరిక ప్రపంచంలో మనము అత్యంత వైజ్ఞానికమైన రీతుల్లో మన రోగ నిర్ధారణ పరీక్షలు చేయిస్తేనే గాని మనకు రోగకారణము ఏమిటో అంతుచిక్కదు. కాని నాటి అజ్ఞాన కాలంలో నాటి మానవులకు పై వ్యాధికి గూని దయ్యమే కారణమని తెలిసిపోయేది. దానికి యేసు కూడా వంతపాడేవాడు. నాటి అనాగరిక సమాజాలు ఆ విధంగా భావించినప్పటికి ఈ బైబిల్ దేవుళ్లకు కూడ ఇట్టి దయ్యాల పిచ్చిపట్టడం మరీ వింతగా వుంది. నేడు శాస్త్రీయమైన రోగనిర్ధారక పరీక్షలైన "M.R.I. స్కానింగ్, C.T. స్కానింగ్" లేజర్ ట్రీట్‌మెంట్‌లకు సంబంధించి ఆయా రోగకారక బ్యాక్టీరియాలు తప్ప ఇట్టి భూతప్రేత పిశాచాల జాడ మనకు ఎక్కడా కనిపించదు.



"దయ్యాలు వేదాలు వల్లించినట్లు" అనే సామెత బైబిల్‌లో నుండే పుట్టుకొచ్చిందేమో! అనిపిస్తాది. అపవాది, అతని అనుచరులుగా చెప్పబడే వీరు దయ్యాలుగా మారి క్రైస్తవ భక్తజనులను అనునిత్యం పీడిస్తూ యుంటాయని ఆ కారణంగా అప్రమత్తంగా వుండవలసిందిగా బైబిల్‌లో హెచ్చరికల మీద హెచ్చరికలు కనబడతాయి. ఎల్లవేళలా ఇవి యెహోవా దేవునికి వ్యతిరేకంగా పనిచేస్తున్నాయని చెప్పుచూయుండగా కొన్ని తెలివి తక్కువ దయ్యాలు ఈ దేవుళ్లకు అనుకూలంగా పనిచేస్తూ బైబిల్‌కు "బ్రాండ్ ఎంబాసిడర్స్"లా (ప్రచారకర్తల) వలె చక్కని ప్రచారం చేయడము మనము ఇక్కడ చూడగలము.

**"ఆ సమాజ మందిరములో అపవిత్రమైన దయ్యపు ఆత్మపట్టిన వాడొకడుండెను... వాడు! నజరేయుడవైన యేసూ! మాతో నీకేమి పని? మమ్మును నశింపజేయవచ్చితివా? నీవెవడవో నేనెరుగుదును! నీవు దేవుని పరిశుద్ధుడవని బిగ్గరగా కేకలు వేసెను. అందుకు యేసు – ఊరకుండుము, ఇతనిని వదలి పొమ్మని గద్దించగా ఆ దయ్యము వానిని పడద్రోసి వదలి పోయెను. (లూకా. 4:33-35).**

ఆ దయ్యము యేసును చూచి... అయ్య బాబోయ్! మీరా సార్!! అన్న చందాన... సర్వోన్నతుడైన దేవుని కొడుకా! నీవు పరిశుద్ధుడవని గావు కేకలు పెడుతూ ప్రశంసిస్తు పారిపోయిందా! ఆ తెలిపి తక్కువ దయ్యం! పైగా యేసు ఇక చాల్లేగాని నోరుమూసుకోరా! అనగానే గట్టిగా నోరు నొక్కుకొని పరుగు లంఘించుకుందా! యేసు మాటలను అది అంత చక్కగా విన్నదా?

ఈ విధంగా బైబిల్‌లో వ్రాయడం వల్ల యేసును గూర్చి ఏకంగా ఆయన విరోధియైన సాతానే ఆయనకు అనుకూలంగా సాక్ష్యమిస్తున్నందున ఆయన యందు అనేకుల విశ్వసించి వెంబడిస్తారని నాటి తెలివి తక్కువ రచయితలు భావించడం జరిగియుండవచ్చును. అపోజిషన్ పార్టీల్లో కూడా కొందరు అధికార పార్టీని పొగడుతూ వుండడము అప్పుడప్పుడూ మనము చూస్తాము. రాగల కాలంలో ఇట్టి అనాలోచిత రచనలకు కాలదోషం పట్టవచ్చని వారికి ఎంతమాత్రము తెలియకపోవడమేకాదు కాల క్రమంలో ఈ నెల్సన్‌రక్షీ గాడు! పుట్టుకొచ్చి మన ఇల్లుపీకి పందిరేస్తాడనే విషయం వారికి అంతకన్నా తెలియదు.

**పై విధంగానే మరో దయ్యం అపోస్తలుడైన పౌలు బృందాన్ని వెంటాడుతూ నెలల తరబడి "ప్రభువు నామాన్ని" ఆయన సేవకుల గొప్పతనాన్ని ప్రశంసిస్తూ తిరిగిందట. అపోస్తలు లకార్యం *16:16-18* చూడండి.**

**మేము ప్రార్థనా స్థలమునకు వెళ్లుచుండగా పుతోను అను దయ్యము పట్టినదై సోది చెప్పుచూ తన యజమానులకు బహు లాభము సంపాదించుచున్నది. ఆమె పౌలును మమ్మును వెంబడించి ఈ మనుష్యులు సర్వోన్నతుడైన దేవుని దాసులు రక్షణమార్గం ప్రచురించుటకు వస్తున్నారని కేకలు వేయుచు అనేక దినాలు వీరిని వెంబడిస్తూ యుండగా పౌలు గారు యీ విషయాన్ని చాలా ఆలస్యంగా గ్రహించి ఆ దయ్యాన్ని తన్ని తరిమేశాడట. వీరు ఆ దయ్యం పేరును కూడ అడిగి తెలిసుకోవడం చిత్రంగా వుంది. ఇట్టి ఉదంతాలు విన్న భక్తజనాలు పరవశించి పోతారని వారు భావించి యుండవచ్చు.**

నేటి ఆధునిక యుగాల్లో ఈ భూతప్రేత పిశాలను గూర్చి విద్యాధికులే కాక పామర ప్రజానీకం కూడ దయ్యాలను అంతగా నమ్ముటలేదు. మనము 50-60 సంవత్సరాల వెనుకకు పోయి చూస్తే నాటి భూతవైద్యులు చేతబడి రాయుళ్లు పట్టణాలు పల్లెలు అనే తేడాలేకుండ బోర్డులు పెట్టుకొని కనబడుతూ వుండేవారు. అయినా చాటుమాటుగా కొన్నిచోట్ల ఇంకా ఇవి జరుగుతూనే ఉన్నాయి. నేడు వారు నామ రూపాలు లేకుండ వారివారి బిచాణాలు ఎత్తివేసి కనుమరుగైపోయారు.

అయితే నేటి మహోన్నత వైజ్ఞానిక యుగంలో విద్యాధికులైన క్రైస్తవ బుద్ధి (హీన) జీవులు, మరిముఖ్యంగా "బ్రదర్స్" బిరుదులు తగిలించుకొన్న అనేకమంది టి.వి. ప్రసంగికులు సిగ్గు శరంలేని రీతిలో టి.వి.లందు ఈ దయ్యాల తతంగాన్ని "లైవ్" ప్రదర్శనలిస్తూ



దయ్యాలను పారద్రోలుచున్నామని పట్టపగలే అమాయక క్రైస్తవ విద్యాధికులను నిలువుదోపిడీ చేస్తూ తమ ఆస్తులను పెంచుకుంటున్న "ప్రవీణు"లైన కొందరి నిజస్వరూపాలను ఇది నిజమా తృతీయ భాగంలో సచిత్రంగా ప్రచురించబడుతుంది. ఎదురుచూడండి!

ఈ బైబిల్ దయ్యాల కథనాలను ఇక్కడ విడమరచి విశదీకరిస్తూ వుండగా కొందరు ఆలోచనా పరులు ఈ దయ్యాలు ఉనికిని గూర్చి అనేక సందేహాలు, అనుమానాలు కలగవచ్చును.

అయితే ఈ క్రైస్తవ మతాన్ని ప్రపంచ వ్యాప్తంగా ప్రచారం చేసి క్రైస్తవ మత అభ్యున్నతికి పాటుపడిన మహామహా సైంటిస్టులు, విజ్ఞాన వేత్తలైన ఇంగ్లీషు వాళ్లకు ఈ దయ్యాలనేవి అబద్ధాలని తెలియదా! అనే సందేహం కలుగవచ్చును. నిజమే దయ్యాలు లేవనే విషయం వారికి చాలా బాగా తెలుసు. దీనికి ఠక్కున సరిపోయే సమాధానం ఇవ్వబడింది జాగ్రత్తగా చదివి చూడండి!

యేసు అనేక జబ్బులకు **దయ్యాలే కా**రణమని చెప్పినప్పటికి ఆంగ్లేయులు వాటిని ఏ మాత్రము పట్టించుకోకుండ, ఆయా చోట్ల రకరకాల రుగ్మతలకు కేవలము మిషన్ ఆసుపత్రులు, డిస్పెన్సరీలు మాత్రమే నెలకొల్పారు గాని "దయ్యాల హీలింగ్ సెంటర్లు" ప్రపంచ వ్యాప్తంగా ఒక్కటైనా నెలకొల్పలేదు. కారణం అదంతా "హంబక్" అని వారికి బాగా తెలుసు. ఆంగ్లేయులు ఈ మత ప్రచారం చేయుటలోని ముఖ్యోద్దేశం రాజ్యవిస్తరణ కాంక్షే! కాని టి.వి. ప్రసంగికులు మాత్రం ఈ దయ్యాలను పారద్రోలే తతంగం ఇంకా నడిపిస్తున్నారు. ఇదే వారి ఆదాయానికి మూలకారణం.



# దైనందిన జీవితాల్లో దయ్యాల "యదార్థ" గాథలు

క్రైస్తవ సమాజాల్లో చాలా మందికి దయ్యాలు అబద్ధమని తెలిసినప్పటికి వీటిని పెడ చెవిని బెట్టి, నేటికీ క్రైస్తవ వాఙ్మయంలో ఇంకా దయ్యాలకు సంబంధించిన యధార్థగాథలుగా క్రిస్టియన్ బుక్‌సెంటర్ లందు ఇట్టి సాహిత్యం కనబడుతూనే వుంది. "మంత్ర శక్తి నుండి - క్రీస్తులోనికి" "FROM WITCH CRAFT TO CHRIST" అనే తన స్వీయ చరిత్రను "ఇర్విన్‌డోరిన్" అనే ఒక విదేశీ మహిళ కళ్లకు కట్టినట్టుగా వర్ణించారు. కథాంశం తాను దయ్యాలతో ప్రత్యక్ష సంబంధాలు కలిగి వాటితో మంచీ చెడ్డలు మాట్లాడుతూ గడిపిన ఆశ్చర్యకరమైన సంబంధాలతో భయాందోళనలు రేకెత్తించే విధంగా వ్రాయబడిన ఈ "యధార్థగాథ" ఇతర భాషల్లోకి కూడ తర్జుమా చేయబడి హాట్-కేక్స్‌లా అమ్ముడుపోతున్నాయి. ఈ పుస్తకాన్ని నేను గత ముప్పది సంవత్సరాలకు ముందే చదివాను. నేడు కూడ క్రిస్టియన్ బుక్‌స్టాల్స్ నందు ఈ పుస్తకం దొరుకుతుంది.




ఈ కథలోని ఆమె పాత్ర ఎలాగుందంటే... ఒక కోతివుందట. అది అసలే కోతి ఆపై కల్లు త్రాగింది. గెంతుకుంటూ తూలుకుంటూ తిరుగుచుండగా తేలుకుట్టిందట! ఆ బాధ భరించలేక ఎగిరిదూకితే నిప్పు త్రొక్కిందట! అంతలో దయ్యం పట్టిందట! ఆపై దానికి పిచ్చి పట్టిందట! దాని పరిస్థితి ఎంతటి దారుణంగా వుంటాదో వర్ణించనలవికాదు. అచ్చం ఈ విధంగానే పై పుస్తక రచయిత స్వీయ పరిస్థితి కూడ ఉంది.

ఆమె తన గత జీవితంలో సమస్త దురలవాట్లకులోనై... మత్తుమందుల సేవనం... త్రాగుడు... ధూమపానం... విశృంఖల వ్యభిచారాలకు బానిసయై సుఖ వ్యాధులతో



బాధపడుతుండగా పిచ్చిదానిలా తిరుగుతూ యుండగా ఆమెకు ఒక్కసారిగా ఏకంగా ఏడు దయ్యాలు పట్టాయట. ఈ దుర్భరస్థితిలో ఆమె ఆ ఏడు దయ్యాలను ఏ విధంగా లెక్కపెట్టిందో ఎవరికీ తెలియదు. పరిస్థితి ఈ విధంగా కొనసాగుతూవుండగా ఒక శుభోదయాన కాదు కాదు ఒక "దురోదయాన" ఈ దయ్యాల అధిపతియైన బైబిల్ విరోధియైన లూసీఫరు (దయ్యాల బాస్) "అపవాది" ప్రత్యక్షమై ఆమెతో "ఫ్రెండ్‌షిప్" చేసికొని తనతో త్రిప్పుకోవడం మొదలు పెట్టాడట. (అపవాది అనేవాడు బైబిల్ కథనాల్లో తప్ప ఈ వాస్తవ ప్రపంచంలో ఎప్పుడూ ఎవరికి కనబడలేదు). ఒక రోజు ఈ అపవాది డోరిన్ ఇర్విన్‌ను తీసికొని తనతోపాటు శికార్లు చేయిస్తూ పనిలో పనిగా బైబిల్‌లో వివరించబడిన నిత్య నరకాగ్ని గుండంలోనికి తీసికొని వెళ్లాడట. అందు భయంకరమైన నిప్పునెరుసులు అగ్నిగంధకాలు విరజిమ్మే అగ్నిజ్వాలలు ఎగసెగసిపడుచుండగా అందు వీరు అవలీలగా నడచుకొంటూ చక్కగా తిరిగారట. అందులో అగ్గిపురుగులుంటాయని, అవి కరుస్తూ నానాయాతనలు పెడతాయని చెప్పబడిన అత్యంత భయానకమైన బాధలు ఏ మాత్రము తమకు ఎదురైనట్టు డోరిన్ ఇర్విన్ మాట వరసకైనా చెప్పలేదు. అపవాది చేయిపట్టుకొని నడిచిందేమో! సాతానును ఎవ్వరూ చూడనంతటి "క్లోజ్ అప్"లో చూచిన ఈమె వాడిని సర్వాంగ సుందరంగా వర్ణించింది. ఆ లూసీఫరు శరీరమంతా దట్టమైన రోమాలు అల్లుకొని వున్నాయని అతని కంఠస్వరము ఉరుముల ధ్వనివలెవుందని వ్రాసింది. ఔను మరి నిజమే! ఎంతయినా ఈ అపవాది యోహెూవా కుమారుడే కదా! అందుచే యెహెూవా రూపంలోను, ఆయన లక్షణాల తోను వుండడము సహజమే కదా! బైబిల్‌లో కొన్ని చోట్ల యెహెూవా కంఠస్వరము విస్తార జలప్రవాహముల వలెను, ఉరుముల ధ్వనివలెను ఉన్నట్టు చెప్పబడింది. ఏది ఏమయితేనేమి బైబిల్‌లో ఏ ప్రవక్తా ఇంతటి సన్నిహితమైన రీతిలో అపవాది రూపురేఖలు వర్ణించి వుండలేదు. అయితే బైబిల్ నందు అసలు దేవదూతలు అనేవారు అందునా ఈ మాజీ ప్రధాన దూతయైన లూసీఫరు మహా అందగాడు గాను, స్ఫురద్రూపి గాను చెప్పబడగా ఈమె అతగాడ్ని "కొండముచ్చి"గాని వలె వర్ణించడం చిత్రంగా యుంది. లూసీఫరు యెహెూవాను ధిక్కరించి భ్రష్టుడై పదవీచ్యుతుడైనట్టే బైబిల్ చెప్పిందిగాని వాడినెక్కడా దేవుడు ఒరే నీవు కొండముచ్చివంటి వికృతాకారుడవు కమ్మని శపించలేదు. కాని బైబిల్ నందలి ఈ దుష్టపాత్రను మాత్రం ఈ క్రైస్తవ సామ్రాజ్యం అపవాదిని పై విధంగా "బూచి" లాగానే భావిస్తాది. అటులనే ఈ డోరిన్ ఇర్విన్ కూడ భావించి యుండవచ్చును.

ఏది ఏమైతేనేమి, ఈ డోరిన్ ఇర్విన్ ప్రపంచమందు అత్యంత దుష్టకార్యాలుగా చెప్పబడే సమస్త దుష్క్రియల్లోను మునిగితేలి చిట్టచివరకు ఆమె మారు మనస్సు పొంది ప్రభువులోనికి వచ్చినట్టు చెప్పబడింది. ఇంతకన్నా ఘోరాతిఘోర పాపాత్ములైనా సరే దేవాపాపినైన నన్ను



నీ పరిశుద్ధ రక్తంలో శుద్ధీకరించి తన పాపాలు క్షమించమంటే చాలు వారంతా పునీతులై పోతారట. దీనినే మారుమనస్సు పొందుట అంటారు. ఇది నిజమేనంటారా? సర్వలోకంలో నున్న సమస్త పాపాలు విచ్చలవిడిగా చేసిపారేసి చివరకు అపవాదితో దోస్తీకట్టి! చేయవలసినవన్నీ చేశాక ఆఖరున ప్రభువా ఈ రోజు నుండి నా పార్టీ మార్చి నీ పార్టీలోకి వచ్చేస్తున్నానంటే పరిశుద్ధ యేసు, దేవుడుగారు "వెల్‌కమ్" అంటాడా? సమస్త ప్రపంచ క్రైస్తవులంతా ఔను. మన తండ్రియైన దేవుడు కరుణామయుడు తప్పకుండ అట్టివారినందర్నీ చేర్చుకుంటాడంటాడు.

నేను మాత్రం కాదంటాను! ఇవినా మాటలు కావు. యేసు ప్రియశిష్యుడైన యోహాను గారితో ఈ విషయాన్ని పరిశుద్ధాత్మ దేవుడు గారు వ్రాయించారు. (యోహాను 9:31లో) దీనిని చూచాకైనా ఇట్టి పాపాత్ములు ఎవరైనా సరే అసలు మారు మనస్సు పొందే అవకాశమేలేదట!.. చూడండి! "దేవుడు పాపుల మనవి ఆలకించడని యెరుగుదుము".

*సాధారణంగా యేసు ఉపహన రీతిలో ప్రసంగించేటప్పుడు అనేక సందేహాలు ఆయన శిష్యులకు కలుగుతూ వుండేవి. అట్టి సందర్భాలలో ఆయన శిష్యులు ఇట్టి విషయాలను తీరికగా యేసుతో చర్చించేవారు. అలాగే యోహాను యేసు యొక్క ప్రియశిష్యుడు. ఆయన ఈ సంగతిని గూర్చి ప్రత్యేకంగా చర్చించి యుండవచ్చును. ఎంతపాపినైనా యేసు రక్షిస్తాడనే మాట నిజమేనా? అని అడిగియుండవచ్చును. యేసు ఏదోమాట వరసకు అలా అన్నానులేగాని దేవుడు పాపుల మనవిని అంగీకరించడు కదా యని యోహానుతో చెప్పి యుండవచ్చును. అందుకే యోహాను అంతధీమాగా దీనిని ఖండించాడు.*

ఇంత కష్టపడి ప్రపంచ క్రైస్తవ సంఘాలు అనేక భాషల్లో ప్రచురించిన ఈ "ఈడోరిన్ ఇర్విన్నమ్మ" ఉదంతం అంతా వట్టి దేనని ఈ పై బైబిల్ వాక్యం తుస్సుమనిపించింది. అంతేగాక దీనికి మూలమైన ఈ డోరిన్ చరిత్రలో అసలు ఈమె ఈ అపవాది బంధకాల నుండి ఏ విధంగా బయట పడిందో వీరిరువురి స్నేహం ఎలా బెడిసి కొట్టిందో వంటి వివరాలు సరిగా ఇవ్వబడలేదు. ఎంత పాపినైననూ యేసు రక్షిస్తాడనే స్లోగన్ (యోహాను



9:31) వాక్యం ద్వారా నిరర్థకమైనట్టుగా మనము చూచాము. అదరాబదరా మారుమనస్సు పొందుదామనే వారు ఇక్కడ నిరుత్సాహపడవలసి వస్తాది.

ఈ కథనమందలి సమస్త విషయాలను మనము నిశితంగా పరిశీలించి చూడగా డోరిన్ ఇర్విన్ నిజంగా నరకంలో నడిచిందంటారా? అది యధార్థమైన విషయమా? అని మనము పశ్నించుకుంటే అది భ్రమలుగాను, భ్రాంతులుగాను తేలిపోతాయి. "ఆమె అసలే కోతి అన్నట్టు"... ఆమె మత్తుమందుల మాదక ద్రవ్యాల రాణి. దీనితో పాటు త్రాగుడు తదితర దుర్లక్షణాల్లో మునిగింది. వీటిన్నిటికి తోడు ఈమె విశృంఖల వ్యభిచారంలో మునిగితేలింది. సుఖవ్యాధులతో బాధపడుతుండవచ్చు ఇట్టివారు నిజజీవితంలోనే భ్రమలకు, భ్రాంతులకు గురియౌతూవుంటారు. వీటన్నిటికి తోడు ధూమపానం, మత్తుమందుల సేవనం తదితర శరీరావయాలపైపడి నరాల బలహీనత వచ్చి భయభ్రాంతులకు గురికావడం సహజం. ఈ దయ్యాల భూతాలనేవే అబద్ధమని చెప్పబడుచుండగా - వాటిని అతిగానమ్మి ఊహాలోకంలో తేలియాడే ఇట్టివారికి ఇటువంటి భయాభ్రాంతులే ఇట్టి భూతప్రేత పిశాచాలుగా భ్రమల్లో విహరింపజేస్తాయి. ఇట్టి భయాభ్రాంతులతో దయ్యాలు ఎంతకయినా తగినవని గాఢంగా విశ్వసించిన వారికే ఇట్టి భ్రాంతులు కలగడము సహజం! ఈ కథతో పాటు ఇప్పుడు మనము చూడనున్న "తోకదయ్యం" కథానంతరం ఈ దయ్యాల శీర్షికకు శాస్త్రీయ వివరణతో ముగించబడుతుంది.



# తోక దయ్యం

## (ఇది సాక్ష్యాత్తూ నామాతృమూర్తికి కలిగిన "దర్శనం")

అది 1946-48ల మధ్యకాలంలో ఏప్రియల్ మే నెలల సమయంలో మా ఇంట్లోనే జరిగిన "యధార్ధ" గాథ. ఈ కథానానికి సాక్ష్యాత్తూ నా మాతృమూర్తి, దైవసేవకురాలు అయిన కెంపురత్మమ్మగారి సంగతే. ఇది ఎవరో.. ఎక్కడో చెప్పగా విని వ్రాసిన గాథ ఎంతమాత్రము కాదు. ఇది స్వీయ గాథ లాంటిదే! అప్పుడు నా వయస్సు పదమూడు పదునాల్గు సంవత్సరాలు. అలనాటి రాత్రి మా తల్లి గార్కి కలిగినది భ్రాంతి కాదు ప్రత్యక్ష సంఘటన అని చెప్పేవారు. పై విషయాన్ని మా కుటుంబ సభ్యులందరికి పదేపదే చెప్పేవారు. అనంతరం మా తల్లిగారు మరో యాబది సంవత్సరాలుపైగా జీవించి 1999లో మరణించారు. శాంతికి చిహ్నమైన పావురాన్ని చేతబట్టుకొనియున్న వీరే మా తల్లిగారు.



అది పశ్చిమ గోదావరిజిల్లా చెట్టిపేట గ్రామం. కొవ్వూరు తాలూకా. ఆ రాత్రి సుమారు ఒంటి గంట ప్రాంతంలో తన మంచం సమీపంలో ఏదో శరీరాకృతి ఇంచుమించుగా



తనను రాసుకుంటూ వెళ్లినట్లనిపించిందట. వెంటనే కెవ్వుమని కేకవేయబోయినా! గొంతుక పెగలక నిస్సత్తువ ఆవరించి మంచం మీదనే కూలబడి బిత్తర చూపులు చూస్తూవుండగా అపవాది ప్రత్యక్షమై... రావణాసురుని కొలువులో ఆంజనేయుడు తన తోకనే ఆసనంగా చుట్టుకొని కూర్చున్న విధంగా మంచం ముందు తన తోకను చుట్టుకొని కూర్చుని మిడిగ్రుడ్లతో మిదుతూ మిదుతూమంటూ చూస్తున్నాడట. వాడు నల్లగా కొండముచ్చి ఆకృతిలో భీకరాకారుడై పళ్లికిలించి చూస్తూ యుండగా మా తల్లిగారు ధైర్యం తెచ్చుకొని తలప్రక్కన వున్న బైబిల్ గ్రంథాన్ని చేతబట్టి ఒరే! అపవాదీ! నాతో నీకేం పనియని అరుస్తూ... నేను విశ్వాసినైన ప్రభువు బిడ్డను. నన్ను నీవు ఏమీ చేయలేవని చెప్పుచుండగా అపవాది వికృతంగా నవ్వి. అలాంటి పనికిమాలిన మాటలు నా దగ్గర సాగవు. నీవేదో పుణ్యాత్మురాలినని భ్రమపడుచున్నావు. నాకు సమస్తము తెలుసును. ఇదిగో కావాలంటే చూడు! నీ పాపాల చిట్టాయంటూ లేచినిలువబడి తన తోక చుట్టను విప్పి నీ పాపాల చిట్టా పద్దులన్నీ ఈ తోక మీద వ్రాసి యున్నాయి చూడమని తోకను సీరియల్‌గా జరుపుతూ ప్రదర్శించసాగాడట.

అంత మా తల్లిగారు అప్రయత్నంగా క్రిందికి చూడగా ఇరువురి మధ్యలో కొన్ని రక్తపు చుక్కలు కనబడగా కొండంత ధైర్యం తెచ్చుకొని మహదానందంతో రెచ్చిపోయి కేరింతలు కొడుతూ "యేసురక్తం జయం! యేసురక్తం జయం" అంటూ ఔను నేను పాపాత్మురాలినే కావచ్చు. అయితే కీస్తు తన దివ్యరక్తంతో నా పాపాలన్నీ శుద్ధీకరించాడని నీకు ధైర్యముంటే ఆరక్తం చుక్కలు దాటి ఒక్క అడుగుముందుకు వేసిచూడమని అనగానే వాడు చూచి బిత్తరపోయి తోకముడిచి పారిపోయాడట. అంతలో మా తల్లిగారు హల్లెలూయా! యేసురక్తం జయం! అనే కేకలకు మా నాన్నగారు లేచి వచ్చి పట్టుకొనగా మేమంతా కూడా నిద్ర లేచాము.

అంతనామె కల్లింత చేసి ఆవేశంతో ఊగిపోతు ఈ అపవాది ప్రత్యక్షమయిన కథనంతా మాకు చెప్పడం జరిగింది. ఈ కథవిన్న మేమంతా బహుశా నీకీ విధంగా కలవచ్చి యుండవచ్చునేమో యంటే కాదు కాదు అది తప్పకుండ నాకు ప్రత్యక్షంగా కలిగిన దర్శనమేనని వాదించేవారు. ఈ విషయాన్ని ఎంతోమందికి అనేకసార్లు చెబుతూయుండేవారు. ఇది సాక్షాత్తూ మా ఇంట్లో సంభవించిన దయ్యం కథనం!

ఇప్పుడు మనము చూచిన పై రెండు దయ్యాల కథనాలు కొంతలో కొంత నిజమైన కథలేమోననే అనుమానం వస్తుంది. మొదటి కథనంలో డోరిన్ ఇర్విన్ సకల విధాలైన దుర్వసనాలకులోనై, ఇందు ముఖ్యంగా దారుణమైన దుర్వసనం డ్రగ్స్‌కు, త్రాగుడు, వ్యభిచారానికి బానిసయై పోయింది. ఇట్టివారికి ఇంచుమించు వారి నాడీ మండలం ("నెర్వస్‌సిస్టమ్") అస్తవ్యస్తమై వుంటుంది. ఇంచుమించుగా ఆమె శరీరావయావాలతో పాటు మెదడు కూడా సక్రమంగా పనిచేయదు.

రెండవదిగా మా తల్లిగారు అప్పటికే ఊపిరి తిత్తులకు సంబంధించిన "క్షయ" వ్యాధితో సతమతమౌతున్నారు. దీనికి తోడు గుండె బలహీనత కూడ వుండేది. ఆ రోజుల్లో టి.బి. వ్యాధికి సరియైన మందులు రాలేదు. నాడు ఆ వ్యాధి సోకిందంటే ప్రాణాల మీద ఆశవదలుకోవలసిందే! ఆమె సోదరీమణులైన మా పెద్దమ్మలిద్దరూ ఈ క్షయ వ్యాధికే బలియైపోయారట. నాడు దీని బారిన పడ్డవారికి ఒకటంటే ఒకటే మార్గం! రాజమండ్రి యొద్ద ఆహ్లాదకరమైన వాతావరణంలో "అల్కట్ గార్డెన్స్" సమీపమందు ఒక కొండ మీద "శానిటోరియం" అనే క్షయవ్యాధి గ్రస్తులకై నిర్మించిన ఆఖరి మజిలీ లాంటి కేంద్రమన్నమాట. అందులో రోగులను చేర్చి పచ్చికోడిగ్రుడ్లను, పాలు ఆహారంగా ఇస్తూ ప్రశస్తమైన గాలి వెలుతురు ప్రసరించే ఆ క్రేంద్రాలందు రోగులను ఉంచి వారివారి జీవితాలను కొద్దిగా పొడిగిస్తూ వుండేవారట. అప్పటికింకా "స్ట్రెప్టోమైసిన్" అనే ఏంటీ బయోటిక్‌ను కనుగొనలేదు. అట్టి సేనిటోర్యాలందు జీవచ్ఛవాల్లా, ఎముకల గూళ్లుగా దయనీయ స్థితిలో అనేకులు కాలగర్భంలో కలసి పోయినట్టు మా చిన్నతనంలో విన్నాము.

ఇక్కడ చెప్పబోయే విషయమేమంటే ఆ రోజుల్లో అనేకులు నిశ్చలమైన భక్తి శ్రద్ధలతో, దైవ భయంతో పాటు దయ్యాల భయాలు, భ్రాంతులతో అభద్రతా భావంతో జీవనం గడిపేవారు. దీనికి ముఖ్య కారణం బైబిల్‌లో చెప్పబడిన దయ్యాల కథలే! తమకు వస్తున్న ఈ జబ్బులన్నింటికి ఈ దయ్యాలే కారణమని గాఢంగా నమ్మేవారు. తాము ఏమీ చేయలేని పరిస్థితుల్లో దైవం మీద భారం వేసి దయనీయమైన స్థితిలో నిరాశా నిస్పృహలతో గడిపేవారు.

డోరిన్ ఇర్విన్ తాను ఉపయోగించిన మాదక ద్రవ్యాలు, మద్యపాన ధూమపానాల దుష్ఫలితాలు ఆమె మానసిక శారీర ఆరోగ్యాలపై గణనీయమైన ప్రభావాన్ని చూపడము, దీనికితోడు దయ్యాలు, భూతాలు మొదలైన "కల్చరల్-బిలీఫ్స్" కారణంగా ఇట్టివారి మానసిక స్థితి అస్తవ్యస్తమైన వారికి ఇంతకుముందు మనం చెప్పుకొన్న "ప్రొసిషన్ స్టేట్" అనే మానసిక రుగ్మత సంభవించడం వల్ల ఇట్టివారు తరచుగా దయ్యాలతోను దేవుళ్లతోను తాము సంభాషిస్తున్నామని చెబుతూవుంటారు. తమకు అనేకసార్లు దైవదర్శనాలు, దయ్యాల సహవాసం కలుగుతాయని నమ్మబలకడమే గాక జరగబోయే ఉపద్రవాలు తమకు బయల్పడుచున్నాయని చెబుతూ యుండడము పరిపాటి. ఇట్టివారు అబద్ధాలు చెబుతున్నారని మనము అనుకోకూడదు. వారి మస్తిష్కాలు ఇట్టి భ్రాంతులతో చంచల మనస్తత్వంలో అస్తవ్యస్థంగా వుంటారు.

ఇట్టి అనేక విషయాలను గూర్చి ప్రముఖ మానసిక వైద్యులు డా॥ ఇంద్లరామ సుబ్బారెడ్డి (విజయవాడ)గారి క్లాసులకు "గోరా-సెన్సు సెంటర్" విజయవాడకు నేను కొన్నిసార్లు వెళ్లడం జరిగింది. ఒక్క బైబిల్‌నందే గాక అన్ని మత గ్రంథాలందు ఇట్టి దయ్యాలు భూతాలు, రాక్షసుల కథనాలు కోకొల్లలుగా కనబడతాయి. నిజానికి ఇవన్నీ సర్వాభద్దాలు. నేటికీ ఈ దయ్యాల భయం ఎవరిలోనైనా గూడుకట్టుకొని వుంటే తక్షణమే బయట పడండి.



కాలక్రమంలో మా తల్లిగారు క్షయవ్యాధి నుండి పూర్తిగా కోలుకొని మా తండ్రిగారు టీచర్‌గా రిటైర్ అయ్యాక "చెర్యాల" (వరంగల్ జిల్లా) ఇండియా మిషన్ చర్చ్‌లో పాస్టరుగా పనిచేసి 1971లో అక్కడే మరణించారు. అలాగే మా తల్లిగారు అదే చర్చికి చెందిన డేవిడ్ లివింగ్‌స్టన్ బైబిల్ థియాలజీ స్కూలులో అధ్యాపకురాలిగా పనిచేసి 1999వ సంవత్సరాంతంలో మరణించారు.

ఈ ఉదంతాలు విన్న తరువాత చాలామంది దయ్యాలను గూర్చిన భయాల నుండి భావనల నుండి విముక్తులయ్యే అవకాశం ఉంది. ఎవరైనా మారవచ్చును గాని నా ప్రియక్రైస్తవ సోదరులు మాత్రం వినరుగాక వినరు. ఎందుకంటారేమో! ఒకవేళ వీరు దయ్యాలు వట్టిదే అంటే వాటి సరసన కొనసాగే దేవుడు కూడ లేడనవలసివస్తాదని వీరి భయం!



## ఆఖరుగా ఈ దయ్యాల "వెరైటీల"ను గూర్చి పరిశీలిందాము

**1) ఈ దయ్యాల్లో ఆంధ్రాదయ్యం:** ఈ దయ్యాలు ప్రాంతాలవారీగా వీటి పడికట్టు మారుతూవుంటుంది. ఆంధ్ర ప్రాంతంలో దయ్యం తెల్లచీర కట్టుకొని, తల విరబోసుకొని చేతులనిండా గాజులు తొడుక్కొని నుదుటన రూపాయి బిళ్లంత బొట్టు పెట్టుకొని నెత్తిమీద నిప్పుల కుంపటి పెట్టుకొని చకచకా నడుస్తూ పోతుందట.

**2) తెలంగాణా దయ్యం:** ముఖ్యంగా గిరిజన గూడేల్లో కాళ్లకు ఘల్‌ఘల్‌మని మ్రోగే గజ్జెలు కట్టుకొని చేతులకు క్రింది నుంచి పై వరకు దంతపు గాజులు తొడుక్కొని తలకు రెండు వైపులా వెండి ఆభరణాలు ధరించి ముక్కుకు "అడ్డబాస" నుదిటికి, చేతులకు పచ్చబొట్లు పొడిపించుకొని రంగుల మయమైన కుచ్చుల లంగాలు, అద్దాల రవికలు తొడిగి నెత్తిమీద గంప పెట్టుకొని "గుటకా" నములుతూ... జణక్ జణక్ - పాయల్ బాజేలా" మువ్వల గలగలతో సాగిపోతుందట.

**2A)** తెలంగాణలోనే ఆంధ్రప్రాంతం వారి ప్రాభల్యంగల నిజాంబాద్, మెదక్, హైదరాబాద్ తదితర పట్టణప్రాంతాల్లో మనం నెం1లో చెప్పుకున్న ఆంధ్ర దయ్యాలే తిరుగుతూ వుంటాయి. "తెలంగాణా ఏర్పడ్డాక ఇవన్నీ ఆయా ప్రాంతాలకు తరలిపోతాయి!" కావచ్చు!

**3) తమిళ తంబీల దయ్యం:** "గుడియాతం"లో తెల్లలుంగీ, నల్ల అంగీ ధరించి నడుముకు వెడల్పయిన పటకా బెల్టు బిగించుకొని తాంబూలం నములుతూ పురుష దయ్యాలు తిరుగుతాయట.

**4) రాజస్తాన్ మార్వాడీ దయ్యాలు:** వళ్లంతా బంగారు ఆభరణాలు ధరించి అందమైన మార్వాడీ పడికట్టులో చీరలు కట్టుకొని ముఖం మీద ముసుగు వేసికొని నడుస్తూ కనబడతాయట.

**5) ఆఫ్గనిస్థాన్ దయ్యాలు:** అలాగే ఆఫ్గనిస్థాన్‌లో బురఖాలు ధరించిన తాలిబాన్ దయ్యాలు కనబడవచ్చునేమో!

**6) వెస్టన్ కంట్రీస్ డెవిల్స్:** పశ్చిమ దేశాల "డెవిల్స్" కాస్త "అడ్వాన్స్"గా గోచరిస్తాయి. మల్లెపువ్వుల్లాంటి ఉల్లిపొర తెల్లటి నైట్‌గౌన్లు తొడిగి పెదాలకు లిఫ్‌స్టిక్ వేసికొని కాళ్లకు హైహీల్స్ తొడిగి తలకు అందమైన ప్రింటెడ్ స్కార్ఫ్‌కట్టుకొని, "ఐలేషెష్" పెట్టుకొని గోళ్లకు



రంగులు వేసికొని నేలమీద నడవకుండ గాలిలో తేలిపోతూ ఒయ్యారంగా విహరిస్తాయట. ఈ మధ్య కొన్ని సాఫ్ట్‌వేర్ దయ్యాలు పోర్టబుల్ కంప్యూటర్లు, ఐప్యాడ్‌లతో తిరుగుతున్నాయట.

**7) ఆఫ్రికా మహిళా దయ్యాలు:** తలల మధ్య మధ్యలో పాపిళ్లవలె షేవింగ్ చేయించుకొని చిన్న చిన్న జడలు అల్లి మధ్యలో చంకీలు చల్లుకొని, స్లీవ్‌లెస్ గౌనులు తొడిగి నేరేడుపండులా మెరిసే అవయవ సౌష్టవంతో ముందుకుసాగిపోతాయట!

ఈ దయ్యాల్లో ఒక క్రమశిక్షణ మనకు కనబడతాది. అదేమంటే దయ్యాలన్నింటికి వాటివాటి పాదాలు వెనుదిరిగి వుంటాయంటారు గనుక అన్ని దేశాల దయ్యాలకు పాదాలు తప్పనిసరిగా వెనుకకు తిరిగివుటాయట.

> *ఈ దయ్యాల సంగతి అలాగుండగా ఇటీవల "చైనా, పాకిస్తాన్ దయ్యాలు" దేశ సరిహద్దుల వెంబడి నాలుగడుగులు ముందుకు వేసి టెంట్‌లు వేస్తున్నట్లు వార్తలు...*
>
> *ఇంతే కాదు ఇటీవలి కాలంలో "కామ పిశాచాలు" మరీ రెచ్చిపోయి మన రాజధానీ నగరం కూడ వార్తల్లో కెక్కుతున్నాయి. వీటిని "నిర్భయ" చట్టం క్రింద అరెస్టులు చేయడం కూడా జరుగుతుంది. లేని దయ్యాలకు భయపడకుండ ఇట్టి "దయ్యాలను" ఎదిరించి దేశ సరిహద్దులను రక్షించుకుందాము. సచ్ఛీల భారతావనిని నిర్మించుకుందాం! "పవిత్ర భారతమాత"కు అపకీర్తి ఆపాదించకండి!*

ఇందుకొన్ని దయ్యాలు ప్రత్యేకంగా స్మశాన వాటికల్లో మాత్రమే తిరుగుతూ వుంటాయట. వాటిని కొరివి దయ్యాలు అంటారు. అవి సంచరిస్తూ యుంటే మంటలు వస్తాయంట. స్మశాన వాటికల్లో అక్కడక్కడ బయటపడ్డ జంతువుల, మానవుల ఎముకల నుండి వచ్చే "భాస్వరము" అప్పుడప్పుడు వాతావరణంలో కలసి మండడము పరిపాటి. గాలికాస్త తీవ్రంగానున్నపుడు అవి అటూ ఇటూ కొట్టుకుపోయి "ఆ కొరివి దయ్యం" పరుగులు తీస్తున్నట్లు భ్రమలు కలుగుతాయి. అంతే గాని అవి కొరివి దయ్యాలు కావు. పాడూ కావు.

ఈ దయ్యాలను గూర్చిన సమస్త సమాచారము కేవలము కట్టు కథలే! ఇవి అన్ని మత గ్రంథాలందు, కాశీ మజిలీ కథల్లోను విక్రమార్కుడు వంటి పూరాణ సాహిత్యంలో మరిముఖ్యంగా "యెండమూరి" రచనలందు విఠలాచార్య సినిమాలందు గతకాలంలోను, నేడు శ్రీ రామ్‌గోపాల్ వర్మ "ఆధునిక" సినిమాల్లోను, టి.వి. సీరియళ్లందు మాత్రమే. మనకు తారసపడతాయి.

అసలు ఈ దయ్యాలకు సంబంధించిన ప్రపంచచరిత్రను మనము తిరగేస్తే మనము నివసించే వాస్తవ ప్రపంచంలో ఎప్పుడూ, ఎక్కడా అవి మనుష్యులను చంపిన వాస్తవ చరిత్రలు మచ్చుకైనా కానరావు. కాని చాలాకాలంగా మనము వింటున్న... "అతన్ని లేక ఆమెను"... అరణ్యంలో అమావాస్య రాత్రి... మంత్రాల మర్రిచెట్టు క్రింద దయ్యాలు చంపాయని... వారు రక్తం కక్కి చచ్చారని... దయ్యాలు పీక్కు తిన్నాయని అనేక కథనాలు

చెప్పబడుతూ వుంటాయి. అట్టివారు మానసిక దౌర్భల్యంతో గాని, గుండెబలహీనత వల్లగాని, లేక ఇట్టి దయ్యాల కథలను జీర్ణించుకున్న పిరికివారైనా అయివుండవచ్చు! లేక కౄరమృగాల భారిన పడవచ్చు.

దయ్యాలు, రాక్షసుల కథలన్నీ నాటి అనాగరిక, అజ్ఞాన భయకంపిత రచయితలు సృష్టించిన కాకమ్మ కథలు మాత్రమే! ఇందెంత మాత్రము సత్యములేదు! అందుకే మన పెద్దలు "భయ్యమేదయ్యము" అన్నారు. అదే విధంగా మన పూర్వీకులు అత్యంత భయానకమైన విధంగా కొందరు నమ్మిన చేతబడి తతంగమంతా వట్టిదే! డబ్బుతీసికొని మనుషులను పీడించుట, చంపుట కూడా చేశేవారు. వారికి తెలియకుండా చాటుమాటుగా ఆహార పదార్థాలతో ఏదో ఎలుకలమందులాంటివి పెట్టేవారు. ఇప్పుడవన్నీ పటాపంచలైపోయాయి. అయినా ప్రజల్లో నాటుకుపోయిన అట్టి దయ్యాలుండవచ్చునని అత్యాధికుల్లో కూడ ఇంకా భయాలు పూర్తిగా తొలగిపోలేదు.







## దయ్యాలపై చర్చ!

1990 ఆ ప్రాంతంలో నేను బెల్లంపల్లిలో వుంటూ అక్కడ నేను స్థాపించిన "మానవతా వాద బృంధం" సభ్యులతో తరచుగా అనేక చర్చలు జరుపుతూ యుండేవారము. ఇందులో భాగంగా ఒక అమావాస్య రాత్రి మేమంతా స్మశానంలో కూర్చొని దయ్యాలపై చర్చ ప్రారంభించాము. ఎవరిమట్టుకు వారు దయ్యాలను గూర్చి తమతమ అభిప్రాయాలు వివరించారు. అయితే అందు ఇద్దరు ముగ్గురు మాత్రం మాతో ఏకీభవించక దయ్యాలనేవి నిజంగా వున్నాయని చాలా దృఢంగా విశ్వసిస్తూ తామొకసారి ఈ దయ్యాల ప్రభావం స్వయంగా చవిచూశామని నిజంగా దయ్యాలు భూతాలు వున్నాయని. మీరులేవంటే మేము ఈ మానవతావాద బృంధానికి రాజీనామా పెట్టి వెళ్లిపోతామని దృఢ నిశ్చయంతో చెప్పి లేచినిలువబడి సమావేశ నుండి వెళ్లిపోయే ప్రయత్నం చేశారు.

· అనంతరం నేను వారిని సముదాయించి ఒకవేళ మీ వాదనలో కూడ నిజముండవచ్చును. మీ అనుభవాలను వివరంగా చెప్పమని కోరగా ఒకరి తర్వాత మరొకరు ఈ విధంగా చెప్పడము జరిగింది. మేము ముగ్గురం మరికొందరితో కలసి అడవి ప్రాంతంలో వున్న "తాళ్లగురిజాలకు" ఆవలనున్న ఒక గ్రామానికి పెండ్లికి వెళ్లాము. అన్ని కార్యక్రమాలు ముగిసేసరికి అర్ధరాత్రి దాటి పోయింది. ఉదయం మేము మా బొగ్గు గనుల పనులకు తప్పక వెళ్లాలని సుమారు పది పండ్రెండుమందితో బెల్లంపల్లికి తిరుగు ప్రయాణమైయ్యాము. మేము ఒక ముప్పావుగంట ప్రయాణం చేశాక దారిలో దుమ్మురేపుకొంటూ గాలి ధుమారం ప్రారంభమయ్యింది. కళ్లల్లో ఇసుకపడుతుంది. చిన్నగా చినుకులు మొదలైయ్యాయి. అడుగుముందుకు వేయలేక మేమంతా ఆ రోడ్డు ప్రక్కనున్న ఒక మర్రి చెట్టు క్రిందకు చేరాము. కొంత సేపటికి చినుకులు తగ్గినా గాలిధుమారం వస్తూనేయుంది. చేసేది లేక ఆ చెట్టు క్రింద కూలబడ్డాము. మెల్లమెల్లగా నిదురలోకి జారుకున్నాము. అందు కనీసం నలుగురైదుగురికి అక్కడ భయంకరమైన అనుభవం ఎదురైయ్యింది. గుండెలు బరువెక్కి పోయాయి. ఎవరోమా గుండెల మీద కూర్చొని మా గొంతు పీకలు నొక్కివేస్తున్న అనుభూతిని పొందాము. మేమంతా లేచి మిగత వారిని కూడ లేపి ఈ సంగతులు మాట్లాడు కొంటుండగా సమయం నాలుగు గంటలు కావస్తుంది.

అంతలో ఆ దారిన ఒక లంబాడీ జంట రావడం మేము గమనించి ఆ కాలి బాట మీదకు వచ్చాము. మమ్మును వారు చూచి అయ్యలారా! మీరు ఈ చెట్టుక్రింద

ఎందుకున్నారు? మీకు తెలియదా? ఇది "మంత్రాల మర్రి" చెట్టని. ఈ చెట్టుపై దయ్యాలున్నా యంటారని వెనకటికి ఒకాయన ఈ చెట్టు క్రిందనే రక్తాలు కక్కి చనిపోయాడని చెప్పగా మేము బెంబేలెత్తి, వెనుదిరిగి చూడకుండ బ్రతుకు జీవుడాయంటూ పరుగు లంఘించుకొన్నామని వీరు వివరించారు.

అనంతరము నేను నిలువబడి మిత్రులారా! మీరు చెప్పినవన్నీ అక్షరాలా నిజాలే! అయినప్పటికి ఇందు మనము ఆలోచించవలసిన విషయము ఒకటుంది. అదేమిటంటే మనము పగటి పూట ఇట్టి చెట్లనీడన విశ్రమిస్తే ప్రాణాలు లేచి వస్తాయి. సేదదీరి నట్లుంటాది. దీనికి కారణం పగటి పూట సమస్త వృక్షాల్లోను జరిగే ప్రక్రియ ఒకటుంది. అదేమంటే దానిని "కిరణ జన్య సంయోగ క్రియ" అంటారు. చెట్ల ఆకులు తమలో నున్న "కార్బన్‌డయాక్సైడ్" అనే గాలిలోని పదార్థాన్ని స్వీకరించి ప్రాణవాయవును పుష్కలంగా బయటకు వదలుతూ వుంటాయి. అది ఆఘ్రాణించిన మన ప్రాణాలు వెంటనే తెప్పరిల్లినట్లుంటాయి. అయితే మన మిత్రులు ఆ చెట్టుక్రింద రాత్రి పూట విశ్రమించారు. అయితే చెట్లు రాత్రి సమయాలందు "కార్బన్ డయాక్రైడ్"ను వదలి ప్రాణవాయువును స్వీకరిస్తాయి. ఆ కారణంగానే ఆ ప్రాంతమంతా కార్బన్ డయాక్సైడ్ అనే "విష" వాయువు కారణంగా మనకు ఊపిరి అందనట్టుగా గుండెలు బరువెక్కి నట్లుగా అనిపించి ఏవో దయ్యాలు వచ్చి మన గొంతులు నొక్కుతున్నట్టు గాను, మన గుండెలను పిసికేస్తున్నట్టు గాను మనము అనుభూతి పొందుతాము. అందుచే ఈ ముగ్గురు మిత్రులు చెప్పింది ఎంతమాత్రము అబద్ధము కాదు. ఇట్టి శాస్త్రీయమైన విషయాలు తెలియని వారికి ఇదేదో అతీత శక్తిగాను... దయ్యాలు భూతాలు గాను భ్రమింపజేయడము సహజమే!

ఈ సందర్భంగా అనుకొనని విధంగా, తలంచని రీతిలో మనమొక శాస్త్రీయమైన సైన్సు పాఠాన్ని వినుటకు తోడ్పడ్డాయి. చక్కని సైన్సు విశ్లేషణను తెలిసికొన్నాము. అనంతరం సమావేశం ముగించుకొని బయలు దేరుచుండగా ఆ అపరాత్రి కమ్ముకున్న నిశ్శబ్ద వాతావరణాన్ని భంగపరస్తూ సంఘ సభ్యులు దయ్యాము లేదు! దేవుడు లేదు! అంటూ నినాదాలు చేస్తూ ఇళ్లు చేరుకున్నారు.

అందుకే అనుభవజ్ఞులైన మన పెద్దలు "భయ్యమే-దయ్యమని" అంటూ వుండేవారు. ఈ విధంగా మనము సవాలక్ష శాస్త్రీయ వివరణలు ఇచ్చినా మన ప్రియతమ క్రైస్తవ విశ్వాసులు దయ్యాలు లేవని చచ్చినా ఒప్పుకోరు! దానికి అత్యంత బలీయమైన ముఖ్యకారణ మేమిటంటే? దయ్యాలు లేవంటే, వాటి సరసనే కొనసాగే దేవుళ్లు కూడ లేరనవలసిన అగత్యము ఏర్పడతాది. అదే వారి భయం! దీనిని బట్టి బైబిల్‌లో చెప్పబడిన రోగకారక దయ్యాల కథనాలన్నీ సర్వాబద్ధమని మనము తెలుసుకోవడం జరిగింది.





# దయ్యాలను పారద్రోలిన మానవతావాద బృందం

## (ఇది నిజంగా జరిగిన సంఘటన)

ఆదిలాబాద్ జిల్లా బెల్లంపల్లి ప్రాంతం సింగరేణి బొగ్గుగనులకు ప్రసిద్ధి. 16-07-1998న బీహారుకు చెందిన "షిర్కే కన్‌స్ట్రక్షన్ కంపెనీ" వారు బెల్లంపల్లిలో "రడీమేడ్ ఇళ్లు" నిర్మాణ పనులు చేసేవారు. ఆ రోజు ఆ కంపెనీ మేనేజర్ మా షాపు యొద్దకు వచ్చారు. నేను విషయము అడిగి తెలిసికోగా బెల్లంపల్లి యందలి "శాంతి ఖని" ప్రాంతంలో తాము సంవత్సరకాలంగా క్వార్టర్లు నిర్మిస్తున్నాము. మా వద్ద సుమారు వందమంది వరకు బీహారుకు చెందిన కూలీలు, మేస్త్రీల కుటుంబాలతో వుంటున్నారు. గత నెల రోజులుగా మాకొక తీవ్రమైన సమస్య వచ్చి పడింది. అందు మీ సహాయం కోరివచ్చామని చెప్పగావిని ఆశ్చర్యపోయాను.

విషయమేమంటే మా యొద్ద పనిచేస్తున్న కార్మిక కుటుంబాలను నెలరోజులుగా దయ్యాలు వేధిస్తూ భయాభ్రాంతులకు గురిచేస్తున్నాయి. మీరు దయ్యాలను పారద్రోలుతారని ఎవరో చెప్పగా విని మీ సహాయం కొరకు వచ్చానని చెప్పారు. సాధారణ కార్మికులైతే మాకు ఇక్కడ కూడ దొరకుతారు. కాని వీరు మా సంస్థలో నైపుణ్యం గల కార్మికులు. సిద్ధంగా యున్న రెడీమేడ్ ఇటుకలను పలకలను, తదితర విడి భాగాలను అతికించి అతి తక్కువ సమయంలో ఇళ్లను నిర్మిస్తాము. అయితే ఈ కార్మికులకు సుమారు రెండు లక్షల రూపాయల వరకు అడ్వాన్సులిచ్చి ఇక్కడికి తీసికొని వచ్చాము. వారు దయ్యాలకు భయపడి వెళ్లిపోతే కంపెనీ తీవ్ర నష్టానికి గురియౌతాదని ప్రాధేయపడ్డాడు. అందుకు అసలక్కడ జరుగుచున్న విషయమేమిటో తెలియజెప్పమని అగాను.

ఆయన వివరాలు ఈ విధంగా వివరించాడు. నెలరోజులుగా మా కార్మికుల గుడిశెల్లో కలకలం బయలు దేరింది. తరచుగా వారి గుడిశెల మీద రాళ్లుపడుతున్నాయట. దయ్యాలు వచ్చి చెక్కరలో-కారంపొడి కలపడము, బియ్యంలో-కెరోసిన్ పోయడము, కందిపప్పులో-మంచినూనె, టీ పొడిలో-పసుపు, వండిపెట్టుకున్న ఆహారంలో-ఇసుక కలపడం వంటివన్నీ జరుగుచున్నాయి. అంతేగాక చాలామంది అనారోగ్యంతో బాధపడుచున్నారు. ఇవన్నీ ఆ దయ్యాల చేష్టలేనని వారు భయపడిపోతున్నారు. ఒక కార్మికుడు

చిన్నడబ్బాలో దాచుకున్న అరవై రూపాయల నోట్లు ముక్కలు ముక్కలుగా చింపబడి వున్నాయని వాటిని తెచ్చి చూపుతూ, దొంగలైతే ఎత్తుకుపోతారని ఈ విధంగా చేయరని, అంతేగాక ఈ ప్రాంతంలో రాత్రులందు ఏవో తెల్లని ఆకారాలు తిరుగుతున్నాయంటున్నారు. ఆయన మాటలు విన్న నేను ముక్కలుగా చించబడిన నోట్ల డబ్బాను నా యొద్ద వుంచమనగా ఇచ్చారు.

* * *

మరునాడు మానవతావాద బృంధ సభ్యులలో కొందరిని వెంటబెట్టుకొని ఆ ప్రాంతానికి వెళ్లి పరిశీలించాము. సరిగా అదే సమయానికి ఒక అగంతకుడు అక్కడ ఒక చెట్టు క్రింద పదిమంది షిర్కే కార్మికులతో మంతనాలు జరుపుచున్నాడు. విషయము తెలిసికోమని ముగ్గురు సభ్యులను వారి యొద్దకు పంపగా వారు వెళ్లి అతను చెప్పే సంగతులన్నీ విని తిరిగివచ్చి నాకు చెప్పారు.

అతను వారికి చెప్పిన సంగతులేమనగా తాను ఈ "శాంతి ఖని"లో పనిచేసే కార్మికుడనని, అనేకసార్లు ఈదారి నుండే నేను డ్యూటీకి వెళ్తూ వస్తూ వుండేవాడినని, నైట్‌షిఫ్టులకు తాను వెళ్లుచుండగా ఈ ప్రాంతంలో ఒక లంబాడీ దయ్యం తిరిగేదని, తన యొద్ద తన గురువు ఇచ్చిన "తావీజు" వున్నందున అవి తన జోలికి వచ్చేవి కావని చెప్పుచుండగా వారు మరింత భయపడ్డారు. అంతేకాక గతంలో ఈ ప్రదేశమంతా కాళీగా వుండేదని, ఆ దయ్యాలు యదేచ్ఛగా సంచరించేవని, ఇప్పుడు ఈ క్వార్టర్లు కట్టడం వల్ల వాటి స్వేచ్ఛకు భగం కలిగి బహుషా ఈ పనులను ఆపుచేయుటకు ఆ దయ్యాలే, ఈ విధంగా చేస్తూ వుండవచ్చని చెబుతూ ఈ సంగతులన్నీ నాకు తెలిసినమా గురువుగార్కి చెప్పగా అదేమీ కష్టంకాదని వాటిని క్షణాల మీద పొలిమేరలు దాటిస్తానని చెప్పారు. కాదంటే కాస్త ఖర్చవుతాదని చెప్పగా అక్కడ ముఠామేస్త్రి అతగాడితో బేరం కుదుర్చుకున్నాడు.

ఒక నల్లమేక పోతు, అయిదు సారాసీసాలు, పూజా ద్రవ్యాలు కాక మంత్రగాని ఫీజు 3000 రూ॥ అవుతాదని చెప్పగా వారు అతనితో బేరం కుదుర్చుకున్నారట. ఈ విషయం షిర్కే కంపెనీ మేనేజ్‌మెంట్‌కు నచ్చింది. డబ్బు ఇవ్వడానికి సిద్ధపడి.. ఇక మీరు వెళ్లవచ్చునని మాతో చెప్పారు. వెనువెంటనే నేను వారితో మాట్లాడి ఆ వచ్చినవాడు ఇక్కడి భూతవైద్యుడి బ్రోకరని చెప్పి మేము ఒక్కపైసా కూడ తీసి కోకుండ ఈ దయ్యాలను వెళ్లగొడతామని వారిని ఒప్పించడము జరిగింది. అనంతరం మా అనుచరులతో ఈ సంగతి చెప్పగా డబ్బులిస్తామురమ్మని ఆ బ్రోకర్‌ను ఆ బంగాళాల వెనుకకు తీసికొని వెళ్లి కాస్తమర్యాద చేసి పంపడము జరిగింది.

ముల్లును ముల్లుతోనే తీయాలంటారు. అలాగే మేము వారి నమ్మకాలను భంగం కలగకుండ మాకు తెలిసిన ఒక మరాటీ భూత వైద్యుడు నాగపూర్‌లో వున్నాడు. వాడిని



తీసికొచ్చి ఎక్కడి దయ్యాలను అక్కడికి తరిమి వేస్తామని చెప్పి ఆదివారం తిరిగివస్తామని మీరు నిశ్చింతగా వుండమని అంతవరకు మీరు ఈ పొడిని గుడిశెల చుట్టూచల్లమన్ని సున్నం పొడి, మన్నూ మశానం కలిపి వారికి ఇచ్చి బయలు దేరాము. వారు ఆ విధంగానే చేశారు.

అన్న మాట ప్రకారము ఆ ఆదివారం మరాటా మాంత్రికుడు తన అనుచరులతో రానేవచ్చాడు. ఆకార్మికులంతా అతనిని భయంభయంగా చూస్తున్నారు. "మాంత్రికుడు" తన అనుచరులను వారియొద్ద వుంచి అటూ ఇటూ చూస్తూ ఈ చిత్రంలో కనబడుచున్న విధంగా ఒక్కసారిగా అటు పరుగెత్తి ఒక చెట్టు యొద్ద ఆగి చేతిలో నున్న మేక కొమ్ముతో పైకి చూస్తూ పరికించసాగాడు. అతని వేషం నిజంగానే భయం గొల్పుతుంది. గళ్లలుంగీ కట్టాడు. నల్ల గడ్డం... నుదుటన విభూది, ఆపై ఎర్రని బొట్టు, చేతిలో ఎముక, చంకలో మానవ కపాలం భుజానికొక జోలె! వాడిని చూస్తేనే నిజంగా దయ్యాలు పారిపోతా యనిపిస్తుంది.



అతడు ఏక దీక్షగా అటూ ఇటూ పైకి చూస్తూ వులిక్కి పడ్డట్టు నటిస్తూ... అక్కడున్న చెత్తాచెదారం ప్రోగుజేసి కుప్పపెట్టి, తన జోలెలో నుండి ఒక సీసా బయటకు తీసి... ఆ చెత్తకుప్ప మీద విభూది చల్లాడు. కొద్ది సేపటికి ఆ చెత్త నుండి పొగలు వస్తూ మంట ప్రారంభమయ్యింది. చేతిలోని సీసాను అటూ ఇటూ త్రిప్పుచూ ఆ పొగల్లో సిసాను పెట్టి వెంటనే దానికి సీలువేసి, అది ఎంతో బరువుగా ఉన్నట్టు నటిస్తూ తిరిగి జోలెలో వేసికొని, తన అనుచరులకు సైగ చేయగా వారందరిని అక్కడి ఒక పెద్ద హాలులో కూర్చుండ బెట్టారు. ఈ చర్యలన్నింటిని ఆ కార్మికులు ప్రత్యక్షంగా చూచారు. ఆ దయ్యాన్ని సీసాలో బంధించి వేశాడని వారు భావించారు. ఈ సంగతులన్నీ వారు ఒకరితో ఒకరు చెప్పుకొంటూ రణగొణ ధ్వనులతో వుండగా మాంత్రికుడు ప్రవేశించాడు. క్షణాల మీద ఆ హాలు నిశ్శబ్దమయి

పోయింది.

నిజానికి వీడెవడో మరాటా మాంత్రికుడు కానేకాదు. మాంత్రికుని వేషంలో నున్నన్న నెల్సన్ రఫ్డీ! నే. ఒక్కసారి అందరినీ తేరిపార జూచాడు. గాలిలో నుండి విభూది నిరప్పించడము చూచి వీడెవడో నిజం మాంత్రికుడే కావచ్చని భయపడిపోయారు.

వెనువెంటనే షిర్కే మేనేజరు ఇచ్చిన జరదా డబ్బా బయటకు తీసి అందలి నోట్ల ముక్కలను ముందు కుమ్మరించాడు. దానిమీద సాంబ్రాణి, విభూది జల్లి తన చేతిలో నున్న ఎముకతో గిరగిరా త్రిపాను. ఆ చినిగిపోయిన నోట్లు నుండి నెమ్మదిగా పొగరావడం ప్రారంభమయి మంటలువచ్చి ఆ నోట్ల ముక్కలు కాలిపోయాయి. వెనువెంటనే టేబుల్ మీద పెట్టిన జరదాడబ్బాపై చేతిలోని ఎముకతో కొట్టి మూత తీయగా అందులో కార్మికుడు దాచుకొన్న 60/- రూపాయలు వున్నాయి. వాడిని పిలిచి అందించగా అతను పాదాభివందనం చేశాడు.

ఆ కార్మికులు అక్కడికి "దయ్యంచే కల్తీ చేయబడిన" బియ్యము, చెక్కర వగయరాలను తెచ్చి అక్కడ పెట్టారు. "మాంత్రికుడు" వాటితో ముగ్గులువేసి కళ్లు మూసుకొని క్రింద కూర్చొని ఓం!హీం! అంటూ ఏవేవో వెర్రికూతలు కూస్తూ వెనువెంటనే "సీరియస్"గా మారిపోయి నిలుచుండి పెద్దపెద్ద అరుపులతో చేయిముందుకు చాచి వ్రేలు చూపుతూ "ఒరే! ఖబ్రా" "అరే! బబ్బులూ" సామ్నే ఆవ్! ముందుకు రండని ఆదేశించాడు. ఆ ఇరువురు భయపడి బిత్తర చూపులు చూస్తూ ఈ మరాటా మాంత్రికునికి తమ పేర్లు ఎలా తెలిశాయోయని వణికిపోతూ వచ్చి చేతులు జోడించి హిందీలో మాకేమి తేలియదు. ఇదంతా ఆ దయ్యంపనేనని హడలిపోయారు. అంతట నేను వారి వెన్నుతట్టి మీరేమి భయపడనవసరం లేదు. ఇదిగో చూడండంటూనా జోలెలో నుండి ఒక సీసా బరువుగా తీసి ఆ దయ్యాన్ని ఈ సీసాలో బంధించాను. ఇక మీకేమి భయలేదు. నిశ్చింతగా నిద్రపొండని వారికి చెబుతూ ఆ దయ్యం ఈ సీసాలో పొగ రూపంలో తిరుగుతుందని చూపాను. కథ రక్తి గట్టింది సుఖాంతమయ్యింది. ఎక్కడి వారక్కడికి వెళ్లిపోయారు.

* * *

మూడు దినాల అనంతరం ఆ షిర్కే కంపెనీ మేనేజరు మరో ముగ్గురు వ్యక్తులు వచ్చి నాకు కృతజ్ఞతలు తెలుపుచూ సార్! నేను కూడ దయ్యాలను నమ్మను. అయితే మీ మంత్రతంత్రాలు చూచాక నిజంగా దయ్యాలు వున్నాయేమోనని "డౌట్" వస్తుందని, ఆ లంబాడీ దయ్యం పారిపోయిందని కృతజ్ఞతలు తెలుపుచూ మీ ఇంటికేదయినా అదనపు పనులుంటే వచ్చి చేస్తామని బలవంతం చేశాడు. అటువంటి ప్రతిఫలాలు మాకేమీవద్దని సున్నితంగా తిరస్కరించాను.



అనంతరము వారు నన్ను అనేక ప్రశ్నలు వేస్తూ మీరు దయ్యాలు భూతాలు అబద్ధమని ప్రచారాలు చేస్తూ మంత్రాలు లేవని చెబుతూ కూడ ఇన్ని మ్యాజిక్కులు ఎలా చేశారు? చినిగిన నోట్లును కాల్చివేసి తిరిగికొత్త నోట్లను ఎలా సృష్టించారు?.. మా కార్మికుల పేర్లు మీకెలా తెలిశాయి.... నిజంగా ఇప్పుడు రాళ్లు పడడము లేదు ఆ "దయ్యపుచేష్ట"లన్నీ ఆగిపోయాయి. అని అసలు ఇదంతా మీరు ఎలా చేశారని వారు నన్ను బలవంతం చేశారు.

అందుకు నేను వారితో మాట్లాడుతూ నేను దయ్యాలు భూతాలు అబద్ధమని ప్రచారం చేస్తూ వీటి విరుగుడుకు నేను అవలంభించిన తీరు నిజంగా అందుకు వ్యతిరేకంగానే కనిపించవచ్చును. కాని వారి భయాన్ని పోగొట్టుటకు దయ్యాలు లేవంటే వారు నమ్మరు. అందుకే ఈ విధంగా చేయవలసి వచ్చింది. ఇంతటితో నా పని అయిపోలేదు. కార్మికులకు ఇదంతా నాటకమని చెప్పినా వారు నమ్మరు. అందుచే మేస్త్రీలను, మరి కొందరు ముఖ్యులను కొన్ని దినాల తరువాత సమావేశపరచి ఈ దయ్యం "మిస్టరీ"ని సవివరంగా వివరిస్తానని చెప్పాను.

అనంతరము వారితో యీ దయ్యాల "మిస్టరీ"ని ఎలా ఛేదించామో! వివరాలు తెలిపాను. మొదటగా వచ్చినపుడు మా అనుచరులు ఆ గుడిశలన్నీ తిరిగి కొన్ని "క్లూ"లు సేకరించారు. మరునాడు అంతా పనులకు వెళ్లిపోయాక ఆ కార్మికుల గుడిశెల దగ్గరనున్న తంగేడు చెట్ల గుబురుల్లో ఇద్దరు అబ్బాయిలను మాటువేయించి మేము దూరంగా కూర్చున్నాము. ఒక గంట తరువాత ఆ బాలురు మాకు సైగ చేయగా మేము ఆ చెట్ల గుబురుల్లో నుండి ప్రాకొంటూ ముందుకువెళ్లి చూడగా ఒక స్త్రీ నేలమీద చేతులతో ప్రాకొంటూ వచ్చి కొన్ని గుడిశల్లోకి దూరి రావడము గమనించాము. మిగిలిన స్త్రీ పురుషులందరూ పనికి వెళ్లిపోయారు. కొందరు పిల్లలు దూరంగా ఆడుకొంటున్నారు. ఆమెను గమనించగా రెండుకాళ్ల చీలమండెలకు బేండేజీలు వేయబడివున్నాయి. ఆమెను వెంబడించి ఆమె గుడిశెకు వెళ్లగా మమ్మును చూచి కొంత కంగారు పడింది. ఆమెను పరామర్శించి నాలుగు అరటిపళ్లు, మిక్చరు ప్యాకెట్టు ఇచ్చి హిందీలో అమ్మా నీకేమయ్యిందని అడగగా ఆమె 18 అడుగుల ఎత్తు బిల్డింగ్ మీద నుండి క్రింద పడగా రెండు కాళ్లు విరిగాయని చెప్పింది. అనంతరము ఆమెను సున్నితంగా మందలించి అమ్మా నీవు చేస్తున్న ఈ పని ఏమీ బాగులేదు. మేమంతా చూచాము. ఈ సంగతి మీ ముఠా మేస్త్రితో చెబితే వారందరూ నిన్ను చావగొడతారు. అందుచే మేమెవ్వరికి చెప్పము. అలాంటి పనులు ఇంకెప్పుడూ చేయవద్దని చెప్పి ఆమె చేతిలో ఒక 50/- రూపాయలను పెట్టి వెళ్లిపోతూ మళ్లీ ఇలాంటి పనిచేస్తే పోలీసులు వచ్చినిన్ను కొడతారని బెదిరించి వెళ్లిపోయాము. దెబ్బతో ఆమె భయపడి ఆ పనులను చేయడం మానేసింది.

ఇట్టి ఆమె ప్రవర్తనను గూర్చి తీవ్రంగా ఆలోచించగా ఆమె పై నుంచి క్రింద పడగా శరీరక గాయాలే కాక, మానసికంగా దారుణమైన "షాక్"కు గురియైవుంటుంది. ఆ దెబ్బతో

ఆమె "మైండ్ అఫెసెట్" అయ్యింది. సాధారణంగా డాక్టర్లు ఇట్టి సంగతులను ఆలోచించకుండ కేవలము బ్యాండేజీలు, గాయాలకు మందులే ఇస్తారు. మానసికంగా కోలుకొనుటకు ఎట్టి చర్యలు తీసికోవడము జరగదు. అందుచే ఆమె యెడల కాస్త దయ చూపి ప్రేమించినట్లు నటించి మాట్లాడమువల్ల ఆమె "అప్రూవర్"గా మారింది. నీకు కూడ మంచి రోజులు వస్తాయని చెప్పాము. ఇటువంటి విషయాలు సాధారణంగా బయటపడవు. గుప్తంగానే వుండిపోతాయి. ఆ కారణంగా మన మూఢ భారతంలో ఇట్టివన్నీ దయ్యాల చేష్టలుగా ప్రజలు తీర్చిదిద్దుతారు.

ఇక రెండవదిగానేను ఆ చెట్టు యొద్ద దయ్యాన్ని బంధించినట్టు చేసిన నటనలో "వీభూది"తో పాటు క్రింద చెత్తలోను.. అలాగే చినిగిన నోట్ల మధ్య కూడ చిన్న భాస్వరం ముక్క వేయగా మంటలు వచ్చాయి.

మూడవదిగా నేను ఇంటియెద్దనే ఒక సీసాలో దట్టమైన పొగనింపి దానికి బిరడావేసి సీలు చేశాను. కొన్ని గంటల వరకు అందులోని పొగ అలా తిరుగుతూనే వుంటాది.

నాల్గవదిగా నేను కార్మికులను పేర్లు పెట్టి పిలిచాను. యీ కార్యక్రమానికి ముందే మా అనుచరులు అందు ముఖ్యులైన ఇరువురి పేర్లు సేకరించి నాకు వ్రాసియిచ్చారు.

అయిదవదిగా చినిగిన నోట్ల స్థానే మంచినోట్లు సరిగా అదే విధమైన మరో జరదా డబ్బా సేకరించి అందులో మంచినోట్లు పెట్టి దానిని ఆ కార్మికునికి అందించడము జరిగింది. వీటన్నింటిని ఎవరూ పరిశీలించరు. మాంత్రికుడంటే ప్రజలకు చచ్చేటంత భయం. అందుచే వాడెన్ని గిమ్మిక్కులు చేసినా చెల్లిపోతాయి.

నిజంగా మీరు వచ్చి నన్ను అడగకుండా వుంటే నేను ఈ సత్యాసత్యాలను మీకు వెల్లడించకుండా వుంటే ఇవన్నీ మంత్రాలు, మాయలుగా మీ మస్తిష్కాలతో స్థిరపడి పోవడమేగాక ఈ సంకేతాలు అనేకమందికి అంది వారి బుర్రలు కూడ దయ్యాలను, మంత్రాలను నమ్మేస్తాయి. కాని క్రింది స్థాయి కార్మికులకు ఎంత చెప్పినా వారు నమ్మరు. వారు ఈ విషయాలన్నీ విని ఆశ్చర్యానందాలతో వెళ్లిపోయారు. వెళ్ళే ముందు ఏమన్నా తీసికోండని కనీసం మా తృప్తి కొరకు అన్నారు. అంతలో నేను నడిపించే రడీమేడ్ దుస్తుల షాపు యొద్దకు ఒక కుష్టురోగి రాగా అయితే వంద రూపాయలు ఇవ్వమని అడిగితీసుకుని ఆరోగికి ఇచ్చాను.

అనంతరము ఒక వారం రోజుల తరువాత ఆ కంపెనీలో పనిచేసే మేస్త్రీలు, ముకార్ధమ్‌లు మొదలైన ముఖ్యులైన పదిమందిని పిలిపించి యీ విషయాలను గూర్చి వారికి వివరించి, ఆమెను ఎట్టి పరిస్థితిలోను దండించవద్దని మాట తీసికొని వారికి హొటల్‌లో అల్పాహార విందు ఇచ్చి పంపి వేయడం జరిగింది. నాడు ఈ వార్తను "విశాలాంధ్ర", "ఉదయం" తదితర పత్రికలన్నీ ప్రముఖంగా ప్రకటించాయి. కొన్ని హేతువాద పత్రికల్లో కూడ ముద్రించబడ్డాయి.



## బైబిల్ గ్రంథం నుండి నిషేధించబడిన గ్రంథాలు, ప్రస్తుత బైబిల్‌లో కూడా అనేక మార్పులు - చేర్పులు చేయబడ్డాయి!

బైబిల్‌లోని పాత నిబంధన - క్రొత్త నిబంధన గ్రంథాల మూల ప్రతుల నుండి అసందర్భ గర్భితాలైన అనేక అధ్యాయాలకధ్యాయాలే కాక క్రొత్త నిబంధన నుండి అనేక "సువార్తలు", తొలగించబడ్డాయి.

పాత నిబంధన గ్రంథం నుండి తొలగించబడిన పదునాల్గు భాగాలను ఇంగ్లండుకు చెందిన ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ వారు నిజాయితీతో ముద్రించి దానికి "అప్రోకిపా" (APOKRIPA) అనే పేరుతో విడుదల చేశారు. అయితే రోమన్ కేథలిక్ చర్చివారు ప్రొటస్టెంట్‌లతో విభేధించి పైన చెప్పిన కొన్ని నిషేధిత భాగాలను యధాతథంగా తమ బైబిల్‌నందు పొందుపరచారు. అయినప్పటికి కేథలిక్ చర్చీలందు ఒక్క మత గురువు మాత్రమే బైబిల్‌ను చదివి బోధించే సాంప్రదాయం కొంత ఉన్నందున ఈ కథా భాగాల సంగతి వారికి అంతంత మాత్రంగానే తెలుసు. కాని ప్రొటెస్టెంట్ క్రైస్తవ శాఖల్లో కోట్లాది మందికి పై కథనాలు బైబిల్ నుండి తొలగించబడ్డాయనే విషయం నామమాత్రంగానైనా తెలియదు.

ఇందులో "తోబీతు" అనే కథా భాగం చెప్పుకోదగ్గది. ప్రస్తుత బైబిల్‌నందలి దానియేలు గ్రంథంలోని "శద్రకు" "మేషకు" - "అబేద్నగో".. దానియేలు సింహపు బోనుల కథల్లో యెహోవా భక్తులైన వీరు అన్య దేవతలను ఆరాధించనందుకు అగ్ని గుండాల్లోను, సింహపు బోనులందు పడద్రోయ బడటం తరువాత వారు నమ్ముకున్న దేవుడే వారిని కాపాడడము జరుగుచుండగా చివరకు రాజు రంగ ప్రవేశం చేసి వారిని విడుదల చేయడం అనంతరం వీరిపై అభియోగాలు చేసి అసత్య ఆరోపణలు చేసిన వారినందరిని పట్టి తెచ్చి వారుత్రవ్వుకున్న గోతిలో వారేపడ్డ చందాన వారందరి సింహపు గుహల్లో త్రోసి వీరి దేవుడైన యెహోవాయే నిజరక్షకుడని చాటింపు వేయించడం తిరిగి పాతకథే ప్రారంభమవ్వడం లాంటి ప్రచార కథలో కొద్దిపాటి మార్పులు చేర్పులతో బయలు దేవత, ఘటసర్పం మొదలైన కథల్లో చూడవచ్చును.

ఇదంతా చూస్తుంటే ప్రస్తుత బైబిల్ కథలు నిజమా! లేక ఈ కథలే యధార్థమాయనే సందేహాలతో అవన్నీ కల్పితగాధలేయని పిస్తుంది.

నెల్సన్ రక్షి

దానియేలు మొదటి భాగము నుండి తొలగించబడిన మరో కథ "సూసన్న చరిత్ర" కష్టాల్లో నున్న వారికి "ఫాంఠం" ప్రత్యక్షమై దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించిన చిన్న పిల్లల కార్టూన్ కథల వలెనే దానియేలు దేవతలా ప్రత్యక్షమై ఆమె మాన ప్రాణాలను కాపాడుతాడు. ఈ కథా సంగ్రహాలన్నీ మూసపోసినట్టుగా ఒకే రీతిలో సాగిపోతూ "దానియేలును" "హీరోగా" చిత్రించడం గమనార్హం. ఈ కథల యొక్క మూల ప్రతులు హెబ్రీ భాషలో లేని కారణంగా బైబిల్ నుండి వీటిని తొలగించడం జరిగిందట. తరువాత సొలోమోను జ్ఞానము, జూడీతు, ముగ్గురు బాలల గీతం, ఎస్తేరు, ఇర్మియా, మనష్షే ప్రార్థన, మక్కాబీయుల కథ మొదలైన భాగాలు చెప్పుకోదగ్గవిగా లేవు.

మొత్తానికి ఈ కథలన్నీ గ్రీకు పురాణ కథలు, "అరేబియన్ నెట్స్" స్టోరీలు, మేజిక్ తివాసీలు, కీలు గుర్రాలు మీద గగన విహారం చేసినట్లుండగా - ఒక కథలో ఒక ప్రవక్తకు ఆహారమందించుటకు దివినుండి భువికి యెహోవాచే పంపబడిన దూత ఒక ప్రవక్తను వెదకి పట్టుకొని వేరొక ప్రవక్తకు ఆహార మందించుటకు గాను అతని జుట్టు పట్టుకొని ఖండాంతరాలకు ఆకాశ మార్గాన ఎగరేసుకుపోయి సింహాల గుహలోనున్న దానియేలుకు ఆహారమందించాక తిరిగి అతనిని జుట్టు పట్టుకొని హెలీకాప్టరు లాగ ఎగరేసుకుపోయి వాళ్ల ఊరిలో దించినట్టున్న కథలు వినోద భరితంగా వుంటాయి.

నేటి బైబిల్‌లో కూడ యెహేజ్కేలు ప్రవక్తను ఒక ఆత్మ అతని జుట్టుపట్టుకొని లేపుకొనిపోయి యెరూషలేములో దింపినట్టు (యెహెజ్కేలు 8:13)లో కనబడతాది. నిజానికి ఒక పొడవు జుట్టు వానిని వెంట్రుకలు పట్టుకొని హెలీకాప్టరుకు వ్రేళ్లాడ దీసి అతనిని హైద్రాబాద్ నుండి కాశ్మీర్ తీసికొని వెళ్తే మనిషి మధ్యప్రదేశ్‌లో రాలిపోగా జుట్టు మాత్రం "జమ్ము తావి" చేరతాది. ఇట్టి పిచ్చి కథల వల్ల మేలుకన్నా కీడే ఎక్కువ జరగవచ్చునని కావచ్చు వీటిని వేరుపరచడం జరిగింది.

ఈ ప్రకారం గానే క్రొత్తనిబంధన గ్రంథం నుండి కూడ అనేక భాగాలు వేరు చేయడం జరిగిందనే విషయాలు ఎంతోమంది క్రైస్తవ సోదరులకు తెలియదు. అవేమిటో చూడండి - పౌలు సువార్త, దాడియస్, సువార్త, హెబ్రీయుల సువార్త, నికోదేము సువార్త మొదలైనవి ఎన్నో వుండగా వీటన్నింటిని కాదని కేవలం నాలుగంటే నాలుగు సువార్తలను మాత్రమే క్రొత్త నిబంధనలో చేర్చడం జరిగింది. ఈ విధంగానే అపోస్తలుల కార్యాలు కాకుండా... పిలాతు కార్యాలు, ఆంద్రూ కార్యాలు, మరియ కార్యాలు, పౌలుకార్యాలు, "థెక్లా"కార్యాలు కూడ చేర్చబడలేదు. ఇవేగాక క్రొత్త నిబంధనకు సంబంధించినదేయైన "హెర్మెసు - గొర్రెల కాపరి" అనే మరో గ్రంథం కూడ దూరం చేయబడింది.

బైబిల్ కూర్పు జరిగినప్పుడు పై జెప్పిన గ్రంథాలను కూలంకుశంగా పరిశీలించి వ్యతిరేకమనిపించినవాటిని తప్పించి అనుకూలమయిన వాటికి అవసరమున్నచోట్ల సవరించి మార్పులు చేర్పుల అనంతరం బైబిల్‌ను ఏర్చికూర్చడం జరిగింది. ఈ తతంగమంతా



క్రీస్తుమరణం తర్వాత చాలాకాలం వరకు తెమలలేదట. ఈ నేపథ్యంలో అనేక వాదోపవాదాలు, తర్జనభర్జనల అనంతరం ఓటింగ్ పద్ధతిలో ఫలానా భాగాన్ని చేర్చాలా వద్దాయని నిర్ణయించే వారట. ఈ విధంగానే "లూకా సువార్త" కేవలం ఒక్కటంటే ఒక్క ఓటు తేడాతో గెలిచి సువార్తల హెూదా పొంది దైవవాక్కై పరిశుద్ధత సంతరించుకొని నేటి రూపంలో క్రొత్త నిబంధనలో చోటు చేసికొంది.

ఇక్కడ మనము చూడగా పరిశుద్ధ దేవుడైన యెహెూవా నోటి నుండి పలికిన దివ్యవాక్కులుగా పరిశుద్ధాత్ముడు బోధించగా వ్రాయబడిందని చెప్పే ఈ బైబిల్ గ్రంథం వెనుక సహజసిద్ధమయిన మానవ ప్రయత్నమే మనకు ప్రముఖంగా కనబడుతుంది. ఇన్ని జాగ్రత్తలు తీసికొన్నప్పటికి బైబిల్‌నందు అనేక అసంభావ్యాలు, అసంబద్ధాలు, స్వవాఖ్యావిఘాతాలు, ఊహలు, కల్పితాలు, బద్ధవైరుద్యాలు కానవస్తూనే వున్నాయి.

"మత్తయ్య" చెప్పిన దానితో "మార్కు" ఏకీభవించడు. "లూకా" మాటలలో "యోహాను" విబేధిస్తూ యుంటాడు. "పేతురు" దారి మరో తీరు. "పౌలు"గారి పంథా ఇంకొక తీరు. ఈ విబేధాలు గమనిస్తూయుంటే పాతనిబంధన గ్రంథమందలి ప్రవచన వాక్యాల నెరవేర్పునకై అనేక లావాదేవీలు జరిపి తంటాలు పడ్డట్టు కనబడుతుంది. మచ్చుకు కొన్ని ముఖ్య విషయాలు చర్చించుకొందాము.

యేసు తన పండ్రెండు గురు శిష్యులలో ఎరికోపట్నం వెళ్తుండగా త్రోవప్రక్కన ఇద్దరు గ్రుడ్డి (బిక్షకులను) స్వస్థ పరచినట్లు మత్తయి చెప్పుచుండగా మార్కు దానిని కాదని ఒక గ్రుడ్డి బిక్ష కుడ్నే స్వస్థ పరచడాని అతను బర్తలోమయి కుమారుడని చిరునామా కూడా చెప్పాడు. ఈ విధంగానే మత్తయి దయ్యములు పట్టిన ఇద్దరు మనుష్యులు సమాధులలో నుండి బయలుదేరి వచ్చారని చెప్పగా, మార్కు అపవిత్రాత్మ పట్టిన వాడొకడు సమాధులలో నుండి వచ్చినట్టుగా చెప్పాడు. తదుపరి క్రీస్తు ఏర్పరచుకొన్న పండ్రెండు గురు శిష్యులతో ఒకడు సాతాను మనస్కుడని వాడు తిన్నగా నరకానికి పోవలసిందేనని మార్కు తెలుపగా అందుకు మత్తయి ప్రభువు యొక్క పండ్రెండుగురు శిష్యులు పండ్రెండు సింహాసనాల మీద ఆసీనులై ఇశ్రాయేలు పండ్రెండు గోత్రాలవారికి తీర్పు తీరుస్తారని వక్కాణించాడు. బహుషా మత్తయి రిపోర్టే కరెక్టేమో! ఎందుకంటే యేసు శిలువ మరణం ద్వారా సర్వ ప్రపంచానికి "రక్షణ" కలుగుతుందని క్రొత్త నిబంధన ఘంటాపథంగా చెబుతూ యుండగా ఆ పవిత్ర కార్యానికి ఇస్కరియోతు యూదా చేతుల మీదుగా ప్రారంభోత్సవం జరిపిస్తూ క్రీస్తును సిలువ మరణానికి అప్పగించి క్రైస్తవ ప్రపంచానికి ఎనలేని మేలు చేశాడుగా! {Am I Correct?} లేకుంటే ఇశ్రయేలు అసలు పరలోకంలో కూడ తగవులు కొట్లాటలు, మొదలైనవి వుంటాయా? పండ్రెండు గోత్రాలకు తగువులు తీర్చడమేమిటి? ఇది నిజమా?

యేసు బాప్తీస్మము పొందిన వెంటనే సాతానుచే శోధించబడుటకు అరణ్యానికి కొనిపోబడ్డాడని అక్కడ నలువది దినాలు ఉపవాసమున్నాడని మార్కు వ్రాయగా కాదుకాదు

- యేసు బాప్తీస్మము పొందిన మూడవనాడు "కానా" అనే వూరు పెండ్లి కెళ్లాడని అక్కడ తన మొదటి అద్భుతంగా బానల కొద్దీ ద్రాక్షసారాయి తయారుచేసి అతిథులు మత్తులోదించి ఆనంద పరచినట్టు మన యోహానుగారు శలవిచ్చారు. ఇది నిజమా? లేక అది నిజమా?

వీటన్నింటికన్నా మరీ చిత్రమయిన విశేష మేమంటే క్రైస్తవానికి అతి ముఖ్యమైన యేసు ఆరోహణాన్ని గూర్చి యేసు గలిలయ ప్రాంతం నుండి ఆరోహణమైనట్టు మత్తయి గారు వ్రాయగా, యెరూషలేము నందలి ఒక ఇంటి నుండి పరమునకేగెనని మార్కు గారు - మార్కులేయగా, అదంతా వట్టిదే! బేతనియ నుండి పరలోకానికి ఎగసినట్టు "లూకయ్య"గారు చెబుతుండగా, ఓస్! ఇది కూడా తెలియదా మీకు ఆయన ఒలీవకొండ మీద నుండి ఆరోహణమైనట్టు అపోస్తలుల కార్యంలో చెప్పబడింది. తలోరకంగా చెబుతున్న తబ్బిబ్బుమాటలు... వారి శిగపట్టు చూస్తుంటే అసలు ప్రభువు వారు పరమున కెక్కిన విషయం పిట్టకథయే కావచ్చునిపించుట లేదా? ఒకసారి మనసు పెట్టి ఆలోచించండి! నిజం ఇన్ని పల్టీలు కొడతాదా! క్రైస్తవ ప్రపంచం అబద్ధాలను కూడ విశ్వసించి నమ్ముతుంది. ఎవరైనా ఎప్పుడైనా ఈ విషయాన్ని ప్రశ్నించడం జరిగిందా? లేదనే చెప్పాలి. నిజమనేది ఒకే విధంగా వుంటాదనే విషయ మరువకండి. పరిశుద్ధ గ్రంథమని చెప్పబడ్డ ఈ సత్యవేద గ్రంథంలో అనేక విషయాలు తబ్బిబ్బుమాటలతో వ్రాయబడ్డాయెందుకు అనే సందేహం ఎవరికీ రాదు. ప్రతి మాట వీరిది దైవ వాక్కే పొరపాటున కూడ ఇదేమిటని ప్రశ్నించరు. ఎందుకు? ఏమిటి? అనే ప్రశ్నలతో బైబిల్‌ను ప్రశ్నించకూడదు. దేవుని పేర చెప్పబడిన సర్వాబద్ధాలను నమ్మితీరిన వారిదే పరలోక స్వర్గం.



**యేసును అప్పగించిన ఇస్కరి యోతు యూదా ఈ ద్రోహము వలన సంపాదించిన రూకలతో ఒక పొలమును కొన్నట్టును. అనంతరం అతడు పై నుంచి తలక్రిందులుగా పడి నడిమికి బ్రద్దలై ప్రేవులు బయటకు వచ్చి భయంకర దుర్మరణం చెందినట్టు అపోస్తలుల కార్యాలు 1:18 లో కళ్లకు కట్టినట్టు విస్పష్టంగా పేతురుగారు వివరించారు.**

**అయితే పేతురు సహచరుడైన మత్తయి (27:5-7)లో మరొక విభిన్న కథనం వినిపిస్తూ...**





**యూదా ఆ వెండి నాణెములు దేవాలయములో పారవేసి పోయి ఉరిపెట్టుకొని చనిపోగా, ప్రధానయాజకుడు వచ్చి ఆ వెండి నాణెములతో ఒక కుమ్మరి వాని పొలమును కొన్నట్టు వివరించబడింది.**

**ఇక్కడ మరింత జాగ్రత్తగా పరిశీలిస్తే పేతురు ఆ "రూకలతో" యూదా ఒక పొలమును కొనుక్కున్నట్టుండగా వాటిని "వెండి నాణెము"లుగా మత్తయి సువార్తలో చెప్పబడింది. ఇదిగో చూచారా? బైబిలు ఎంత "సత్యమయినదో!" అలనాడెప్పుడో ఇర్మియా ప్రవక్త "ప్రవచన వాక్యం" నెరవేరిందని అత్యంత ఆర్భాటంగా చెప్పబడిందని క్రైస్తవ సమాజాలు చంకలు కొట్టుకుంటాయి! కాని పేతురు వ్రాసిన "పొట్టపగిలి ప్రేవులు బయటకువచ్చి ఇస్కరియోతుయూధా మరణించిన సంగతి ఒక్క ప్రసంగికుడైనా ఎత్తడు.**

యేసు శిష్యులలో ప్రథమ స్థానంలోనున్న ముఖ్య శిష్యుడిగా సీమోను పేతురుని గూర్చి చెబుతారు. అలాగే మత్తయి కూడా ఆఖరు ఘడియ వరకు యేసువెంటే యన్నాడు. తమ ప్రభువును వెన్నుపోటు పొడిచి నమ్మక ద్రోహానికి పాల్పడి, శత్రువులకు అప్పగించిన యూదా దుర్మరణం చెందగా మిగిలిన పదకొండు మంది శిష్యులు తమ సహచరుని మృత దేహము యొద్దకు నిశ్చయముగా వెళ్లియుందురనుటలో సందియము లేదు. తమ సహచరుడు మరణిస్తే, అందునా దుర్మణం చెందితే ప్రతి ఒక్కరు వెళ్లి స్వయంగా చూస్తారు కదా!

కాని ఇక్కడ మనము చూడగా పేతురు చెప్పింది - యూదా పొట్టపగిలి, ప్రేవులు బయటకు వచ్చి భయంకరంగా చచ్చాడని ఢంకాభజాయించి చెప్పుచుండగా... మత్తయి కాదు కాదు "ఇస్కరియోతుయూదా" ఉరి పెట్టుకొని కనుగృడ్లు తేలేసి చచ్చాడని, వాడు తీసికొన్న లంచం సొమ్ముతో కుమ్మరివాని పొలం కొన్నారని చెప్పడంలోని ఔచిత్యమేమిటి? "అబద్ధ విశ్వాసం"లో ఆరితేరిన క్రైస్తవ సోదరుల్లారా? ఇందలి నిజానిజాలేమిటో తెలిసికొందామనే ఆలోచనమీకెందుకు రాలేదు? అది మీకే విడిచి పెడుతున్నాను. ఒకవేళ దాన్ని గూర్చి ఆలోచిస్తే బైబిల్ అబద్ధమై పోతాదేమోనని అనవసరంగా బుర్రపాడు చేసికోరనే విషయం తెలిసిందే! ఇది ఇర్మియా ప్రవచన వాక్యం నెరవేర్పుకై పన్నిన మాయోపాయం తప్ప మరొటి కాదు. క్రీస్తు మరణానంతరం క్రొత్త నిబంధన కూర్పు చేయుటకు సుమారు రెండు వందల సంవత్సరాలు పట్టింది. ఈ కారణంగా వారు తమ ఇష్టమొచ్చినట్లు మార్పులు చేర్పులు చేశారు. అప్పటివరకు ప్రత్యక్ష సాక్షులెవరు జీవించి యుండదు గనుక ఎవరూ ప్రశ్నించరు. అయినప్పటికి నేటి క్రైస్తవ మేధావులకు కూడ ఎటువంటి సందేహాలు రావు.

ఈ బద్ధవిరుద్ధమైన ప్రత్యక్షసాక్ష్యాలను గూర్చి బైబిల్‌ను అతి ఫవిత్రమయినదిగా నమ్మే క్రైస్తవ సమాజాలు అదేదో అచ్చుపొరబాటో లేక అనువాదకుల గ్రహపాటో అంటారే కాని ఇది యొక మోసపూరితమైన చొరబాటని మాత్రం చచ్చినా ఒప్పుకోరు. బండ వంటి పేతురు కుండ బద్దలు కొట్టినట్లుగా - ఇస్కరియోతు యూదా దుర్మరణాన్ని గూర్చి ఎంతో తేటగా వివరించి చెప్పగా... ఏమిటిది?

మత్తయి సువార్తలో ఎంతో దూరము ఆలోచించి ప్రవక్తల ప్రవచనాలు క్రీస్తుకు అనుకూలంగా నెరవేరినట్టు కనబడడం క్రైస్తవానికి ప్లస్ పాయెంట్‌గా భావించి కావచ్చు ఇర్మియా ప్రవచనం నెరవేరుటకు గాను తల్లక్రిందులుగా పై నుండి క్రిందకు పడిపొట్ట పగిలిచచ్చిన యూదా "పోస్ట్‌మార్టం రిపోర్టు"ను గజిబిజి గావించి కొన్ని సందర్భాల్లో లాకప్‌లో ఉరిపెట్టుకున్న కథలాంటిది సృష్టించి, పేతురు చెప్పిన మామూలు రూకలను ప్రవక్త ప్రవచనానికి అనువుగా వెండి రూకలుగా వివరించి వాటితో అర్జంటుగా ఒక కుమ్మరివాని పొలాన్ని కొన్నట్టు ఫోర్టరీ కథనాన్ని సృష్టించినట్టు ఇక్కడ తేటతెల్లంగా కనబడుతుంది. ఈ విధంగా ప్రశస్తమయినదని చెప్పబడే బైబిల్ గ్రంథానికే మాయనివచ్చులు తెచ్చినట్టు చెప్పవలసి వస్తుంది. మేము అబద్ధాలు ఆడం! సత్యమే పలుకుతాం! అనే ఏ క్రైస్తవ మేధావి ఇట్టివాటి జోలికిపోరు. ఈ పాయెంట్ ప్రప్రథమంగా బహిరంగంగా బట్టబయలు చేసిన వ్యక్తి ఈ నెల్సన్ రష్దీయే!

రెండు వేల సంవత్సరాల పై మాట గల ఈ కేసును తిరగదోడలేము. ముద్దాయిలు లేరు సాక్షులూలేరు. ఇది కేవలం మన ఇంగితజ్ఞానంతోనే నిజం గ్రహించడం తప్పవేరే మార్గంలేదు.

పాతనిబంధన 1950వ సంవత్సరానికి ముందున్న బైబిల్ ప్రతులయందు "ఆ సంగతులు జరిగిన" తరువాత దేవుడు అబ్రహామును శోధించెను" అని యుండగా తదుపరి వచ్చిన బైబిల్ ప్రతులలో... ఆ సంగతులు జరిగిన తరువాత దేవుడు అబ్రహామును పరిశోధించెను అని మార్చడం జరిగింది. ఎందుకంటే యాకోబు 1:13లో దేవుడు ఎవరిని శోధించడని యుందిగా. ఆ కారణంగా దానికి విస్తృతార్థము కల్పిస్తూ "పరిశోధించెను" అని మార్చబడింది. అయితే యెహోవా యోబును ఎందుకు శోధించాడో ఎవరు చెప్పలేరు.

ప్రకటన గ్రథం ఆఖరులో ఒక "వార్నింగ్" అనగా హెచ్చరిక చేయబడింది. ఈ గ్రంథ మందున్న ప్రవచన వాక్యాల నుండి ఎవడైనా – ఏదయినా కలిపినా లేక తీసివేసినా వారికి ఈ గ్రంథంలో వ్రాయబడిన తెలుగుళ్లన్నింటిని దేవుడు వానికి కలుగజేయును! కపడ్‌దార్! అన్న విధంగా బెదిరించబడింది. దీనికి క్రైస్తవ విశ్వాసులు పై వాక్యాన్ని యావత్ బైబిల్ గ్రంథానికి అన్వయించుకొని గజగజలాడిపోతూ వుంటారు.

అయితే మనమిప్పటి వరకు చూచిన దాన్ని బట్టి బైబిల్ గ్రంథ నుండి ఒక "సున్నా" లేక "పొల్లు" కాదు ఏకంగా అధ్యాయాలకు అధ్యాయాలే (అవి నమ్మశఖ్యంగా లేవని తొలగించి పారేయడం జరిగింది). అయినప్పటికి బైబిల్‌నందు మరెన్నో అభూత కల్పిత గాథలు మరెన్నో ఉన్నాయి. నెబుక ద్నేజరు పశువుగా.. పక్షిగా మారిగడ్డి మేసిన ఉదంతం బూటక కథనం కాదా! ఏది ఏమైనా బైబిల్ నుండి అనేక అధ్యాయాలను తొలగించిన పై సంస్కర్తలకు ఏ జబ్బులు వచ్చి, అర్ధమంత్రంగా చచ్చిన దాఖలాలు ఏమీలేవు. అదంతా ఎందుకు నేను సుమారు నలువది సంవత్సరాలుగా బైబిల్ గ్రంథాన్ని చీల్చి చెండాడుతూ



"ఇది నిజమా?" వ్రాత ప్రతులను వ్రాయుచుండగా నేడు నేను ఎనుబది యొకటవ సంవత్సరంలో పడ్డప్పటికి దేవుడు నన్నేమీ చేయలేకపోతున్నాడేమిటి? నేను నేటికి "తమాలవృక్షం" వలె మొవ్వులు వేయుచూ "సెంచురీ" కొట్టే దిశగా సాగిపోతుండగా ఈనా ప్రయత్నాన్ని ఆదిలోనే తృంచివేయుటకు ఎందుకు పూనుకోలేదో ఎవరికీ తెలియదు. రాగల దినాల్లో నేను ఏదన్నా ప్రమాదంలో మరణిస్తే విశ్వాసులంతా చంకలు కొట్టుకొంటూ చూచారా! ఈ గర్వాంధుని పీచము మన దేవుడు అణచి వేశాడంటారు. ఇట్టివారు మరోకోణంలో మాత్రం ఎందుకాలోచించరో తెలియదు.

భక్తాగ్రేసరులు తమ జీవితమంతా ప్రభుని సేవలో శ్రమించి అవసాన దశల్లో కేన్సరు, పక్షవాతం, గుండెజబ్బులు తదితరాలలో మరణించడం లేక కుంటుకుంటూ బ్రతుకులు ఈడ్చడం లేదా! దీనికి వీరేమంటారు. దేవుడు పై విశ్వాసులను ఇంకా పరీక్షిస్తున్నాడంటారు. దివంగత దినకరన్ గారి కుమార్తె "ఏంజలినా" కారు ప్రమాదంలో యుక్త వయస్సులోనే మరణించగా... "యేసు పిలుచుచున్నాడు" పత్రికలో ఈ విధంగా వ్రాశారు. "ఆమె శ్రావ్యమైన గాయని కదా! ఆమె పాటలు వినడానికి కావచ్చు మన ప్రభువు ఆమెను తీసికొని పోయాడన్నారు". ప్రభువు తీసికొని వెళ్లాలంటే కారు ప్రమాదంతో అమాయక బాలికను ఛిద్రం చేసి రక్తసిక్తం గావించనవసరం లేదు కదా! మరణానంతరం తెలివైనా ఉపాయమైనా వుండదని బైబిలే చెబుతుంది. అందుకే అంటారు నరంలేని నాలుక ఏమయినా మాట్లాడతాదని. ఇది కూడ అబద్ధపుసామెతే! నాలుకను మడతపెట్టి చూస్తే అన్నీ నరాలేకనబడతాయి.

బైబిల్ గ్రంథాన్ని పరిశుద్ధాత్మ దేవుడు ప్రబోధించగా ప్రవక్తలచే వ్రాయబడిన పరిశుద్ధ గ్రంథమని చెబుతారు. అయితే బైబిల్‌నందు ఇన్ని రకాల అసందర్భ గర్భితాలైన అరేబియన్ నైట్స్, కాశీమజిలీ కథల వంటి నమ్మశఖ్యం కాని దయ్యాల కథలు ఎందుకు వ్రాయబడ్డాయంటారు? నిషేధించబడిన గ్రంథాల్లోనే కాక నేటి బైబిల్‌లో కూడ అనేక అసంభవాలైన కథనాలు కోకొల్లలు గావున్నాయి.

**బైబిల్ నుండి నిషేధించబడిన కొన్ని కథనాలు "APOKRIPA" (అపోక్రిపా) అనే ఇంగ్లీషు పుస్తకానికి స్వేచ్ఛానువాదం సచిత్రంగా చూడండి!**



**నెల్సన్ రష్దీ**




# తోబీతు

"తోబీతు" నఫ్తాలీ గోత్రానికి చెందినవాడు, అమెనిస్సర్ అనే అస్సీరియన్ రాజు గలెలియలోని "నఫ్తాలి"ని పాలించేవాడు. ఇశ్రాయేలీయులంతా ఎక్కడెక్కడ చెదరియున్నా, నినివే పట్టణం మొదలుకొని తదితర దేశాల్లో నున్న అన్ని తెగలవారు దేవునికి దహన బలులు అర్పించుటకు యెరూషలేమునకు విధిగా వస్తూ యుండేవారు. అయితే అనేకులు ఇతర దేవతలను కూడ పూజిస్తూయున్నప్పటికి తోబీతు మాత్రం యెరూషలేమునకు క్రమం తప్పకుండ వెళ్లి దేవుని ఆరాధించేవాడు. అతడు దేవునికి ప్రథమ దశమ భాగమును సమర్పించేవాడు. అలాగే తన నాయనమ్మకు కూడ ఆర్థిక సహాయము చేస్తూయుండేవాడు.

తోబీతుకు యుక్త వయస్సురాగా "అన్నా" అనే ఆమెను పెండ్లాడాడు. వారికి "తోబియాస్" అనే పుత్రుడు జన్మించాడు. అనంతరం వీరు "నినివే పట్టణనికి" బంధీలుగా కొనిపోబడ్డారు. అక్కడ వారు అనేక శ్రమలను అనుభవించారు. అనేకులు చంపబడ్డాడు. అయినా తోబీతు దేవుని విడువలేదు. కాలక్రమేణా తోబీతు తన మంచితనం వల్ల అక్కడ ఆదేశ ప్రధాని సలహాదారునిగా ఎదిగాడు. తదుపరి తోబీతు పదివెండి తలాంతుల జీతం మీద "మిథియా" అనే పట్టణానికి ప్రధానాధికారిగా నియమించగా అక్కడకు మఖాం మార్చాడు.

కొంతకాలానికి రాజైన అమెనిస్సర్ మరణించగా అతని కుమారుడైన "సెన్హారీబు" రాజాయెను. కౄరుడైన సెన్హారీబు యూద జాతీయులను ఎంతోమందిని చంపిస్తూ యుండగా తోబీతు రహస్యంగా వారందరికి అంత్యక్రియలు జరిపిస్తూయుండేవాడు. కొన్నాళ్లకీ విషయం రాజు చెవినిపడింది. కోపోద్రిక్తుడైన రాజు తోబీతు యావదాస్తిని స్వాధీనం చేసికొన్నాడు. చివరకు తోబీతుకు మిగిలింది తన భార్య-బిడ్డలు మాత్రమే. ఈ సంఘటన జరిగిన యాభై రోజులు గడవక ముందే సెన్హారీబు కుమారులే తండ్రిని చంపి "అరారాతు" కొండకు పారిపోయారు. అనంతరం సెన్హారీబు కుమారుడై ఎసర్హద్దోను" తండ్రికి బదులుగా



రాజయ్యాడు. ఇశ్రా యేలీయుడైన తోబీతు సోదరుని కుమారుడు కోశాధికారిగా రాజు తర్వాతి స్థానంలో యుండేవాడు. తోబీతు ఈ బంధువైన "ఆయహీకారు" ద్వారా తిరిగి "నినివే" పట్టణానికి చేరుకోగలిగాడు. అక్కడ తోబీతు తన కుటుంబ సమేతంగా "పెంతుకోస్తు పండుగ"ను ఘనంగా జరుపుకొంటాడు. అనేక సందర్భాలలో తోబీతు పేదలకు దానధర్మాలు, అన్నదానాలు చేస్తూయుండేవాడు. అయితే ఆమోసు ప్రవక్త ప్రవచించిన ప్రవచనం ప్రకారం "వారి విందులన్నీ దు:ఖ భాజన మౌతాయనే" సంగతిని గూర్చి తోబీతు దు:ఖిస్తూ యుండేవాడు.



ఒకనాడు తోబీతు భోజనం బల్లయొద్ద కూర్చుంటూ కుమారుడైన తొబియాస్‌ను పిలచి నాయనా నీవు బజారుకుపోయి ఆకలిగొన్న యూదుడెవడైనా కనబడితే మన ఇంటికి తీసికొని వచ్చి మనతో కలసి భోజనం చేస్తేనే గాని నేను భోజనం ముట్టనని నీకు తెలుసును కదా! అని చెప్పిపంపగా తిరిగి వచ్చిన తోబియాస్ తమ స్వజాతీయుడైన ఒకరిని ఎవరో చంపారని చెప్పగా తోబీతు అక్కడకు వెళ్లి అతనికి ఖనన సంస్కారము జరిపాడు. అప్పటికే చాలా రాత్రి యైనందున తోబీతు కోటగోడ ప్రక్కన పవళించి ఆకసము దిక్కు చూస్తూయుండగా గోడమీద నున్న పిచ్చుక యొకటి తోబీతు కంట్లో రెట్ట వేయగా అతని రెండు నేత్రాలు పోయి అంధుడై పోయాడు. ఎన్ని వైద్యాలు చేయించినా ఫలితం లేక పోయింది.

ఈ విధంగా అంధుడైన తోబీతు అనేక కష్టాలు పడుతూయుండగా అతని భార్య "అన్నా" గత్యంతరము లేక ఆమె ఒక భాగ్యవంతుల ఇంట పనికి కుదిరింది. ఈ విధంగా వారు దుర్భర జీవితం అనుభవిస్తూ యుండగా ఒకనాడు ఆమె యజమాని ఆమె జీతంతో పాటు ఒక మేక పిల్లను కూడ బహుమతిగా ఇస్తాడు. అంధుడైన తోబీతు తన ఇంట మేక పిల్ల అరుపులు విని దాన్ని ఎక్కడి నుండి దొంగిలిచావని, వెంటనే వెళ్లి దానిని దాని యజమానికి ఇచ్చి రమ్మనాడు. విషయం తెలిసి శాంతించాడు. చిన్న బుచ్చుకొన్న "అన్నా" భర్తతో నీవింతగా నీతి నిజాయితీగా దైవభక్తితో జీవిస్తున్నా మన ఇబ్బందుల్లో ఒక్కరయినా ఆదుకున్నారాయని దెప్పిపొడిచింది.

అంత తోబీతు రోధిస్తూ, దేవుని ప్రార్థిస్తూ, దేవా! నా తండ్రీ! నేను చేసిన పాపాలకు



నున్నదండించవద్దని నీ ఆజ్ఞలను నిజాయితీగా ఆచరిసున్నందునే నాకీ దుస్థితి కలిగిందని ఈ విధంగా నన్ను బ్రతక నీయడమెందుకు? మంటిలో కలిపివేయమని... అయినా నీ ముఖం నా నుండి ప్రక్కకు త్రిప్పుకోవద్దని దీనంగా మొరపెడుతూ, అయినా నీ చిత్తమే సిద్ధించునుగాక! యని ప్రార్థించాడట.

* * *

"మిథియా"లోని "ఎక్బటనా" అనే పట్టణంలో రఘూయేలు కుమార్తె "సారా" తన తండ్రి దాసీల వలన నిందించబడింది. ఎందుకనగా ఆమె ఏడుగురిని వివాహ మాడింది. అయితే ఆమెను "అస్మోదియసు" అనే అపవిత్రాత్మ ఆశించి ఆవరించిన కారణంగా ఆమె పెండ్లాడిన భర్తలందరిని ఆ భూతం మొదటి రాత్రి వారు "సారా" గదిలోనికి అడుగిడినంతేనే వారిని చంపేస్తూ యుండేవాడట. అందుచే ఆమెకు సంతాన యోగం లేకుండా పోయింది. ఆమె దాసీలు సారాయే తన భర్తలను చంపేస్తూ వస్తుందని నిందించసాగారు. అనేకసార్లు ఆమె ఆత్మహత్యాయత్నానికి పాల్పడాలని తలంచినా చేయ సాహసించలేదు.

***తరచుగా ఆమె దేవుని ప్రార్థిస్తూ దేవా! నీ మహిమ ఎల్లప్పుడూ నిలచి యుండును గాక! నీ సృష్టి యావత్తూ నిన్ను స్తుతించునుగాక! నేను ఏ పాపము ఎరుగను ఈ అపనిందలతో నేను జీవించలేను. నన్ను కూడ నీ సన్నిధికి తీసికొని పో! నా నిర్దోశత్వాన్ని నీ వెరుగుదువు. నేనెప్పుడు నా తండ్రికి చెడ్డపేరు తేలేదు. నా భర్తలంతా మరణించాక ప్రయోజనమేమిటి? ఒకవేళ నేను మరణించడమే నీ చిత్తమైనచో ఎవరూ నన్ను నిందించకుండా చూడమని ప్రార్థించేది. అంత దేవుడామె ప్రార్థనకు జవాబిస్తూ... నేను నీ ప్రార్థన నంగీకరించాను. త్వరలో తోబీతు కుమారుడైన "తోబియాస్"తో నీ వివాహము జరగబోతుంది. నీ భర్త అతని తండ్రి యొక్క అంధత్వాన్ని కూడా నివారించగల సమర్థుడని బయలుపరచాడు. ఆమె మహదానందంతో గంతులు వేసింది.***

తోబీతుకు అంధత్వంతోపాటు వృద్ధాప్యం దాపురించింది. ఆపై పేదరికంతో కృంగిపోతూ కాలం గడుపుచుండగా ఒకనాడు మిథియాలో "గబీయేలు" యొద్ద పది సంచులు వెండి నాణెములను దాచిపెట్టిన సంగతి జ్ఞాపకం వచ్చింది. తాను మరణించకముందే తన కుమారునకు చెప్పాలనుకున్నాడు. వెంటనే కుమారని పిలిపించి నాయనా మేము వృద్ధులమైపోయాము. నీ తల్లి అష్టకష్టాలు పడి నిన్నింత వాడిని చేసింది. మేము మరణిస్తే మా ఇరువురుని ఒకే సమాధిలో వుంచుము. దేవుని కట్టడలను మరువక దానధర్మాలు చేస్తూయుండు. అవే నిన్ను రక్షిస్తాయని, దుష్టులకు దానం చేయవద్దని మత్తుపానీయాల





జోలికి వెళ్లకుండ నీతిగా బ్రతకమని చెప్పాడు. నీ స్వజనుల నుండే మంచి అమ్మాయిని ఎంచుకొని వివాహమాడమన్నాడు. నేను చెప్పిన మాటలు వింటే నీవు అబ్రహాము, ఇస్సాకు, యాకోబుల వలె నీవు కూడ ఆశీర్వ దించబడతావని హితోపదేశం చేశాడు.

మరో ముఖ్య విషయమేమనగా నేను మిథియాలోనున్నపుడు "రాగీసు" అనే ఊళ్లో గబీయేలు యొద్ద పది సంచుల వెండి నాణెములు దాచిపెట్టాను. నీవు వెళ్లి ఆ నాణాలను తీసికొనిరా. నేను ఒక ఉత్తరము వ్రాసియిస్తానని, నీవు ఎవరినైనా సాయం తీసికొని మిథియా వెళ్లిరమ్మని కుమారునికి చెప్పాడు. (నెలకు పదివెండి తలాంతుల జీతగాడైన తోబీతు ఒకటికాదు వందకాదు ఏకంగా పది సంచుల వెండిని ఎలా సంపాదించాడో సుమా!) అదీగాకున్నా ఆ క్రూరుడైన రాజు తోబీతు యూదజనుల పక్షపాతియని అతని యావదాస్తిని స్వాధీనం చేసికోన్నాడని చూచాము. అటువంటప్పుడు తోబీతుకు పదినంచుల వెండినాణాలున్నాయనే విషయము నమ్మశఖ్యంగా లేదు. అది అక్రమ సంపాదన కావచ్చును. తోబియాస్ తన మిథియా ప్రయాణం గూర్చి ఆలోచిస్తూ యుండగా... రెఫాయేలు అనే దేవదూత ప్రత్యక్షమయ్యాడు. కాని అతడు దేవదూత యని తోబియాస్‌కు తెలియదు. వివరాలు అడగగా తాను అసారియా గోత్రీకుడినని అనానియాస్ కుమారుడనైన రెఫాయేలునని ఆ దేవదూత అబద్ధం చెప్పాడు. అతనితో తన కుమారుడైన తోబియాస్‌ను తల్లిదండ్రు లిరువురు సాగనంపారు. తమతో పాటు తమ పెంపుడు కుక్కను వెంట బెట్టుకొని వారు బయలు దేరారు. వారా



విధంగా కొండలు, కోనలు దాటుకొంటూ ప్రయాణము సాగించి టైగ్రీస్ నదీ తీరాన చేరి మార్గాయాసం తీర్చుకొనుటకు నదిలో స్నానం చేయుటకు దిగాడు! స్నానం చేయుచుండగా నదిలోనుండి ఒక రాకాసి మత్స్యం అతని మీదికి దూసుకొచ్చింది. దేవదూత రెఫీయేలు వెంటనే ఆ మత్స్యముతో పోరాడి దానిని చంపమని హెచ్చరించగా ఆ మహా మత్స్యమును అతని సూచన మేరకు పెనుగులాడి చంపి దాని గుండె, కార్జము, చేదుకట్లను దూత సూచన మేరకు భద్రపరచాడు. ఆ చేపను వారిరువురు కాల్చి భుజించారు. మరికొంత భాగము ఉప్పులో ఊరబెట్టారు. తోబీతు ఆరాకాశి చేపను ఎలా చంపగలిగాడు. ఎవరైనా నదిలో స్నానం చేస్తూ కైజార్లు కత్తులు మొలకు కట్టుకుంటారా? ఇలాంటి కథలో ఎన్ని అసంభవాలు వ్రాయబడ్డా ఎవరూ ప్రశ్నించరు!



మరునాటి ఉదయాన్నే లేచి తిరిగి ప్రయాణం కొనసాగించారు. ఆ విధంగా వారు మిథియా నందలి "ఎగ్‌బటనా" పొలిమేరలకు చేరారు. తోబియాస్ రెఫాయేలుతో మాట్లాడుతూ ఆ మహామత్స్యము యొక్క అంతర్భాగాలు ప్రయోజన మేమిటని అడగగా దేవదూత బదులిస్తూ దాని "గుండె, కార్జము"లతో దయ్యాలను భూతాలను పారద్రోల వచ్చునని వాటితో పీడించబడే స్త్రీ పురుషులకు విముక్తి కలిగించవచ్చని, అలాగే అంధులకు, కళ్లపై పొరలు వచ్చిన వారికి ఆ చేదుకట్టు ద్వారా అంధత్వమును నివారించవచ్చునని చెప్పగా తోబియాస్ ఆశ్చర్యపోయాడు. ఇలా మాట్లాడుకొంటూ ఎగ్బటనా చేరారు. ఆ దేవదూత తోబియాస్ తో ఈ పట్టణములో నా సోదరుడైన రఘూయేల్ ఉన్నాడు. మనమీ రోజు వారింట్లోనే బస చేస్తామని చెప్పి ఆయనకు సౌందర్య వతి గుణవతియైన ఒక కుమార్తెయున్నది. ఆమె అందగత్తె మాత్రమే కాక చాలా తెలివైనదని మెచ్చుకొంటూ, నేను మా అన్నతో మాట్లాడి మీ వివరాలన్నీ చెప్పి ఆమెను నీ భార్యగా చేస్తానని మాట ఇచ్చాడు. ఎందు చేతనంటే వారుకూడా మీ గోత్రపువారే! ఆమె ఇశ్రయేలు కన్య!

అయితే ఈ సందర్భంలో నీకొక ముఖ్యవిషయం చెప్పడం నా బాధ్యత అదేమంటే ఆమెకు ఇంతకు ముందే ఏడుగురితో పెండ్లిళ్లయ్యాయి కాని వారంతా పెండ్లయిన మొదటి రాత్రి గడపకుండానే మరణించడం జరిగిందన్న మాటలు విని తోబియాస్ భయకంపితుడై నాకీ పెళ్లీవద్దు. ఏమీవద్దు బాబు యిలా బ్రతక నియ్యమన్నాడు. అందుకు రెఫీయేలు అతని వెన్నుతట్టి ధైర్యం చెప్పి నీవెంత మాత్రము భయపడవలసిన పనిలేదు. ఆమె పవిత్రురాలు. నీ తండ్రి ఆనతి ప్రకారము నీ స్వజనులతో





నీకు వివాహం జరిపించవలసిన బాధ్యత నాపైనుంది. నీకొక ఉపాయం చెబుతాను. నీవు మొదటి రాత్రి నీతోపాటు అత్తరు, చేప యొక్క అంతర్ భాగాలను నేను చెప్పిన విధంగా కాల్చి పొగబెట్టినచో ఆ ఆస్మోదియస్ అనే భూతం ఆమెను వదలి పొలిమేరలు దాటి పారిపోతాది. మరెన్నటెన్నటికి అది మీ యొద్దకు రాదని అభయమిచ్చాడు.

మీరు ఎల్ల కాలము దేవుని స్తుతిస్తూ పిల్లా పాపలతో హాయిగా గడపొచ్చని చెప్పగా తోబియాస్ కార్యరంగంలోకి దిగాడు. రఘూయేలు వీరిని సాదరంగా ఆహ్వానించాడు. సారాయే ముందుకు వచ్చి వీరిని ఆహ్వానించింది. తోబియాస్ తనవివరాలు, రఘూయేలుతో చెప్పగా ఉదుటున లేచివచ్చి కౌగలించుకొని ఏడ్చి తన దగ్గబంధువైన తోబీతు అంధుడైన విషయం విని ఎంతో బాధపడ్డాడు. చక్కని విందు ఏర్పాటు చేశారు. మాటలు సందర్భంలో "సారా" విషయం అన్ని వివరాలు తోబియాస్‌కు చెప్పాడు. తన కుమార్తెయైన సారా చేతిని తోబియాస్ చేతిలో పెట్టగా వారి వివాహం జరిగింది.



రఘూయేలు వివాహ ఒప్పందం వ్రాసి అతని భార్య "ఎడ్నా" కు కూడ చూపి సీలు వేశారు. పెండ్లి విందు ముగిసింది. అంతా తెల్లవారే నరికి ఏమి జరుగుతాదోయని ఆందోళనగా వున్నారు. వారు మొదటి రాత్రి గడపడానికి వెళ్లారు. సారా తండ్రి యధా ప్రకారంగా అల్లుడి కోసం సమాధి త్రవ్వించి అంత్యక్రియల ఏర్పాట్లు చేయసాగాడు. దేవదూతయైన రఫీయేలు చెప్పిన ప్రకారంగా పొగపెట్టగా భూతం సారాను విడచి ఇగుప్తుకు పారిపోయింది. ఇగుప్తులో ఒక దేవదూత ఆ భూతమైన ఆస్మోదియస్‌ను బంధించింది. సారా, ఆమె తల్లిదండ్రులు, దాస దాసీలు మహదానందపడి దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించాడు. శుభవార్త విన్న తండ్రి త్రవ్వించిన సమాధిని పూడ్చివేయించాడు. మహదానందంతో పదునాల్గు రోజులు విందులు వినోదాలతో గడిపారు. కనీసం తన అల్లుడు ఈ విందు ముగిసే దాకా జీవించినా చాలనుకున్నాడు గాని అంతా సజావుగా సాగిపోయింది. తన ఆస్తిలో సగం భాగం వ్రాసియిచ్చిన వివాహ ఒప్పందాన్ని అల్లుడికి అందజేశారు. తండ్రి ఆనతి ప్రకారం తోబియాస్ మంది మార్బలంతో "రాగీసు" కవెళ్లగా గబీయేలు ఆపదిసంచుల వెండి నాణాలను అందజేసి సాధరంగా సాగనంపాడు. అత్తమామల కోరిక ప్రకారం వారు అక్కడే కొంతకాలం గడిపాడు.

అక్కడ నినివే పట్టణంలో తోబీతు అతని "భార్య అన్నా"లు, కొడుకైన తోబియాస్ ఇంకా రాకపోవడంతో మరణించాడేమోనని రోధించ సాగారు. కాని అతని తండ్రి మాత్రం తన కుమారు క్షేమంగా వస్తాడనే నమ్మకంతో వున్నాడు. వారు కళ్లుకాయలు కాచేలా ఎదురు చూస్తూయున్నారు. కొన్నాళ్లకు తోబియాస్ తనకు సంక్రమించిన ఆస్తిపాస్తులు, తండ్రిదాచిన పది సంచుల వెండి నాణేలు, దాసదాసీ జనాలను ఒంటెల మీద ఎక్కించి "నినివే"కి బయలుదేరాడు. కుమార్తె సారాతో ఆమె తల్లిదండ్రులు ఇక నుండి నీ అత్తమామలే నీ తల్లిదండ్రులు. మేము మరణించకముందు పిల్లాపాపలతో ఒకసారి వచ్చి వెళ్లమని తోబియాస్‌తో చెప్పారు.

తమ కుమారుడు సకల సంపదలతో కోడలితో సహా "నినివే" పట్టణంలో అడుగుపెట్టాడనే వార్త వారికి తెలిసి మహదానంద భరితులై ఎదుర్కొన వచ్చి ఆలింగనం చేసి కొన్నారు. విషయాలన్నీ విని కోడలిని సాదరంగా ఆహ్వానించారు. వెంటనే తోబియాస్ తన వెంట తెచ్చిన చేప చేదుకట్టును తన తండ్రి కళ్లల్లో మదించగా ఆశ్చర్యకరంగా కళ్లనుండి పొరలు రాలిపడి తోబీత్‌కు దృష్టివచ్చింది. అంతా సంబర పడిపోయారు. తోబీతు యొక్క సోదరుని కుమారులైన యాహీరు, "నాస్‌బాస్"లు కూడ వచ్చారు. వైభవోపేతంగా గొప్ప విందు జరిపి ఆనంద పరవశులైయ్యారు.

తమకింతగా సహాయము చేసిన రెఫాయేలుకు జీతభత్యాలిచ్చిపంపి వేయమని తండ్రి చెప్పగా తోబియాస్ అతను చేసిన సహాయానికి మన ఆస్తిలో అర్ధభాగమిచ్చినా సరిపోదనాడు. అంత ఆ దేవుని దూతయైన రఫీయేలు వారిని ప్రక్కకు తీసికొని వెళ్లి తాను మానవుడ్ని కాదని తాను దేవుని ఏడుగురు పరిశుద్ధ దూతలలో ఒకడిని చెప్పగా వారు విస్మయం చెందారు. ఆ దూత సారాతో మాట్లాడుతూ నీ ఏడుగురు భర్తలు చనిపోయినప్పుడు వారిని పాతిపెట్టే సమయంలో నేనక్కడే యున్నాను. అని వివరించాడు. ఇక నుండి మీరు దేవుని యందు భయభక్తులు కలిగి, దాన ధర్మాలు చేయుచూ ఉపవాస ప్రార్థనలలో గడపమని చెప్పి, తాను మీతో గడిపిన దినాలో నేను తినుట త్రాగుట చేయలేదని కేవలం మీకు భ్రమకలిగించానని చెప్పి వారిని సంభ్రమాశ్చర్యాలలో ముంచి తేల్చి అంతర్ధానమైపోయాడు.

ఈ "తోబీతు" కథనం పరిశీలించగా ఈ రచనా సరళి అంతా బైబిల్ కథల వలెనే కనబడుతుంది. దేవదూతలు మానవాకృతిలో భూలోకమందు సంచరిస్తూ ఇశ్రాయేలు ప్రజలు దైనందిన జీవతంలో ప్రత్యక్షంగా సహకరిస్తూ వారితో కలసిమెలిసి తిరుగుతూ వారి కష్టసుఖాల్లో పాల్గొంటూ, సమయోచిత సలహాలు అందిస్తూ యున్నట్లు చెప్పబడింది.

ఇందు "విఠలాచార్య" భూతప్రేత పిశాచాల కథల వంటి వాటిని స్ఫురణకు తెచ్చాయి. చేప చేదుకట్టుతో కనుచూపు కలిగించడం, దాని అంతర్భాగాలు కాల్చి పొగబెట్టగా దయ్యాలు పారిపోవడం వంటి వింత విషయాలను కల్పిత గాథలను జోడించిన కథగా రక్తి గట్టించారు.



తోబీతు అంధుడై నానా అగచాట్లు పడుతూయుండగా ఆయన భార్య ఇతరుల ఇంట చాకిరీలు చేసినట్టి దయనీయ స్థితిలో కూడ తాను మిధియాలో దాచియుంచిన పది బస్తాల వెండినాణాల సంగతి ఆయనకు గుర్తురాలేదు. కథ సుఖాతం జరగనున్న సమయంలో జ్ఞప్తికి వచ్చింది. ఇటువంటి కల్పిత కథాంశాలు బైబిల్‌లో చేర్చినట్లయితే మొదటికే మోసం వస్తుందని అలనాటి బైబిల్ సమీక్షకులు వీటిని తొలగించడం జరిగింది. అయినప్పటికి ఇటువంటి నమ్మశఖ్యం కాని అనేక కథా సంగ్రహలు నేటి బైబిల్‌నందు కూడ అనేకం కనబడుతూనే వుంటాయి.



# సూసన్న చరిత్ర



"మిల్కియా" కుమార్తెయైన "సూసన్న" అందాలు చిందే సుందరాంగి ఆమె చిన్నతనం నుండి మోషే ధర్మ శాస్త్రానుసారం ఆమెను పెంచారు. భక్తి మార్గంలో పెరిగిన ఆమెను యెహోయాకీము అనే ఒక సంపన్నుని వివాహమాడింది. విశాలమైన వారి ఇంటి ఆవరణ ఉద్యానవనంలా విశాలంగా వుంటుంది. తరచుగా వారింటికి యూదులు వస్తూపోతూ తమతమ వ్యాజ్యెములను యెహోయాకీము యొద్ద పరిష్కరించుకొంటూ యుండేవారు. పని ఒత్తిడి పెరిగి తనకు సహాయంగా మరో ఇద్దరు న్యాయమూర్తులను యెహోయాకీము నియమించగా వారు తమపనిని కొనసాగిస్తున్నారు. యీ విధంగా యెహోయాకీము పేరు ప్రఖ్యాతులు గాంచాడు.

సూసన్న తమ ఉద్యానవనంలోని స్నానవాటికలో చెలికత్తెలలో వెళ్లి స్నానాధికా లాచరించి ఆటపాటలతో గడిపేది. ఇదిలా గుండగా ఆ ఇరువురు న్యాయమూర్తులు "సూసన్న" మీద



కన్నువేశారు. బాబిలోనియాలో దుష్టత్వమున్నది. న్యాయాధిపతులు న్యాయము చెప్పి ప్రజలను సన్మార్గంలో నడిపింపజాలకున్నారని "ప్రభువు" పలికిన విధంగా ఈ ఇరువురు న్యాయమూర్తులు కపటవర్తనులై యుండి, ఒకరికి తెలియకుండా మరొకరు సూసన్న కదలికలను గమనిస్తూ తగిన సమయం కొరకు ఎదురు చూడసాగారు. ఈ దుష్ట పన్నాగంతో ఒకనాడు వారిరువురు ఒకరికి తెలియకుండా మరొకరు స్నానాలవాటిక యొద్ద చెట్లగుబురులలో దాగుయున్నారు. ఆమె స్నానానికి ఉపక్రమిస్తూ యుండగా ఒక్కసారిగా వారు బయటకు వచ్చి ఆమెను బలాత్కరింబోయారు. అందుకామె వారిని ప్రతిఘటించి ఆ సమయంలో చెలికత్తెలు అక్కడ లేరు. వారు నూనె, సుగంధ పరిమళాలు తేవడాని వెళ్లారు. అప్పుడామె దేవునికి వ్యతిరేకంగా నేను పాపం చేయనని ఆమె అక్కడి నుండి తప్పించుకొని పారిపోయింది. అంతనా ఇరువురు న్యాయమూర్తులు సూసన్న భర్తయైన యెహోయాకీము యొద్దకు ముందుగా వెళ్లి ఉద్యానవనంలో నీ భార్యయైన సూసన్న ఒక పడుచువానితో పాపము చేయుచుండగా మేము చూచామని, ఆ యువకుడు బహుబలశాలి యైనందున మేము అతనిని బంధించలేక పోయామని మోసపు మాటలు చెప్పి ఆయనను నమ్మించారు.

మరునాడే యెహోయాకీము ఈ విషయాన్ని న్యాయ విచారణకు అదేశించాడు. సూసన్న తన పిల్లలు, బంధువర్గంతో సహా వచ్చి అవమాన భారంతో ముసుగు వేసికొని దోషివలె తలవంచుకొని నిలుచుంది. ఆ పోకిరీ న్యాయమూర్తులు మరొక్కసారి ఆమె ముఖం చూడాలని ముఖం మీది ముసుగును తొలగించాలని ఆదేశించారు. వారివురు ముందుకు వచ్చి ఆమెతలపై చేతులుంచి ప్రమాణము చేసి ఆమె వ్యభిచారము చేయుచుండగా తాము ప్రత్యక్షంగా చూచామని ఆమెపై నేరం మోపారు. న్యాయస్థానం ఏకగ్రీవంగా సూసన్నకు మరణదండన విధించింది.

అంత "సూసన్న" బిగ్గరగా రోధిస్తూ, నిత్యుడవైన దేవా! నీకు రహస్యము లెల్ల తెలియును. నీవు ప్రతికార్యమును అది జరగక మునుపే తెలియును. నిర్దోషినైన నా మీద ఈ నేర మారోపించబడింది. నేను మరణమునకు సిద్ధముగా నున్నాను. నన్ను రక్షించు ప్రభువాయంటూ మొరపెట్టింది. ఆమెను రాళ్లతో కొట్టి చంపుటకు ప్రజలు ఆమెను తీసికొని పోవుచుండగా దేవుడామె మొరను ఆలకించెను. అంత గొప్ప స్వరముతో దాని యేలు ప్రవక్త ప్రత్యక్షమై ఈమె మరణము నాకు సమ్మతము కాదు. అని పలుకగా జనులెల్లరు దానియేలు వైపు తిరిగి చూడగా ఆయన వారి మధ్యకు వచ్చి మీరెంత మూర్ఖులు. సరియైన విచారణ జరుపకయే ఒక ఇశ్రయేలు కుమార్తెను చంపజూస్తున్నారా! వారిరువురు అబద్ధ సాక్ష్యాలు పలికారు. తిరిగి విచారించమని చెప్పగా మిగిలిన న్యాయమూర్తులు అందుకు సమ్మతించారు. అంతా న్యాయ పీఠం యొద్ద కూర్చున్నారు. దానియేలు ఆ ఇరువురు న్యాయమూర్తులు రూపంలోనున్న మోసకారులను విడివిడిగా విచారించాడు. అసలు సంఘటన ఏ ప్రదేశములో జరిగిందని మొదటి వానిని ప్రశ్నించగా అతడు సింధూర వృక్షము క్రింద

అని చెప్పాడు. ఆ ఉద్యానవనాన్ని పరిశీలించగా అక్కడ అసలు సింధూర వృక్షమేలేదు. మరియొకనిని ప్రశ్నించగా అతడు "మస్తకి వృక్షము" క్రింద జరిగిందని చెప్పాడు. పై విధంగానే ఆ తోటలో మస్తకి వృక్షం కూడా లేదు. ఈ తబ్బిబ్బు మాటలతో వారు దోషులుగా తేలిపోయింది.

అంతట దేవుని "దూత"యైన దానియేలు అబద్ధపు సాక్ష్యములు పలికి ఒక నీతి మంతురాలైన ఇశ్రయేలు కుమార్తె ప్రాణము తీయజూసిన ఆ ఇరువురికి మోషే ధర్మశాస్త్రము ప్రకారము మరణదండన విధించగా వారిని రాళ్లతో కొట్టి చంపారు. ఈ జ్ఞానమైన తీర్పును విన్న న్యాయాధిపతులు, ప్రజలు బిగ్గరగా రోధిస్తూ దేవుని ఆశ్చర్యకార్యమునకై దేవుని వేనోళ్ల కొనియాడారు.

న్యాయం గెలిచినందుకు సూసన్న, భర్తయైన యెహోయాకీము వారి బంధువర్గాలు అత్యానంద భరితులయ్యారు. (ఈ కథాంశం దానియేలు గ్రంథం ప్రారంభ భాగాల నుండి తొలగించబడింది).

ఈ సూసన్న చరిత్రలో ఆపద సమయాలందు దేవుడు తన ప్రజలను ఏ విధంగా ఆదుకొంటాడో వివరించుటకు గాను చాలాకాలం నుండి ప్రచారంలోనున్న "ఫాంటమ్", స్పైడర్ మేన్, "సూపర్‌మేన్"ల వంటి సాహస వీరుల గాథలను పోలిన కథాంశాలు బైబిల్‌నందు ప్రవక్తగా చెప్పబడుచున్న దానియేలును ఈ కథలో హీరోవలె ప్రవేశపెట్టి ఆయన ఆకసాన్నుండి దిగివచ్చిన దేవదూత చందాన భ్రమకలిగించి సూసన్నను ఆదుకొని ఆమె ప్రాణాలను రక్షించినట్టుగా దాని యేలును చూపడం జరిగింది. నేటి బైబిల్‌నందు దానియేలును "హీరో"గా చూపుతూ దేవుడు ఎంతటి గొప్పకార్యాలను చేయగలడో వివరించారు. అయితే మరీ నమ్మశక్యంగా కాని విధంగా దానియేలు వారి మధ్య ప్రత్యక్షం కావడం వంటి అతిశయోక్తులు మరీ అతిగా వుంటాయని, ఇప్పటికే దానియేలు ప్రముఖ పాత్రలో అనేక కథనాలున్నాందున మరీ "అతి"గా యుంటాదనే భావనతో ఈ కథను కూడ బైబిల్ నుండి తొలగించారు. అయితే ప్రస్తుత బైబిల్ నందలి దానియేలు కథలనే కొన్ని మార్పులు చేర్పులతో ఈ నిషేధిత కథలందు కనబడతాయి.





# బయలు దేవత



రాజైన "అస్తువాగేసు" తన పితరులతో కూడ మరణించగా పారశీక రాజైన "కొరెషు" తిరిగి తన రాజ్యాన్ని స్వాధీన పరచుకొన్నాడు. దానియేలుకు తన రాజ్యంలో అత్యంత ఉన్నత పదవినొసంగాడు. బాబిలోనియన్లకు యూదుడైన దానియేలు ఉన్నత పదవిలో నుండుట నచ్చలేదు.

బాబిలోనియన్లు "బయలు దేవతను" పూజించేవారు. దానికి వారక్కడ అతిపెద్ద దేవాలయాన్ని కట్టించి అందు బయలుదేవతను ప్రతిష్టించారు. తమ బయలు దేవత సజీవమైనదని అది ప్రతిదినము నైవేద్యములను స్వయంగా ఆరగిస్తుందని ప్రచారం జరిగింది. ప్రతిదినము దానికి పన్నెండు తూముల మంచి పిండి, నలుపది గొర్రెలు, ఏబది పాత్రల నిండా ద్రాక్షారసము సమర్పించేవారు. తెల్లవారే సరికి ఆ బయలు దేవత ఆ పదార్థముల నన్నింటిని భక్షించి, ద్రాక్షారసాన్ని సేవించేది. అని అందరిని నమ్మించారు.

రాజైన కొరెషు క్రమము తప్పకుండా ఆ బయలు దేవతా విగ్రహాన్ని పూజిస్తూ యుండేవాడు. దానికి పై విధంగా రోజువారీ అర్పణలు అర్పిస్తూయుండేవాడు. ఒకనాడు రాజైన కొరెషు దానియేలుతో నీవెందుకు బయలు దేవతను పూజించుట లేదని నిలదీసి అడిగాడు. అందుకు దానియేలు మహారాజా! బయలు దేవత మానవ నిర్మితమైన విగ్రహము. అయితే యావత్ సృష్టికి మూలకారకుడైన జీవముగల దేవుడినే నేను సేవిస్తాను. ఆ దేవునికి యావత్ మానవాళి మీద అధికారముంది. అందుచే ఇట్టి నిర్జీవమైన దేవతా విగ్రహాలను

నేను పూజించనని నిష్కర్షగా చెబుతాడు.

అందుకు రాజు ప్రత్యుత్తర మిస్తూ మా దేవతయైన "బయలు" ప్రతిదినము క్రమం తప్పకుండ విస్తారమైన ఆహారము భుజిస్తూ గొర్రెలకు గొర్రెలనే తింటూ బానల కొద్దీ ద్రాక్షాసారాయిని సేవిస్తూ యుండగా అది ఎందుకు సజీవమైనది కాదని దానియేలును రాజైన కోరెషు ఎదురు ప్రశ్నవేశాడు. దానియేలు దానికి పక్కున నవ్వి ఆ బయలు దేవతా విగ్రహము బంకమన్నుతో చేయబడి, పైన ఇత్తడి రేకులు తాపడం చేయబడ్డ నిర్జీవ విగ్రహము. అది త్రాగుట, తినుట అనేది అభూత కల్పనయని ఇందు ఏదో మోసము దాగియున్నదని దానియేలు సమాధానమిచ్చాడు.

రాజు అత్యాగ్రహంతో పూజారుల నందరిని రాజమందిరానికి పిలిపించి మీ బయలు దేవతకు సమర్పించే నైవేద్యాలు ఏమౌతున్నాయని, దేవత నిజంగా తింటుందా? వాటిని ఆరగిస్తుందా? నిజం చెప్పండి! అని నిలదీశాడు. అందుకు పూజారులు అదురు బెదురు లేకుండ రాజామీకు అనుమానంగా యుంటే స్వయంగా మీరేవచ్చి నిజం తెలిసికోమంటారు. ఆనాటి సాయంకాలము బయలు దేవతాలయము ఎదుట రాజుతోపాటు దానియేలు కూడ వచ్చి నిలుచుండగా వారి సమక్షమున సకల ఆహార పదార్థాలు, ద్రాక్షారసము వుంచారు. దానియేలు, రాజుతో కూడ వెళ్లి గుడిని పరిశీలించి వచ్చారు. అయితే పూజారులెవరు చూడకుండ దానియేలు తన సేవకులతో మెత్తని బూడిదను గుడంతా చల్లించారు. అనంతరం గుడి గడియ బిగించి తాళం వేసి, దానిపై సీలువేసి తాళం చివిని రాజు యొద్ద వుంచారు. వారు వెళ్తూ వెళ్తూ రాజా బయలు దేవత ఆహారాన్ని తింటే దానియేలుకు, తినకుంటే మాకు మరణ శిక్ష విధించవలసిందేనని సవాలు చేసి వెళ్లిపోయారు. రాత్రి కాగానే పూజారుల కుటుంబాలు రహస్య మార్గం గుండా గుడిలోకి ప్రవేశించి ఆహారపదార్థాలను, ద్రాక్షారసాన్ని తీసికొని వెళ్లిపోయారు.





తెల్లవారగానే రాజు - దానియేలు సమక్షాన గుడి తలుపులు తెరచారు. వారులోనికి తొంగిచూడగా రాజు ఆవేశంతో సజీవమైన బయలు దేవతా! నీవు నిశ్చయముగా సజీవమైన దేవతవు. నీలో ఏ కల్లాకపటము లేదు. నీవే స్వయంగా వీటన్నింటిని ఆరగించావు అని పెద్దస్వరంతో రాజు దేవతను కీర్తించాడు. అంతట దానియేలు మందహాసము చేస్తూ రాజా! మీరు నాతో పాటు ముందుకువచ్చి నేలమీదనున్న అడుగు లేమిటో కాస్త పరిశీలించి చూడండి! అవి పురుషులు, స్త్రీలు, పిల్లల అడుగుజాడలుగా గుర్తించిన రాజు పట్టరాని ఆగ్రహముతో పళ్లుకొరుకుతూ బయలు దేవత పేరున జరిగే పెద్ద మోసాన్ని కళ్లారా చూచి గ్రహించాడు. వెనువెంటనే బయలు దేవత పూజారులైన డెబ్బదిమందిని, వారి భార్యాపిల్లలతో సహా పట్టుకొని బంధించగా రహస్య ద్వారం సంగతి బయటపడింది. వారు తమ నేరాన్ని అంగీకరించారు. రాజైన కోరెషు అక్కడికక్కడే వారి కుటుంబాలతో సహా అందరిని కత్తివాత హతము చేయించాడు.

అనంతరం దానియేలు ఆ బయలు దేవతా విగ్రహాన్ని ముక్కలు ముక్కలు చేయించి దాని గుడిని నేలమట్టం చేయించాడు. దానియేలు దేవుడే నిజమైన దేవుడని తెలిసికొన్నారు.

* * *

నేటి బైబిల్ నందు ఇటువంటి కథనాలు మరి కొన్ని వున్నాయి. వీటి ఉద్దేశం మా దేవుడైన యెహోవా ఒక్కడే సజీవమైన దేవుడు. అన్య దేవతలంతా వట్టిదేనని నిరూపించుటకు చెప్పబడిన అనేక కథాంశాల వలెనే ఇది కూడ యుంది. యధా ప్రకారం దానియేలును ఇందు ముఖ్య పాత్రధారునిగా ప్రవేశపెట్టారు. ఇదికూడ యెహోవాకు సంబంధించిన ప్రచారకథే! అలనాటి మానవులకు అంత సన్నిహితంగా యుండే దేవుడు నేడేమయ్యాడు?



# ఘటసర్పము

చాలాకాలం తరువాత బాబిలోనియన్లు బయలు దేవత గుడి స్థలంలో మరియొక ఆలయాన్ని కట్టి అందు ఘటసర్పాన్ని ప్రతిష్టించి పూజాపురస్కారాలు ప్రారంభించారు. అది కూడ ప్రతీదినము ఆహార పదార్థాలను స్వీకరిస్తూయుండేది. ఒకసారి అంతాబట్ట బయలయ్యాక ఆ రాజుకు తెలివిలేదా? మళ్లీ పాతకథలాంటి దేమొదలెడ తారా? మూసపోసినట్లున్న కథలు ఈ నిషేధిత గ్రంథాల్లో ఆనాలోచితంగా కనబడతాయి.



ఒకనాడు రాజు దానియేలునుద్దేశించి నీవు ఆ సజీవమైన ఘటసర్పాన్ని ఎందుకు పూజించవని అడిగాడు. అది తింటూ త్రాగుతూ యున్నందున అది నిజమైన దేవుడని దానిని పూజించవలసిందిగా బలవంతం చేశాడు. అందుకు రాజుతో దానియేలు మాట్లాడుతూ తాను గతంలో బయలు దేవత విషయంలో చెప్పినట్లే చెప్పాడు. అంతట దానియేలు రాజుతో మీరు సెలవిచ్చినచో ఆ ఘటసర్పమును కత్తిగాని కర్రగాని పట్టకుండ దానిని నేల కూల్చగలనని రాజుతో చెప్పగా రాజుదానికి అంగీకరించాడు. అంతట దానియేలు ఒక పాత్రలో కీలు, క్రొవ్వు, కొన్ని వెంట్రుకలను కలిపి ఉడికించి ముద్దలు ముద్దలుగా చేసి ఆ ఘటసర్పానికి తినిపించాడు. వెనువెంటనే ఆ ఘటసర్పము పొట్టపగిలి మరణించింది. దానియేలు



రాజునుద్దేశించి మీరు ఇంతటి శక్తి హీనమైన "పామును" పూజిస్తున్నారాయని ఎద్దేవా చేశాడు.

ఈ సంగతి జరిగిన తరువాత బాబిలోనియన్లంతా కూడివచ్చి రాజుకు వ్యతిరేకంగా తిరుగుబాటు లేవనెత్తారు. రాజు యూదమతంలో కలసిపోయాడని, అలనాడు తమ బయలు దేవతా పూజారులనందరిని చంపించి గుడిని కూల ద్రోసింది చాలక నేడు ఘటసర్పాన్ని సహితం పడగొట్టించాడని అలజడి చేయుచూ రాజప్రాసాదాన్ని ముట్టడించి అల్లరి చేయుచుండగా గత్యంతరము లేక రాజు దానియేలును వారికి అప్పగించాడు. వారు మహదానందంతో గంతులువేస్తూ దానియేలుకు మరణదండన విధించి అతనిని ఏడు క్రూర సింహాలున్న గుహలోనికి విసరివేశారు. ఆ సింహాలు ప్రతిదినము రెండు పాత మానవ శవాలను, రెండు గొర్రెలను తింటూ యుండేవి. అయితే గుహలోనికి విసరిన దానియేలును ఏమీ చేయకుండా మౌనంగా వున్నాయి. వారు ఆ సింహాలకు ఆరు దినముల వరకు మరే ఆహారము వేయకపోయినప్పటికి దానియేలుకు అవి ఏహానీ చేయలేదు.

* * *



యూదయలో "హబక్కూకు" అనే ప్రవక్త యొకడుండేవాడు. అతడు పులుసు వండి దానిలో రొట్టె ముక్కలను వేసి ఒక కుండలో వాటిని తన పొలములో పంట కోయచున్న పనివారి కొరకు కొనిపోవుచుండెను. అంత "హబక్కూకు" ఒక దేవదూత ప్రత్యక్షమై నీవు వెంటనే బాబిలోనియా వెళ్లి అక్కడ సింహపు గుహలో ఆకలితో అలమటిస్తున్న దానియేలను నా సేవకునికి ఈ పులుసును అందజేయవలసిందిగా ఆజ్ఞాపించగా ఆ ప్రవక్త ఎక్కడ యూదయ - ఎక్కడ బబులోను దేశము అసలు అది ఎక్కడుందో కూడ నాకు తెలియదు! నేనెలా వెళ్లగలనని తత్తరపడ్డాడు.

వెనువెంటనే ఆ దేవదూత ప్రవక్తయైన హబక్కూకు యొక్క జుట్టును ఒడిసిపట్టుకొని అమాంతం (హెలీకాప్టరు వలె) పైకి లేపి (నేటి ఇశ్రయేలు దేశం నుండి ఇరాక్ వరకు) సముద్రమార్గాన ఎగరేసుకొనిపోయి దానియేలున్న ఆ సింహాల గుహ యొద్ద దింపడం జరిగింది.

అంతట ఆ ప్రవక్త గుహ ఎదుటకు వెళ్లి దానియేలును పిలచి ఇదిగో దేవుడు నీ కొరకై ఆహారమును పంపెనని చెప్పగా ఆశ్చర్యంతో అందుకున్న దానియేలు దేవా! నిన్ను

నమ్మిన వారిని నీవెన్నడును ఎడబాయవని ఆయనను స్తుతిస్తూ ఆ పులుసును స్వీకరించి ఆకలి దాహం తీర్చుకున్నాడు. తిరిగి దేవదూత ఆ ప్రవక్త జుట్టందుకొని యూదయ దేశంలో దిగవిడిచి అంతర్ధానమై పోయాడు.

ఏడవ దినాన దానియేలు గతి ఏమైనదోయని రాజైన కోరెషు ఆ సింహాల గుహ యొద్దకు రాగా దానియేలు ఆ భయంకర క్రూర సింహాల నడుమ ప్రశాంతంగా కూర్చొని యుండుట చూచి మహదానందంతో దానియేలును అభినందించి వెనువెంటనే గుహ నుండి బయటకు రప్పించి, సర్వశక్తి మంతుడైన దానియేలు దేవుడే నిజమైన దేవుడని మరి ఏ దేవుడును లేడని చాటింపు వేయించాడు.

దానియేలును సింహపు బోనుల వేయించుటకు కారకులైన పూజారులను, వారి అనుచరులనందరిని పట్టి సింహాల గుహలో పడవేసిన మరుక్షణమే ఆ సింహాలు వారినందరిని చీల్చి చెండాడి ఆరగించాయట! ఈ కథనం బైబిల్ నుండి నిషేధించబడిన భాగం.

అయితే నేటి బైబిల్‌నందు దానియేలు 6వ అధ్యాయంలో పై కథనే మార్పులు చేర్పులతో మరొక విధంగా వివరించబడింది. పై కథనం రాజైన కోరెషు కాలంలో జరిగిందని చెప్పబడగా బైబిల్‌నందు రాజైన "దర్యావేషు" కాలంలో జరిగినట్టుగా వివరించబడింది. దానియేలు అతి శ్రేష్ఠమైన బుద్ధి గల వాడైయున్నందున రాజైన దర్యావేషు నూట ఇరువది మంది అధిపతుల మీద ముగ్గురు ప్రధానులను నియమించి అందు ముఖ్యునిగా దానియేలును నియమిస్తాడు. అయితే దానియేలు తమ వలె అన్యదేవతలను గాక సజీవమైన దేవుడని చెప్పబడే (యెహోవాను) సేవిస్తాడు. (కాని అక్కడ యెహోవా పేరు ఉదహరించబడలేదు) మిగిలిన అధికారులందరు దానియేలు మీద పగబట్టి అతనిని అంతమొందించాలనే ఉద్దేశంతో వారంతా రాజుయొద్దకు వెళ్లి మాయోపాయముతో రాజా! మాదొక మనవి. నేటి నుండి ముప్పది దినముల వరకు దేశంలో ఎవరూ కూడ ఏ దేవుళ్లను గాని, మరెవరికి గాని ఏ విన్నపము చేయకూడదు. నీ ఆజ్ఞను మీరినవారిని సింహాల గుహలో ప్రడద్రోయబడిన కథలన్నీ మూసపోసినట్టుగా ఒకే విధంగా యుండడము, చిత్రమైన రీతిలో చేసిన గగన విహారాలు పురాణ కథలను పోలియున్నాయి. ఒకే రాజు దానియేలు దేవుడే నిజమైన వాడని తెలిసికోవడం చాటింపులు వేయించడం తిరిగి దేవతా విగ్రహాలే నిజమైనవని - చీటికి మాటికి పరీక్షలు పెట్టడం అయోమయాన్ని కలిగిస్తాయి.

అలాగే ఘటసర్పరం కథలో అది విగ్రహమో లేక సజీవమైన "పామో" సరియైన వివరణ లేకుండనే దానియేలు దానికి కీలు, క్రొవ్వు, వెంట్రుల ముద్దలు తినిపించి చంపడం, దాని పొట్ట పగలడం అస్తవ్యస్తమైన రీతిలో చెప్పబడింది. మొత్తానికి ఈ కథలన్నింటి సారాంశం దానియేలు దేవుడే (యెహోవా) నిజమైన దేవుడని చెప్పబడ్డ ప్రచార కథనాలే! ఇట్టి తలాతోక లేని కథనాలను బైబిల్ నుండి తొలగించడం జరిగింది.



## బైబిల్‌లో దానియేలు పాత్రపై సవాలక్ష సందేహాలు...

**(చెరపట్టబడిన దానియేలును నపుంసకుల అధిపతి ఆధీనంలో వుంచటమేమిటి?)**

యూదజనులైన దానియేలును, హనన్య, మిషాయేలు, అజర్యాలు రాజవంశీయులైన రాకుమారులు. యూదులు జ్ఞానులుగా చెప్పబడింది. అయితే రాజవంశీయులైన వీరు మరింత శ్రేష్ఠులు కావచ్చు. మాదీయ రాజైన నెబుకద్నేజరు. బెల్షాసరు, కోరెషు, దర్యావేషు మొదలైన రాజుల యొద్ద వీరు పనిచేసినట్టు బైబిల్ చెబుతుంది.

అన్యజాతులైన రాజులు అనేక సందర్భాలలో యూదులను ఓడించి, అట్టి యుద్ధాలందు అనేకులను చెరపట్టి బంధీలుగా తమ దేశాలకు తీసికొనిపోవడం ఆనవాయితీగా జరిగేది. పైన చెప్పిన నలుగురు రాజవంశీయులు కావడం చేత వారి సహజ జ్ఞాన సంపదను ఆయా శత్రురాజులు ఉపయోగించుకొనేవారు. ఆ నలుగురు యూదులకు వరసక్రమములో దానియేలుకు బెల్తెషాజరు, హనన్య-మిషాయేలు-అజర్యాలకు షద్రకు-మేషాకు- అబెద్నగోలనే మాదీయుల దేవతల పేర్లు పెట్టారు. అయితే ఈ పేర్లు బైబిల్‌లో యున్నవి గనుక పవిత్రమైనవని భావించి తమ పిల్లలకు కూడ ఈ పేరు పెట్టుకుంటూ యుండడము కనబడతాది. అవి అన్యదేవతల పేర్లని క్రైస్తవులు గ్రహించరు.

ఇక్కడొక ముఖ్య విషయం చాలామంది క్రైస్తవ మేధావులకు వచ్చినట్లు కనబడదు. పూర్వం శత్రురాజులు ఆయా దేశాలపై దండయాత్రలు జరిపి అందమైన స్త్రీలతోపాటు తెలివైన యువకులను చెరపట్టుకొని పోయి వారిని రకరకాలుగా ఉపయోగించుకొనేవారు. ఈ విషయాలు తెలుసుకొనుటకు మనము వేలాది సంవత్సరాలు వెనుకకు పోనవసరము లేదు. కేవలము 150 సంవత్సరాల ముందు చరిత్ర మనము తెలిసికొంటే మన కళ్లముందే హైద్రాబాద్, ఢిల్లీ, ఔరంగాబాద్ తదితర చోట్ల మొగలాయి రాజులు, నైజాము నవాబులు మొదలైన సంస్థానాధిపతులు అనేకమంది యువకులను స్వచ్ఛందంగాను, బలవంతంగాను తీసికొనిపోయి వారిని రాణివాసాలలో కాపలాదారులుగా వుంచుటకు ముమ్మందు వారితో ఎట్టి సమస్యలు రాకుండ వారిని నపుంసకులుగా మార్చి పని చేయించుకొన్న వైనం మనందరికి తెలుసును. వీరిలో నేటికీ కొందరు జీవించేయున్నారు.

ఈ నేపథ్యంలో జ్ఞానము, సౌందర్యవంతులైన యూదులతో కూడ ఎట్టి సమస్యలు రాకుండ అట్టి వారిని బలవంతంగా నపుంసకులుగా మార్చే ఆనవాయితీ వుండేది. ఆ

విధంగానే ఈ దానియేలు బృంధాన్ని నపుంసకులుగా మార్చుటకు, నపుంసకుల అధిపతియైన “అష్పెనజు”కు అప్పగించినట్లు మనము గ్రహించాలి. ఇట్టి వివరాలు బైబిలలో ఇవ్వకపోయినా ఇది తిరుగులేని సత్యం. ఎందుకంటే వీరిని న్యాయాధిపతులుగాను, తదితర అధికారులుగను తీర్చిదిద్దవలసియుంటే... వీరిని ఏ న్యాయశాస్త్ర కోవిదులకో అప్పగించియుండేవారు. ఒక్కసారి ఆలోచించండి. పోలీసు అధికారుల క్రింద పోలీసులే వుంటారు కదా! అందుచే నపుంసక అధికారి క్రింద “కొజ్జా”లే వుంటారు. ఈ కారణంగానే వీరు అనేకమయిన పదవుల్లో వున్నప్పటికి ఈ నలుగురిలోను ఏ ఒక్కరు పెండ్లిళ్లు చేసికొని సంసార జీవితంలో యున్నట్టు వివరించబడలేదు.

అయితే ఇక్కడొక చిన్న సందేహం వచ్చిపడింది. యెహెూవా సేవచేయుటకు నపుంసకులు పనికిరారట. యెహెూవాకు పనికిరాని చెత్తమానవుల లిస్టులో నపుంసకులు కూడా వున్నారట. దానిని ఇక్కడ ఉదహరించి యెహెూవాను కించపరచలేను. ఆ భాష అంత సభ్యతగా లేదు. (లేవియా కాండము 21:8:21) చూడండి.

విగ్రహారాధికులైన అన్యరాజులకు జరగనున్న విపత్తులను గూర్చి యెహెూవా ముందస్తు హెచ్చరికలు చేయడమేమిటి?:- ఈ దానియేలు గ్రంథములోను, ఇంతకుముందు కథాంశాలలోను భవిష్యత్‌లో జరగనున్న విషయాలు స్వప్నాలద్వారా యెహెూవా ఆయా అన్యరాజులకు తెలియజేసి వారిని హెచ్చరించుట చూడగా ఏ ప్రయోజనము ఆశించి యెహెూవా వారికి ఇట్టి సహాయ సహకారాలు అందజేసాడు? మరీ చిత్రమైన రీతిలో రాజు తాను కన్న కలను మరచిపోవడము.. ఆయన మరచిపోయిన కలను సైతము దానియేలు చెప్పడమే గాక దాని భావాన్ని తెలియజేయడము ఎంతమాత్రము నమ్మ శఖ్యంగా లేదు. ఈ కలను శకునగాండ్రు, మాంత్రికులు, జ్యోతిష్కులు ఎవరూ చెప్పలేకపోగా ఆ దానియేలు హీరో అవతారమెత్తి ఆయా రాజుల మెప్పుగాని బహుమతులుగాని తనకు అక్కరలేదని చెప్పిన దానియేలు... రాజ సత్కారానికి తలవంచి రాజవస్త్రములు, సువర్ణా భరణములు, కంఠ భూషణములను స్వీకరించి దేశానికి మూడవ అధిపతిగా పదవీ సత్కారం స్వీకరించినట్టు కనబడతాది.

**విగ్రహారాధనలు:** రాజైన నెబుకద్నేజరు ఒక బంగారు ప్రతిమను చేయించి దానిని బబులోను దేశమందు ప్రతిష్టించి తన రాజ్యములోని ప్రతీ పౌరుడు దానికి నమస్కరించాలని, లేని యెడల అగ్నిగుండములోనికి త్రోయబడతారని చాటింపు వేయించాడు. యూదులైన “శద్రాకు, మేషాకు, అబిద్నగో” అనే ముగ్గురు దానిని వ్యతిరేకించగా... అగ్ని గుండం వేడిని ఏడంతలు అధికం చేసి వారిని ఆ గుండంలోనికి పడద్రోయగా... ఆ పడద్రోసిన భటులు మాత్రం ఆ వేడికి మాడిమసియైపోగా ఈ ముగ్గురితో పాటు మరియొకడు తోడై ఆ అగ్ని గుండంలో శికార్లు చేయుచున్నారట. ఆశ్చర్యపడిన రాజు వారిని బయటకు రప్పించి చూడగా వారి బట్టలు అగ్నివాసన సైతం రాలేదట. ఆ నాల్గవ వ్యక్తి దేవదూత అట. ఆయన కూడ పైకి వచ్చాడో లేక మాయమయ్యాడో తెలియదు.





వీరు నమ్ముచున్న దేవుడే సజీవుడైన దేవుడని దేశమంతా డప్పుకొట్టించడము జరిగి మరలా అదే అన్యదేవతల వైపు తిరగడము జరిగేది. తదుపరి అనతికాలంలోనే తిరిగి మరొక ప్రకటన జారీచేసి రాజైన తననే దేశ ప్రజలంతా ఆరాధించాలని లేకుంటే సింహాల గుహల్లో వేయిస్తానని చెప్పడం.. వ్యతిరేకించిన “దానియేలు”ను సింహాల గుహలో వేయించడం, సింహాలు ఆయనను ఏమీ చేయకపోవడం వంటి కథలు బైబిల్‌లోను... నిషేధిత గ్రంథాలలోను కొద్దిపాటి మార్పులతో కనబడతాయి. ఈ కథల్లో కూడ దానియేలే హీరోగా కనబడతాడు. అవన్నీ కల్పిత గాథల వలెనే కనబడతాయి.

ఈ రాజులు నాడు యావత్ ప్రపంచాన్ని కత్తులు కఠారులతో ఏక ఛత్రాధిపత్యంగా పాలించారని చెప్పబడింది. నాటి అనాగరిక యుగాల్లో పారశీక, మాదీయ దేశపు రాజులు విభిన్న జాతులు... భాషలతో కూడుకున్న సమస్త ప్రపంచాన్ని ఏలారా? గాడుదలు... గుర్రాలు... ఒంటెల కాలంలో వేలకిలో మీటర్ల ఆవలనున్న ప్రపంచాన్ని సముద్రాలు దాటి పాలించారనడం సత్యదూరమయిన విషయం.



## దానియేలు యెహెూవా యొక్క ప్రవక్తా? లేక మాంత్రికులు, భూతవైద్యులు, జ్యోతిష్కులు, శకున గాండ్ర అధిపతా?

శ్రీమాన్ దానియేలు మహాశయుడు యెహెూవాకు ప్రీతి పాత్రిమైన ప్రవక్త యెహెూవాకు బద్ధవిరుద్ధమైన రీతిలో శకున గాండ్రకు, గారడీ విద్యలవారికి, కల్దీయులకు, జ్యోతిష్కులకు, మాయలమరాఠీ గజకర్ణగోకర్ణ, టక్కుటమారీ, దగుల్బాజీ మంత్రగాళ్లమీద సుపీరియర్ బాస్‌గా ఉద్యోగం వెలగబెట్టాడా? మాంత్రికులు, గారడీవిధులు చేయువారు, శకున గాండ్రు అంతా నరకంలోకి పోవలసిందేనని బైబిల్ చెబుతుండగా, దానియేలు యెహెూవాను అనునిత్యం సేవించే మహాభక్తునిగా బైబిల్ వివరించగా ఈ దిక్కు మాలిన పదవి ఆయన ఎలా నిర్వహించాడు? ఇట్టి బద్ధ విరుద్ధ కథలను ప్రపంచ క్రైస్తవ సమాజాలు శ్లాఘించడమేమిటి? ఇటువంటి నీతి బాహ్యమైన కల్పిత విషయాల జోలికి వీరెవరూ పోరు. ఆయనను మాత్రం మహోన్నత ప్రవక్తగా ఆరాధిస్తూయుంటారు. ఇది బైబిల్‌కు ఎంతటి విరుద్ధం?



# యెహోవాను తప్ప తాను మరే ఇతర దేవతను పూజించనని చెప్పిన దానియేలే! కాస్సేపు దేవుడి అవతార మెత్తి... పూజలెలా అందుకున్నాడో చూడండి!!

(దానియేలు (2:46) అంతట రాజగునెబుకద్నేజరు దానియేలునకు సాష్టాంగ నమస్కారము చేయుచు, అతనిని పూజించి నైవేద్యములు, ధూపదీపములు సమర్పించ నాజ్ఞాపించెను. ఈ విధముగా రాజైన నెబుకద్నేజరు పూజించగా దానియేలు ఏ మాత్రము అభ్యంతరము చెప్పినట్టు కనబడదు. ఈ విధంగా దానియేలు కాసేపు దేవుడి అవతార మెత్తాడు.



దానియేలు గ్రంథము ఆఖరిలో యెహోవా దూతలుగా చెప్పబడిన గాబ్రియేలు, మిఖాయేలు వంటివారు నారబట్టలు కట్టుకొని నీళ్లపై తేలియాడుతున్నట్లు గజిబిజిగా వివరించబడింది. దేవదూతల మాదిరిగా ఈయన పేరు వెనుకకూడ "యేల్" అనే పదమున్నది. ...నిషేధిత కథల యందలి "సూసన్న చరిత్ర"లో దానియేలు ఒక దేవదూత వలె ప్రత్యక్షమైనందున దానియేలు కూడ ఒక దేవదూత పాత్ర పోషించినట్లనిపిస్తుంది.

ఏదియేమైనా దానియేలు గ్రంథమంతా అభూత కల్పనలతోను, అసంభవ విషయాలతోను నిండియున్నది. పరిశుద్ధ గ్రంథమని చెప్పబడిన బైబిల్ నందు ఇట్టి కల్పనాకథలు దర్జాగా చోటు చేసికొన్నాయి. బైబిల్ ప్రసంగీకులు ఇట్టి అంశాలను భక్తజనులకు అదే పనిగా బోధిస్తూ వారిని మరింత మూఢులుగా తీర్చిదిద్దడం గర్హనీయం. ●





# చక్రవర్తియైన నెబుకద్నేజరు పశువుగా మారి గడ్డియేయుట!

ప్రవక్తయైన దానియేలు మహాచక్రవర్తియైన నెబుకద్నేజరు రాజ్యంలో ప్రధానాధికారిగా పనిచేస్తూ యుండగా ఒక రోజు రాత్రి కలత నిద్రలో ఒక కలగన్నాడు. కలల గుట్టురట్టు తెలిసిన దానియేలు తన కొలువులోనే యుండగా యధాప్రకారంగా కథరక్తి గట్టుటకు శకునగాండ్రను, గారడీవిద్య గలవారిని, మంత్రగాళ్లను పిలిచినా వారు చెప్పలేకపోయారు. నెబుకద్నేజరు వ్యాకులతతో మంచం పట్టాడు.

చివరకు గారడీవిద్యల... శకునగాండ్ర అధిపతియైన దానియేలు రంగ ప్రవేశం చేస్తాడు. (దానియేలు 4వ అధ్యాయములో "కల" వివరాలు ఇవ్వబడ్డాయి. ఆ కలను దానియేలుకు వివరించాడు నెబుకద్నేజరు.

ఆ కల యొక్క భావం గ్రహించిన "దానియేలు" బహు వ్యాకులత చెంది. ఇంతటి దౌర్భాగ్యస్థితి నీ పగవారికి కూడా రాకూడదు. నీవు నీ దేవునికి వ్యతిరేకంగా అనేక దుష్టకార్యాలు సాగించి గర్వాంధుడవయ్యావు. ఏడు కాలములు గడుచువరకు (నీకున్న) మానవ మనస్సునకు బదులుగా "పశుమనస్సు"ను (యెహోవా) నీకు కలుగుజేయును. ప్రజలు నిన్ను తమ యొద్ద నుండ కుండ అరణ్యములోనికి తరిమివేయుదురు. నీవు అడవి జంతువుల మధ్య నివసించుచూ పశువువలె గడ్డిమేయుదువని ఆ కలాభావాన్ని వివరించాడు. ఒక సంవత్సరం తరువాత రాజు గర్వించగా ఆకాశము నుండి ఒక శబ్ధము వచ్చెను..." నెబుకద్నేజరూ! నీవు అడవి జంతువుల మధ్య నివసించుచూ పశువువలె గడ్డిమేయుదువు. ఆకాశపు మంచు నీ మీద కురియును.

**ఈ రాజైన నెబుకద్నేజరు చేసాడని చెప్పే ఆ గొప్ప నేరమేమిటో అది ఎంత గొప్ప నేరమో చూడండి!... ఆయన తన బబులోను రాజధానిని మహా వైభవంగా అద్భుతమైన రీతిలో, కళానైపుణ్యంలో కట్టించడం జరిగింది. ఆ సందర్భంలో రాజు "బబులోను"ను నా ప్రభావమును, నా ఘనతను కనబరచుటకై నేను ఎంతటి గొప్పగా ఈ నగరును కట్టించాను గదా! యని రాజు తనలో తాను అనుకొని విజయగర్వంగా చూచుకొన్నాడట. అంతే! యెహోవాకు వళ్లు మండిపోయింది. వీడికి ఇంత పొగరా! కళ్లు నెత్తికెక్కి నట్లున్నాయి! అనుకున్నాడేమో!**

క్షణాల మీద రాజును శపించేశాడు. ఆ గడియలోనే అది అతనికి సంభవించెను. వెంటనే ప్రజలు అతనిని అడవిలోనికి తరిమివేశారు. ఆకాశపు మంచు అతని దేహమును తడపగా అతని తలవెంట్రుకలు పక్షిరాజు రెక్కలవలె ఈకలు మొలచి, అతనికి పక్షుల వంటి గోళ్లు మొలుచుకువచ్చాయి. ఈ విధంగా నీవు ఏడు సంవత్సరాల పాటు వుంటావని చెప్పాడు. ఏడేళ్లు గడిచిన అనంతరం నెబుకద్నేజరుకు బుద్ధివచ్చి దేవుడ్ని స్తుతించగా తిరిగి మానవాకృతి వచ్చి తన రాజ్యాన్ని తాను పాలించాడట.

ఇట్టి చిత్రమై సంఘటనలు మానవ చరిత్రలో ఎప్పుడైనా ఎక్కడన్నా జరిగాయా! ఇట్టి అసంభవమైన విషయం ఈ నరలోకంలో ఎక్కడా జరిగియుండదు. మా క్రైస్తవ మతమొక్కటే యధార్థమయినదని తదితర మతాలు పుక్కిటి పురాణాలని మాదే అసలైన మతమని చెప్పే ఈ మతం గూర్చి గరివింద సామెత చెప్పి ముగించవలసిందే!





## ప్రార్థనా ఫలితాల ప్రహసనం

సర్వసాధారణంగా సత్‌క్రైస్తవ కుటుంబాల్లో వారివారి దినచర్యల్లో ప్రథమంగా మంచంమీద నుండి లేచినప్పుడే ప్రార్థన ప్రారంభించి... ప్రభువా నీ ఉచితమైన కృపతో నీవు మాకు మరియొక సూర్యోదయం అనుగ్రహించి మమ్మును ఇంకా సజీవుల లెక్కల్లో ఉంచినందుకు వేలాది స్తోత్రవందనములు... ఈ దినమంతటిలో మా యొక్క ప్రతీ చర్య నిన్ను సొంతోషపెట్టేదిగాను... ఇతరులకు సహాయ కరంగాను వుండేటట్టుగా నీ కృప మాకు దయచేయండి!... నేటి మా అనుదినాహారము మాకు అనుగ్రహించండి. ఆకలిగొన్న అన్నార్తుల ఆకలి తీర్చండి. మాకు ఈ అల్పహారం అనుగ్రహించినందుకు అనేక వందనాలు ప్రభువా మరిముఖ్యంగా మా విరోధియైన సాతాను దుష్టపన్నాగముల నుండి మమ్మును రక్షించి కాపాడండి... ఇప్పుడు మా పిల్లలు స్కూల్‌కు వెళ్లుచుండగా నీ రెక్కల నీడన వారిని కాచి కాపాడండి... మా ఉద్యోగ విధులకు మేము వెళ్లుచుండగా మమ్మును కాపాడి రక్షించండి. ప్రేమ గల మా తండ్రీ! నీవు మాకిచ్చిన మధ్యాహ్న భోజనానికై కృతజ్ఞతలు... తిరిగి మమ్ముల నందరిని క్షేమంగా ఇల్లుచేర్చినందుకు... రాత్రి భోజనాన్ని కూడ ఇచ్చినందుకు మరొక్కసారి నీకు స్తుతులర్పిస్తున్నాము... తిరిగి మేము నిద్రకు ఉపక్రమిస్తూయుండగా మంచి నిద్రదయచేయండి... దుష్ట స్వప్నములకు దూరంగా వుంచండి! నీ చిత్తమైతే మాకు మరియొక సూర్యోదయమునను గ్రహించి నిన్ను స్తుతించే భాగ్యము దయచేయండి... ఉదయము లేవడముతోనే తిరిగి ఇదే కథ ప్రారంభమౌతుంది! వీరు ఇంత దీనంగా ప్రతి ఏ పూటకాపూట ఆహార మను గ్రహించినందుకు దేవునికి అలవాటుగా ప్రార్థనలు చేసినప్పటివి. ఈ ఉద్యోగస్తులు మాత్రం నెలకు సరిపడ్డ సరకులకు బియ్యాని మోర్ సూపమార్కెట్లులో కొన్ని స్టోరు చేసికున్నా ఆ దేవుడే వారికి ఏ పూటకాపూట ఆహారమందిస్తున్నాడని బూటకపు ప్రార్థనలు చేయడం నాటకీయంగా కనపడతాది.

దేవుని ప్రార్థించడమనేది - దేవునికి - మానవునికి మధ్య వారధి వంటిదని... అలవాటు ప్రార్థనలుకాక భయభక్తులతో విరిగినలిగిన హృదయాలతో వీలయినంత అధిక సవయం గడపాలని.. మరిముఖ్యంగా అప్పుడప్పుడు ఉపవాస ప్రార్థనలు చేస్తూ వుండాలని ఆయా క్రైస్తవ బోధకులు హెచ్చరిస్తూ ఉంటారు.. ఇంతటితో సరిపోదు.. మీరు మీ

ఆదాయములో "పదియవ వంతు" తప్పనిసరిగా దేవునికి సమర్పించాలని చెబుతూ ఇవి ధిక్కరించిన వారికి నరకమే గతియని భయాందోళనలకు గురిచేస్తూ ముక్కుపిండి మరి వసూలు చేసి జేబులు నింపుకుంటారు.

ఇట్టి భావజాలంలో పెరిగిన నేను నా బాల్యమందే క్రమం తప్పకుండ సండే స్కూళ్లకు, చర్చీలకు, ప్రత్యేక ప్రార్థనా కూటాలకు క్రమం తప్పకుండ వెళ్తూయుండేవాడిని. అనేకసార్లు నా గది తలుపులు మూసుకొని గంటల తరబడి ప్రార్థనలో గడుపుచూ.. ఒకవేళ్ల ప్రభువువారు నాకు దర్శనమిస్తారేమోనని అప్పుడప్పుడు కనులు తెరచి చూస్తూయుండగా కిటికీ రెక్కల సందుల నుండి ప్రసరించే వెలుగు కిరణాలను చూచి అది యేసు ప్రభుని తేజస్సు ఏమోనని భ్రమిస్తూ వుండేవాడిని.

కుటుంబంలో ఎవరికైనా బలహీనతలు, జ్వరాలు వంటివి వస్తే ప్రార్థనలు చేసేవారు.. అవసరమైతే భక్తులను, "ఫాదర్లకు" పిలిచి విశ్వాస ప్రార్థనలు చేయించేవారు వారు తిరిగి వెళ్లేటప్పుడు వారి బైబిల్లో "పదో-పరకో" పెట్టేవారు. అయినా హోమియోమందులు, ధర్మాసుపత్రుల్లో ఇచ్చే "ఎరపురంగు అరుకు" ఇస్తూ కూడా ప్రభువా! ఈ మందులను మీరు దీవించి తగిన గుణము నీయవలసిందిగా ప్రార్థించేవారు. మాకువచ్చిన జ్వరం మందులకు తగ్గిందో లేక ప్రార్థనలకు లొంగిందో మాకు తెలిసేది కాదు.

ఒకసారి కారణాంతరములచే మా అక్కగారు, నేను ఒక ఆదివారము చర్చికి వెళ్లకుండ ఇంట్లోనే వున్నాము. ఆ రోజు మా అక్కగారు " ఒరే! నెల్సా!!" ఏమయినా తినాలనిపిస్తుంది. నీవు ఎవరి పొలంలోని కైనాసరే వెళ్లి కొన్ని కందికాయలు కోసుకొని వస్తే ఉడకబెట్టుకొని తిందామంటూ - నీవు ఎవరి 'చేలో"కి వెళ్తావని అడిగింది. వెంటనే నేను తడుముకోకుండ అక్కా నన్ను దేవుడు ఎక్కడికి నడిపిస్తే అక్కడికే వెళ్తాననగా పకపకా నవ్వేసింది. వెనువెంటనే తేరుకొని.. నీవు దేవుడిపేరు చెప్పి నా కళ్లు తెరిపించావు. అసలే ఈ రోజు ఆదివారం. మనము చర్చికి వెళ్లకుండ ఇంట్లో ఉన్నాము. అదను చూచుకొని "సాతాను" నన్ను ప్రేరేపించిందని మనల్ని పాపంలో పడగొట్టబోయిందని వెంటనే ఆ ప్రయత్నం విరమింపజేసింది.

ఆంగ్లేయుల పాలనా కాలంలో ఈ క్రైస్తవ మతం మన దేశానికి దిగుమతి అయ్యింది. వారు దీని ప్రచారము నిమిత్తం విదేశీ మిషనరీలను ఇబ్బడిముబ్బడిగా దేశవ్యాప్తంగా తీసికొని వచ్చారు. మొట్టమొదటగా.. అణచివేత, బానిసత్వం, వెట్టిచాకిరీ, హింస, అంటరాని తనం, పేదరికంలో కూరుకుపోయి ఊరికి దూరంగా వెలిబ్రతుకులు బ్రతుకుచున్న దళిత వర్గాలు - ఈ మతమైనా మమ్మును ఈ దుర్భర దారిద్ర్యం నుండి రక్షిస్తాదేమోనని ఈ "కిరస్తానీ" మతాన్ని స్వీకరించారు. నాటి ఈ అమాయకులైన చదువు సంధ్యలకు నోచుకోని వీరిని





చేరదీసి పాలపొడి, గోధుమలవంటి ఆహార పదార్థాలను ఉచితంగా అందిస్తూ... రోగులకు చిన్న చిన్న డిస్పెన్సరీల ద్వారా సేవలందించి వీరిని ఆకట్టుకున్నారు. బైబిల్‌నందలి అద్భుత కథలను వివరిస్తూ వచ్చారు. క్రైస్తవ జీవన విధానంలో "ప్రార్థన" అనేది ఎంతటి బలీయమైనదో వివరిస్తూ మీరు ఆవగింజంత విశ్వాసంతో ప్రభువును వేడుకొంటే ఎంతటి అసాధ్యమైనా సుసాధ్యమైపోతాదని వివరిస్తూ.. మీరు ఆ కొండను చూచి నీవు ఎత్తబడి సముద్రంలో పడుదువుగాకయని అంటే చాలు అది ఎగిరివెళ్లి అక్కడ పడతాదని... అలాగే ఆ "కంబళిచెట్టు"ను చూచి నీవు వెళ్లి వేరొకచోట నాటుబడుదువుగాక అన్నంతనే అది జరిగిపోతుందని ఇట్టి ప్రార్థనలు ఎంతటి బలీయమైనవో తెలుసుకోవాలంటే మన యేసు ప్రభువువారు రెండు చిన్న చేపలను - అయిదు రొట్టెలను ముందుంచుకొని ప్రార్థన చేయగా అది వేలాది రెట్లు పెరిగిపోయాయని వాటిని అయిదు వేలమంది తిని తృప్తిపొందగా ఇంకా పండ్రెండు గంపలనిండా మిగిలిపోయాయని... చెప్పబడిన అద్భుత కథలతో నాటి అమాయక ప్రజల బుర్రలను నింపివేయడము జరిగింది. నిజానికి నాటి నుండి నేటి వరకు ఏ క్రైస్తవ భక్తుడు ఇట్టి ప్రచారాలు చేయడము తప్ప ఇట్టి అద్భుత ప్రార్థనల్లో రుజువు చేయడం. ఈ "భూ" ప్రపంచంలో ఎక్కడా జరగలేదు? కేవలము బైబిల్ కథల్లో తప్ప ఇట్టి అద్భుతము జరుగదుగాక జరుగదు.

అయినప్పటికి ఇట్టి "అద్భుత" భావజాలం వీరిలో అణువణువునా జీర్ణించి పోయింది. నాడు క్రైస్తవ మతాన్ని స్వీకరించిన వీరు ప్రార్థిస్తూ.. దేవుడా! మా ప్రభువా! మేమీ దుర్భర దారిద్ర్యాన్ని తట్టుకోలేకపోతున్నాము. మా కేదయినా బ్రతుకు దెరువు చూపండి. అంటూ తమ తమ ప్రార్థనల్లో ప్రాధేయపడ్డారు. వెనువెంటనే ఇట్టి ప్రార్థనలకు జవాబులు రావడం ప్రారంభమయిపోయింది కావచ్చు. ఇట్టి వారికి కామందుల యొద్ద, భూస్వాముల యొద్ద రైతు కూలీలుగాను, పాలేర్లుగాను, స్త్రీలకు ఇళ్లల్లో పనిచేయడం వంటి గంజిమెతుకులు, గటక, అంబలి తినే స్థాయికి ఎదిగిపోయారు.

అనంతరం వీరి సంతానం ఇట్టి గటక, అంబలి, గంజీమెతుకులు, చింకిపాతల బ్రతుకులను భరించలేకపోయారు. వీరు మరింత భక్తి శ్రద్ధలతో ప్రభువుని ప్రార్థించారు. అనంతరం వీరికి మూడణాల కూలీ 16 గంటల పనిదినం అనుగ్రహించాడు కావచ్చు. వీరు మరింత పట్టుదలతో ప్రార్థిస్తూ ప్రభువును విసిగించారేమో! కాలక్రమంలో వీరి జీతాలు రోజుకు ఆరణాలు గాను, మాజీముఖ్యమంత్రి అంజయ్య ఆరణాల కూలి మాకు గుర్తుకురావచ్చు, పనిదినం 12 గంటలు గాను మార్చేశాదేమో... అయినా నాటి ప్రజల ఇబ్బందులు సమసిపోలేదు. వీరి యజమానులు వీరిని అనాగరికమై బూతు మాటలతో పాటు చిత్రహింసలకు గురిచేస్తూ వచ్చారు. చేయని నేరాలకు చెట్లకు కట్టి, చితక బాది

నేరాంగీకారం చేయించారు. కారాగారాలకు పంపారు. గ్రామ బహిష్కరణలు గావించారు. ఈ విషయాలను వీరు ఇంగ్లీషు మిషనరీల దృష్టికి తీసికొని వెళ్లారు. ప్రభుత్వం వాళ్లదే గనుక తమకు ఏమన్నా ఊరట దొరకునేమోయని. అయితే వారు కొందరికి బైబిల్ చదవగల పరిజ్ఞానాన్ని నేర్పి ఇట్టి దీనజనుల యెద్దకు "కేటకిష్టులు" కంట్రీబోధకులను పంపారు. దేవుడు పాపాత్ములైన మా మొర ఆలకించుట లేదేమో! మా గూర్చి మిషనరీ దొరగారితో చెప్పి ప్రార్థన చేయించమని వీరు కోరారు. అందుకువారు మేము మీ యొద్దకు వచ్చింది అందుకే! మేము చెప్పేది వినండి!

మన యేసు ప్రభువువారు కొండమీద ఎక్కి చేసిన ప్రసంగ పాఠం చెబుతాము వినండి... 1) ఆత్మవిశయమై దీనులైన వారు ధన్యులు... పరలోక రాజ్యంవారిది... 2) నీతి కొరకు ఆకలి దప్పులు గలవారు ధన్యులు వారు తృప్తిపరచబడుదురు... 3) కనికరము గలవారు ధన్యులువారు కనికరము పొందుదురు. 4) హృదయ శుద్ధిగల వారు దేవుని చూచెదరు. 5) నీతి నిమిత్తము హింసంచబడు వారు ధన్యులు పరలోక రాజ్యము వారిది. 6) నా నిమిత్తము చెడ్డమాటలెల్ల మీరు పడినప్పుడు మీరు ధన్యులు. సంతోషించి ఆనందించుడి! పరలోకమందు మీ ఫలమధికమగును. ఇట్టి ప్రసంగాలను విన్నవీరు తన్మయత్వం చెందారు. ఈ అసహాయ శూరులకు ఇట్టి ప్రసంగాలు కొండంత ఆదరణ నిస్తూవచ్చాయి. అయినా వీరు ప్రభునికి ప్రార్థన చేస్తూనే ఉన్నారు.

తమకు పై విషయాలు తెలియక మిమ్ము చాలా విసిగించాము ప్రభువా! మమ్మును మన్నించండి! అయితే అంటరాని వారమైన మా సంతానానికి చదువు సంధ్యలు లేవు. పట్టణాలకు వెళ్లి చదివించే స్తోమత మాకు లేదు అంటూ పట్టుదలతో ప్రార్థిస్తూనే ఉన్నారు. ఇట్టి విషయాలు మిషినరీల చెవిని పడ్డటున్నాయి. వారు ప్రభుత్వం దృష్టికి తీసికొని వెళ్లారు. ఇది నిజమే విద్యాలయాలు, వైద్యాలయాల ద్వారా మత ప్రచారం మరింత విరివిగా సాగించవచ్చని భావించిన ప్రభుత్వం క్రమక్రమంగా అనేక గ్రామాల్లో పాఠశాలలు వాటికి అనుబంధంగా చర్చీలు కట్టించి మరింత ఉధృతంగా మత ప్రచారం సాగించారు. చిన్నచిన్న ఆసుపత్రుల ద్వారా మత ప్రచారం మరింత ఊపందుకొంది. కాలక్రమంలో ఇట్టి అణగారిన వర్గాల నుండి టీచర్లుగాను, నర్సులుగాను, గుమస్తాలుగాను, ఆఫీసు బంట్రోతులుగాను నియమితులైయ్యారు. కాలక్రమంలో కాలేజీల్లో ఉన్నత విద్యాభ్యాసాలు చేయడం ప్రారంభమయ్యింది.

ఈ పరిణామానికి ముందే కొందరు బర్మారంగూన్ వంటి ప్రాంతాలకు తరలి వెళ్లారు. చాలామంది అక్కడి నుండి బాగానే సంపాదించుకొని వచ్చారు. మరికొందరు క్రైస్తవులు దేశంలో ఆయా పట్టణాల్లో లేసు వ్యాపారం చేసి ఆర్థికంగా బలపడ్డారు. కాలం వేగంగా దొర్లిపోయింది. దేశంలో అనేక ఇంజనీరింగ్ కాలేజీలు, సివిల్ సర్వీసులు, ఐ.పి.యస్.





మొదలైన అత్యున్నత డిగ్రీకోర్సులు ప్రారంభమయ్యాయి. గతంలో వందల్లో సంపాదించిన జీతాలు వేలల్లోకి వెళ్లిపోయాయి. మరికొంత మంది ఔత్సాహికులు "గల్ఫ్‌కంట్రీస్"లో ఉద్యోగాలు సంపాదించారు. ఇట్టి ఆధునిక కాలంలో గతంలో పది గంటల పనిదినం 8 గంటలుగా కుదించబడింది. వారాంతపు సెలవులు అమల్లోకి వచ్చాయి. అరబ్బు దేశాల్లో వేలకు వేలు సంపాదించే క్రైస్తవ సోదరులు ఇదంతా ప్రభువు కృపగా భావించి ఆయా చర్చీలకు భూరి విరాళాలు అందించారు. ఈ మతం స్వీకరించక ముందు మన పూర్వీకులు ఎంతటి దయనీయంగా జీవించారు. నేడు మనము మన ప్రభువుని ఉచిత కృపవల్ల నేడీ స్థితికి ఎదిగి పోయామని పరవశించి పోతూ...

"పెంటాకుప్పల మీద పడియున్న ఈ నీచ మంటిపురుగులను.. లేవనెత్తి! మింటిపై ఘనులతో కూర్చుండాబెట్టీ... అంటూ గీతాలాపనలు చేస్తూనే వున్నారు. ఇట్టి అభివృద్ధితో క్రైస్తవ మత విశ్వాసాలు మరింత పెరిగిపోయాయి. "ప్రార్థన"లో ఎంత గొప్ప శక్తియుందో అనుకొంటూ మరింత విశ్వాస ప్రార్థనలతో ముందుకు సాగుతున్నారు.

ఈ నేపథ్యంలో విజ్ఞాన శాస్త్రం మరింత విస్తరించసాగింది. వైద్య విజ్ఞానం మరింతగా పెరిగిపోయింది. సాఫ్ట్‌వేర్ చదువులు ప్రారంభమయ్యాయి. జీవ శాస్త్రం పురోగతి సాధించింది. నాటి రేడియోలు, టెలీఫోన్‌లు కాలగర్భంలో కలసిపోయాయి. టి.వి.లు., ఇంటర్‌నెట్ సౌకర్యాలు, సెల్‌ఫోన్లు, కంప్యూటర్‌లు మానవ జీవితంలో పెనవేసుకుపోయాయి. విద్యావంతులైన నేటి ఆధునిక క్రైస్తవుల ప్రార్థనాంశాలు పూర్తిగా మారిపోయాయి. ప్రభువైన దేవా! పరమతండ్రీ మా అమ్మాయి.. అబ్బాయిలను వారి అత్యాధునిక విద్యాభ్యాసాల్లో ప్రథములుగా ఉత్తీర్ణులయ్యేటట్టు నీ జ్ఞానాన్ని వారికి అనుగ్రహించండి. మా పిల్లలకు అమెరికా.. ఆస్ట్రేలియా.. స్విజ్జర్‌లాండ్.. న్యూజిలాండ్... దక్షణాఫ్రికా.. జర్మనీ.. ఇటలీ వంటి దేశాలకు వీసాలివ్వండి... వారిని విమాన ప్రయాణాల్లో కాపాడండి అంటూ వీరి ప్రార్థనల్లో గణనీయమైన మార్పులు వచ్చాయి.



గత అజ్ఞాన కాలంలో లాగ నేడు.. దేవా మేము నీరు నిలువ యుంచుకొనుటకు మాకొక మట్టి బానను ఇవ్వండి, మేము వర్షంలో తడవకుండ మాకొక తాటాకు గొడుగు ఇవ్వండి! మేము ఇల్లు కట్టించుకొనుటకు ఒక "సున్నపుడంగు" ఇవ్వండి! అప్పుడప్పుడు పట్నం వెళ్లడానికి ఒక ఒంటెద్దు బండి కావాలి... సైకిల్ కావాలని నేటి భక్తజనులు ఎవ్వరూ దేవుని ప్రార్థించరు. నేడవన్నీ కాలగర్భంలో కలసిపోయాయి. ఒక్క సైకిల్ తప్ప!




నేడు నడిమంత్రంగా కోటీశ్వరులైపోతున్న టి.వి. ప్రసంగికులు ప్రభువా వేలాదిమంది పట్టగల ఎకరాల కొద్దీ స్థలంలో సువిశాల ప్రదేశంలో అత్యాధునిక ప్రార్థనా మందిరం కావాలి. నీ సేవలో మరింత చురుకుగా పాల్గొనుటకు "స్కోడా" రోల్స్-రాయ్, "BMW" వంటి ఇంపోర్టెడ్ కారొకటి కావాలి! అర్జంటు పనులు చక్క బెట్టుటకు ఒక "టూవీలర్" కావాలి! తండ్రీ మరి ముఖ్యంగా మాకు స్వంతంగా ఒక టి.వి. ఛానల్ అత్యవసరం ప్రభువా! దయగల ప్రభువా! చీటికి మాటికి మిమ్మును విసిగించడం మంచిది కాదు. పనిలో పనిగా దినమంతా నీ సేవలో అలసిపోయేమాకు "LANCO HILLS" లాంటి ఏరియాలో ప్రశాంతంగా నిన్ను స్తుతిస్తూ జీవించడానికి మాకొక మంచి నివాస గృహాన్ని ఇవ్వండి అంటూ "గొంతెమ్మ కోరికలు" కోరడం సర్వసామాన్యమైన విషయం.



ఏదో ఈ రచయిత ఇట్టి రాతలు వ్రాస్తున్నాడుకాని ఇంతటి విలువైన ఈవులను మన ప్రభువువారు ఇస్తారా? అనే సందేహం రావచ్చు! అబ్బబ్బే అలా సందేహించకండి! మన ప్రభువు చాలా గొప్పవాడు. ఇదిగో కావాలంటే చూడండి! KA పాల్ లాంటి సేవకులకు హెలీకాప్టరు కూడా ఇచ్చాడు. (ఇప్పుడాయన జాడగాని నీడగాని కనిపించుటలేదు).

పాపం... నేటి ఈ ఆధునిక యుగంలోనే ఒక ప్రముఖ టి.వి. ప్రసంగికుడు జెరూసలేం వెళ్లాడు. బైబిల్‌లో చెప్పబడిన (పరిశుద్ధ పట్టణమైన జెరూసలేంలో అయితే సిగ్నల్స్





బాగుంటాయనుకున్నారేమో!) అక్కడ ఒక విలాసవంతమైన "స్టార్ హోటల్" నుండి ఆయన ప్రార్థిస్తూ ఆశ్చర్యకరుడవైన దేవా! నీ అమూల్యమైన సేవలో భాగంగా ఒక ఇంజనీరింగ్ కాలేజీని ప్రారంభించాలనుకుంటున్నాను. దానికి తగిన సహాయము అనుగ్రహించవలసిందిగా ప్రభుని ప్రార్థించాడట. ఇండియా వచ్చాక ఈ విషయాన్ని వారు ఏడెనివిధి భాషల్లో నడిపిస్తున్న వారి స్వంత పత్రికల్లో ప్రకటించారు. ఆ ఘుమేఘూలమీద నిధులు కురవడమేకాదు మహా మెట్రో నగరమైన చెన్నై (మద్రాసు) నగరం నడిబొడ్డున ఏకంగా 550 ఎకరాల స్థలం ఇచ్చేయడమేగాక అందు రెండుమూడు ప్రకృతి సిద్ధమైన కొండలు కూడ బోనస్‌గా వచ్చాయి. ఇది సాధించింది ఎవరో కాదు బ్రదర్ దినకరన్ మహాశయులే! ఇది ఆయన సాధించిన కొండంత అద్భుతం! దానికి "కారుణ్య ఇంజనీరింగ్ కాలేజ్" అని నామకరణం చేశారు. దానికిప్పుడు "పాల్‌దినకరన్" ఛాన్సలర్!! ఇది నిజంగా బంగారు గుడ్లు పెట్టే బాతు.

***ఇట్టి అత్యంత విలువైన దినకరన్ ప్రార్థనా ఫలితాలను గూర్చి ఇది నిజమా! తృతీయ భాగంలో మరి కొందరు టి.వి. ప్రసంగికుల స్వస్థతా ప్రార్థనల ప్రహసనం సచిత్రంగా రాబోతుంది.***

క్రైస్తవ విశ్వాస ప్రార్థనా యోధుల్లారా! దీనికి మీరేమంటారు? ఇవన్నీ నిస్సందేహంగా ప్రభుని ఆశ్చర్యకరమైన ప్రార్థనా ఫలితాలని చెబుతారు. రాగల కాలంలో ఇట్టి ప్రార్థనా ప్రహసనాలు సమూలంగా మారిపోతున్నాయి. అత్యాధునికమైన రీతిలో శాస్త్రీయమైన హంగులు సంతరించుకుంటున్నాయి. అనాగరిక యుగాల్లో ప్రవక్తల వంటి వారు గుడారాల్లో నుండి.. తరువాత తాటాకు గుడిశల నుండి... గూనపెంకుటిళ్ల నుండి... దేవునికి ప్రార్థనలు చేసేవారు. నేటి ఆధునిక భక్తులకు అవి సరిగా చేరుతున్నాయో లేదోననే డౌట్ వచ్చినట్టుంది. ఆ కారణంగా ఆయా పట్టణాల్లో వీరు తమ తమ స్థావరాల్లో చర్చీల ప్రక్కనే "ప్రెయర్



టవర్స్" నిర్మిస్తున్నారు. సెల్‌ఫోన్ టవర్స్ వలె వీటికి "ఏంటీనాలు" "డిష్‌ల" వంటి రిసీవర్స్‌ను ఏర్పాటు చేశారేమో తెలియదు. అక్కడ ఆయా సంఘస్తుల నుండి కొందరు ప్రార్థనా యోధులను ఎంపిక చేసి "షిఫ్టు"ల వారీగా ఇట్టి ప్రార్థనా బృంధాలతో 24 గంటలు నిర్విరామ ప్రార్థనా విన్నపాలు చేయించడం జరుగుతుంది. వీళ్లకేమి జీతభత్యాలు ఇవ్వనవసరం లేదు. అంతా స్వచ్ఛందంగా సాగిపోతూ ఉంటాది. వీరి ప్రార్థనలు ఏ దేవుడు వినక పోయినా ఈ ప్రార్థనా చేసిన సంఘస్తులే.. ప్రార్థనావసరతలు విన్న తదితర భక్తజనాలే వీరాళాలు ఇస్తూ ఉంటారు. ఫలితాలు మాత్రం ఆయా "సేవకులు" అందుకుంటూ యుంటారు.

ప్రియమైన విశ్వాస ప్రార్థనా యోధుల్లారా! ఇట్టి ప్రార్థనా విన్నపాలను గూర్చి మరొక్కసారి నిశితంగా పరిశీలించి చూద్దాము. మన పూర్వీకులు కల్లా కపటంలేని నిజాయితీ పరులుగా నిష్కళంకులుగా జీవించిన నాటి అమాయక భక్తజనులకు గటక, అంబలి, గడ్డి గుడిశలు, తాటాకిళ్లు, గూన పెంకుటిళ్లు మాత్రమే ఇచ్చి, నేటి అవకాశవాద భక్తాగ్రేసరులకు పంచభక్ష్య పరమాన్నాలు అద్భుతమైన ఎయిర్‌కండిషన్డ్ అపార్ట్‌మెంట్లు లక్షలాది రూపాయల జీతభత్యాలు జీవిత కాల ఫెన్షన్ సౌకర్యాలు. తరతరాలుగా పై వర్గాలన్నీ దేవుని పార్థిస్తూనే యున్నారు. "నేను, నిన్న, నేడు నిరంతరము ఒకే విధంగా నున్న దేవుడనని చెప్పుకొంటున్న దేవునికి ఈ తారతమ్యాలు, వ్యత్యాసాలు ఏమిటి? అని మనము ప్రశ్నించకూడదు.

ఇది దేవునిలో వచ్చిన మార్పు ఎంత మాత్రము కాదు. భక్తుల ప్రార్థనా విన్నపాలకు స్పందించి ప్రభువు అనుగ్రహించిన అభివృద్ధి అసలేకాదు. ఇది కాలనుగుణంగా అంచెలంచెలుగా పెరుగుచున్న మానవ విజ్ఞానముతో వ్యవసాయం, పారిశ్రామిక, సముద్ర భూగర్భ శాస్త్ర పరిశోధనలు, సహజ వాయువులు, భారతైలాల అన్వేషణ, విద్యుచ్ఛక్తికి తోడుగా సౌరశక్తి తదితర పరిశోధనలే మానవాభ్యున్నతికి మూలకారణాలు. ఇప్పుడు మనము చూచిన ఏ నూతన అన్వేషణలను వాటి ఫలితాలను మానవులు ప్రార్థనల ద్వారా గాని, పూజాపునస్కారాల ద్వారా గాని సాధించలేదు. దీనిని ఒక్క మాటలో చెప్పాలంటే ఇందు దేవుళ్ల పాత్ర పూచిక పుల్లంతయినా లేదు. అనే సత్యాన్ని విజ్ఞానులైన ఆలోచనా పరులు మాత్రమే గ్రహించగలరు.

అయితే ఇక్కడ మనమొక ముఖ్య విషయాన్ని గూర్చి ఆలోచించాలి. యావత్ ప్రపంచంలోను జనాభా ఆందోళణకరమైన రీతిలో పెరిగిపోతుంది. భూగర్భ జలాలు అడుగంటి పోతున్నాయి. బొగ్గుగనులు తరిగిపోతున్నాయి. LPG గ్యాస్‌కు కొరత ఏర్పడుతుంది. పెట్రోలు, డీసిల్ తదితర భారత్తైలాలు "నిండుకుంటున్నాయి", మరో ప్రక్క విద్యుచ్ఛక్తి అవసరానికి సరిపడా లభించడం లేదు. ఈ నేపథ్యంలో మరిన్ని నూతన వనరుల కోసం మానవుడు అన్వేషణలో పడ్డాడు. ఈ క్రమంలో సరిక్రొత్తగా "శిలాజవాయువు"పై





నరునికన్నుపడింది. ఇటువంటి సమస్త ఇంధనాలు అనతికాలంలోనే హరించిపోయే అవకాశముంది. ఈ సందర్భంలో ఒక పరమ రహస్యాన్ని భవిష్యత్‌లో జరగబోవు విప్లవాత్మక మార్పులను గూర్చి యావత్ ప్రపంచానికి తెలియజేయాలను కుంటున్నాను. ఈ పరమ సత్యం రాగల ఏడెనిమిది వందల సంవత్సరాలకో నిశ్చయంగా జరిగి తీరుతుంది. అప్పటి వరకేకాదు మన క్రైస్తవ విశ్వాసులు మరో పదివేల ఏళ్లవరకో పై విధంగానే ప్రార్థిస్తూవుండరు. కాలానుగుణంగా వీరు సరిక్రొత్త రాగం అందుకుంటారు. ఇది తిరుగులేని సత్యమని మరొక్క మారు చెప్పుచున్నాను. అదేమిటో చూడండి.

*ప్రేమ గల మా పరలోకపు తండ్రీ! దయాళుడవైన మా ప్రభువా! ఈ భూలోక రాజ్యాల్లో మా పిల్లలకు నెలకు రెండుమూడు లక్షల రూపాయలకన్నా ఎక్కువ జీతం దొరకడములేదు. చాలా ఇబ్బందులు పడుతున్నాము. అంగారక గ్రహంలోను, శుక్ర గ్రహంలోను వేతనం నెలకు పదిలక్షలు పైగా దొరుకుచున్నాయట! మా అమ్మాయి సమస్త ఉన్నత చదువులు పూర్తి చేసింది. మామూలుగా కాదు "యూనివర్స్-ఫస్ట్" వచ్చింది. మా యందు దయదలచి మా అమ్మాయి "సునితా-విలియమ్స్" అంగారక గ్రహంవెళ్లడానికి మార్గం సుగమం చేయండి! తన మొదటి మూడు నెలల జీతంతో నీకు కానుకగా సమర్పించుకొని దానితో అంగారక గ్రహంలో నీకొక అద్భుతమైన చర్చి కట్టిస్తాము. ఆమెకు "స్పేస్‌పాస్ పోర్ట్" అర్జంటుగా వచ్చేటట్టు మీ కృపను మాపై కుమ్మరించండి! అనే విధంగా నాటి క్రైస్తవ విశ్వాసుల ప్రార్థనలు కొనసాగవచ్చును. ప్రభుని రెండవ రాకడ అనేది ఇంకా ఎందుకు సభవించలేదని ఏ ఒక్కరూ ప్రశ్నించరు. ఎంత కాలమైనా సరే ఇలాగే ప్రార్థిస్తూవుంటారు. (ఎవరన్నా ఇలా ప్రశ్నిస్తే.. మన ప్రభువు దయామయుడు కదా! అంతేగాని ఆయన రాకడ ఆలస్యం చేయుచున్నాడు. ఒక్క పాపి కూడ నశించకూడదని ఇంత దీర్ఘకాలం ఓరిమి వహిస్తున్నాడని జవాబిస్తారు).*



ఈ నా "జోశ్యాన్ని" అప్పటి భావి ప్రపంచ తరాల కొరకు ఈ సమాచారాన్ని భద్రపరచి ఉంచవల సిందిగా "గోగుల్" మరియు "వికీ్కీ పీడియా" మొదలగు ఇంటర్‌నెట్ సంస్థలకు ఈ భవిష్యత్ సత్యాన్ని తెలియపరుస్తాను. అప్పుడు దీన్ని చూచిన వారు ఈ నెల్సన్‌రఫ్జీ కాలగర్భంలో కలిసిపోయినా వందలు

లేక వేల సంవత్సరాల అనంతరం నాటి సుపీరియర్ బుద్ధి జీవుల ప్రసంశలను అందుకోవచ్చును.

దీనికి ఆధారాలేమిటని చాలామందికి సందేహాలు కలగవచ్చును. అయితే ఈ భూమండలముతో పాటు యావత్ గ్రహసముదాయాలు. సమస్త నక్షత్రమండలాలన్నీ "ఒక్క తానులోని" ముక్కలే కదా! వీటి పుట్టుక సమయాల్లో వ్యత్యాసాలున్నా వీటిలో కూడా సమస్తలోహసంపద, ఖనిజాలు, నీరు, ఇంధన వాయువులు, భారతైలాలు, కొద్దిపాటి మార్పులతో నిక్షిప్తమై వున్నాయి. అందుచేతనే అనాదిగా భూమిమీద సంభవిస్తున్న భూకంపాలు, తుఫానులు, అగ్నిపర్వత విస్ఫోటనాలు సంభవిస్తూనే ఉన్నాయి.

బుధవారం । మే 2013 ఈనాడు

## శనిగ్రహంపై పెనుతుపాను

వాషింగ్టన్: శనిగ్రహం ఉత్తర ధ్రువం చుట్టూ భారీ తుపాను ముసురు కుంది. 'క్యాసిని' అంతరిక్షనౌక అత్యంత స్పష్టంగా దీనిని చిత్రీకరించి నాసాకు పంపింది. రెండు వేల కిలోమీటర్ల మేర ఇది విస్తరించి ఉందని, భూమిపై సంభవించే సగటు తుపానుకంటే ఇది 20 రెట్లు పెద్దదని శాస్త్రవేత్తలు గుర్తించారు. షడ్భుజాకారంలో ఏర్పడిన ఈ తుఫాను చుట్టూ సెకనుకు 150 కిలోమీటర్ల వేగంతో తేలికపాటి మేఘాలు పయనిస్తున్నట్లు గుర్తించారు.

చాలాకాలంగా గ్రహాంతరాలకు సంబంధించిన అనేక వార్తలు మనము వార్తాపత్రికలందు చూస్తూనేవున్నాము. ఇప్పుడే అందిన మరో తాజావార్తను చూడండి.

ఇన్ని రకాలైన శాస్త్రీయమైన పరిశీలనాంశాలు నామస్తిష్కంలో తిరుగుచూ యున్నందున అలనాడు నేను క్రైస్తవ నేపథ్యంలో నుండే వచ్చినా నేడు "మంత్రాలకు చింతకాయలు రాలవనే" దృఢ నిశ్చయం వల్ల కొన్ని సంవత్సరాలుగా ఏ పనిని ప్రార్థనలతో ప్రారంభించను. అది కేవలం మూఢ విశ్వాసము మాత్రమే.

ఈనాడు మంగళవారం జూన్ 11, 2013

## అంగారకుడిపై ఆశలు

- ఆవాసయోగ్యతపై మరిన్ని ఆధారాలు
- నీటి ప్రవాహం ఆనవాళ్లను పసిగట్టిన నాసా రోవర్



వాషింగ్టన్: అంగారకుడిపై అన్వేషణ కోసం అమెరికా అంతరిక్ష సంస్థ (నాసా) పంపిన అపర్చ్యూనిటీ రోవర్ గొప్ప విజయాన్ని నమోదు చేసింది. బంకమట్టి ఖనిజాలతో కూడిన ఒక శిలను అది కనుగొంది. దీంతో అరుణగ్రహంపై ఒకప్పుడు నీరు ప్రవహించిందనడానికి మరిన్ని ఆధారాలు లభించినట్లయింది. శిలతో నీరు చర్య జరిపినప్పుడు బంకమట్టి ఏర్పడుతుంది. నీరు, శిల తీరును బట్టి రకరకాల బంకమన్ను తయారవుతుంది. ఎస్పరెన్స్ అనే శిలలో అల్యూమినియం పుష్కలంగా ఉన్న మట్టిని రోవర్ గుర్తించింది. తాగడానికి వీలైన నీటిలోనే ఇది ఏర్పడినట్లు కార్నెల్ విశ్వవిద్యాలయానికి చెందిన శాస్త్రవేత్త స్టీవ్ స్క్వైరెస్ తెలిపారు. జీవుల ఆవిర్భావానికి దారితీసే రసాయన పరిస్థితులకు ఇది దోహదపడేలా ఉందని వివరించారు. నాసాకు చెందిన మరో రోవర్ క్యూరియాసిటీ కూడా అరుణగ్రహంలోని గేల్ బిలంలో తాగడానికి అనువైన నీటికి సంబంధించిన ఆధారాలను కనుగొంది.





# బైబిల్లో కలల సంస్కృతి!

బైబిల్ నందు ఈ విధమైన కలల సంస్కృతి ఒక్క దానియేలు గ్రంథమందే కాక మరికొన్ని చోట్ల కనబడతాది. ఆదికాండమందు అబ్రహాము మునిమనవడైన యాకోబు కుమారుడున "యోసేపు" కూడ దానియేలు వలెనే కలల భావాన్ని చెప్పగల నిపుణుడు. ఈ విధమైన శక్తియుక్తులన్నీ యెహోవా వలన కలిగినవేయని చెబుతారు.

అయితే యోసేపుకు యవన ప్రాయములోనే అర్జంటుగా రెండు కలలు వచ్చేశాయట. కలలు వేరువేరయినా వాటి భావము ఒక్కటే ఒకేకల పంపితే సరిగా అర్థం కాదేమోనని కొన్నిసార్లు యెహోవా జంటకలలు పంపుతూ యుండేవాడు. తాను కన్న కలలను యోసేపు ఈ విధంగా వివరించాడు.

**మొదటి కల:** మనము పొలములో పని చేయుచూ పనలు వేయుచుండంగా నా పన లేచి నిలబడగా మీ అందరీ "పనలు" పరుగున వచ్చి నా పనకు సాష్టాంగ నమస్కారము చేయుచున్నట్టుగా వచ్చింది.

**రెండవ కల:** సూర్యచంద్రులు, పదనకొండు నక్షత్రాలు నా ముందు మోకరిల్లి సాష్టాంగ నమస్కారము చేయుచున్నట్టు కల వచ్చిందని చెప్పాడు. సోదరులు చిన్న బుచ్చుకొని, కోపావేశంతో ఏమిటీ! మాపనలన్నీ నీకు నమస్కరించాయా? సూర్య-చంద్రులు, పదకొండుగురు. అనగా అన్నదమ్ములమైన మేము, మన తల్లిదండ్రులు వచ్చి నీకాళ్ల మ్రొక్కాడమా! అంటూ యోసేపు పై ద్వేషము పెంచుకున్నారు. దానికి తోడు తమ తండ్రి వీడినే అతిగా ప్రేమిస్తాడు. ఇటీవల యోసేపుకు ఒక విచిత్రమైన అంగీకుట్టించాడు. ఇదంతా వారు సహించలేక యోసేపును ఒకరోజు ఈజిప్టు వ్యాపారులకు అమ్మివేసి పీడవదిలించుకొని, అతని అంగీని రక్తంలో ముంచి క్రూర మృగాలు యోసేపును చంపివేశాయని తల్లిదండ్రులను నమ్మించారు.

ఈ కల కూడ చాలా కాలం తర్వాత నెరవేరింది "కానాను"లో ఏడు సంవత్సరములు కరవు రాగా యోసేపు పదకొండు మంది సోదరులు "అయిగుప్తు"లో దాన్యం కొనుటకు వెళ్లి అక్కడి ప్రధానాధికారికి సాష్టాంగ నమస్కారము చేశారు. ఆ అధికారే తమ సోదరుడైన యోసేపేనని వీరికి తెలియదు. ఈ ప్రకారంగా ఆకలలు నెరవేరాయట.

ఈజిప్టు చేరిన ఆ వ్యాపారులు యోసేపును అక్కడ ఒక అధికారి అతనినికొని అతని తెలివితేటలను బట్టి తన గృహ నిర్వాహకునిగా వాడుకొంటుండగా అందగాడైన యోసేపు మీద ఆ యజమాని భార్య కన్నేసింది. అయితే అతడు నిజాయితీ పరుడై ఆమెకు లొంగనందున తనపై అత్యాచార ప్రయత్నం జరిపాడని ఆరోపించగా అతడు కారాగారం పాలైయ్యాడు.

ఆకారాగారంలోనే "ఫరో" రాజు యొక్క పానదాయకుడు, ఒక వంటవాడు కూడ వివిధ కారణాల వల్ల జైలుపాలైయ్యారు. ఆ రాత్రే వారిరువురికి రెండు కలలు వచ్చేశాయి. వారు దిగులుగా యుండడం చూచి యోసేపు వారిని విచారించగా మొదటివాడు తానొక కలగన్నానని కలలో ఒక ద్రాక్షావల్లికి మూడు తీగలున్నట్టును, వాటికి ఉన్న మూడు గెలలను కోసి ద్రాక్షారసము పిండి రాజుకు అందిస్తున్నట్టు కలవచ్చిందని చెప్పగా – యోసేపు నీవు అదృష్ట వంతుడివి. మూడు ద్రాక్షతీగలు మూడు రోజులకు గుర్తు. నీవు మూడు రోజుల్లో విడుదలయై నీ పనిలో నీవు చేరతావు అని చెప్పాడు.

రెండవవ్యక్తికి వచ్చిన కల: తాను మూడు గంపల నిండా పిండి వంటలు చేసుకొని వాటిని తనతలపై పెట్టుకొని వెళ్తూయుండగా ఆకాశపక్షులు వచ్చి ఆ గంపలోని పదార్థాలను తన్నుచూ తిన్నవని చెప్పాడు. యోసేపు విచార వదనంతో అతనితో ఇలా చెప్పాడు. ఆ మూడు గంపలు మూడు రోజులకు గుర్తు. పక్షులు కాళ్లతో తన్నడం అశుభం. మూడు రోజుల్లో నీకు ఉరిశిక్ష పడుతుందని కలాభావాన్ని విడమరచి చెప్పాడు. అతనికి ఆ ఇరువురి విషయంలోను అక్షరాలా అలాగే జరిగింది.

రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. ఐగుప్తుదేశ రాజైన "ఫరో"కు కూడ జంట కలలు వచ్చేశాయి. మొదటి కల: రాజు ఏటి ఒడ్డున నిలచియుండగా ఆ ఏటిలో జమ్ముమేసిన బలిష్టమైన ఏడు ఆవులు పై కెక్కాయి. ఆ రాజు వాటిని చూస్తున్న తరుణంలోనే మరో ఏడు బక్కచిక్కిన ఎముకల గూళ్లు లాంటి మరో ఏడు ఆవులు పైకి రావడంతోనే అవి ఆ బలిసిన ఎండ్లను తినివేశాయి. అయినప్పటికి వాటిలో ఏ విధమైన మార్పు రాలేదు. బక్కగానే వున్నాయి...

రెండవ కల: ఒకే చొప్పదంటుకు బలమైన ఏడు వెన్నులు కనబడ్డాయి. మరికొద్ది సేపటికి మరో ఏడు పీలవెన్నులు పైకి వచ్చాయి. వెనువెంటనే ఆపీల వెన్నులు బలమైన ఏడు వెన్నులను మ్రింగి వేశాయి. అయినా అవి పీలవెన్నులుగానే ఉన్నాయి. రాజుకు మతి పోయింది. ఈ కలల భావమేమిటని దేశమంతటి నుండి కలలను విప్పే సందర్భములో కల్దీయులును, శకున గాంఢ్రను, జ్యోతిష్కులను, పిలిపించాడు. వారెవరూ కూడ ఈ కలల భావాలను చెప్పలేకపోయారు. రాజువ్యాకులతతో వుండగా సేవకుడు చూచాడు. ప్రశ్నించి విషయము తెలుసుకున్నాడు.





రాజు పరిస్థితి గమనించిన నాటి పానదాయకుడికి గతం గుర్తుకొచ్చింది. ధైర్యము చేసుకొని మహా రాజా! నాడు నేను కారాగారంలో యుండగా అందున్న ఒక హెబ్రీయుడు నాకు నా సహచరునికి వచ్చిన కలలను క్షణాల మీద విప్పిచెప్పాడు. అవి ఇరువురి పట్ల అక్షరాల నెరవేరాయి. అతని పిలువనంపుడని రాజుకు చెప్పాడు. క్షణాల మీద యోసేపును రాజసన్నిధికి పిలిపించారు. కలలు విన్న యోసేపు రాజా!.. ఇందునా గొప్పతనమేమీలేదు నేను సేవించుచున్న (యెహోవా) దేవుడే నాకీ విషయాలన్నీ బయలు పరుస్తూ యుంటాడు... భవిష్యత్‌లో జరగనున్న విషయాలను దేవుడు మీకు తెలియజేయడం జరిగింది. తమకు వచ్చిన కలలు రెండయినప్పటికి వాటి భావం ఒకటే! ఏడు ఆవులు.. ఏడు వెన్నులు ఏడేసి సంవత్సరాలకు సూచన. రాగల ఏడేళ్లలోను పంటలు పుష్కలంగా పండుతాయి. అయితే తరువాత రానున్న ఏడు సంవత్సరాల్లోను దారుణమైన కరవు రానుంది. ముందు జాగ్రత్త చర్యగా దేవుడు ఈ కలల ద్వారా మిమ్మును హెచ్చరించాడని చెప్పగా రాజు ఆశ్చర్య చకితుడైయ్యాడు.

**వెనువెంటనే రాజు యోసేపును మహాజ్ఞానిగాను వివేకవంతుని గాను గుర్తించి ఉన్నత పదవినిచ్చి చేతికి ఉంగరము, విలువైన వస్త్రాలను తొడిగించి "ఓను" యొక్క యాజకుడైన ఫొతీపరు కుమార్తెయగు "అసెనతు" నిచ్చి పెండ్లిచేసి ఘనంగా సత్కరించాడు. ("ఓను" అనగా ఈజిప్టు దేవత కావచ్చు) ఈ ఏడు సంవత్సరాల్లో పండిన పంటలన నిలువచేసే బాధ్యతను కూడ యోసేపుకే అప్పజెప్పాడు ఫరోరాజు. యోసేపుకు అన్యదేవతలైన "ఓను" దేవతకు పూజారియైన ఫొతీపరు కుమార్తెనిచ్చి వివాహం జరిపించాడట ఆ రాజు. యెహోవా భక్తునికి అన్యదేవత పూజారి కూతురులో పెండ్లా?**

కాలక్రమంలో పుష్కలంగా పండిన పంటలను గోదాములలో నిల్వచేయడం జరిగింది. ఆ ప్రకారంగానే ఏడు సంవత్సరాల అనంతరం వర్షాలు కురవక భయంకరమైన కరవు ప్రారంభమయ్యింది. యావత్ ప్రపంచం కటకటలాడింది అంత "కానాను"లోనున్న యోసేపు తండ్రి కొడుకులను పిలిచి "ఇగుప్తు"లో ధాన్యం అమ్మకాలు జరుగుచున్నాయట. మీరు వెళ్లి సరకులు, తేవలసిందని చెప్పగా వారంతా ఒంటెల మీద బయలుదేరారు. వారక్కడకు చేరి తమ తమ్ముడైన యోసేపును గుర్తించక ఆ (ఆ అధికారి) కాళ్ల మీద పడి సాష్టాంగ నమ్మస్కారమాచరించి వచ్చిన పని చెప్పారు.

ఈ విధంగా చిన్నతనంలో యోసేపుకు వచ్చిన కల నెరవేరినట్లయ్యింది. మొత్తానికి ఆయా కలల ద్వారా దేవుడు మనుష్యులతో మాట్లాడుతూయుంటాడని "దానియేలు" గ్రంథంలో వివరించబడింది. ఇట్టి బైబిల్ వాక్యాల ద్వారా క్రైస్తవ సమాజాలు నేడు కూడ దేవుడు కలల ద్వారా మాట్లాడుతూ యుంటాడనే భావన పాతుకుపోయింది.

పైన ఆకాశమందే కాని, క్రింద భూమియందే కాని ప్రపంచంలో మరెక్కడా నేను తప్ప వేరొక దేవుడులేడని నేనొక్కడినే నికార్సయిన దేవుడినని విగ్రహారాధికులంతా తనకు

హేయములని చెబుతూ యుండే ఈ దేవుడు దానియేలు గ్రంథంలో ఇలా దిగజారిపోయాడెందుకు? తన బద్ధ విరోధులైన అన్యరాజులైన నెబుకద్నెజరు. బెల్షాసరు, కొరెషు, ఫరో వంటి అన్యజనాంగాల రాజుల చుట్టూ తిరుగుచూ వారు, వారి ప్రజలు ఎక్కడ కష్టాల్లో పడిపోతారోయని కంగారు పడుతూ ఆయా రాజులకు, వారి సేవకులకు సైతం "కలలు" పంపడమేమిటి? ఒక కల పంపితే అర్థమయిచావదని ఒకే తీరయిన రెండేసికలను పంపి వారిని హెచ్చరించడమేమింటి! ఆ కలాభావాలను విప్పేవారిని కూడ వారికి అందుబాటులో యుంచడమేమిటి? నాటి అనాగరిక కాలంలో ఇటువంటి వ్రాతలవల్ల మేలుకన్నా కీడే ఎక్కువ జరుగుతాదని వారికి తెలియదు కావచ్చు.

అయితే ఆధునిక యుగాలో పాతరోజుల వలె దీర్ఘకాల కరవులు కాటకాలు రావడంలేదు. కాని ఎక్కడ చూచినా ప్రపంచంలో అలజడి, హింసావాదం, తీవ్రవాదం పేట్రేగి పోతుంది. ఇరాన్ ఇరాక్ ఈజిప్టు దేశాలందు ఎంతో అల్లకలోలాలు జరిగాయి. ఇటీవలి కాలంలో ఆఫ్ఘనిస్తాన్‌లోనూ చెదురుమదురుగా పాకిస్తాన్‌నందు తీవ్రవాద సంఘటనలు జరుగుతున్నాయి. నేడు సిరియాలో హింసావాదం తల ఎత్తింది. అయితే మనదేశంలో చాలా కాలంగా నక్సలిజం ప్రభలిపోయింది. ఇది ముఖ్యంగా ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రమందు.. తీవ్రంగా కనబడుతుంది. అసలీ నక్సలిజం అంటరానితనం, అసమానతల నుండి తలెత్తిన ప్రతిఘటనే! ఇక ప్రపంచంలో ముందుకొస్తున్న తీవ్ర సమస్య తీవ్రవాదం. ఇది దేశ సరిహద్దులను దాటి మన ఇండియాలో ప్రవేశించింది. ఇది ముంబాయి, కలకత్తా తదితర పట్టణాలను దాటి హైద్రాబాద్, కోయంబత్తూర్‌లకు ప్రాకింది. ఇది ఇప్పుడు మరింతగా ప్రభలిపోతూ తిరుపతి దగ్గర పుత్తూరులో మకాం వేసింది. ఆశ్చర్యకరమైన విధంగా తమిళపోలీసులు, మన రాష్ట్ర బలగాలు అనూహ్యమైన రీతిలో పెద్ద రాకెట్"ను చేదించి 2013 అక్టోబర్ ప్రారంభంలో ఛేదించాయి. ఇదిలా గుండగా దేశంలో గత 25 సంవత్సరాలుగా అనేక రంగాలో అభివృద్ధి సాధించిన "ఈ సాఫ్ట్‌వేర్" యుగంలో ముందడుగు వేయుచుండగా మానవులో మరిముఖ్యంగా రాజకీయ నాయకుల్లో ముఖ్యమంత్రులు, మంత్రులు, అధికారులు అనే తేడా లేకుండా ప్రభలిపోయింది. చిరుద్యోగుల్లో కూడ లంచగొండి తనం వ్యాపించి పోయింది. అధికారం అడ్డుపెట్టుకొని భూపందేరాలు, వేలకోట్ల విలువచేసే భూకబ్జాలకు యధేచ్చగా పాల్పడడం జరుగుతుంది. ఈ నేపథ్యంలో రైతులు నేతపనివవారి "ఆత్మహ్యతలు" పెరిగిపోయాయి. వీటి ప్రభావం ఎంతటి తీవ్రంగా యున్నా ఆయా నేరస్తులను గుర్తించినా అట్టివారిపై చర్యలు తీసికొనే అవకాశం లేకుండా న్యాయం నత్తనడక నడుస్తుందనడానికి చిన్న ఉదాహరణలు:

**1) 1987లో బోఫోర్సు తుపాకుల వ్యవహారం బయటపడగా శంకరానంద్ అధ్యక్షతన ప్రభుత్వం ఒక ఉన్నత స్థాయి కమిటీని వేసింది. ఆ కమిటీ ఇప్పటివరకు 50 సార్లు సమావేశమైనా, అది ఇంకా తేలలేదు. దోషులపై చర్యలు తీసికొకముందే అందు "ఖత్రోచి" వంటి వారు మరణించారు.**





**2) 1992లో హర్షద్‌మొహతా "స్టాక్‌బ్రోకర్" పై వచ్చిన అవినీతి కేసుపై "రామ్‌నివాస్ మీర్జా కమిటీ"ని వేయగా అది 105 సార్లు సమావేశమైనా ఇంకా ఒక కొలిక్కి రాలేదు..**

**3) 20013లో "ఖేతన్‌ఫరేక్" వ్యవహారంపై త్రిపాఠి అధ్యక్షతన 109 సార్లు సమావేశమయ్యింది. శరామామూలే!...**

**4) 2011లో స్పెక్ట్రం-2జి స్కాంలో (కేంద్రమంత్రి) "రాజా" అవినీతి బయటపడింది. అది కూడ అలాగే యుంది.**

**5) 2010లో ఇస్రోదేవాస్ రెండు లక్షల కోట్ల అవినీతి వ్యవహారం వెలుగులోకి వచ్చింది. అది ఇంకా పూర్తికాలేదు.**

**6) 2011లో గాలి జెనార్ధనరెడ్డి అక్రమ ఇనుప ఖనిజాల త్రవ్వకం అనుమతి లేకుండా విదేశాలకు ఎగుమతుల కేసులు ఇంకా అపరిష్కృతంగానే వున్నాయి. ఇలాంటివే మరికొన్ని ఇతర "స్కాం"లు ఎం.ఆర్. స్కామ్‌లు.. రహేజా అక్రమాలు, చీమకుర్తి, బయ్యారం, ఓ బుళాపురం గనుల కుంభకోణాలు మరెన్నో అలానే ఉన్నాయి. కర్ణాటక ముఖ్యమంత్రి ఎడ్యూరప్పపై ఎన్నో అవినీతి అభియోగాలు వచ్చి ఆయన పదవి నుంచి తప్పుకున్నారు. ఇకమన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వర్యులు - వై.యస్. జగన్ పేర జరిపిన లక్షల కోట్ల లావాదేవీలు ఒక్కొక్కటి సి.బి.ఐ. కోర్టు బయట పెడుతుంది. ఇందు మంత్రులు, హోమ్‌మంత్రులు, ఐ.ఎ.ఎస్. అధికారులు, ఆడిటర్లు మొదలైన వారంతా దోషులుగా తేలుచున్నారు. ఇవన్నీ తేలాలంటే మరెన్ని దశాబ్దాలు పడతాయో తెలియడంలేదు. ఇట్టి సందర్భాలలో వేళ్లమీద లెక్కపెట్టే కొద్దిమందికే మధుకోడా.. లాలూ ప్రసాద్ యాదవ్ మరికొందరికే శిక్షలు పడ్డాయి. ఈ నేపథ్యంలో అమాయక ప్రజల్లో కూడ చిత్రమయిన మార్పువచ్చింది. జైలుకెళ్లి వచ్చాడంటే పాత రోజులో ప్రజలు అతనిని జీవితాంతం, దొంగగానే చూచేవారు. కాని రాజకీయ నాయకులకు ఇదొక "హోదా" అయి కూర్చొంది. ఈ విషయంలో నేను అనేకమంది సామాన్య ప్రజలతో మాట్లాడిచూచాను. మీరు నేరచరితుల్ని సమర్థించుటకు గల కారణమేమని అడగగా అనేకమంది "తినని వాడెవడయ్యా" చెప్పు! తింటే తిన్నాడులేగాని ప్రజలకు చాలా చేశాడండీ! అనే సమాధానం వస్తుంది. నిజమే! ఇట్టివారు "బంపర్-మెజారిటీతో" అధికారంలోకి కూడ రావచ్చును. మారుచున్న చరిత్ర ఎలాగుంటాదో చరిత్ర రుజువు చేయగలదు.**

ఈ శీర్షకలో మరీ ముఖ్యంగా బైబిల్ విమర్శ నా గ్రంథంలో ఇటువంటి దిక్కుమాలిన రాజకీయ ప్రస్తావనలెందుకని సమయము సందర్భము లేకుండా ఈ రచయిత హద్దులు మీరుచున్నాడని కొందరు నన్ను విమర్శించవచ్చు. నిజమే కాని ఈ శీర్షిక ముగిసేవరకు కాస్త సహనము వహించడము మంచిదని ఇట్టివారికి మనవి చేయుచున్నాను.

"మోడీ" నాయకత్వాన ఈ అవినీతి పరిపాలనలను అసరాగా తీసికొని, నీతివంతమైన సుపరిపాలన అందజేయగలనని చెబుతున్నాడు. ఈ ఆధునిక కాలంలో ఇట్టి నాయకులు తమ ప్రచారాలను ఇంటర్‌నెట్‌లో, ఫేస్‌బుక్కులు, ట్విటర్ల ద్వారా ప్రపంచవ్యాప్తంగా సత్వరప్రచారం సాగిస్తున్నారు. దేశంలో ప్రభలిపోయిన అశ్రిత పక్షపాతం అవినీతి, లంచగొండితనంతో ప్రజలు విసుగెత్తి పోయారు. మరీముఖ్యంగా యువత ఈ అవినీతి ప్రభుత్వాలను దించివేయాలని కంకణం కట్టుకున్నారు. ఈ నేపథ్యంలో మోడీ మీద నమ్మకంతో బిజెపిని బంపర్ మెజారిటీతో గెలిపించే అవకాశాలు మెండుగా ఉన్నాయి. ఏది ఏమయినా ఇట్టి మార్పు తప్పనిసరిగా రావాలి. ఒకవేళ్ల అదే నిజంకావచ్చునేమో! మరి ముఖ్యంగా జగమంతా రామమయం చేసేస్తారనే మరో భయం కూడ కాంగ్రెస్, తదితర పార్టీల వాళ్లకుంది. ముఖ్యంగా క్రైస్తవులు భయపడుచున్నారు. అధికారంలోకి వచ్చినా అలాంటి భయాలు పడనవసరము లేదు.

ఏం చేయమంటారు? యెహోవాదేవా? ఎంతయినా మా "UPA CHAIR PERSON" నీ! భక్తురాలే కదా! నాడు నీవు అన్యదేవతలను ఆరాధించే రాజులకు సైతం కలలు పంపించి హెచ్చరించి వారిని ఆదుకోలేదా? మరి మా సోనియమ్మ పేరు చివర, గాంధేయ వాదం కూడ వుంది. ఒకసారి మా ఇందిరమ్మ "ఉల్లిపాలు" పేరు చెప్పి అధికారంలోకి వచ్చింది. నేడా ఉల్లిపాయలు కూడా దేశం మీద తిరగబడ్డాయి. ఎన్నడూలేనిది మా రూపాయి దొర్లుకుంటూ వెళ్లి అథ:ప్రాతాళానికి దిగిపోయింది. "దేశం-క్లిష్టపరిస్థితిలో యుందని" "నూతన్‌ప్రసాద్" డైలాగులు చెప్పినట్టు - నిజంగానే ఈ దేశం క్లిష్టపరిస్థితుల్లో యుంది. దానికితోడు సోనియమ్మ అనారోగ్యం ఒకటి. ఇట్టి అత్యవసర పరిస్థితిలో మా "చైర్‌పర్సన్"కు ఒక అద్భుతమైన కల రావింపజేసి "స్విస్ బ్యాంకుల్లో" పేరుకుపోయిన, నల్లధనం వివరాలు వారివారి పేర్లు, అడ్రసులూ... పైన మనము చూచిన అవినీతి కేసుల వివరాలు కాస్త విడమరచి చెప్పి ఒక కల రావించగూడదా, యెహోవాదేవా! మునిగిపోవడానికి సిద్ధంగా వున్న ఈ దేశాన్ని కాస్త రక్షించకూడదా అనిపిస్తుంది. నా మాట విని నీవాపని గనుక చేస్తే నీవున్నావో లేవోయని ప్రక్కదారులు పట్టుచున్న ప్రపంచ ప్రజానీకమంతా కుప్పలు తెప్పలుగా వచ్చి నీ మతంలో చేరిపోతారు. పనిలో పనిగా ఈ కలా భావాలను విడమరచి చెప్పగల నీ సేవకులైన శాంకిషోర్ గారినో, అనిల్ కుమార్‌నో అరేంజ్ చేస్తే బాగుంటాది. మరొక్క మాట ఈ "డ్రీమ్" మాత్రం తప్పని సరిగా ఇంగ్లీషులోనే రావించండి!

దేవా! నిజంగా నీవీ పని చేయగలవా? నాటి అజ్ఞాన కాలంలో చేసినట్లు నేటి వైజ్ఞానికులను నమ్మించగలవా? కాస్తంత "డౌట్"గానే యుంది. ఎందుకంటారేమో "ఎక్కడ ఇద్దరు ముగ్గురు నా నామమున కూడుకొని వుంటారో వారి మధ్యన నేనుంటానని" సెలవిచ్చారు. అది నిజమేనని నేను చాలాకాలం భావించాను మొన్నా మధ్య ఈ 2013వ సంవత్సరం సెప్టెంబర్ నెలాఖరు ఆదివారం రోజున పాకిస్తాన్ నందలి "ఆల్ సెయింట్స్





చారిత్రాతిక చర్చి"లో సుమారు 800 మంది సమావేశమై నిన్ను స్తుతిస్తూ పరవశించి పోతూ యుండగా అందు ఇరువురు "తాలిబాన్" తీవ్రవాదులు "మానవ బాంబు"ల రూపంలో ప్రవేశించి బాంబులు పేల్చుకోగా రమారమి తొంభయిమంది భక్తజనులు నీవు చూస్తుండగానే అసువులు బాశారని వార్తాపత్రికలు ప్రకటించాయి. ఒకవేళ అందులో నీవు కూడ వున్నావేమో! ఈ వార్తను ప్రకటించిన విలేఖరులకు తెలియదు. ఈ వార్త చూచిన తర్వాత మనసంతా అదోలాగయ్యింది. నీవు వాగ్ధానం చేసిన బంగారు వాక్యాలన్నీ బూటకాలేనా!

ఇవన్నీ చూస్తుంటే కలలు పంపించి మమ్మునాదుకోమని నేను చేసిన ప్రతిపాదనలన్నీ ఎందుకూ పనికి రావని తేలిపోయింది. పాపం! ఇది నీతో అయ్యే పనికాదు!! అనవసరంగా చాలా సమయాన్ని వృధా చేశాననిపిస్తుంది.

సోదరమహాశయుల్లారా! బైబిల్‌లోని కలల కథలు ఎంతో వినసొంపుగా నున్నాయి. కాని మన నిజ జీవితంలో కలలు ఎక్కడా నెరవేరిన సందర్భాలు అరుదు. కాకతాళీయంగా ఒకటీ అర జరగవచ్చును. స్వప్నాల ద్వారా దేవుళ్లు మనుషులను హెచ్చరిస్తారనేది ఒక మూఢనమ్మకం! అది అనాగరిక ఆలోచన.

భక్త రామదాసు "ఆరు లక్షల స్కామ్" సందర్భంలో రామలక్ష్మణులు స్వయంగా కలలో గోల్కొండ ఖీలాలో నిదురిస్తున్న తానీషా నవాబుకు ప్రత్యక్షమై అణాపైసలతో సహా ఆ సొమ్ము అంతా చెల్లించి వెళ్లారట.. మెళకువ వచ్చాక ఆకల నిజమౌతాదా? ఆ డబ్బు కట్టలు అక్కడుంటాయా? కలలు కల్లలని మనిషన్న ప్రతీఒక్కడికి తెలుసు. ఒక క్రైస్తవ భక్తులకు తప్ప! నా మాటల్లో మీకు నమ్మకము చిక్కకుంటే చర్చి అయ్యాక ఒక ఆదివారం పూట గోల్కొండ ఖీల్లాకు విహారయాత్రకు వెళ్లరండి. రామదాసు జైలు గదిని సందర్శించండి. అది "అక్కన్న మాదన్న"ల చాబర్ పైఅంతస్తుల్లో యుంది. మిమ్మును నడిపించడానికి "గైడ్స్" కూడ వుంటారు. తానీషా నవాబుగారు మాత్రం అక్కడలేరు. మీ సౌలభ్యం కొరకు గోల్కొండ ఖీల్లా చిత్రాన్ని చూచి తరించండి.

గోల్కొండ ఖిల్లా.. దర్పం చూద్దాం

ఈ శీర్షిక చదివాక భక్తాగ్రేసరులకు మాత్రమే తెలిసిన ఒక బంగారు వాక్యం చదివి నిద్రకు ఉపక్రమించండి. కలలు కనడం మొదలు పెట్టండి. ఇట్టి బైబిల్ వాక్యాలు సాధారణంగా సామాన్య క్రైస్తవులకు తెలియవు.

**యోవేలు గ్రంథం 2:28-29**

*సర్వజనుల మీద నా ఆత్మను కుమ్మరింతును! మీ కుమార్తెలును, మీ కుమారులును ప్రవచనములు చెప్పుదురు. మీ ముసలి వారు కలలు కందురు. మీ యవనస్థులు, దర్శనములు చూతురు.. మీ పనివారి మీదను, మీ పనికత్తెల మీదను నా ఆత్మను కుమ్మరింతును. (తన భక్తుల మీదనే కాదు! సర్వెంట్స్ మీద కూడ తన ఆత్మను కుమ్మరిస్తాడట!)*

ఉపసంహారం: అలనాటి అంధకార యుగాల్లో ఇట్టి కలలను నమ్మే సంస్కృతి విలసిల్లి యుండ యుండవచ్చును.

నాటి అంధకార యుగాల్లోని సమాజాలు ఇటువంటి కథనాలను నమ్మాయంటే కొంతలో కొంత అర్థముంది. అయితే నేటి 21వ శతాబ్దంలో కూడ నమ్మడం అత్యంత శోచనీయమైన విషయం. నేటి మానవ నాగరికత అత్యున్నత స్థాయికి ఎదిగిపోయింది. నేడు టి.వి.లు, స్మార్ట్‌ఫోన్లు, ఐప్యాడ్లు, ఆటమిక్ ఎనర్జీ, గ్రహాంతర యానం తదితర రంగాలలో రోజుకోక్రొత్త ఆవిష్కరణ జరుగుతుంది. మూత్రపిండాలు, గుండె ఊపిరితిత్తులు తదితర అవయవ మార్పిడీ జరుగుతున్న కాలంలో మనము గత మూఢనమ్మకాలకు దూరమైపోయామని చెప్పుకొంటున్నాము. ఈ రచనను నేను చేయుచుండగా వార్తా పత్రికలలో ఒక సంచలన వార్త ప్రకటించబడింది.

అదేమంటే ఉత్తరప్రదేశ్‌లోని "ఉన్నవ్" జిల్లాలో "శోభన్ సర్కార్" అనేక ఒక సాధుపుంగవునికి ఒక కలవచ్చింది. అది 150 సంవత్సరాల క్రితం (సిపాయిల తిరుగుబాటు కాలంలో) సామంత రాజైన రాజారావ్ రామ్ భక్ష్‌సింగ్ ఇటీవల అక్టోబర్ 2013లో తన కలలో కనబడి శివాలయం సమీపంలో నున్న తన "దాండియా ఖేరా" కోటలో ఏకంగా వేయిటన్నుల బంగారాని దాచిపెట్టానని చెప్పాడట. అబ్బబ్బ తులంబంగారమే రూ॥ 30 వేలకు పైగా పలుకుతూ యుండంగా వేయిటన్నులంటే మాటలా!

దీని వెనుక ఒక నేపథ్యముంది. ఆంగ్లేయులు ఆ సమయంలో రాజ్యవిస్తరణకు ఎన్నో సామంత రాజ్యాలను ఓడించి హస్తగతం చేసుకొన్నారు. కాని ఈ ప్రాంతంలో వారు ఓటమిపాలైయ్యారు. ఒక శివాలయంలో వారు కుటుంబాలతో సహా తలదాచుకొని, ఆలయ మందలి విగ్రహాలను, శివలింగాన్ని పెకలించి బయటట పారవేయగా రెచ్చిపోయిన స్థానికుల చేతిలో వారంతా ఊచకోత కోయబడ్డారట. అనంతరం ఆంగ్లేయుల ఆ ప్రాంతంపై దాడిచేసి ప్రవాసంలోనున్న ఆ రాజు రామ్‌భక్ష్ సింగ్‌ను బంధించి ఆ అలయం ముందే ఉరితీసి చంపారట.





ఈ స్వప్న విషయం తెలిసిన ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం ఏ విధంగాను స్పందించలేదు. అయితే ఎప్పటికైనా దేశ ప్రధానిని కాగలనని కలలుకంటున్న "యువరాజు" ఇందిరాగాంధీ మునిమనవడు, రాజీవ్‌గాంధీ కుమారుడు అయిన రాహుల్‌గాంధి చెవినపడింది. కాంగ్రెసు ఉపాధ్యక్షుడుగా అనధికారికంగా కేంద్ర మంత్రియైన చందేశ్‌కుమారి కటోచ్‌కి తెలియజేయగా.. పురావస్తు శాఖ డెప్యూటీ డైరెక్టర్ నేతృత్వంలో డజనుమంది అధికారుల పర్యవేక్షణలో దాండియా ఖేరా కోటలో డ్రిల్లింగు, ఆపై త్రవ్వకాలు ప్రారంభమయ్యాయి. ప్రభుత్వం చేస్తున్న ఈ హంగామాను చూచిన ఢిల్లీ హేతువాదులు ఎటువంటి శాస్త్రీయ ఆధారాలు లేకుండా ఒక సాధువుకు వచ్చిన కల ఆధారంగా ఇదంతా చేయడమేమిటని విమర్శించారు.

అజ్ఞాన కాలంలో ఆయా రాజులకు, ప్రవక్తలకు దేవుడు కలల ద్వారా జరగబోయే విషయాలను తెలియపరుస్తూయుండేవాడని చెప్పబడిన కొన్ని విషయాలను మనమీ శీర్షికలో చూచాము. ఆ రోజుల్లో వీరికి దేవుడు కేవలం "BLACK & WHITE" కలలు రావించే వాడేమో! నేటి ఆధునిక కాలంలో శోభన్ సర్కారు పంచరంగుల కల కని యుండవచ్చును.

ఇదీ బాగానే ఉంది. దేశం ఎంతో క్లిష్ట దశలో వుంది. అవినీతి, దోపిడి, అధికార దుర్వినియోగం జరుగుతూ యుంది. సి.బి.ఐ. దర్యాప్తులు దశాబ్దాల నుండి సాగిస్తూయున్నా ఒకకొలిక్కి రావడంలేదని మనమీ వ్యాసంలో వివరంగా చూచాము. పనిలో పనిగా రాహుల్ గాంధి తన పలుకుబడిని ఉపయోగించి ఈ కలల వీరుడు శోభన్ సర్కారును సి.బి.ఐ. డైరెక్టరుగా నియమిస్తే ఆయన రోజుకో కలకని పేరుకుపోయిన ఈ అభియోగాల గుట్టువిప్పి చిటికెలో పరిష్కారం చూపగలదేమోననిపిస్తుంది. ఇలా జరిగితే ఇక సాక్ష్యాధారాలతో పనిలేకుండ సత్వరం ఘరానా ముద్దాయిల భరతం పట్టవచ్చును.

నిజంగా ఇలా జరిగితే మన భారత దేశానికి "స్వప్న భారతావని"యని, ముద్దుగా "డ్రీమ్‌వేండ్" అని పిలుచుకోవచ్చు.

సాధారణంగా అనేక హిందూ దేవాలయాల క్రింద, హిందూ రాజులు ప్రాసాదాల కింద బంగారము, వెండి, నాణాలు మొదలైనవి భద్రపరచడం ఆనవాయితీ, ఆకారణంచే దాండియా ఖేరా కోట అడుగున ఏమయినా లభించవచ్చును. అంతేగాని వేయిటన్నుల బంగారం కలగన్న ఒక సాధువు మాటలకు ఇంత ఆర్భటం చేయవలసిన అవసరం లేదు.



# భూమిని గూర్చిన బైబిల్ వివరణ



భూమి ఎన్నటెన్నటికి కదలకుండునట్లు ఆయన దానిని నీళ్లమీద స్థిరపరచెను. కీర్తనలు 104:5 ఆయన భూమిని నీళ్లమీద పరచియున్నాడు (కీర్తనలు 136:6).

ఆయన సముద్రము మీద దానికి పునాది వేసెను. ప్రవాహ జలముల మీద దాని స్థిరపరచెను. (కీర్తనలు 24:2). భూమి యొక్క స్తంభములు యెహోవా వావశము. I సమచా॥ 2:8 సాక్షాత్తూ యెహోవా వాక్కులు:- నేను భూమికి పునాది వేసినప్పుడు నీవెక్కడ యుంటివి? నీకు వివేకము కలిగిన యెడల చెప్పుము... దాని మీద పరిమాణపు కొలతలు వేసిన వాడెవడో చెప్పుము... దాని స్తంభములకు పాదులు దేనితో కట్టబడెనో చెప్పుము. ఉదయ నక్షత్రములు ఏకముగా కూడిపాడినప్పుడు... దేవదూతలు జయజయ ధ్వనులు చేసినపుడు దానికి మూలరాతిని వేసినవాడెవడు? సముద్రము దాని గర్భము నుండి పొర్లి రాగా "తలుపుల" చేత దానిని మూసియుంచిన వాడెవడు? (యోబు-38:4:8).



**శూన్యములో వ్రేళ్లాడుచున్న భూమి**

శూన్య మండలంముపైని ఉత్తర దిక్కుననున్న ఆకాశ విశాలమును ఆయన పరచెను. ... శూన్యముపై భూమిని వ్రేళ్లాడ జేసెను. ... ఆయన గద్దింపగా ఆకాశ విశాల స్తంభములు విస్మయమొందెను. (యోబు 26:7-11).







భూమి ఆకృతి మనకు తెలిసినందున ఆయా ఊహాచిత్రాలలో భూమిని గోళాకృతిలో చిత్రించడం జరిగింది. అంతేగాని భూమి బంతివలె గుండ్రంగా యుందని బైబిల్ ఎక్కడా చెప్పలేదు. పై వచనం యోబు గ్రంథంలో గోళాకృతి ప్రస్తావన వచ్చినప్పటికీ ఈ పదప్రయోగం బైబిల్‌కు సంబంధించినది కాదనే విషయం రానున్న పేజీల్లో విపులంగా చర్చకు రానున్నది. గమనించగలరు.

**యెహోవా భూమి మీద పునాదులు వేసిన స్తంభాలపై ఆవాశములో మేడలు కట్టుకొనెను.**

ఆయన సైన్యములకధిపతి యగు యెహోవా! ఆయన భూమిని మొత్తగా అది కరిగిపోవును... ఆకాశమందు తనకొరకై మేడలు కట్టుకొనువాడును ఆకాశమునకు భూమియందు పునాదులు వేయువాడును ఆయనే! (ఆమోసు 9:5-6).



అప్పుడు భూమి కంపించెను పరమండలపు పునాదులు వణికెను. (2. సమూయేలు 22:8).

ఏది ఏమయినా మనమీ రచన ద్వారా భూగోళము తీరు తెన్నులను గూర్చి అనే శాస్త్రీయ వివరణలు చూచినందున ఇంతకన్నా ఎక్కువ వివరణలు అవసరములేదు. మాటలతో పనిలేకుండ అమెరికా అంతరిక్ష పరిశోధనా కేంద్రము "నాసా" వారు చూపుచున్న ఈ రియల్ భూమండలాన్ని ఇక్కడ మనము ప్రత్యక్షంగా చూచినట్లయితే ఈ మతగ్రంథం వివరించిన వన్నీ కట్టుకథలని తేలిపోయింది.





# సూర్యుడు

సూర్యుడు భూమికన్నా పదమూడు లక్షల రెట్లు పెద్దవాడు. భూమికి సూర్యునికి గలమధ్య దూరం 15 కోట్ల కిలోమీటర్లు. భూమి మీద జీవం ఆవిర్భావానికి, జీవ రాశి మనుగడకు సూర్యుడు మూలాధారం. సూర్యుని వ్యాసం 64 వేలమైళ్లు. సూర్యుడు కూడ భూమివలెనే ఘన పదార్థమని చాలామంది అనుకుంటారు. కాని అది భగభగమండే అతిపెద్ద వాయుగోళ నక్షత్రం. సూర్యుని బ్రహ్మాండమైన గురత్వాకర్షణ శక్తివల్ల దాని చుట్టూనున్న వాయువులు నొక్కబడి చిక్కదనం పెరిగి పారదర్శకత (ట్రేన్స్ ఫరెన్సీ) కోల్పోతుంది. దీని గురుత్వాకర్మణ శక్తి భూమికన్నా 25% అధికము. ఆ కారణంగా భూమి మీద నూరు కిలోల వస్తువు అక్కడ 2500 కిలోలు తూగుతుంది. ఇంత గొప్ప గురుత్వాకర్మణ వల్లనే సౌర కుటుంబం అని పిలవబడే ముప్పది రెండు ఉపగ్రహాలు, ఎన్నో లక్షల గ్రహ శకలాలు, తోక చుక్కలతో సహా సూర్యుడు తన చుట్టూ పరిభ్రమింపజేసి కొనుచున్నాడు.



సూర్యోపరితలంపై 60,000 (డిగ్రీల) సెంటీగ్రేడ్ వేడిమితో అనునిత్యం మండుతూ యుంటుంది. సూర్యుని కేంద్రకం అనగా లోపలి భాగంలో 20 లక్షల సెంటీగ్రేడ్ ఉష్ణోగ్రతగల సూర్య మండలంలో ఘనపదార్థం అనేదే వుండదు. ఇనుమును కరిగించుటకు కేవలం 1430 సెంటీగ్రేడ్ వేడితో మండే ఉష్ణశక్తిని ఒకసారి ఊహించండి. అది ఎంత ఎక్కువో మనము గ్రహించవచ్చు.

సూర్యోపరితలం సర్వకాల సర్వావస్థల్లోను అనునిత్యం అత్యంత అల్లకల్లోలంగానే వుంటుంది గాని అది ఒక క్షణకాలమైనా ప్రశాంతతకు తావులేదు. సూర్యునిలోని హైడ్రోజన్ - మరియు ఆటమ్‌లు కలసి హీలియంగా రూపాంతరం చెందుతుంది. ఇదిగాక మరో అరవై రకాల "ఎలిమెంట్స్"తో పాటు నాలుగు రకాల వాయువులతో ప్రతి చదరపు మీటరుకు





75 వేల హార్స్‌పవర్ శక్తి జనిస్తూ అనునిత్యం ప్రచండమైన పేలుళ్లతో మహోజ్వల వేగంతో అనగా సెకనుకు 400 కిలోమీటర్ ఉధృతమైన మెరుపు వేగంతో 80 వేల కిలోమీటర్ల పరిధి వరకు అత్యంత వేగభరితమైన "వెల్డింగ్ ఫ్లేమ్" వలె సుమారు లక్ష కిలోమీటర్ల లోపు పరిధి వరకు మంట మెరుపులను భయానకమైన రీతిలో నలుదిక్కులా విరజిమ్ముతూ మహాబీభత్సంగా తూఫానులా విరజిమ్ముతూ యుంటుంది.

ఇది ప్రతి సెకనుకు 58 కోట్ల 40 లక్షల టన్నుల హైడ్రోజను హీలియంగా మారుస్తూ ఉష్ణాన్ని విరజిమ్ముతున్నా ఈ ప్రళయ రుద్రుడైన సూర్యుడు మహాద్భుతమైన రీతిలో ఊహలకందని విధంగా 500 కోట్ల ఏళ్లుగా నిర్విరామంగా మండుచున్నప్పటికి ఈ చిరంజీవియైన సూర్యుడు రానున్న మరో 500 కోట్ల సంవత్సరాల వరకు చల్లారి పోకుండ నిర్విరామంగా మండుతూ - మండుతూ - పేలుతుపేలుతూనే వుంటాడని ప్రపంచ శాస్త్రవేత్తలు ఏక కంఠంతో అంచనా కడుతున్నారు. ఈ విపులమైన సైన్స్ వివరణ ద్వారా సూర్యుడు కేవలం ఏడెనిమిది వేల సంవత్సరాల క్రితమే సృష్టించబడ్డాడని చెప్పే బైబిల్ కథనాలు, అశ్వాల రధాల మీద పయనిస్తున్నాడని చెప్పే ఇతర పురాణ కథలు ఎంతటి అసందర్భమైనవో కాస్త నిధానంగా ఆలోచించుటకు ప్రయత్నించండి.

మనకు 15 కోట్ల కిలోమీటర్ల దూరంలోనున్న సూర్యకాంతి భూమిని చేరడానికి కేవలం 8.3 నిముషాలు మాత్రమే పడుతుంది. ప్రస్తుతం భూమి మీద పడుచున్న సూర్యకాంతి ఏ అవాంతరం వల్లనైనా సగానికి తగ్గినచో భూగోళమందలి సప్త సముద్రాలు, సకల నదీనదాలు, సమస్త సరోవరాలు చెరువులు చివరకు మన శరీర మందలి రక్తం కూడ గడ్డకట్టుకొనిపోయి భయానకమైన హిమయుగం ప్రారంభమై భూమిమీద జీవం అంతరించిపోయే ఉపద్రవం ఏర్పడతాది.

ఇదే విధంగా అదే సూర్యకాంతి ఒకటిన్నర రెట్లు అధికమైనచో భూమి అందలి సమస్తము భస్మీపటలమై పోతాది.



# సూర్యుని గూర్చిన బైబిల్ వర్ణన



ఆకాశములు దేవుని మహిమను వివరించుచున్నవి. వాటిలో ఆయన సూర్యునికి గుడారము వేసెను. (కీర్తనలు 19:4).

దూరదృషి గల యెహోవా సూర్యునికి ఎండదెబ్బ, వానతాకిత గలకుండ "టెంట్" వేశాడా?

సొలోమోను రాజు లెక్చర్: సూర్యుడు ఉదయించును. సూర్యుడు అస్తమించును. తాను ఉదయించు స్థలమును చేరుటకు త్వరపడును. (ప్రసంగి 1:5).

**దావీదు మహారాజు**

**- లాజిక్ -**



ఆయన సూర్యునికి గుడారము వేసెను. అతడు తన అంత:పురములో నుండి బయలుదేరు పెండ్లి కుమారుని వలె వున్నాడు. శూరుడు తన పథమందు పరుగెత్త నుల్లసించునట్లు అతడు ఆకాశమున ఈ దిక్కున బయలుదేరి ఆ దిక్కువరకు దాని చుట్టూ తిరిగివచ్చుచున్నాడు. (కీర్తనలు 19:4-6).

ప్రవక్త విన్నపము మేరకు పరుగెత్తని సూర్యుని నిలిపివేసిన యెహోవా!



ప్రవక్తయైన యెహోషువా - యుద్ధము జరుగుచుండగా, శత్రు సంహారానికి అనువుగా త్వరగా చీకటి పడకుండటకు గాను ఒకదినమెల్లా సూర్య చంద్రులను ఆపివేయ వలసిందిగా యెహోవాను ప్రార్థించాడట.





"యెహోషువా ప్రార్థన చేసెను". "సూర్యుడా నీవు గిబియోనుతో నిలువుము". "చంద్రుడా నీవు అయ్యాను లోయలో నిలువుము". "జనులు తమ శత్రువుల మీద పగతీర్చుకొను వరకును సూర్యుడు నిలచెను. చంద్రుడు ఆగెను... సూర్యుడు ఆకాశ మధ్యమున నిలిచి ఇంచుమించు ఒక నాడెల్ల అస్తమింప త్వరపడలేదు. (యెహోషువ. 10:12-13) పరిభ్రమించేది సూర్యుడు కాదు భూమియని ఏ మాత్రము తెలియని యెహోషువా పై విధంగా యెహోవాను కోరాడనుకుందాము. భూమితో పాటు విశాలవిశ్వాన్ని సూర్యచంద్ర నక్షత్రాదులను తానే సృజించానని చెప్పే యెహోవాకూ కూడ తిరిగేది సూర్యుడు కాదు నాయనా తిరిగేది భూమి అని చెప్పవలసింది పోయి సూర్యుడ్ని ఆగిపోమని ఆదేశించాడట. సూర్యుడు ఒకదిన మెల్లా కదలలేదట. దీనినిబట్టి ఈ కథనాలు ఎంతటి పుక్కిటి పురాణాలో బోధపడుచున్నది.



సూర్యుడు

## సూర్య-చంద్రులు లేని ఉదయాస్తమయాలు!

"భూమి నిరాకారం గాను సూన్యం గాను వుంది. వెలుగుకలుగును గాక" అన్నంతనే ప్రకాశవంతమైన వెలుగు కలిగింది. వెనువెంటనే వెలుగు చీకట్లను వేరుపరచి వాటికి "పగలు-రాత్రి" అనే పేర్లు పెట్టబడ్డాయని సృష్టికార్యం గూర్చి బైబిల్ చెబుతుంది. రెండవ రోజున జలాలను క్రిందికి పైకి వేరు చేసి ఆరిన నేలకు భూమియని, పై కాళీ ప్రదేశానికి ఆకాశమని పేర్లు పెట్టబడ్డాయి. తదుపరి చెట్టు చేమలు మొలిపించడము మొదలగు సృష్టి కార్యాలతో ముచ్చటగా మూడు రోజులు గడచిపోయాయి. అయినప్పటికి నిర్విఘ్నంగా ఉదయాస్తమయాలు యధావిధిగా సాగిపోయాయని బైబిల్ చెబుతుంది.

*ఇక్కడ మొదటి ప్రశ్న ఈ విశాల విశ్వంలో సూర్యచంద్ర నక్షత్రాదులు కాని, మరే ఇతర గ్రహాలు గాని లేకుండ ఇతర గోళాల ఆకర్షణ వికర్షణలతో నిమిత్తం లేకుండ ఒక్క భూగోళము మాత్రమే నిలకడగా నిలిచియుండనే విషయం శాస్త్ర విరుద్ధమైన అసంభవ విషయం. ఈ ఒక్క వివరణతోనే బైబిల్ సృష్టి కార్యమంతా అభూత కల్పనయని చెప్పుటకు అత్యంత ప్రాముఖ్యమైన సాక్ష్యాధారం. కాదనలేని పరమసత్యం!*

ఇక రెండవ విషయమేమంటే అదొక విడ్డూరమైన విశేషం. నిప్పులేకుండ పొగరాదు. మంటలేకుండ వెలుగురాదు. సూర్యచంద్ర నక్షత్రాదులు నాల్గవ దినాన సృష్టించబడ్డాయని చెప్పబడుచుండగా, మొదటి మూడు దినాలు పాటకు పల్లవిలా ఉదయాస్తమయాలు కాదు అస్తమయాలు ఉదయాలు సజావుగా సాగిపోయినట్టు ఏ ఆధారంతో చెప్పబడింది? కొంతమంది ఆధునిక క్రైస్తవులు ఆ వెలుగు యెహోవా నుండి వచ్చిన తేజస్సుగా అర్థాలు చెబుతారు. అయితే ఆయన తేజస్సు పొద్దున్నే ఉదయించి, సాయం సమయానికి అస్తమిస్తూ యుంటుందా?

భూమి మీద చెట్టు చేమలు మూడవ దినమందే సృజించబడ్డాయని, అప్పటికింకా సూర్యుడు కలుగజేయబడలేదని చెప్పుచుండగా, పచ్చని చెట్లకు జీవనాధారమైన సూర్యరశ్మిలేకుండ "కిరణ జన్యసంయోగ క్రియ" జరిగే అవకాశమే లేనప్పుడు చెట్లు జీవించాయనే వాదనలో పసలేదు. సృష్ట్యాది పూర్వగాథలో భూమి నిరాకారం గావించబడిందని అనంతరం యావత్ భూమండలాన్ని జలాలు ముంచివేశాయని చెప్పబడగా





సూర్యుడేలేనప్పుడు జలాలు ఎలా వచ్చాయో ఎవరికి తెలియదు. అసలు భూమి మీద అంతకుముందు వర్షమే పడలేదని, భూమి నుండి ఆవిరి వంటిది లేవగా తేమయైన భూమి నుండి చెట్లు మొలచుకొచ్చాయని చెప్పినందున అట్టి అగాధ జలాల ప్రసక్తి కూడ "మిస్టరీ"గానే మిగిలిపోయింది. క్రైస్తవ సామ్రాజ్యంలో ఎంతమంది మేధావులున్నప్పటికి ఎందుకు? ఏమిటని? ప్రశ్నించని కారణంగా మతం ముందు వారి జ్ఞానం మురికి గుడ్డపేలికల వంటిదే! అందుకే మాతాలింతకాలం మన గలుగు తున్నాయి. అందుకే మానవుని తెలివి యెహోవా జ్ఞానం ముందు పైన చెప్పిన గుడ్డపేలికల వంటిదని యెషయా ప్రవక్త వక్కాణించారు. ఇక్కడ మనము చూడగా అసలు యెషయా ప్రవక్త మాటలే మురికిగుడ్డ పేలికలుగా కనబడుచున్నవి. సర్వమతాలు నేటి వరకు సజీవంగా మన గలుగుతున్నాయంటే ఇదే కారణం. ఆయా మతాలు ఎంతటి అసంభవ విషయాలను చెప్పినా, అది ఎంతటి అభూత కల్పలనైనప్పటికి బాల్యదశ నుండి అనేకసార్లు వినీ... వినీ వారి మనసుల్లో అవి నిజాలుగా పాతుకుపోతాయి. చివరకు అవి నిజాలై కూర్చుంటాయి.

నాల్గవ దినాన పగటిని ఏలుటకు పెద్దజ్యోతిని, రాత్రిని ఏలుటకు చిన్నజ్యోతిని నక్షత్రాలను చేసినట్లుంది. సూర్యచంద్రులను జ్యోతులుగా పేర్కొన్నారు. జ్యోతి అనగా భగభగమండేది. జగజగ వెలిగేది. అని అర్థము. అయితే చంద్రుడు జ్యోతి ఎంతమాత్రము కాదు. అది ఒక నిర్జీవ గ్రహమని, అది యొక బూడిద కుప్పయని మానవుడు స్వయంగా అందుకాలిడి మరి చూచివచ్చాడు.

సూర్యరశ్మి చంద్రుడిపై పడినందుననే అది ప్రతి ఫలిస్తున్నదే తప్ప దాని వెన్నెలకు కారణం దాని స్వయం ప్రకాశం ఎంతమాత్రము కానేకాదు. ఇంతటి ముఖ్య విషయం బైబిల్ రచయితల ఊహలకు దరిదాపులకు కూడ రాలేదు. "చందమామ రావే! జాబిల్లి రావే! అన్న చందానే రచన సాగింది. మనకంటికి గోచరించిన విధంగానే సూర్యుడు పెద్దజ్యోతి, చంద్రుడు చిన్నజ్యోతి, నక్షత్రాలు మరీచిన్నవనే భావన కలిగించే విధంగా ఆ రచన సాగింది. సూర్యునికన్నా కోటాను కోట్ల రెట్లు పెద్దవి, మరింత ప్రకాశవంతమైనవి అయిన సుదూర

నక్షత్రాలను గూర్చి ఏ విధమైన ప్రాముఖ్యత నీయంకుండ వివరణలీయడం గమనార్హం.

బైబిల్‌లో చెప్పబడిన కాకి లెక్క లెలాగున్నా నిజానికి సూర్యచంద్ర నక్షత్రాలేర్పడి అయిదు వందల కోట్ల సంవత్సరాలకు పైగా అయ్యిందని ఖగోళ శాస్త్రవేత్తల అంచనా! కోటానుకోట్ల సంవత్సరాల క్రితము సూర్యుని నుండి విడివడిన పదార్ధమే కాలక్రమేణా చల్లారి, వాతావరణ మేర్పడి, దాని ప్రభావానికి అవి అనేక మార్పులు చేర్పులు చెంది చల్లారి నేడీస్తితికి వచ్చినా అవి ఇంకా ఇంకా మార్పులు చెందుతూనే వున్నాయి. ఒక వంకాయను వేడి నిప్పులు గాని బూడిదలో కాలనించ్చి బయటకు తీసి చల్లార్చినచో అది ఎత్తుపలాలు గల బొడిపెలతో ఎగుడుదిగుడుగా రూపాంతరం చెందుతుంది. అయితే ఆ వంకాయ లోపలి భాగంలోని వేడి చాలా సేపటి వరకు చల్లారదు. అలాగే కోట్ల సంవత్సరాలకు పూర్వం సూర్యునిలో జరిగిన మహా విస్పోటనం (బిగ్‌బాంగ్) జరిగి కొంతపదార్థం విడివడి అవి సూర్యునికి ఉపగ్రహాలుగా స్థిరపడినవని, ఈ కారణంగానే భూమిలోపలిపొరలయందలి వేడి ఇంకా చల్లారక అగ్ని పర్వతాల రూపంలో బహిర్గత మగుచున్నవని అనేక పరిశోధనల అనంతరం శాస్త్రవేత్తలు సిద్ధాంతీకరించారు. అంతేగాని భూమి కేవలం ఏడు వేల సంవత్సరాల క్రితమే సృజించబడి, వెనువెంటనే సస్యశ్యామలం గావించబడిందని, నివాసయోగ్యమైయ్యిందని చెప్పబడిన సృష్టివాదం కల్పిత గాధగా వీగిపోయింది. దీనికి సంబంధించిన వివరాలు ఇది నిజమా ప్రథమ భాగంలోనే చూచాము.

ఇక్కడ మరియొక అనుమానం పొడసూపుతుంది. సృష్టిలో ఒకే లక్ష్యం కొరకు, ఒకే విధి నిర్వహణార్థం యెహోవా అంతకుముందు కేవలం మూడు రోజుల క్రితం వెలుగును చేయడం వెలుగు చీకట్లను వేరుచేయడం అవి మంచివైనట్టు యెహోవా సంతృప్తి చెందడం జరిగినా నాలుగు దినాల అనంతరం సూర్యుని ద్వారా వెలుగురాగా పాత వెలుగు చీకట్లు ఏమైపోయాయి? దాని వివరణ ఏకోశాన లేకపోవడం చూడగా సృష్టికార్యం గందరగోళంలో పడింది.










## చంద్రుడు

చంద్రుడు భూమికన్నా చాలా చిన్నవాడు. చంద్రుడు భూగోళంలో సుమారు 80వ వంతు వరకు వుండి మనకు అత్యంత సమీపంలో గల ఖగోళ గ్రహాల్లో మొదటివాడు. చందమామ భూమికి మూడుకోట్ల, ఎనుబది నాలుగు లక్షల, నాలుగు వందల కిలోమీటర్ల దూరంలో వున్నాడు. చంద్రుడు భూమికి ఉపగ్రహము మాత్రమే.

సూర్యకాంతి చంద్రోపరితలం పై పడి ప్రతిఫలించడం వల్ల మాత్రమే మనకు వెన్నెల కాస్తుంది. చంద్రుడు తన చుట్టూ తాను తిరిగే సమయం, నక్షత్ర మాసం ఒకటే అయినందున చంద్రుని మనము ఎల్లప్పుడూ ఒకే వైపు చూస్తాము. దాని వెనుకవైపు ఎల్లప్పుడూ గాఢాంధకారం కలిగియుంటుంది. చంద్రునిపై వాతావరణము లేనందున పగలు అత్యంత వేడిమి, రాత్రులు అత్యంత చల్లదనం కలిగియుంటాది. మొట్టమొదటగా రష్యన్ వ్యోమ నౌక చంద్రుని వెనుక భాగాన్ని ఫొటోలు తీయడం జరిగింది. ఇటీవలి వరకు అక్కడ నీళు లేవని తలస్తూ వచ్చారు. అయితే మన భారతీయ అంతరిక్ష శాస్త్రవేత్తల కృషి ఫలితంగా మన శాస్త్రవేత్తలు ప్రయోగించిన “చంద్రయాన్-1” ద్వారా అక్కడ నీటి జాడలు కనుగొన్నారు. దీనిని అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థ “నాసా” కూడ ధృవీకరించింది.



నేడు భూమి మీద మానవ వనరులు అంతరించి పోతున్నాయి. భూమి నుండి అనేక రకాలైన ఖనిజసంపద, సహజ వాయువులు, పెట్రోలు డీజిల్‌కు సంబంధించి ఇంధన వనర్లు నిండుకొంటున్నాయి. కొత్త రకాల ఇంధన పరిశోధనలు ప్రారంభమయ్యాయి. భావితరాల మనుగడ అగమ్య గోచరంగా మారకుండ భూమిని రక్షించుకొనే ప్రయత్నాలు ముమ్మరంగా సాగుతున్నాయి. మానవుడు ఇతర గ్రహాలకు తరలిపోవలసిన పరిస్థితులు ఎదురు కావచ్చునేమోయనే భావనలు కూడ శాస్త్రవేత్తలు ఆలోచించడం ప్రారంభించారు. ఈ తరుణంలో చంద్రునిపై నీటి నిల్వలున్నాయనే విషయం మానవునిలో ఆశలు రేకెత్తుచున్నాయి.

చందమామపై నీటి వనరులు మంచురూపంలో విస్తారంగా వున్నాయని నాసా ప్రకటించడంతోనే ఇది "ఈ సహస్రాబ్ది ఆవిష్కరణ"యని భారతీయ అంతరిక్ష సంస్థ "ఇస్రో" మాజీ నేత మాధవన్ నాయర్ అభివర్ణించారు. చంద్రునిపై మానవ స్థావరాలు ఏర్పాటు అనే చిరకాల వాంఛ, నెరవేరే రోజు మరెంతో దూరంలో లేదని అంతరిక్ష నిపుణులు అభిప్రాయపడుతున్నారు.

చందమామ ఉత్తర ధ్రువ ప్రాంతంలో దర్శనమిచ్చిన మంచు బిలాలు. స్పష్టంగా కనిపిస్తున్న మంచుబిలం (అంతరచిత్రంలో)

## చంద్రుడిపై మంచు బిలాలు

**గుర్తించిన నాసా రాడార్ • చంద్రయాన్-I ప్రాజెక్టు నుంచే..**

వాషింగ్టన్: అమెరికా అంతరిక్ష సంస్థ నాసాకు చెందిన రాడార్ చందమామపై మంచు బిలాలు ఉన్నట్లు గుర్తించింది. ఉత్తర ధ్రువం ప్రాంతంలో నలభైకిపైగా మంచుతో నిండిన బిలాలు కనిపించాయి. చంద్రుడిపై పరిశోధనలు నిర్వహించడానికి భారత్ పంపిన అంతరిక్ష ఉపగ్రహం చంద్రయాన్-1పై నాసా అమర్చిన 'మినీఎస్ఏఆర్' రాడార్ వీటిని గుర్తించింది. చంద్రుడిపై నీటి జాడలు ఉన్నాయనే వార్తల్ని తాజా పరిణామం మరోసారి బలపరచినట్లయింది. 2 నుంచి 15 కి.మీ. పరిమాణంతో ఈ బిలాలు కనిపించినట్లు నాసా ఓ ప్రకటనలో తెలిపింది. వీటిలో సుమారు 600 మిలియన్ మెట్రిక్ టన్నుల మంచునీరు ఉన్నట్లు అంచనా వేసింది. ఈ సరికొత్త పరిణామాలతో చంద్రుడు గతంలోకన్నా ఆసక్తికరమైన, ఆకర్షణీయమైన పరిశోధనలకు గమ్యస్థానంగా మారారని నాసా శాస్త్రవేత్త పాల్ స్పుడిస్ పేర్కొన్నారు. చంద్రుడిపై పూర్తిగా చీకట్లో ఉండిపోయిన, భూమి నుంచి చూడలేకపోతున్న బిలాలను 'మినీఎస్ఏఆర్' రాడార్ సమర్థంగా పట్టిచూపించిందని వివరించారు.

మానవ నాగరికతను కొత్త ప్రాంతాలకు విస్తరింపజేయడం అక్కడ లభించే కొత్త తరహా లోహాలను, ఇంధన వనరులను వెలికి తీసి మానవ కళ్యాణానికి తోడ్పడడం అక్కడి వనరులను ఉపయోగించుకొని, కొత్త ఉత్పత్తుల ద్వారా మరింత సంపదను సృష్టించి మానవాళికి అందజేయుటకు అవకాశ మేర్పడుతుంది.

భూమిపై నుండి మనము ఇతర గ్రహాలకు తరలి వెళ్లవలసిన పరిస్థితి సఫలమైతే విశ్వంలో అడుగుపెట్టడానికి మనకు మొదటి మజిలీ చంద్రుడే అవుతాడు. ఎందుకంటే భూమికి అతి సమీపంలోనున్న ఉపగ్రహం చందమామే! ఈ కారణంగా చంద్రుడొక కీలకమైన "స్పేస్-స్టేషన్"గా ఉపయోగపడతాడు. ఇతర గ్రహాలకు వెళ్లే వ్యోమగాములు విశ్రాంతి





తీసికొనుటకు, మున్ముందు అక్కడే లభించబోయే ఇందనాన్ని కూడ వ్యోమనౌకలు నింపుకొనుటకు వీలుపడవచ్చు.

అభివృద్ధి చెందిన అమెరికా వంటి కొన్ని దేశాలలో ప్రయివేటు వ్యక్తులను కూడ అంతరిక్షంలోనికి తీసికొని వెళ్లుటకు అనేక ప్రయివేటు కంపెనీలు ఆవిర్భవించి కోట్ల డాలర్ల వాణిజ్యాన్ని ఇప్పటికే నడుపుతున్నాయి. అభివృద్ధి చెందిన నేటి సాంకేతిక పరిజ్ఞానం ద్వారా నేడు అమెరికా వ్యోమగాములకు చందమామ పర్యటనకు పట్టే సమయం విప్లవాత్మకంగా తగ్గిపోయింది. అది నేడు కేవలం మూడు రోజులు మాత్రమే! చంద్రునిపై నుండి నేడు ఫోనులో మాట్లాడితే కేవలం మూడు సెకన్ల ఆలస్యంతో సంభాషణ భూమికి చేరుతుంది.

గతంలో చాలామంది ఈ అంతరిక్ష పరిశోధనలను గూర్చి పెదవి విరుస్తూ ఎందుకీ ప్రజాధన దుర్వినియోగం ఆ వేల కోట్ల అనవసరపు ఖర్చుతో లక్షలాది మంది దారిద్ర్యాన్ని నిర్మూలించవచ్చునని విమర్శలు గుప్పించేవారు.

భవిష్యత్తులో చంద్రునిపై మానవ ఆవాసాలు ఏర్పాటు చేసికోవడానికి నీరే కనబడుతుంది గాని మానవ ప్రాణాధారమైన గాలి అక్కడ లేదని కొందరు తలంచవచ్చును. ఇప్పుడు మనకు నీరు మాత్రమే బయటపడింది. అక్కడ లభిస్తున్న మంచును కరిగించి నీరుగా మార్చడమేగాక నీటిని ఆక్సిజన్ - హైడ్రోజన్‌లుగా విడగొట్టడం వల్ల వ్యోమగాములకు కావలసిన ప్రాణవాయువు లభిస్తుంది. దానితో పాటు అంతరిక్ష వ్యోమనౌకలకు ఇంధనం కూడ లభిస్తుంది.

ప్రస్తుతము ఈ చంద్రమండల పరిశోధనా కార్యక్రమాలలో అమెరికా, భారత్, రష్యా, చైనా, జపాన్ తదితర దేశాలు ఈ ప్రయోగాలను తీవ్రతరం చేయుటకు ముమ్మర ప్రయత్నాలు ప్రారంభించాయి. మన కార్మిక శక్తి, నిపుణుల పర్యవేక్షణ ఇంతవరకు గల్ఫ్ కంట్రీస్‌కు, ఆస్ట్రేలియా, అమెరికా, బ్రిటన్ తదితర దేశాలకు అవసరమైన విధంగానే మున్ముందు అనేకులకు చంద్రమండలంలో ఉద్యోగ అవకాశాలు దొరికే రోజులు భావితరాలకు నిస్సందేహంగా అందుబాటులోకి రాగలవు. మరో చిత్రమేమిటంటే ఆనాడు కూడ తమతో పాటు ఆయా మతాలను వాటి తాలుకు దేవుళ్లను కూడ చంద్రమండలానికి ఎగుమతి చేస్తారు. ఇటీవలి పరిశోధనల్లో చంద్రునికన్నా మరింత దూరంలో నున్న "కుజగ్రహం" మానవ నివాసానికి మరింత అనుకూలమని భావిస్తున్నారు.




రాత్రి సమయాల్లో మనము ఆరు బయట పరుండి ఆకాశము వైపు చూస్తే భూమిపై పెద్ద గిన్నె బోర్లించిన విధంగా లెక్కకందని విధంగా నేత్రానందం కలిగిస్తూయుంటాయి. ఇటువంటి నక్షత్ర కుటుంబానికి చెందిన వాడే సూర్యుడు కూడ. ఇటువంటి నక్షత్ర సూరీళ్లు విశాల విశ్వంలో అనేకంగా వుంటాయి. ఇంచుమించుగా అవన్నీ కూడ భగభగ మండే అగ్నిగోళాలే!

మన కంటికి గోచరించే నక్షత్ర మండలాన్ని పాలపుంత (మిల్కీవే)గా వ్యవహరిస్తారు. ఈ మిల్కీవే యందు సుమారు పదివేల కోట్ల నక్షత్రాలుంటాయని ఖగోళ శాస్త్రవేత్తల అంచనా. ఇట్టి నక్షత్ర మండలాలను గెలాక్సీలుగా పిలుస్తారు. ఈ విధంగా ఊహలకందని విశాల విశ్వంలో కోట్లాది కాంతి సంవత్సరాల ఆవల సుధీర తీరాల్లో ఒకదానిపైన మరొకటిగా నున్న గెలాక్సీలు పదిహేడు వేల కోట్ల వరకు వ్యాపించియున్నట్టు ఖగోళ శాస్త్రం చెబుతుంది. ఇట్టి సంగతులు సామాన్య ప్రజానీకం మేధస్సు అందని విషయాలు. బైబిల్ నందు మనకు కంటికి కనబడే పాలపుంత ఒక్కటే నక్షత్ర మండలంగా చెప్పబడింది. ఇంతటి విస్తృత పరిధిలో అండపిండ బ్రహ్మాండమైన నక్షత్ర సముదాయాలు, కోటానుకోట్ల గెలాక్సీలు ఎందుకు "సృష్టించబడ్డా"యో బైబిల్‌లో వివరించబడలేదు. కొన్ని సందర్భాలలో బైబిల్ మూడవ ఆకాశం - ఏడవ ఆకాశం అంటూ వ్రేళ్లమీద లెక్కించే ప్రస్తావనలు మాత్రమే తెచ్చింది. అంతేగాని మొత్తము గెలాక్సీలు పదిహేడు వేల కోట్ల వరకు వున్నాయనే విషయము బైబిల్ రచయితలకు ఊహామాత్రంగానైనా తెలియదు.

ఇంచుమించు మత గ్రంథాలన్నీ విశాల విశ్వం గూర్చిన విషయాలను కాల్పనిక ధోరణిలో కాకమ్మ కథలవలె ఊహా జనితంగా సాగాయి. మతం ఖగోళ శాస్త్ర విజ్ఞానాన్ని అపహాస్యం చేస్తూ అడుగడుగునా ధిక్కరించింది. అయినా మానవ జ్ఞాన నేత్రం మత కట్టడలను ధిక్కరించి ప్రాణాలను సైతం పణంగా పెట్టి మానవ జాతి పురోభివృద్ధికి పాటుపడింది. 1975-80 ప్రాంతాలకు పూర్వమే అమెరికా యందలి కేలిఫోర్నియా రాష్ట్రమందు మౌంట్ విల్సన్ అబ్జర్ వేటరీలో నూరు అంగుళాలు, "మౌంట్ పలోమార్"లో 200 అంగుళాల వ్యాసంగల పెద్ద టెలిస్కోపులను అమర్చి విశాల విశ్వమందలి నక్షత్ర సముదాయాలను పరికిస్తూ వచ్చారు. తదుపరి రష్యా పై రెంటికన్నా పెద్ద టెలిస్కోప్‌ను కాకసస్ పర్వత శ్రేణిలో సుమారు 236 అంగుళాల వ్యాసం గల దానిని అమర్చారు. యీ విధమయిన పోటీలో ఏకంగా 390 అంగుళాల వ్యాసం గల ఒక రాకాశి టెలిస్కోపును అమెరికానందే "హవాయి"లో ఒక ఎత్తయిన పర్వతంపై నెలకొల్పారు. దీని సహాయంతో 1200 "కోట్ల







కాంతి సంవత్సరా"ల దూరం వరకు వీక్షించుటకు అవకాశ మేర్పడింది. ఈ "టెలిస్కోప్"తో చంద్రమండలం మీద చిన్న క్రొవ్వొత్తిని వెలిగించి పెట్టినా దానిని తేటతెల్లంగా చూడవచ్చునట. ముప్పయి ముప్పయైదు సంవత్సరాల క్రితం మాట. ఇప్పుడు మరింత శక్తివంతమైన "ఎలక్ట్రానిక్ మైక్రోస్కోప్ టెలిస్కోపులు" మరింత అభివృద్ధి చెందాయి. ఈ విశాల విశ్వరహస్యాలను ఇటువంటి టెలిస్కోపులతోనే కాకుండ అత్యాధునిక రాడార్ యంత్రాలతో మరే ఇతర గ్రహాలలోనయినా గ్రహాంతర వాసుల వునికి కనిపెట్ట వచ్చునేమోయని రేడియో సంకేతాల ద్వారా ఏమయినా సమాచారం లభించ వచ్చునేమోయని రేయింబవళ్లు ఎదురు తెన్నులు చూస్తున్నారు. అధ్యతన భావిలో గ్రహాంతర మానవులను కనుగొన్నా ఆశ్యర్యపోవలసిన పనిలేదు అది ఇప్పట్లో సాధ్యం కాకున్నా రాగల వందల సంవత్సరాల్లోనైనా ఇది జరిగి తీరు తుందనుటలో ఎటువంటి సందేహములేదు. ఎందు చేతనంటే విశాలవిశ్వంలో అనేక కాంతి సంవత్సరాల ఆవలనున్న పదిహేడు వేలకోట్ల "గెలాక్సీల్లో" ఎక్కడైనా జీవం వుండే అవకాశం లేకపోలేదు. విశాల విశ్వాంత రాళంలో భూమి కేవలం ఒక ఇసుక రేణువ వంటిది. ఇదే సర్వస్వం కాదు.

**<u>గ్రహాంరత జీవులపై గట్టి నమ్మకం!</u>**

ఈ విశ్వంలో భూమిపై తప్ప మరెక్కడా జీవులు లేవా? అనే ప్రశ్న యావత్ ప్రపంచాన్నీ వేదిస్తున్నది. ఈ అంశంపై సాధికారికమైన పరిశోధనలు జరుపుతున్న శాస్త్రవేత్తలలో మన దేశానికి చెందిన జయంత్ విష్ణు నార్లికర్ ఒకరు. మనదేశ ఉన్నత పురస్కారాలలో ఒకటైన పద్మవిభూషణ్ అందుకున్న ఈయన అంతర్జాతీయ గుర్తింపు పొందిన శాస్త్రవేత్త. ఈయన మన హైదరాబాద్‌లో జరిగిన పరిశోధనలలో గ్రహాంతరాలకు చెందిన సూక్షజీవులను కనుగొనడం ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. గ్రహాంతరాల్లో జీవంవుందనే ఆయన వాదన **2001**లో భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో) హైద్రాబాద్‌లో జరిపిన ప్రయోగం బలం చేకూర్చింది. ఓ 'భారీ బెలూన్‌కు అనుసంధా నించిన "పేలోడ్"ను భూమి ఉపరితలం నుండి **41** కి.మీ॥ ఎత్తులోని వాతావరణంలోకి ప్రయోగించగా అక్కడి సూక్ష్మజీవుల వునికి గుర్తించారు. అంత ఎత్తుకు భూమి మీద సూక్ష్మజీవులు వెళ్లలేని కారణంగా అవి భూమికి సంబంధించినవి కావని నిర్ధారించారు. దీనితో ఈ పరిశోధనలకు తీవ్రతరం చేశారు.



... ఈనాడు వి. జూలై 2010 సౌజన్యంతో

**కాంతివేగం:**

కాంతివేగం అని తరచుగా చెప్పుకోవలసిన వస్తున్నందున అసలు కాంతి వేగమంటే ఏమిటో వివరంగా తెలిసికోవాలి.

కాంతి వేగం: నక్షత్రాల దూరం కిలోమీటర్లలో కొలుచుట అసాధ్యం. ఆ కారణంగా నక్షత్రాల దూరాన్ని కాంతివేగంతో కొలుస్తారు. కాంతివేగం నిముషానికి సుమారు *187 1/2* కోట్ల కిలోమీటర్లు. మనకు *15* కోట్ల కి.మీ. దూరంలోనున్న సూర్యుని కాంతి భూమిని చేరుటకు *8.3* నిముషాలు పడుతుంది. ఇంకా తేలికగా చెప్పాలంటే కాంతివేగం రెప్పపాటులో ఏడున్నర సార్లు భూమిని చుట్టి వస్తుంది. ఇంతటి వేగవంతంగా పయనించే కాంతి - ఒక సంవత్సర కాలంలో ఎంతదూరం పయనిస్తుందో దానినే "ఒక కాంతి సంవత్సర మంటారు". అధ్యతన భావిలో కాంతివేగంతో పయనించగల రోదసీనౌకను మానవుడు తయారు చేయడం జరిగినా. ఒక సుదూర నక్షత్రాన్ని మానవుడు చేరుటకు అనేక మిలియన్ సంవత్సరాలు పట్టవచ్చును.

ఉదాహరణగా భూమికి అత్యంత చేరువలోనున్న "ఫాక్సిమా సెంటారై" అనే నక్షత్రం సూర్యునికి మనకు గల *15* కోట్ల కి.మీ. దూరం కన్నా రెండు లక్షల యాభైవేల రెట్లు అధికమైన దూరంలో యున్నది. ఇప్పుడు మనకున్న **(2010వ సంవత్సరం)** రోదసీ నౌకా వేగంతో బయలు దేరినా పై నక్షత్రం చేరుటకు అధమపక్షం ఏడు లక్షల సంవత్సరాలు పడుతుందంటేనే అది ఎంతదూరమో ఆలోచించవచ్చు. ఇంతటి జఠిలమైన సుధీర్ఘ వివరణలో భూగోళంకన్నా ఆ నక్షత్రాలు ఎన్నివేల కోట్లరెట్లు పెద్దవో అవగాహన కలిగించుటకు మీకు ఇంత శ్రమ కలిగించినందుకు మన్నించగలరు.







# నక్షత్రాలు నేలరాలుట

ప్రకటన గ్రంథ రచయితయైన యోహాను చెరపట్టబడి సలసలా కాగేనూనెలో ముంచితీయగా కాలిన గాయాలతో "పత్మాసు" అనే దీవిలో ఖైదీగా యుండగా "యుగ సమాప్తి"యందు **క్రీస్తుచే బయలు పరచబడినవాడై** క్రీస్తు సంఘాలను హెచ్చరిస్తూ వ్రాసినట్లు చెప్పబడుతుంది. అక్కడ ఈయనకు తిండితిప్పలు ఎలా అమిరాయో అగమ్యగోచరం.

1) సూర్యుడు కంబళివలె నలుపాయెను. చంద్రబింబమంతయు రక్తవర్ణమాయెను. పెద్దగాలి చేత ఊగు అంజూరపు చెట్టు నుండి అకాలపు కాయలు రాలునట్లు ఆకాశ నక్షత్రములు భూమి మీద రాలిపడెను. (ప్రకటన 6:12,13).



2) మూడవ దూత బూర వూదగా దివిటీ వలె మండుచున్న యొక పెద్ద నక్షత్రము రాలి నదుల మూడవ భాగము మీదను నీటి బుగ్గల మీదను పడెను. అందుచే నీళ్లలో మూడవ భాగము "మాచిపత్రి" యాయెను. నీళ్ళు చేదైపోయినందున వాటి వలన అనేకులు చచ్చిరి. (ప్రకటన 8:10,11).

3) ఇదిగో ఎర్రని ఘటసర్పము. దానికి ఏడు తలలును, పది కొమ్ములును గూర్చి చదువుచున్నపుడు ఇట్టి ప్రసగాలు వినే సందర్భంలోను, భయంకర కౄరమృగ వర్ణన, "రాకాశి తేళ్లు" ఒక స్త్రీ ఏకంగా నెత్తిమీద ఏడు నక్షత్రాలను తలపై అలంకరించుకొన్నదని వేరొక దేవదూత మేఘాలను ధరించి తలమీద ఇంద్ర ధనస్సును ధరించియున్నదని

అతిశయోక్తులతో కూడిన అసంభవ విషయాలను భయానకంగా వర్ణిస్తూ క్రైస్తవ సమాజాల గుండెలను చెదర గొడుతూ, బి.పి.లను పెంచుతూ హడలగొట్టేస్తూ వుంటాయి ఇట్టి ప్రసంగాలు.



పై వాక్యాలను మనము చూడగా నక్షత్రలు అకాలపు అంజూరపు కాయలు రాలునట్టుగా, భూమ్మిద రాలిపడిపోతాయనీ, మండుచున్న నక్షత్రాలు నదుల మీద పడి విషపూరితంగావిస్తాయని, ఆ నీరు త్రాగిన మనుష్యులు చచ్చిపోతారని భయానకంగా వర్ణించబడింది. ఈ ఘటసర్పాన్ని ఇంగ్లీషు బైబిల్ నందు "డ్రేగన్"గా వర్ణించబడింది.

నక్షత్రాల ఆకృతి ఎంతపెద్దదో అవి లెక్కలకు అందని కాంతి సంవత్సరాల ఆవల కోటానుకోట్ల మిలియన్-బిలియన్-ట్రిలియన్లుగా వున్న నక్షత్రాలు గెలాక్సీలుగా ఏర్పడి ఒకదాని పైనొకటి 17 కోట్ల గెలాక్సీలున్నాయని ఇంతకుముందు పేజీల్లో చూచాము. అయినప్పటికి మనము కేవలము మనకంటికి కనబడే మిల్కీవే యందలి పదివేల కోట్ల నక్షత్రాలనే పరిగణనలోనికి తీసికొందాము. అయినప్పటికీ భూమి మీద రాల్చబడతాయని చెప్పబడిన నక్షత్రాల సంఖ్య ఎంతటి భయంకరంగా యుంటుందో చూడండి. పది వేల కోట్ల నక్షత్రాల్లోను మూడవ వంతు నక్షత్రాలు రాల్చబడ్డాయని చెప్పుచున్నందున ఆ మూడవ వంతు నక్షత్రాలు ఎన్నోచూడండి...



ముప్పది మూడు కోట్ల, ముప్పది మూడు వేల, మూడు వందల, ముప్పది మూడు లక్షలన్న మాట. ఆ సంఖ్య ఈ విధంగా యుంటుంది. (3333,33,33,333) భూమికన్నా లక్షలాది రెట్లు పెద్దవైన నక్షత్రాలు కోట్ల లక్షల సంఖ్యలో కాదు ఒక నక్షత్రంలో మూడవ వంతు శకలం వచ్చి భూమిని ఢీ కొట్టడం జరిగితే అసలు భూమి గాని అందలి సమస్తము నామ రూపాలు లేకుండ భస్మీపటలమైపోతాది.

అసలు నక్షత్రాలు ఒక్క ఆకృతిలోనే కాక వాటి ద్రవ్యరాశి అంతులేని వ్యత్యాసము కలిగిన బరువుతో వుంటాయి. యీ విషయము చాలామందికి తెలియదు. ఉదాహరణకు మనకు పదమూడు కాంతి సంవత్సరాల ఆవలనున్న "వాన్‌మానెన్స్" అనే నక్షత్రం మన భూమండల బరువుకంటే అరవైయ్యారు వేలరెట్లు అధికమైన బరువువుంటాదట. మనము పై నక్షత్రం నుండి కేవలం ఒక ఘనపుటంగుళం పదార్థాన్ని సేకరించి భూమి మీదకు తెచ్చి





తూకం వేస్తే దాని బరువు దాదాపు ఆరుటన్నుల వరకు తూగుతాదంటే నక్షత్రాల యొక్క బరువు ఏ విధంగా యుంటుందో అవగాహన కలుగుతుంది. గాని అన్ని నక్షత్రాలు ఇదే విధంగా యుండవు. కొన్ని విభిన్న రీతుల్లో వాటి వాటి బరువుల్లో తేడాలుంటాయి.

గత ఇరవయ్యో శతాబ్ధాంతంలో సూర్యునికన్నా పదివేల కోట్ల రెట్లు కాంతివంతమైన అతిపెద్ద నక్షత్రాని దక్షణార్ధ గోళంలోని "తరంటులా నెబ్యులా" అనబడే పాలపుంత కేంద్ర భాగంలో వున్నట్టు అమెరికా శాస్త్రవేత్తలు గుర్తించినట్టు వార్తలు వచ్చాయి. భావితరాలకు మరింకెన్నో అద్భుత విషయాలు ఆవిష్కరించబడ గలవనుటలో ఎటువంటి సందేహము లేదు.

ఇట్టి రుజువుల కారణంగా భూమికన్నా సూర్యుడే పదమూడు రెట్లు పెద్దవాడు కాగా సూర్యునికన్నా భూమికన్నా వేలాది రెట్లు పెద్దవైన నక్షత్ర సముదాయాలు కోటానుకోట్లుగా భూమి మీదకు రాలిపోతాయని అయినా భూమికి ఎటువంటి ఆపద లేకుండ కొన్ని నదులు, నీటి వనరులు మాత్రమే విషపూరితమౌతాయని వాటి రుచి మారిందని చెప్పే విషయాలు అవగాహనా రాహిత్యంతో నక్షత్రాల విషయం ఏ మాత్రము తెలియని వారు వ్రాసిన "అకాలపు అంజూరపు" కాయలతో పోల్చడం వంటి కథనాలు. కోట్ల నక్షత్రాలు, లక్షల... వేల.. వందల.. పదుల నక్షత్రాలు రాలనవసరము లేదు. కేవలం ఒక్క నక్షత్రం భూమిని ఢీ కొంటే చాలు. భయంకర విస్పోటనం జరిగి యావత్ జీవంతోపాటు సమస్త భూగ్రహం చిద్రమైపోయి భస్మీపటలమైపోతాది. కనీసం ఈ వార్త ప్రకటించుటకు "మీడియా"లనేవే మిగలవు. ఈ సంగతి ఇదివరకే చెప్పుకున్నాము. ఇంతే సంగతులు చిత్తగించవలెను.

ఈ విధంగా అజ్ఞానాంధకారంలో, ఆటవిక ఆలోచనలతో ఆశాస్త్రీయ అవగాహనలతో మతం మానవాళిని తప్పుదారి పట్టిస్తుండగా శాస్త్ర విజ్ఞానం దినదినాభివృద్ధి గాంచుతూ ఎప్పటికప్పుడు తాజా పరిశోధనలను అమెరికాకు చెందిన "న్యూసైంటిస్టు" అనే ప్రముఖ పత్రిక ప్రచురిస్తూయుండగా ముఖ్యంగా తెలుగు దినపత్రిక "ఈనాడు", "ఆంధ్రజ్యోతి", ఇటీవల "సాక్షి" తదితర వార్తా పత్రికలు మనకందిస్తూ ఎనలేని మేలు చేస్తున్నాయి. నేటి కంప్యూటర్ యుగంలో మనకు ఏ విధమైన సమాచారం కావలసినా సరే దానికి సంబంధించిన "వెబ్‌సైట్" ఓపెన్ చేస్తే వాటికి సంబంధించిన సకల సమాచారము మనకళ్లముందు ప్రత్యక్షమౌతుంది. ఇంతటి అపూర్వ విజ్ఞాన సంపదను మానవాళికి అందజేసిన సకల శాస్త్ర ప్రముఖులకు మరొక్కసారి జోహార్లర్పిస్తున్నాను.

యెహోవా మానవ మనుగడ కోసం సూర్యచంద్ర నక్షత్రాదులను చిన్న నలుసులాటి భూమి కొరకు సృష్టించాడని బైబిల్ చెబుతూయుండగా యెహోవాకే తెలియని వేలకోట్ల గెలాక్సీలు.. లక్షలాది సూర్యుళ్లు... ఎక్కడి నుండి వచ్చాయో చెప్పడానికి మతం యొద్ద ఎటువంటి సమాచారము లేదు. పైగా అవగాహన లేని విధంగా నక్షత్రాలు రాలి మీది

నీళ్లకుండలను పగల గొడతాయి జాగ్రత్త యన్నట్టు పొంతనలేని భయాందోళనలను ప్రచారం చేస్తున్నాయి.



భూమికన్నా అనేక రెట్లు పెద్దవయిన నక్షత్రాలు రాలుడు - కథనాలు ఎంత హాస్యాస్పదమైనవో ఈ క్రింది చిత్రాన్ని చూడండి. ఈ విధంగానే ఘటసర్పం నక్షత్రాలను రాల్చే ఊహా చిత్రాలు కూడ ఇక్కడ ఇవ్వబడుతున్నాయి. ఇవి జాగ్రత్తగా చదివితే మీ గుండెల మీద పడనున్న గుమ్మడి కాయల్లాంటి నక్షత్రాలు బరువు క్షణాల మీద దిగిపోయి కనువిప్పు కలుగుజేస్తాయి.

ఇక్కడ భూమండలం ఆవగింజతో పోల్చబడుతుంది. నక్షత్రాలు గుమ్మడికాయలతో పోల్చబడ్డాయి.

ఈ ఆవగింజమీద గుమ్మడికాయలు నిలిచియుండగలరా? నిలవడం సంగతి అలాగుంచి ఎంతవెదకినా ఆవగింజ అడ్రసు దొరకడమనేది జరగదు.

**భూమి మీద నక్షత్రాలు రాలడమనేది అసంభవమమైన విషయం**




యీ చిత్రానికి ఏ మాత్రము వివరణ అవసరము లేదు. అదే మితో మాట్లాడుతుంది.

మూడవ దూత బూర వుదగా భగభగమండే పెద్ద నక్షత్రము రాలిపడి భూమి మీదనున్న మూడవ వంతు నీటి వనరులు చితికిపోతాయా భూమి మీదనున్న మూడవ భాగము నీటి వనరులన్నీ కట్టగట్టుకొని ఒక్క చోటనేయుండవు కదా! అసలు గతంలో మనము చెప్పుకొన్న మండే నక్షత్రం రాలిపడుతుంటే అది ఇంకా భూమిని చేరకముందే భూమి ఆ వేడికి మాడిమసిదై బూడిదైపోతాది.

భూమికి చేరువలోనున్న "ఫాక్సిమా







సెంటారై" అనే నక్షత్రం చేరుటకు నేటి రాకెట్ వేగంతో అత్యంత వేగంగా పయనించినా ఏడు లక్షల సంవత్సరాలుపైగా పట్టనుండగా 42 లక్షల కోట్ల మెళ్లదూరంలో వున్న ఆ నక్షత్రాల వైపు కొండ చిలువ ఆకృతిలో రక్తమాంసాలు గల పాము అంత పొడవుండునా? అది మెలమెల్లగా కదులుతూ పైకి లేస్తూ మెలికలు తిరుగుతూ ఎన్నివేల కోట్ల సంవత్సరాలకు నక్షత్ర మండలాన్ని చేరుతుంది? అసలంతటి బారీ కాయసర్పం చుట్టు కొని నిలుచుండుండుటకు ఎన్ని కోట్ల భూమండలాలు కావాలి. సైన్సు అంటే పిట్ట కథలు, పాము స్టోరీలు కాదు. అసలీ కథనం ఇంత సమయము వృధా చేసి చర్చించుకొనుటకు కూడ అర్హం కాదు. అయినప్పటికి మత విశ్వాసుల సౌకర్యార్థం ఇన్ని తర్జన భర్జనలు చేయవలసివచ్చింది. ఈ వివరణలన్నీ విన్నాక 25% భక్తజనాలు చాలా వరకు అవగాహన చేసికొని నిదానంగా ఆలోచించే దిశగా అడుగులు వేయగలరు. కాని మరో 75% భక్తాగ్రేసరులు తమ మత పునాదిని బండమీద వేసికొని చాలా స్ట్రాంగ్‌గా నిలబడుటకు ప్రయత్నిస్తూయుంటారు. అట్టి వారి కొరకు మరొక సంఘటన జ్ఞప్తికి తెచ్చి ఈ చర్యకు భరత వాక్యం పలుకుతాను.

1973వ సంవత్సరంలో మే 14న "నాసా" అంతరిక్ష కేంద్రం నుండి ప్రయోగించిన "స్కైలాబ్" అనే ఉపగ్రహం బరువు కేవలం 35 టన్నులు మాత్రమే. అది 22 అడుగుల వ్యాసము, 54 అడుగుల ఎత్తు కలిగి స్తూపాకారంలో వుంది. దీని పరిమిత లక్ష్యం అనంతరం అది పతనావస్తకు చేరుకుంది. 1979 జూలై నెలలో ప్రపంచంలో ఏదో ఒక చోట అది కూలిపోవచ్చుననే భయం వ్యాపించగా యావత్ ప్రపంచం గడగడలాడి పోయింది. ఆ విధంగానే మన ఇండియా కూడ కలవరపడింది. అది భూమిని ఢీ కొంటే వందలాది కిలోమీటర్లు చీల్చుకొంటూ విధ్వంసం సృష్టించగలదని తెగ భయపడిపోయారు. ఏ విషయంలోనయినా కాస్త అతిగా స్పందించే మన ఆంధ్ర దేశం అయోమయంలో పడింది.

కొందరైతే తమ బ్యాంకు బ్యాలన్సులు డ్రా చేసి తింటూ త్రాగుతూ ఆనందంగా చద్దామని భావించి నానా హంగామా చేశారు. చివరికది హిందూ మహా సముద్రంలోను ఆస్ట్రేలియా నిర్జన ప్రదేశంలోను కూల్చి వేయుటలో అమెరికన్లు కృతకృత్యులైయ్యారు. కేవలం 35 టన్నుల స్కైలాబ్ శకలం విషయంలోనే ఇంత కలకలం జరిగియుండగా నక్షత్రాలకు నక్షత్రాలే రాలతాయనే కథనం గూర్చి ఇంతటి సుధీర్ఘమయిన చర్చ జరిగింది. బైబిల్‌లో ప్రాధాన్యత నీయకుండా చిన్నవని చెప్పిన నక్షత్రాల వెనుక ఇంత పెద్ద సమాచారం దాగియుంది.

... రచయిత

# స్వగతం

భూమి, సప్తసముద్రాలు, అరణ్యాలు, భూగర్భ పరిశోధన, లోహ సంపద, రాక్షసి బొగ్గు, శిలాజాలు, సహజ వాయువులు, భారతైలాలు, సూర్యచంద్ర నక్షత్రాదులు తదితర గ్రహాలు, అగ్ని పర్వతాలు, వాతావరణం, జీవశాస్త్రం, కాంతి, కాంతివేగం అంతరిక్ష పరిశోధనలు మొదలగు ఎన్నో విషయాలను గూర్చి "ఇది నిజమా" ప్రథమ, ద్వితీయ భాగాల్లో విస్తృతంగా చర్చించాను. అయితే నేను ఎటువంటి సైన్స్ డిగ్రీలు చదవలేదు. కేవలం హై స్కూలు చదువులతో S.S.L.C. మాత్రమే ఉత్తీర్ణుడనయ్యాను. అనంతరం డ్రాయింగ్ పరీక్షలు ప్యాసైయ్యాక డ్రాయింగ్ టీచర్ ఉద్యోగావకాశాలు వచ్చినప్పటికి దాన్ని తిరస్కరించాను. తరువాత "రామారావ్ స్కూల్ ఆఫ్ ఆర్ట్స్" స్కూల్ రాజమండ్రిలో శ్రీ వరదావెంకటరత్నం గారి ఆధ్వర్యంలో ఆరునెలలు ట్రెయినింగ్ అయ్యాను. ఆ సమయంలోనే అమెరికన్ క్రైస్తవ మిషినరీ అయిన "జర్మన్" గారు నాతో కొన్ని "బైబిల్ బంగారు వాక్యాలు" రాయించి వాటిని ఆర్ట్‌పేపర్ కార్డుల మీద అందంగా ప్రింట్ చేయించి క్రైస్తవ మతప్రచారానికి వాడుకున్నారు. అలాగే ఇండియన్ సీనరీలు వేయించి వాటితో క్రైస్తవ క్యాలండర్లు ప్రింట్ చేయించారు. తర్వాత నేను నిడదవోలులో నెల్సన్ కళామందిర్ నెలకొల్పి అందు పెయింటింగ్ సైన్స్ బోర్డులు వ్రాయడం, "అవుట్‌డోర్-ఫొటోగ్రాఫీ" చేశాను. ఒకసారి ఒక మూడేళ్ల పాపను ఫొటోతీయమని ఎవరో అడగగా వారి ఇంటికి వెళ్లి ఫొటో తీశాను. మూడవరోజున వారు వచ్చి ఫొటోలు తీసికొని వెళ్లారు. మరునాడు కొంతమంది నా స్టూడియో పై దాడి చేసి నష్టపరిచారు. కారణము విచారించగా మా పిల్లను మంగళవారం వచ్చి ఫొటో తీశావు. ఆ కెమిరా మా పిల్ల జీవాలు లాగేసిది. నాల్గవ రోజున చచ్చిపొయిందని నానా అల్లరి చేశారు. అంతటితో ఆ స్టూడియో మూసేశాను. అలనాటి అనాగరిక నమ్మకాలు అలాగుండేవి.

అనంతరం బెల్లంపల్లిలో సింగరేణి కాలరీస్ కంపెనీలో (బొగ్గుగనులు) వారానికి కేవలం 18-00 రూపాయల వేతనంలో పనిలో చేరాను. అందు గని కార్మికుల భద్రతాపరమైన పోస్టర్లు చేస్తూయుండేవాడిని. సింగరేణి కంపెనీ ప్రతిమూడు నెలలకు ఒకసారి, గని భద్రతా వారోత్సవాలు, సంవత్సరానికి ఒకసారి ఆరోగ్య వారోత్సవాలు జరుపుతూ నా చిత్రాలను ప్రదర్శిస్తూ యుండేవారు. నేను ఈ పని చేస్తూనే 1962వ సంవత్సరంలో మెయిన్ బజారులో ఒక రడీమెడ్ దుస్తుల షోరూమ్‌ను ప్రారంభించాను. ఈ రడీమెడ్ షోరూమ్








అనతి కాలంలోనే కష్టమర్లను ఆకట్టుకొని ఆదిలాబాద్ జిల్లాలోనే నెంబర్ వన్ అండ్ ఫస్ట్ రడీమేడ్ షాప్‌గా ప్రఖ్యాతిగాంచింది. తరువాత పది సంవత్సరాలు సర్వీసు అనంతరం 1967లో ఉద్యోగానికి రాజీనామా చేసి పూర్తికాలం వ్యాపారంలో వుంటూ దైవభక్తితో 1962లోను, తిరిగి 1972లోను నా స్వంత బాధ్యతపై సచిత్ర బైబిల్ క్యాలండరు మల్టీ కలర్స్‌లో ప్రింట్ చేయించి ఆంధ్రరాష్ట్రమంతటా పంపిణీ చేశాను. బెల్లంపల్లి సి.యస్.ఐ. చర్చి కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొనేవాడిని. బెల్లంపల్లి చర్చి హాలులో 15-20 అడుగుల ఎత్తున ఒక కిటికీలాంటి వెంటిలేటర్ వుంది. ఆ కిటికీకి "పరిశుద్ధాత్మ" దేవుడు పావురం వలే దిగి వస్తున్నట్టు గ్లాస్ మీద పెయింటింగ్ వేసి అక్కడ బిగించాము. అది నేటికి వుండవచ్చు. అనేకమంది క్రైస్తవ సంఘ కాపరులను తదితర భక్తులను పరిశీలించగా వారి యాధార్థ జీవితం మరోరకంగా వుండేది. నేను బైబిల్ క్యాలండర్లను ముద్రించిన సమయంలో ఆయా చర్చీలకు బాధ్యులైన సంఘకాపరులు వాటిని తమకిస్తే అమ్మిపెట్టగలమని చెప్పగా అలాగే ఇచ్చాను. కాని వారెవరూ ఒక్కపైసా అయినా తిరిగి చెల్లించలేదు. నేను అనేకులైన భక్తాగ్రేసరుల నిజజీవితాల్ని పరిశీలించి చూడగా చాలామంది ప్రవర్తన సజావుగాలేదు. కొందరు త్రాగుడుకు అలవాటైన వారిని కూడా చూచాను. ఎవరెలా గుంటేలే నేను మాత్రం సరిగ్గా యుంటే చాలని బైబిల్ పఠనంపై ఆసక్తిని పెంచుకొన్నాను. బైబిల్‌ను శ్రద్ధగా పఠించడము ప్రార్థనా జీవితం గడపడం అలవాటు చేసుకొన్నాను. ఈ నేపథ్యంలో బైబిల్‌ను ఏడు పర్యాయాలు మొదటి నుంచి చివర వరకు చదివాను. ఇంతటి పరిశీలనానంతరం ఏమిటి? ఈ యెహోవా తానే యూద ప్రజలకు పది



ఆజ్ఞలు జారీ చేసి, నియమనిబంధనలతో జీవించమని చెప్పి, తానే పై నియమాలను ధిక్కరింపజేయడమేమిటి? అని మరింత విస్తృతంగా పరిశోధించి అవన్నీ కల్పిత గాథలుగా నిర్ధారించుకొని 1974-75ల్లో చర్చికి దూరమై నిరీశ్వరవాదిగా మారిపోయాను. నా భావనలన్నీ మానవతావాదం వైపు తిరిగాయి. 1985లో బెల్లంపల్లి లయన్స్ క్లబ్‌లో చేరి పదేళ్ల పాటు అనేక సేవా కార్యక్రమాల్లో పాల్గొని ఒక సంవత్సరం పాటు క్లబ్ కార్యదర్శిగా పనిచేశాను. తరువాత నేను అనేక హ్యూమనిస్టు (మానవతావాదిగా అనేక చోట్లు అనేక సమావేశాలలో పాల్గొని ప్రసంగించడం జరిగింది. విశాఖపట్టణంలో "బా.నా.సా" సమావేశాల్లో నేను, బాలగోపాల్ పాల్గొన్నారు. క్రైస్తవంపై నేను ఒక గంటసేపు ప్రసంగించిన అనంతరం శ్రీ బాలగోపాల్ తన వాణిని వినిపించాడు.



1990లో నేను గోరా సైన్సు సెంటర్ ఆధ్వర్యాన విజయవాడలో బెంజి సర్కిలో ప్రపంచ మహాసభల్లో "బాబాలకు, గురువులకు" సింహస్వప్నమైన కేరళకు చెందిన ప్రేమానంద్ (యోగి)ని కలుసుకున్నాము. ఆ సమావేశాల్లో మాయలు, మంత్రాల బండారం బయటపెడుతూ వారు ఇచ్చిన ప్రదర్శనలో నేను స్టేజీ మీద వారికి సహాయకుడిగా పాల్గొన్నాను.

ఆ సందర్భంలోనే బ్రిటీష్ హ్యూమనిస్టు సొసైటీ ప్రెసిడెంట్ బార్బరాస్మోకర్‌ను కలిసి కొనడం జరిగింది.

ఇట్టి సేవా దృక్పథంతో 1985లోనే "మానవతావాద బృందం" అనే స్వచ్ఛంధ సేవా సంస్థను స్తాపించి ఈ చిత్రంలో చూపబడిన "ఎంబ్లమ్"ను చిత్రించి ఒక దీనజనునికి ఒక ఉన్నత స్థితిలోనున్న వాడు చేయునిచ్చే విధంగా "లోగో"ను స్వీకరించి ఆ బృందంలో 30 మంది సభ్యులతో అనేక దీనజనసేవలు నా ఆదాయంలో 20% కేటాయించి




రోగగ్రస్తులకు, అనాదలకు మరి ముఖ్యంగా కుష్టు రోగుల కొరకు సేవలు అందించాము. బృందం సభ్యులు అర్ధరాత్రి పిలిచినా వారు వచ్చి తమ సహకారం అందించే వారు. సాధారణంగా ఎంతటి దయార్ద్రహృదయులైనా కుష్టురోగుల ముఖము చూడడానికే ఇష్టపడరు. వారిపై దయయున్న వారు కూడా వాళ్ల ముఖము చూడకుండా కొద్దిపాటి చిల్లర విసురుతారు. మా బృందం మాత్రం వారిని ఎంతో ప్రేమగా ఆదరించేవారు.







అట్టి సభ్యులకు మాదిరిగా వుండాలని నేను వేళ్ల కూడ వూడిపోయి దయనీయస్థితిలోయున్న రోగులను సైతం నా స్కూటర్‌పై ఎక్కించుకొని ఇంటికి తీసికొని వచ్చి వారి ప్రేమ పూర్వకంగా ఆదరించి, దుస్తులు వగైరా ఇచ్చి పంపేవారము. ఇట్టి సేవా కార్యక్రమాలలో మా ఇంటి నుండి కూడ మంచి సహకారం అందేది. నా భార్య కూడ స్వయంగా పాల్గొనేది.



నేను ఒకసారి రాత్రి పది గంటలకు షాపు మూసివేసి ఇంటికి వస్తుండగా మా ఇంటికి సమీపంలోనున్న ఒక బస్‌షెల్టర్‌లో ఒక అభాగ్యురాలు రోధిస్తూ యుండడము చూచాను. అదేమిటో చూద్దామని ఆమె యొద్దకు వెళ్లాను. ఆమె తలకు పెద్దగాయమై అది పురుగులు పట్టి ప్రాకుచున్నాయి. ఆ ప్రదేశమంతా దుర్గంద భరితమైయ్యింది. వెంటనే నేను ఇంటికివెళ్లి వేడినీళ్లు కాచుకొని ఒకరిద్దరు బృందం సభ్యులను పిలిపించి అక్కడకు వెళ్లాము. ఒక బిచ్చగానికి 20 రూపాయలు ఇచ్చి అతని సహాయంతో ఆమెకు డెట్టాల్ వగైరాలతో స్నానం చేయించాము. ఆమెకు కాస్త మతిస్థిమితం లేనట్టు అనిపించింది. ఆమె మురికి బట్టలు కత్తిరించి తీసివేసి ఒక నైటీ తొడిగాము ఒక R.M.P. డాక్టరును పిలచి బేండేజు కట్టించాము. ఆమె గాయము మానేవరకు బేండేజి మారుస్తూ వచ్చాము. అలా ఆమెను బాగుచేసి అప్పుడప్పుడు ఆమెకు బట్టలు మారుస్తూ వచ్చాము.



అనాదలైన విధవరాళ్ల ఇళ్లు దర్శించి అట్టివారికి కొద్దిపాటి నిత్యావసర వస్తువులు

అందిస్తూ యుండేవరము. వారి కళ్లు ఆనందంతో మెరిసేవి.



ఈ చిత్రాలలో చూచినవి కాక మా బృందం సభ్యులు చేసిన అనేక సేవా కార్యక్రమాలు చాలా వున్నాయి. ఇట్టి రుజువులు చూపకపోతే చాలామంది నమ్మరు. ఈ సేవా కార్యక్రమాలను గూర్చి వివరించుట పబ్లిసిటీ కొరకు కాదు. అనేకమంది ఇట్టి దృక్పథాలు కలిగే ఉంటారు. ఇవి చూచాక అట్టి వారు కూడ. ధైర్యంగా బయటకు వచ్చి ఈ విషయాలతో స్ఫూర్తి చెంది అనేకమంది అనాదలకు చేయూత నీయగలరనే భావనతో ఈ విషయాలను అందరికి తెలియజేయడమైనది. ఇది చదివిన ప్రతీవారు వారికి తారసపడ్డ వారిలో పదిమందికైనా ఏదో ఒకటి చేయుటకు ప్రయత్నించండి.

ఈ విధంగా పదిమందికి సహాయకరమైన జీవితం గడుపుతూయుండగా 1998-99 ఆ ప్రాంతంలో బెల్లంపల్లి పట్టణ మునిస్పాలిటీ వారి మాస్టర్ ప్లాన్‌లో మాకు దెబ్బమీద దెబ్బ తగిలింది. మెయిన్‌రోడ్‌లో ముఖ్య సెంటర్‌లోనున్న మా షాపు రోడ్డు వెడల్పు కార్యక్రమంలో షాపు మొత్తం కూల్చి వేయబడింది. అంతలోనే మామీద మరో "పిడుగు" పడింది. అదే మెయిన్ రోడ్‌లోనున్న మా సుందరమైన స్వగృహము ఏకంగా 12 అడుగుల



ముందు భాగం కూడ కూల్చి వేయబడింది. ఈ చిత్రంలో చూపబడినది కూల్చివేత ప్రారంభ దశ. ఇది సింగరేణి కాలరీస్‌కు ప్రభుత్వము లీజుకు ఇచ్చిన భూమియైనందున ఎవరికి





పట్టాలు లేవు. అందుచే ఎవరికి పైసా నష్టపరిహారం కూడా ఇవ్వబడలేదు. తదుపరి ఆ ఇంటిని రీమోడల్ చేసి మా అమ్మాయికి బహుమతిగా ఇచ్చాము.

ఇంత బాధలో మేముండగా క్రైస్తవ సోదరుల నుండి సూటిపోటి మాటలు ఎదుర్కోవలసి వచ్చింది. దైవాన్ని ధిక్కరించే వారిని దేవుడు ఎంతోకాలం సహించడు. తగిన శాస్తి జరిగిందని చంకలు కొట్టుకున్నారు. ఇట్టివారికి ఒకటే సమాధానం మెయిన్‌రోడ్ మీదనున్న దైవవ్యతిరేకినైన నాకే నష్టం కలిగించాడనుకుందాము. మెయిన్‌రోడ్‌లోనున్న తదితర భక్తుల మాటే మిటి? మెయిన్‌రోడ్‌లో లేని లక్షమందిలోనున్న దుర్మార్గులను, దుష్టులను, దొంగలను, దైవద్రోహులను ఆ దేవుడు ఏమీ చేయలేక పోయాడెందుకు? దీనికి వీరు సమాధానం చెప్పలేరు. మెయిన్‌రోడ్‌లోనున్న దైవభక్తులైన వారు కూడ నష్టపోయారు కదా!

ఈ నేపథ్యంలో కుమారుని యొద్దకు తరలి వెళ్లి హైద్రాబాద్‌లో స్థిరపడ్డాము. అర్జునుడు అస్త్రసన్యాసం చేస్తూ తన "అంబుల పొదిని" జమ్మిచెట్టుకు తగించిన విధంగా నేను నా "అంబుల పొదిని" బయటకు తీశాను. అదే నా చిత్రకళా సరంజామాయైన బ్రష్‌లను బయటకు తీసి పెయింటింగ్ ఆర్టిస్టు అవతారమెత్తాను. హైద్రాబాద్ స్టేట్ ఆర్ట్ గ్యాలరీలో 2008 వరకు నాలుగైదు చిత్రకళా ప్రదర్శనలిచ్చాను. అనేకమంది ప్రముఖుల అభినందనలందుకున్నాను. మూడుసార్లు అక్కనేని నాగేశ్వరరావుగారు, ఒకసారి మహేష్‌బాబు




భార్య గట్టమనేని నమ్రతాశిరోద్కర్ నా ప్రదర్శనలను ప్రారంభించారు. నేను బెల్లంపల్లిలో ఉన్నప్పుడే 1977లో శ్రీమతి ఇందిరాగాంధీకి ఒక పెయింటింగ్ పంపగా ఆమె నన్ను అభినందిస్తూ లేఖ వ్రాశారు. అక్కినేని తన జన్మదిన సందర్భంగా నన్ను "రవీంద్ర భారతి"లో

సన్మానించారు. ఇటీవల నేను చిత్రకళా ప్రదర్శనలు జరిపించక పోయినా చిన్నాచితుకు పెయింటింగ్ వేస్తూనేయున్నాను.

ఈ విధంగా నేను చరమాంకంలో ప్రవేశించిన నాకు నవంబరు 18, 2013 నాటికి నేను 80 సం॥ నిండి 81లో ప్రవేశించాను. ఇంతకూ నా ఆరోగ్య రహస్యమేమిటో ఇంతవరకు నేను ఎవరికి చెప్పలేదు. ఈ రచనల వల్ల ఎంతమందో అభిమానులు... అంతకు అనేక రేట్లు అధికంగా శత్రువులను కూడా సంపాదించుకొన్నాను. అయితే నా అభిమానులకు మాత్రమే కాకుండా సర్వజనులకు ఒక ముఖ్యమైన ఆరోగ్య సూత్రం చెప్పేస్తున్నాను జాగ్రత్తగా వినండి. వినడమే కాదు ఆచరించండి. అదేమంటే నేను దేవుడైన యేసుక్రీస్తు మాటలను ధిక్కరించినందుకే నాకీ ధీర్ఘాయుష్షు ఈ మాట అందరికీ ఆశ్చర్యం కలిగించవచ్చు. ఇది అక్షరాల నిజం!

యేసు "లాస్ట్ సప్పర్"లో ఏమి చెప్పాడంటే నేను సిలువ మరణం పొందవలసి యుంది. తిరిగి మూడవ దినాన సమాధి నుండి తిరిగి నేను లేస్తాను. అనంతరం నా తండ్రి యొద్దకు (యెహోవా) పరలోకానికి వెళ్లిపోతాను. వెళ్తాను తిరిగి నా రెండవ రాకడలో



వస్తాను. అప్పటి వరకు మీరు నా రక్తానికి గుర్తుగా ద్రాక్షారసాన్ని త్రాగుచూనన్ను గుర్తు చేసికొంటూ వుండండని ఆజ్ఞాపించాడు. ఆ మాటలను నేటి వరకు ప్రపంచ క్రైస్తవ విశ్వాసులందరు పాటిస్తున్నారు. దానికి ద్రాక్షారసము అని చెప్పబడినా.. అది ద్రాక్షసారాయే! యేసు చేసాడని చెప్పే ఆరుబానాల ద్రాక్షారసము అసలైన ద్రాక్షసారాయి అని ఆ పెండ్లి విందుకు వచ్చిన అనుభవజ్ఞులే చెప్పారు. (యోహాను 2:10) చూచినట్లయితే "కానా"లో నీళ్లను ద్రాక్షారసముగా మార్చిన సందర్భంలో ఒక అనుభవజ్ఞుడు దానిని రుచి చూచి ఈ అద్భుత "ద్రాక్షారసము" బలే బాగుందని అర్జంటుగా ఆ విందు ప్రధానిని, పెండ్లి కుమారులను పిలిచి ఎవరైనా సరే విందుల్లో మొదట మంచి ద్రాక్షారసమును పోసి జనులు మత్తుగా ఉన్నప్పుడు నకిలీ ద్రాక్షారసమును పోయుదురని మీరయితే ఇదివరకే మంచి ద్రాక్షారసము ఉంచుకొని యున్నారని అన్నాడట ఆ త్రాగుబోతు అతిథి. దీని అర్థం ఏమిటి? ద్రాక్షారసమనేది అచ్చమైన ద్రాక్షాసారాయేనన్నమాట! అటువంటి ద్రాక్షసారాయి జోలికి వెళ్లక





పోవడమే నా దీర్ఘయుష్షుకు కారణమన్నమాట! అనేకమంది పేరుగాంచిన భక్తాగ్రేసరులలో ఈ అలవాటు చాలామందికి ఉంది. ఇట్టివారిలో "దినకరన్" కూడా ఉన్నాడు. ఈ విషయం ఇది నిజమా తృతీయ భాగంలో రుజువులు చూపగలను.

ద్వితీయ భాగం ఫైనల్ ప్రూఫ్ కాపీ వచ్చింది. ఈ నెల ఒకటో తేదీన నేను అనారోగ్యంతో పడుకొని ఈ ప్రూఫ్ కాపీలోని తప్పులు దిద్దుచున్నాను. అనంతరం రాత్రి 9:30కి భోజనానికి లేచాను భోజనం యొద్దకూర్చునే సరికి అంతులేని నిస్సత్తువ ఆవరించింది. ఒక్క ముద్ద కూడ తినలేక స్పృహ తప్పినంత పని అయ్యింది. కాసేపటికి నేను తేరుకొని ఈ రోజు నా మరణం ఖాయమనే అధైర్యంలో పడిపోయాను. వెనువెంటనే ఎలా లేచానో నాకే తెలియదు. శక్తి కూడ గట్టుకొని ద్వితీయ భాగం ఫైనల్ ప్రూఫ్‌ను, దీని తరువాత ప్రచురించవలసియున్న వ్రాత ప్రతులను బయటకు తీసి ఒక సంచిలో పెట్టి నేను చనిపోయేలాగున్నాను. నా ఆఖరి కోర్కెను మన్నించవలసిందిగా నా భార్యను బ్రతిమాలి ఈ సంచిని డాక్టరు భానూ ప్రసాద్ భద్రాచలం గార్కి అందజేయాలని వారి ఫోన్ నెంబర్ కాగితం పై వ్రాసి ఇస్తూ మీరు ఫోన్ చేస్తే చాలు ఆయనే వచ్చి వీటిని తీసికొని వెళ్తారని ప్రామిస్ చేయించుకున్నాను. రోష్ని గ్రాఫిక్స్ అండ్ ప్రింటర్స్‌కు ఇంతవరకు 35 వేల రూపాయలు అడ్వాన్సుగా చెల్లించానని చెప్పమన్నాను. ఆమె చాలా ఏడ్చింది. ఇంతేకాదు నా డెడ్ బాడీని ఏదయినా మెడికల్ కాలేజీకి అందజేయాలని... మతపరమైన అంత్యక్రియలు చేయకూడదని చెప్పాను. ఆ సమయంలో మా అబ్బాయి, కోడలు, మనవలు ఎవరలేరు. తరువాత మంచం మీద వాలిపోయాను. అంతలో కుమారుడు వచ్చాడు. నేను దినమంతా విరామము లేకుండా ఈ రచనా వ్యాసాంగం చేయుచున్నానని విని బాగులేనప్పుడు కూడా ఈ దిక్కుమాలిన రాతలు ఎందుకని విసుగుకున్నాడు. ఇవి నా మీద ప్రేమతో అన్నమాటలే. మొత్తానికి వెంటనే ఆసుపత్రికి తీసికొని వెళ్లారు. మళ్లీ బ్రతికి బయటపడ్డాను. ఈ అనారోగ్యానికి ఒక కారణముంది. 15 రోజుల క్రితము నాకు తొడ వెనుక పై భాగంలో ఒక గడ్డ పుట్టగా ఆపరేషన్ చేయించుకున్నాను. అది చాలా లోతుగా యున్నందున చాలా రక్తము పోయింది. "రెస్ట్‌లెస్"గా బెడ్‌మీదే పని చేసినందున ఇలా జరిగింది. ఎలాగైతే నెల్సన్ రష్ఢీ బ్రతికిపోయాడు. ఈ ద్వితీయ భాగంలో దమ్ముంటే నన్ను తన మెరుపు బాణాలు... పిడుగుపిరంగులతో మట్టుబెట్టమని యెహెూవాను సవాలు చేశాను. అలా జరిగియుంటే దేవుడు వీడిని ఈ పుస్తకం వెలువడకముందే చంపివేశాడని క్రైస్తవ విశ్వాసులు ఆనందించి యుండేవారు. కాని కొంచములో తప్పిపోయింది.

ఈ వృద్ధాప్యంలో నేను కొనసాగిస్తున్న ఈనా పోరాటంలో కృతకృత్యుడను కాగలని నేను తలస్తున్నాను. మూడు నాలుగు భాగాలు, వీలయితే అయిదవ భాగం కూడా విడుదల చేయాలనుకుంటున్నాను. ఇది లాభాపేక్షలేని పనియని మీకందరికి తెలుసు. ఈ విషయంలో

నాతోపాటు పాలు పంచుకోవాలని ఎవరయినా తలస్తే వేలరూపాయలు పంపాలని అనుకోనవసరములేదు. తమకు తోచిన విధంగా మూడు నాలుగు వందలు పంపినా మహదానందంతో స్వీకరించగలను. ఈ ద్వితీయ భాగానికి 85 వేలు పైగా ఖర్చయ్యింది. ఆసక్తి గలవారు ఈ క్రింద ఇవ్వబడిన విధంగా B. Nelson SBH A/c No: 52103810923, DEFENCE COLONY BRANCH, SECUNDERABAD-500054. చెక్కుల ద్వారా పంపగలరు. (నెల్సన్ రష్దీ పేర బ్యాంక్ ఎక్కౌంట్ లేదు గమనించగలరు). ఇతర వివరములకు నాసెల్ నెంబర్ 9396220406కు ఫోన్ చేయగలరు. 2014లోనే వెలువడనున్న ఇది నిజమా తృతీయభాగానికై ఎదురుచూడండి.

సమాప్తం

- నెల్సన్ రష్దీ

